# బైబిలు బోధల దీపిక.



ఇది

రెవ. యోసేపు స్టంప్ (REV. JOSEPH STUMP) దొరగా

రచింపబడి

యునైటెడ్ లూథరన్ సంఘ సబ్బాతుబడి పాఠపుస్తకములలో

ఐదవదాని ననుసరించి

రెవరెండు జే. ఆబ్ర్లి, డి. డి. గారిచే

సవరింపబడి

రెవరెండు పి. ఫిలిప్ లైసెరింగ్ గారి సహాయమువలన

తెనిగింపబడెను.

తెలుగు లూథరన్ పబ్లికేషన్ కమిటీవారివలన

ప్రచురింపబడెను.

మూడవ కూర్పు 2000 ప్రతులు.

బెజవాడ

వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడెను.

1927

# విషయసూచిక.

# పీఠిక



మన మిప్పుడు చదువబోవు పాఠములకు బైబిలు బోధల దీపిక యను పేరుపెట్టదగును. ఇందులో బైబిలులోని యే గ్రంథమునైనను ఏ గ్రంథములోని భాగమునైనను పాఠమునుగా బెట్టక, ఆయా మత సిద్ధాంతముల ననుసరించి, ఆ సిద్ధాంతములను దృష్టాంతపఱచు బైబిలు వాక్యములనెత్తి వాటిని పాఠముగా నేర్పఱచడమైనది. ఇది జనరల్ కౌన్సిల్ కమిటీవారి యధీనమున యోసేపు స్టంపు అను దొరగారిచే రచింపబడిన సబ్బాతుబడి పుస్తకమును అనుసరించును. మొదటి 26 పాఠములు చాలమట్టుకు సిద్ధాంతములై, మొత్తముమీద విశ్వాస ప్రమాణములోని సిద్ధాంతముల ననుసరించును. మఱియు నివి సిద్ధాంతములను బోధించు పాఠములైనను, సమయానుకూలముగ వాటికి సంబంధములగు నీతులుకూడ వీనితో జేర్పబడియున్నవి. తరువాతి 26 పాఠములలో నడతవిషయమైన బోధలు ప్రత్యేకముగా వివరింపబడును. మన సభవారు లేఖనములయందు గట్టివారగునట్లు దేవుడీ బోధల దీపిక నాశీర్వదించునుగాక!

# బైబిలు బోధల దీపిక

## 1. దేవునిగూర్చిన బోధ.

నీ దేవుడనైన యెహోవాను నేనే. నేను తప్ప వేరొక దేవుడు నీకుండకూడదు. నిర్గ. 20: 2, 3.

### భాగములు.

I. దేవునిగూర్చిన బోధకు ఆధారములు.

II. దేవుడు ప్రత్యేక దేవుడు.

III. దేవుని గుణలక్షణములు.

### అనుసరి వేదపాఠములు.

| | |
|---|---|
| మనస్సాక్ష్యము. | రోమా 2: 1-16. |
| సృష్టివలన దేవుని తెలిసికొనుట. | రోమా 1: 18-18. |
| బైబిలుయొక్క ఆవశ్యకత. | కీర్తన. 19. |
| దేవుడు ప్రత్యేక దేవుడు. | మత్త. 3: 13, 17; 28: 16-20 |
| దేవుని ఘనత్వము | యెషయ 40: 12-31. |
| దేవుని పరిశుద్ధత. | యెషయ 6. |
| దేవుని ప్రేమ. | 1. యోహాను. 4: 7-21. |

### వేదవాక్యములు.

I. 1. దేవునిగూర్చి తెలియ శక్యమైనదేదో అది వారిలో విశదమైయున్నది. దానిని దేవుడు వారికి విశదపరచెను (రోమా 1: 19.).

2. ధర్మశాస్త్రము లేని యన్యజనులు స్వాభావికముగా ధర్మశాస్త్ర సంబంధమైన క్రియలను చేసిన పక్షమున, వారు ధర్మశాస్త్రము లేనివారైనను, తమకు తామే ధర్మశాస్త్రమైనట్టున్నారు (రోమా 2: 14.).

3. యెహోవా! నీ పనులు ఎన్నెన్ని విధములుగా నున్నవి! జ్ఞానముచేత నీవు వాటి నన్నిటిని నిర్మించితివి. నీవు కలుగజేసిన వాటితో భూమి నిండియున్నది (కీర్తన 104: 24).

4. లేఖనములయందు మీకు నిత్యజీవము కలదని తలంచుచు వాటిని పరిశోధించుచున్నారు; అవే నన్నుగూర్చి సాక్ష్యమిచ్చుచున్నవి (యోహా. 5:39).

II. 5. మీరు వెళ్ళి సమస్తజనులను శిష్యులనుగా జేయుడి. తండ్రియొక్కయు, కుమారునియొక్కయు, పరిశుద్ధాత్మయొక్కయు నామములోనికి సమస్తజనులకు బాప్తిస్మమియ్యుడి (మత్తయి 28:19).

III. 6. దేవుడు ఆత్మ గనుక ఆయనను ఆరాధించువారు ఆత్మతోను సత్యముతోను ఆరాధింపవలెను. (యోహాను 4:24).

7. నిశ్చయముగా దేవుడు ఈ లోకమందు నివాసము చేయడు; ఆకాశమహాకాశములు సయితము నిన్ను పట్టజాలవు. నేను కట్టించిన యీ మందిరము ఏలాగు పట్టును ? (1 రాజు 8:27).

8. పరలోకమందున్న మీతండ్రి పరిపూర్ణుడు గనుక మీరును పరిపూర్ణులుగా నుండెదరు (మత్త 5:48).

9. పర్వతములు పుట్టకమునుపు, భూమిని లోకమును నీవు పుట్టింపక మునుపు యుగయుగములు నీవే దేవుడవు (కీర్తన 90:2).

10. యేసుక్రీస్తు నిన్న, నేడు, ఒక్కటే రీతిగా నున్నాడు ; అవును యుగయుగములకు ఒక్కటే రీతిగా నుండును (హెబ్రీ. 13:8).

11. నీ యాత్మయొద్దనుండి నేనెక్కడికి పోవుదును? నీసన్నిధినుండి నేనెక్కడికి పారిపోవుదును ? నేను ఆకాశమున కెక్కినను నీవు అక్కడ నున్నావు. నేను పాతాళమందు పండుకొనినను నీవు అక్కడ నున్నావు. నేను వేకువ రెక్కలు కట్టుకొని సముద్ర దిగంతములలో నివసించినను అక్కడ నీచేయి నన్ను నడిపించును. నీ కుడిచేయి నన్ను పట్టుకొనును (కీర్తన 139:7-10).

12. ఇదిగో నేను యుగసమాప్తి పర్యంతము సదాకాలము మీతో కూడ నున్నాను (మత్తయి 28:20).

13. నేను కూర్చుండుట నేను లేచుట నీవు ఎరిగియున్నావు. నాకు తలంపు పుట్టకమునుపే నీవు నా మనస్సు గ్రహించుచున్నావు (కీర్తన 139:2).

14. దేవుడు చెప్పిన యేమాటయైన నిరర్థకము కానేరదు (లూకా 1:37).

15. ఆ నిత్యజీవమును అబద్ధమాడనేరని దేవుడు అనాదికాలమందే వాగ్దానము చేసెను (తీతు 1:2).

16. మీరు విధేయులగు పిల్లలై మీ పూర్వపు అజ్ఞానదశలో మీ కుండిన యాశల ననుసరించి ప్రవర్తింపక మిమ్మును పిలిచినవాడు పరిశుద్ధుడైయున్న ప్రకారము మీరును సమస్త ప్రవర్తనలయందు పరిశుద్ధులైయుండుడి (1 పేతురు 1:15,16).

17. మీరు పరిశుద్ధులైయుండవలెను. మీ దేవుడనైనయెహోవానగు నేను పరిశుద్ధుడనైయున్నాను (లేవీ. 19:2).

18. ఆయన ప్రతివానికి వాని వాని క్రియల చొప్పున ప్రతిఫలము నిచ్చును (రోమా 2:6).

19. బుద్ధి విజ్ఞానముల సర్వసంపదలు ఆయనయందే గుప్తములై యున్నవి (కొలొ 2:3).

20. దేవుడు ప్రేమాస్వరూపి; ప్రేమలేనివాడు దేవుని నెరుగడు (1 యోహాను 4:8).

21. దేవుని అనుగ్రహము మారుమనస్సు పొందుటకు నిన్ను ప్రేరేపించుచున్నది (రోమా 2:4).

22. మనము నమ్మతగని వారమైనను ఆయన నమ్మతగినవాడుగా నుండును; ఆయన తన స్వభావమునకు విరోధముగా నేదియు చేయలేడు (2 తిమొ 2:13).

23. దేవుడు అబద్ధమాడుటకు ఆయన మానవుడుకాడు. పశ్చాత్తాపపడుటకు ఆయన నరపుత్రుడు కాడు. ఆయన చెప్పి చేయకుండునా? ఆయన మాటయిచ్చి స్థాపింపకుండునా? (సంఖ్యా 23:19).

24. యెహోవా దయాళుడు ఆయన కృప నిత్యముండును. ఆయన సత్యము తరతరములుండును. ఆయనను స్తుతించుడి ఆయన నామము ఘనపరచుడి (కీర్తన 100: 5).

25. ఆయనయందు విశ్వాసముంచు ప్రతివాడు సిగ్గుపడడని లేఖనము చెప్పుచున్నది (రోమా 10:11).

వి వ ర ము.

I. దేవుని నిజముగా తెలిసికొనుటకు బైబిలే ఆధారముగాని మరియొకటి లేనే లేదు. అయినను స్వబుద్ధివలనను, సృష్టిక్రమమువలనను మనము దేవుని గూర్చిన కొన్ని సూచనలను తెలిసికొనగలము.

స్వబుద్ధి:—బైబిలు లేక పోయినను మనుష్యులకంటె గొప్పవాడొకడున్నాడను సంగతి మనుష్యులు గుర్తింపగలరు. దేవుడున్నాడను సంగతిని దేవుడు మనుష్య

లందఱికి విశదపఱచెను* (1). ఈ సంగతి తెలియకుండు నంతటి మూర్ఖజనము లోకములో లేనేలేదు. తప్పొప్పులను వివేచించు మనస్సాక్షి మందఱికి గలదు. కావున తప్పు చేసిన యెడల ఈ లోకమునకు తీర్పుచేయు దేవునిచే తప్పక శిక్ష నొందెదమని దానిఫలననే మనుష్యులందఱును తెలిసికొందురు (2).

సృష్టిక్రమము:—దేవుడున్నాడను సంగతి సృష్టిక్రమమును జూడగా నిర్ధారణ చేయబడును "ఆకాశములు దేవుని మహిమను వివరించుచున్నవి. అంతరిక్షము ఆయన చేతిపనిని ప్రచురపఱచుచున్నది" (కీర్తన 19:1). సృష్టికర్త లేనిది ప్రపంచము కూడ నుండనేరదు; మఱియు నీసృష్టిలో ప్రతిచోట కనబడు క్రమమును, చక్కదనమును జూడగాను, దివారాత్రములు, ఋతువులు క్రమముగా వచ్చుటను, అందఱి యక్కఱలను దీర్చుటకు ఈ భూమి నిర్మింపబడియుండుటను జూడగాను జ్ఞానవంతుడును, దయగలవాడును దీని నిర్మించెనని యొప్పుకొనక తప్పదు (3). కావున బుద్ధిహీనులుతప్ప మఱి యెవరును దేవుడు లేడని అనుకొనరు (కీర్తన. 14:1).

బైబిలుయొక్క ఆవశ్యకత:—అయినను రక్షణ పొందుటకు దేవుని గూర్చి తెలిసికొనవలసిన వాటిని స్వబుద్ధివలననైనను, సృష్టిక్రమమువలననైనను తెలిసికొనజాలము (4). వీటిని మాత్రము తెలిసికొనినవారు విగ్రహారాధకులై "అక్షయుడగు దేవుని మహిమను క్షయమగు మనుష్యులయొక్కయు, పక్షులయొక్కయు, చతుష్పాద జంతువులయొక్కయు ప్రతిమా స్వరూపముగా మార్చిరి" (రోమా 1:23). దేవుడున్నాడను సంగతిని తెలిసికొనుటమాత్రము చాలదు. ఆయన యెట్టివాడో, మనము ఆయన దయను ఏలాగున పొందగలమో, ఏలాగు ఆయనకు అనుకూలముగా ప్రవర్తింపగలమో ఈ మొదలగు విషయములు తెలిసికొనుట కూడ అత్యావశ్యకము. వీనిని బైబిలువలననేకాని మఱిదేనివలననైనను తెలిసికొనలేము. ఇక బైబిలు దేవునిగూర్చి బోధించు విషయములను విచారింతము.

II. దేవుడు ప్రత్యేకదేవుడు:— దేవుడు ఏక దేవుడై యున్నాడు. ఆయన మనుష్యులకు పదియాజ్ఞల నిచ్చినపుడు—"నీదేవుడనైన యెహోవాను నేనే. నేను తప్ప వేఱొక దేవుడు నీకుండకూడదు" అని సెలవిచ్చెను. దేవుడు ఏకదేవుడైయున్నాడు; ఆయన తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మయను ముగ్గురు మూర్తులుగ నున్నాడు. కావున దేవుడు ప్రత్యేకదేవుడని చెప్పుచున్నాము. ఈ మూర్తుల విషయములో ఒకడెక్కువ, మఱియొకడు తక్కువయను మాటలు చెల్లవు. ఈ ముగ్గురును అన్నివిషయములలో సమానులు. "తండ్రి దేవుడై యున్నాడు, కుమారుడును

* ఈ వివరములో కనబడు సంఖ్యలు పాఠమునందలి భాగములలోని వచనముల సంఖ్యలను తెలియజేయును.

దేవుడే, పరిశుద్ధాత్మయు దేవుడే. మఱియు వీరు ముగ్గురును ఏకదేవుడై యున్నారు. కాని ముగ్గురు దేవుండ్లున్నారనరాదు" అని అథనాశియ విశ్వాస ప్రమాణములో వివరింపబడెను. ఇది మనము గ్రహింపలేని మర్మమై యున్నది. మన చుట్టునున్న అనేక విషయములనే మనము మన కొద్ది బుద్ధివలన గ్రహింపలేక యుండగా, అపరిమితుడైన దేవు డున్న విధమును గ్రహింప గలమా? అలాగు వీలుకాదు గదా? అయితే దేవుడు దానిగూర్చి తనవాక్యములో చెప్పినదానిని మనము తెలిసికొని నమ్మవలయును. క్రీస్తు తన శిష్యుల కిచ్చిన చివరి యాజ్ఞవలన, పరిశుద్ధ త్రిత్వములో ముగ్గురు మూర్తులున్నట్లు తెలిసికొనగలము (5). ఆ ముగ్గురును క్రీస్తు బాప్తిస్మ మొందినసమయములో కనబడిరి. ఎట్లనగా, ఆసమయమున క్రీస్తు బాప్తిస్మము నొందెను. పరిశుద్ధాత్మ పావురమువలె దిగెను; ఈయన నా ప్రియ కుమారుడు ఈయనయందు నేనానందించుచున్నానని తండ్రి ఆకాశమునుండి పలికెను.

III. దేవుని గుణలక్షణములు:—దేవుడు తన తత్వమును బట్టి ఆత్మస్వరూపియై యున్నాడు (6). ఆయనకు శరీరము, శరీరావయవములు, ఇంద్రియములు మొదలైనవి లేవు. మనము సంభాషించునపుడు దేవునికి అవయవము లున్నట్లుగ ఆయన సర్వశక్తిగల హస్తము గలవాడు అనియు, 'ఆయన నేత్రము' అన్నిటిని జూచుచున్నదనియు పల్కుచుండుట వాస్తవము. బైబిలులో కూడ నిట్లు వ్రాయబడి యున్నది. అయితే మనము చేతులతో పనిచేయుచు, కండ్లతో జూతుము కావున, దేవునికి అవయవము లున్నట్లుగ మనము మాట్లాడునపు డుపయోగించునట్టి 'హస్తము' 'నేత్రము' మొదలగు మాటలు ఆయన కార్యములు చేయుటకు శక్తిగలిగిన వాడనియు, జరుగు వాటి నన్నిటిని తెలిసికొనువాడనియు అర్థమిచ్చు అలంకార పదములని గ్రహించుకొనదగును.

దేవుని లక్షణములను జూడగా ఆయన సర్వశక్తిగలవాడును, మహిమాసంపన్నుడును, అపరిమితుడును (7), పరిపూర్ణుడు (8) నైన ఆత్మయైయున్నాడు. ఆయన ఆది యంతములు లేనివాడు.—ఆయన లేనికాలము ఎన్నడునుండలేదు. అట్టి కాలము ఎప్పుడు నుండదు (9). ఆయన మారనివాడు.—యెహోవా నైన నేను మార్పులేనివాడనని తానే చెప్పెను (మలాకి 3:6). ఆయన ఇదివరకున్న రీతిగానే యిప్పుడు నున్నాడు. ఇకమీదట కూడ నుండును (10). ఆయన అంతట నున్నాడు.—ఆయన ఏక కాలమందు అంతట నుండును ఆయన లేని స్థలము ఈ ప్రపంచములో లేదు (11). మన మెచట నుండినను ఆయన మనకు తోడుగా నుండును (12). ఆయన అన్నిటిని తెలిసికొనువాడు.—సర్వ మాన

భూత భవిష్యద్వర్తమానములన్నియు ఆయనకు తెలియును. ఆయనకు చాటుగా మనమే మియు దాచి పెట్టలేము. మన హృదయములలోని ప్రతి తలంపును, ఆశను ఉద్దేశమును ఆయన తెలిసికొనును (13). ఆయన సర్వశక్తి గలవాడు. ఆయన కసాధ్యమైన దేదియు లేదు. (14). అయితే తన స్వభావ లక్షణములకు విరుద్ధమైన వాటిని ఆయన చేయలేడు కావున అబద్ధ మాడుటయైనను (15) పాపము చేయుటయైనను (16) ఆయనకు అసాధ్యమని తెలిసికొనవలెను.

దేవుని నీతికి సంబంధమైన లక్షణము లెవ్వియనగా పరిశుద్ధుడు.—ఆయన యెదుట నిలుచు మాతలు: సైన్యముల కధిపతియగు యెహోవా పరిశుద్ధుడు పరిశుద్ధుడు పరిశుద్ధుడు, సర్వలోకము ఆయన మహిమతో నిండి యున్నదని యెడతెగక పాడెదరు. (యెషయ 6:3) ఆయన పరిశుద్ధుడు కావున మనమును పరిశుద్ధులము కావలెనని కోరును (17).

ఆయన న్యాయస్థుడు.—ఆయన మనుష్యులకు ఆజ్ఞలనిచ్చి వాటిని గైకొనవలయునని వారికి ఆజ్ఞాపించియున్నాడు. వాటిని మీరువారిని శిక్షించును. వారి వారి క్రియలచొప్పున ఆయన ప్రతివారికి తీర్పుచేయును (18). ఆయన మేలు కీడులను పూర్తిగా తెలిసికొను సర్వజ్ఞానియైయున్నాడు (19). మేలేదియో దేని చేయుటవలన ఆ మేలును పొందగలమో అది ఆయనకు పూర్తిగా తెలియును. ఆయన కనికరము గలవాడు.—దేవుడు ప్రేమయై యున్నాడు (20). తన దయను గుర్తెరుగని వారియెడల సహా ఆయన దయను జూపును. ఆయన మంచి వారిమీదను చెడ్డవారిమీదను సూర్యుని నుదయింపజేసి, నీతిమంతులమీదను అనీతిమంతులమీదను వర్షము కురిపించుచున్నాడు (మత్త. 5:45). ఆయన ప్రతిదినమును మనకు క్రొత్త యుపకారములను జేయును. దుర్మార్గుడు మరణము నొందుటవలన ఆయనకు సంతోషము లేదు; దుర్మార్గుడు తన దుర్మార్గతను విడిచి బ్రతుకుటవలన ఆయనకు సంతోషము కలుగును (యెహె. 33:11). తన అద్వితీయ కుమారునియందు విశ్వాసముంచు ప్రతివాడు నశింపక నిత్యజీవము పొందుటకు ఆయన ననుగ్రహించునంతగా ఈలోకమును ప్రేమించెను (యోహా. 3:16). దుర్మార్గులను చాలకాలము సహించుచు, తన దయనుబట్టి వారు గుణపడవలెనని కోరును (21). ఆయన నమ్మతగినవాడును (22) మాట తప్పనివాడు (23) నై యున్నాడు. ఆయన సెలవిచ్చిన వన్నియు, ఆయన వాగ్దానము లన్నియు నెరవేరును. ఈ ప్రపంచములోనివారి నందరిని జూడగా దేవునిమీదనే పూర్ణముగా నానుకొని మనరక్షణకై ఆయనను మాత్రము నమ్మగలము గాని, మనకు వేఱుదిక్కు లేనేలేదు (24, 25).

## 2. దేవుని కార్యములను గూర్చిన బోధ.

యెహోవా అందరికిని ఉపకారి, ఆయన కనికరములు ఆయన సమస్తకార్యములమీద నున్నవి కీర్తన. 145.

### భాగములు.

I. దేవుడు ప్రపంచ మంతటిని సృష్టించెను.

II.. దేవుడు తాను సృష్టించిన వాటిని కాపాడును.

III. దేవుడు ఈ లోకము నేలును.

| | |
|---|---|
| దేవుడు అన్నిటిని సృజించెను. | ఆది. 1. |
| దేవుడు అన్నిటిని సృజించెను. | ఆది. 2. |
| దేవుడు అన్నిటిని కాపాడును. | కీర్తన. 145. |
| దేవుడు మనుష్యులను పోషించును. | కార్య 14: 17, 18; 17: 22-31 |
| దేవుడు భక్తులను కాపాడును. | కీర్తన 34. |
| దేవుడు భక్తులను కాపాడును. | మత్తయి 6: 19-34. |
| దేవుడు కీడును మేలుగా మార్చును. | కార్య 4: 23-31. |

### వేదవాక్యములు.

I. 1. పూర్వమే నీవు భూమికి పునాదివేసితివి. ఆకాశములుగూడ నీచేతి పనులే (కీర్తన 102: 25).

2. ఆకాశమందైనను భూమిమీదనైనను దేవతలనబడినవారు ఉన్నను, మనకు దేవుడొక్కడే యున్నాడు. ఆయన తండ్రి; ఆయన మూలముగా సమస్తముకలిగెను. ఆయన నిమిత్తము మన మున్నాము; మఱియు మనకు ప్రభువు ఒక్కడే. ఆయన యేసుక్రీస్తు; ఆయన ద్వారా సమస్తము కలిగెను; మనము ఆయన ద్వారా కలిగిన వారము (1 కొరింథి 8: 5, 6).

3. ప్రపంచములు దేవుని వాక్యమువలన నిర్మాణమైన వనియు, అందునుబట్టి దృశ్యమైనవి దృశ్యపదార్థములచే నిర్మింపబడలేదనియు, విశ్వాసముచేత గ్రహించు కొనుచున్నాము (హెబ్రీ 11: 3).

II. 4. నీవే అద్వితీయుడవైన యెహోవావు. నీవే ఆకాశమును, మహాకాశము లను వాటి సైన్యమును, భూమిని దానిలో నుండునదంతయును, సముద్రములను వాటిలో నుండున దంతయును సృజించి వాటి నన్నిటిని కాపాడువాడవు. ఆకాశ సైన్యమంతయు నీకే నమస్కారము చేయుచున్నది (నెహెమ్యా 9: 6)

5. ఆకాశపక్షులను చూడుడి; అవి విత్తవు, కోయవు, కొట్లలో కూర్చుకొనవు; అయినను పరలోకమునందున్న మీ తండ్రి వాటిని పోషించుచున్నాడు; మీరు వాటి కంటె బహు శ్రేష్ఠులు కారా? వస్త్రములనుగూర్చి మీరు చింతింపనేల? అడవి పువ్వులు ఏలాగు నెదుగుచున్నవో ఆలోచించుడి. అవి కష్టపడవు ఒడుకవు; అయి నను తన సమస్తవైభవముతో కూడిన సొలొమోను సహితము వీటిలో నొకదానివలె నైనను అలంకరింపబడలేదు (మత్త 6: 26, 28, 29).

6. వారి ప్రాణమును మరణములో నుండి తప్పించుటకును, కఱవులో వారిని సజీవులుగా కాపాడుటకును యెహోవాదృష్టి ఆయనయందు భయభక్తులుగలవారి మీదను ఆయన కృపకొఱకు కనిపెట్టువారిమీదను నిలుచుచున్నది (కీర్తన 33: 18, 19).

III. 7. యెహోవా రాజ్యము చేయుచున్నాడు. భూలోకము ఆనందించు గాక (కీర్తన 97: 1).

8. యాకోబూ నిన్ను సృజించినవాడగు యెహోవా, ఇశ్రాయేలూనిన్ను నిర్మిం చినవాడు ఈలాగు సెలవిచ్చుచున్నాడు: నేను నిన్ను విమోచించి యున్నాను. భయపడకుము. పేరుపెట్టి నిన్ను పిలిచియున్నాను. నీవు నా సొత్తు; నీవు జల ములలోబడి దాటునపుడు నేను నీకు తోడైయుందును. నదులలోబడి వెళ్లునప్పుడు అవి నీమీద పొర్లి పారవు అగ్నిమధ్యను నడచునప్పుడు నీవు కాలిపోవు జ్వాలలు నిన్ను కాల్చవు (యెషయా 43: 12).

9. ప్రస్తుతమందు సమస్త శిక్షయు దుఃఖకరముగా కనబడునేకాని సంతోష కరముగా కనబడదు; అయినను దానియందు అభ్యాసము కలిగినవారికి అది నీతియును శాంతికరమైన ఫలమిచ్చును (హెబ్రీ 12: 11).

10 నీమార్గమును యెహోవాకు అప్పగించుము. నీవు ఆయనను నమ్ముకొ నుము. ఆయన నీ కార్యము నెరవేర్చును (కీర్తన 37: 5).

## వి వ ర ము.

I. దేవుడే ప్రపంచమంతటిని సృష్టించెను: — ఈ ప్రపంచము అనాదినుండి యుండినదికాదు. దానియంతట అదే పుట్టలేదు. అది దేవునిచే సృజింప బడెను (1). దేవుడొక్కడే నిత్యమునాదినుండి యున్నవాడు (కీర్తన 90: 2). ఇతరములైన వాటి కన్నిటికి ఉత్పత్తి కలదు (2) "ఆయన మూలముగాను, ఆయన ద్వారాను, ఆయన నిమిత్తమును సమస్తముకలిగియున్నది (రోమా 11: 36). కాబట్టి సమస్తమునకు మూలము దేవుడే. ఆయన యిచ్ఛాప్రకారముగా ప్రపంచము సృష్టింపబడెను. ఆయన మాట సెలవియ్యగా దాని ప్రకారము జరిగెను, ఆయన ఆజ్ఞాపింపగానే కార్యము స్థిరపరచబడెను (కీర్తన 33: 9).

దేవుడీ ప్రపంచమును సృష్టించిన విధమునుగూర్చి బైబిలులోని మొదటి రెండధ్యాయములవలన మనము తెలిసికొనగలము. "ఆదియందు దేవుడు భూమ్యాకాశము లను సృజించెను" (ఆది 1: 1). ఏమియు లేనప్పుడు ఆయన శూన్యములోనుండి వాటిని సృజించెను (3). మొదట సృష్టింపబడినది నిరాకారముగాను, శూన్యముగాను నుండెనుగాని వెంటనే చక్కపరచబడిన ప్రపంచముకాలేదు. దేవుడా యసలు వస్తువులలోనుండి ఆరు దినములలో నిప్పుడున్న ప్రపంచమును నిర్మించెను. దేవుని యాత్మ జలములపైన అల్లాడుచుండగా (ఆది 1: 2) నిరాకారముగా నున్నవి చక్కపరచబడుటకు సిద్ధము చేయబడెను. తరువాత దేవుడు ఆరుదినములలో (1) వెలుగును సృజించి చీకటినుండి దానిని ప్రత్యేకించెను. (2) మబ్బు భూమిని కమ్మి యుండునట్లు మన కిప్పుడు కనబడు ఆకాశమను విశాలతను, దాని మేఘములను భూమి నుండి ప్రత్యేకించెను. (3) జలములను ఆరిన నేలను ప్రత్యేకించి, ఆరిన నేలమీద అన్నివిధములైన చెట్లు మొలచునట్లు చేసెను. (4) ఇప్పుడున్న రీతిగానే సూర్య చంద్ర నక్షత్రములను నిర్మించెను. (5) చేపలను, పక్షులను సృష్టించెను. (6) భూజంతువులను, చిట్టచివరను మనుష్యులను సృష్టించెను. (ఆది 1: 3–31). మరియు దేవుడు ఏడవ దినమున విశ్రమించి దానిని పరిశుద్ధపరచెను (ఆది 2: 2, 3.)

దేవునిచే సృష్టింపబడిన వాటిలో మనుష్యుడు చిట్టచివరి వాడును, గొప్పవాడునైయున్నాడు "దేవుడు తనస్వరూపమందు నరునిసృజించెను; స్త్రీనిగాను పురుషునిగాను వారిని సృజించెను" (ఆది 1: 27.) "నేల మంటితో నరుని నిర్మించి వాని నాసికారంధ్రములో జీవవాయువును ఊదగా నరుడు జీవాత్మ ఆయెను" (ఆది 2: 7). పురుషునికి సాటియైన సహాయురాలగునట్లు స్త్రీసృష్టింపబడెను (ఆది 2: 18).

సృష్టి కార్యము త్రైయేక దేవుని పనియై యున్నది. తండ్రితో కూడ కుమారుడును (1 కొరి. 8:6; ఎఫె. 3:9.) పరిశుద్ధాత్మయు (ఆది. 1:3) ఈ పని చేసిరి. అయితే అపొస్తలుల విశ్వాసప్రమాణములో నున్నట్లు తండ్రి సృష్టికర్తయై యున్నాడని సాధారణముగ జెప్పబడును. త్రిత్వములోని మొదటి మూర్తికి దేవుని పనులలో మొదటిదియగు సృష్టిని యీ విధముగ నారోపించుట న్యాయము.

II. దేవుడు తాను సృష్టించిన వాటిని కాపాడును:— ఒక గడియారమును చేసినవాడు తాను జేసిన గడియారమును విడిచిపెట్టినట్లుగా దేవుడు తాను సృష్టించిన సృష్టిని విడిచిపెట్టి యుండలేదు. ఆయన తాను సృష్టించిన వాటిని ఎల్లప్పుడు నుద్ధరించి కాపాడును. లేనియెడల నీ ప్రపంచ మొక క్షణములో నాశనమై పోవును. "మన మాయనయందు బ్రతుకుచున్నాము, చలించుచున్నాము, ఉనికి కలిగి యున్నాము" (కార్య. 17:28.) అను మాటలు మనుష్యులకు మాత్రము గాక సర్వ సృష్టికిని జెల్లును. ఆయన కనికరములు గడ్డి పువ్వు, ఆకాశ పక్షి మొదలు గొప్ప నక్షత్రములవరకు సమస్తమైన వాటిమీద నున్నవి. (కీర్తన. 145:9).

దేవుడు మనుష్యులను ముఖ్యముగా కాపాడును—దేవుడు తాను సృష్టించిన వాటి నన్నిటిని కాపాడుచున్నాడు గాని మరి ముఖ్యముగా మనుష్యులను కాపాడును. "ఆయన మనలో నెవనికిని దూరముగా నుండువాడు కాడు" (కార్య. 17:27.) దేవుడు మనుష్యులను సృష్టించి, వారి పోషణకొరకు తగిన యేర్పాటులను జేసెను (ఆది. 1:29.) ఆ యేర్పాటుల ప్రకారము ఆయన నేటివరకు వారిని పోషించుచున్నాడు. వ్యవసాయకులు విత్తనములు వేతురు గాని వాటిని పైరుగా చేయువాడు దేవుడే. "సర్వజీవుల కన్నులు దేవునివైపు చూచుచున్నవి. తగిన కాలమందు ఆయన వారికి ఆహారము నిచ్చుచున్నాడు. ఆయన తన గుప్పిలిని విప్పి, ప్రతి జీవి కోరికను తృప్తిపరచుచున్నాడు" (కీర్తన 145:15, 16.)

దేవుడు మరి ముఖ్యముగా భక్తులను కాపాడును.—దేవుడు సామాన్యముగా అందరిని కాపాడుచున్నాడు గాని ఆయన తన భక్తులను విశేషరీతిగా కాపాడుచున్నాడు. (6) కావున భక్తులు తమ చింత యావత్తు ఆయనమీద వేయవలెను. "ఆయన మిమ్మునుగూర్చి చింతించుచున్నాడు" (1 పేతురు 5:7.) అని వ్రాయుచు పేతురు భక్తులను ప్రేరేపించుచున్నాడు. ఆకాశ పక్షులకు ఆహారము పెట్టుచు, అడవి పువ్వుల నలంకరింపచేయుచున్న దేవుడు తన బిడ్డలకు మరి రూఢిగా అన్నవస్త్రాదుల ననుగ్రహించును (మత్త. 6:26, 30.) ఆయన సెలవు లేనిది ఒక పిచ్చుకయైనను నేలపడదు. కావున అనేక పిచ్చుకలకంటె చాల విలువగల వారైన

తన భక్తుల నాయన మరెక్కువ జాగ్రత్తగా జూచును. వారి తలవెండ్రుకల నన్నిం టిని లెక్కించినంత జాగ్రత్తగా వారిని కాపాడి వారిమేలును విచారించును. (మత్తయి 10:29, 30.)

III. దేవుడు ఈ లోకము నేలును—దేవుడు తాను సృష్టించిన ప్రపంచముమీదఅధికారియైయేలుచున్నాడు. (7) ఆయన అందరికి ప్రభువును(రోమా 10:12), అద్వితీయుడగు సర్వాధిపతియు, రాజులకు రాజును, ప్రభువులకు ప్రభువునై యున్నాడు (1. తిమో. 6:15.) ఆయన అన్యజనాంగములను (కీర్త.66:7.) నరులం దరిని (యోబు 14:3.) ఏలును. ఆయన ప్రభుత్వవిషయములను జూడగా వానిలో మనము గ్రహించుకొనలేని సంగతులెన్నియున్నవు (1. కొరి 13:12 ) ఆయన తలంపులు మన తలంపుల కంటె నెంత యెక్కువయైనను (యెష. 55:9.) "దేవుని ప్రేమించు వారికి మేలు కలుగుటకై సమస్తమును సమకూడి జరుగుచున్నవని యెఱుగుదుము" (రోమా 8:28.) దేవుడు మనుష్యులకు స్వేచ్ఛ ననుగ్రహించెను. అందువలన దేవుడు కోరని వాటిని చేయుటకుకూడ మనుష్యులకు శక్తికలిగెను. అట్టి స్వేచ్ఛను మనుష్యుల యొద్దనుండి తీసివేయక వారు దాని ననుసరించి చేయుటకు సెలవిచ్చుటచే, ఆయనకు అసహ్యముగనున్న పాపమును జేయుటకు వారికి వీలాయెను. అయితే పాపముచేయు టయందుకూడ దేవుడు మనుష్యులకు ఒక హద్దును నియమించెను. ఆ హద్దును దాటి పాపము చేయుట కెవరికి తరముకాదు (యోబు 5:12, యెష 8:9, 10). ఆయన తన సర్వజ్ఞానమునుబట్టి దుర్మార్గులు వర్ధిల్లునట్లు, భక్తులు శ్రమపడునట్లు సెలవిచ్చినను, తన భక్తులకు మేలుచేయునంతటి శ్రమను మాత్రమే వారిపైకి రానిచ్చును (8:9.)

భక్తులపనులు కొనసాగునట్లు దేవుడు వాటిని సఫలపఱచును. (10) దుర్మార్గుల పనులలో అనేకమైన వాటిని ఆయన అడ్డగించును. దృష్టాంతముగ, యాకోబుకు హానిచేయకుండునట్లు లాబానును (ఆది. 31:24), ఇశ్రాయేలీయులను శపింపకుండునట్లు బాలామును (సంఖ్యా 22 : 12) ఆభ్యంతరపఱచెను. కీడుగా నెంచబడిన దానిని ఆయన యనేక పర్యాయములు మేలుగా పర్యవసింప జేయును. దృష్టాంతముగ యోసేపు తన సహోదరులచే ఐగుప్తుకు అమ్మబడుట యనునది యాకోబు సంతతివా రును ఐగుప్తీయులందఱును కఱవులో నశింపక రక్షింపబడుటకు కారణమయ్యెను. (ఆది. 50:20). మఱి ఆశ్చర్యకరమైన యింకొక విషయ మేదియనగా దుష్టులైన యూదులు క్రీస్తును సిలువవేయుట జనులందఱును రక్షింపబడుటకు సాధన మయ్యెను (కార్య. 4:28, 29.)

---

## 3. మనుష్యుడు సృష్టింపబడుట, అతడు పాపాత్ముడగుటను గూర్చిన బోధలు.

ఒక మనుష్యుని (ఆదాము) అవిధేయత వలన అనేకులు పాపులుగా నేలాగు చేయబడిరో, ఆలాగే యొకని (క్రీస్తు) విధేయత వలన అనేకులు నీతిమంతులుగా చేయబడుదురు. రోమా. 5:19.

### భాగములు.

I. నరుడు దేవుని పోలికెగా సృష్టింపబడెను.

II. నరుడు పాపాత్ముడైన విధము.

III. నరులు పాపాత్ములగుటచే కలిగిన ఫలములు.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| ఆదాము పాపాత్ముడగుట. | ఆది 3:1-12 |
| పాపమునకు ఫలితము. | ఆది 3:13-24 |
| మనజీవము ఏపాటిది? | కీర్తన 90 |
| పాపములో చచ్చినవాడు. | ఎఫెసీ 2:1-10 |
| నూతన జన్మము. | యోహా 3:1-15 |
| దుర్బుద్ధికి, సుబుద్ధికిగల పోరాటము. | రోమా 7:7-25 |
| ఆదాము, క్రీస్తు అనువారు చేసినపనియొక్క ఫలితములు. | రోమా 5:12-21 |

### వేదవాక్యములు.

I. 1. నీవు వాని జ్ఞాపకము చేసికొనుటకు మనుష్యుడు ఏపాటివాడు ? నీవు దర్శనమిచ్చు నరుడు ఏపాటివాడు ? దేవునికంటె వానిని కొంచెము తక్కువవానినిగాచేసి యున్నావు. మహిమా ప్రభావములతో వానికి కిరీటము ధరింప చేసి యున్నావు (కీర్తన 8:4,5).

2. నీవు నన్ను కలుగచేసిన విధము చూడగా భయమును ఆశ్చర్యమును నాకు పుట్టుచున్నవి. అందును బట్టి నేను నీకు కృతజ్ఞతా స్తుతులను చెల్లించుచున్నాను. నీకార్యములు ఆశ్చర్యకరములు. ఆ సంగతి నాకు బాగుగా తెలిసియున్నది (కీర్తన 139:14).

౩. ఒక మనుష్యుడు లోకమంతయు సంపాదించి తన ప్రాణముపోగొట్టుకొంటే అతని కేమి ప్రయోజనము? ఒక మనుష్యుడు తన ప్రాణమునకు ప్రతిగా నేమి యియ్యగలడు (మత్త 16:26)?

II. 4. ఆదాము మోసపఱచబడలేదు గాని స్త్రీ మోసపఱచబడి యపరాధమునకు లోఁబడెను (1 తిమొ 2:14).

III. 5. ఒక మనుష్యునిద్వారా పాపమును, పాపముద్వారా మరణమును లోకములో నేలాగు ప్రవేశించెనో, మనుష్యులందఱు పాపముచేసినందున, అలాగుననే మరణము అందఱికి సంప్రాప్తమాయెను (రోమా 5:12).

6 ఒకమనుష్యుని అవిధేయతవలన అనేకులు పాపులుగా నేలాగుచేయబడిరో అలాగే యొకని విధేయతవలన అనేకులు నీతిమంతులుగా చేయబడుదురు (రోమా 5:19.

7. నేను పాపములో పుట్టితిని. పాపములోనే నాతల్లి నన్ను గర్భమున ధరించెను (కీర్తన 51:5).

8. శరీరానుసారమైన మనస్సు దేవునికి విరోధమై యున్నది; అది దేవుని ధర్మశాస్త్రమునకు లోఁబడదు. ఏమాత్రమును లోబడనేరదు (రోమా 8:7).

9 నీ హృదయములోనుండి జీవధారలు బయలుదేరును. కాబట్టి అన్నిటి కంటె ముఖ్యముగా నీ హృదయమును భద్రముగా కాపాడుకొనుము (సామె 4:23).

10. యేసు ఇట్లనెను-ఒకడు నీటిమూలముగాను ఆత్మమూలముగాను జన్మించితేనేకాని దేవుని రాజ్యములో ప్రవేశింపలేడని నీతో యదార్థము చెప్పుచున్నాను. శరీరమూలముగా జన్మించినది శరీరమును ఆత్మమూలముగా జన్మించినది ఆత్మయునై యున్నది (యోహా 3:5,6).

## వివరము.

1. నరుడు దేవుని పోలికెగా సృష్టింపబడెను.—దేవుడు చిట్టచివరగా సృష్టించిన నరజాతి ఆయనచే సృజింపబడిన సృష్టి యంతటిలో గొప్పదియైయుండెను (1). మనుష్యులు దేవుని పోలికెగా సృష్టింపబడుటచేతను (యాకో 3:9.), దేవుని పోలికయు, ఆయన మహిమయు వారికి నుండుటచేతను (2. కొరింథ 11:9) వారికిగొప్పతనము కలిగెను. మనుష్యులకు చక్కని నివాసస్థానముగా నుండునట్లు

దేవుడు భూమిని నిర్మించి, అలంకరించి, ఆకాశపక్షులను భూమృగములనుసృష్టించిన పిమ్మట ఆయన మాస్వరూపమందు మాపోలికెచొప్పుననరులను చేయుదుమని చెప్పెను (ఆది. 1: 26) ఈవిధమున నిర్మింపబడి మనుష్యుడు దేవునిపోలికెగా నుండుటచే వారు దేవునిచే సృజింపబడిన వాటన్నిటిలో ముఖ్యులైయున్నారు. అందువలన ఒక మనుష్యుని చంపువాడు చంపబడవలెనను కట్టడను దేవు డేర్పఱచెను (ఆది. 9: 6).

మానవశరీరము.—దేవుడు ఆత్మ కావున ఆయన పోలిక శరీరసంబంధమైనది కాదు. మానవశరీరమును జూడగా అది తక్కిమ్మ జీవుల శరీరములవలె నేలమట్టితో నిర్మింపబడి (ఆది. 2: 7), వాటికి సంబంధించియున్నది. ఇట్టిసంబంధము గలదిగ నున్న మానవశరీరము ఇతరజీవుల శరీరములకంటె మిక్కిలి చిత్రముగా చేయబడి వాటికంటె చాలా దివ్యముగా నున్నది (2). ఈ శరీరము ఆత్మకు నివాసస్థానముగ (2 కొరి. 5: 1) నుండుట అనునది దానికి ముఖ్యఘనమైయున్నది. మఱియు దేవుడు మానవదేహమును ప్రత్యేకముగా సృజించెను. గనుకను ఆయన కుమారుడు ఈ లోకమునకు వచ్చినప్పుడు మానవదేహమునుధరించెను గనుకను, (యోహా 1: 14). విశ్వాసి దేహము ఈ లోకమందుసహ పరిశుద్ధాత్మకు నివాసస్థానముగనున్నది గనుకను (1కొరి 6: 19), అది పరలోకమందు మహిమపఱచబడును గనుకను (1కొరి 15: 42-44), దానిని యితరజీవుల శరీరములకంటె మిక్కిలి ఘనమైన దానినిగా నెంచవలెను.

మనుష్యుల ఆత్మ.—దేవుడు తన యూపిరిచేత (ఆది 2: 7) మనుష్యులకు ననుగ్రహించిన ఆత్మ చాల ముఖ్యమైనది. ఈ యాత్మ దేవుని పోలికెగా చేయబడెనని తెలిసికొనవలెను. దేవుడు సృష్టికర్త; మనుష్యుడు సృష్టింపబడినవాడు. కావున మనుష్యు డన్ని విషయములలో దేవునిపోలికెగా నుండుట అసాధ్యము. దేవునికుమారుడైన క్రీస్తు ఒక్కడే అన్నివిషయములలో దేవుని పూర్ణముగ దేవుని స్వరూపియైయున్న మనుష్యుడాయెను (కొలొ 1: 15). ఆయన దేవుని మహిమయొక్క ప్రతిబింబమును, ఆయన తత్వముయొక్క మూర్తిమంతమునై యున్నాడు (హెబ్రీ 1: 3) అయినను ఏయే గుణలక్షణములు దేవునియందు పూర్ణములై యున్నవో అవి మనుష్యులయందు మితముగా నుండునట్లు దేవు డనుగ్రహించెను కావున, ఈ విధముగ మనుష్యుడు దేవుని పోలిక చొప్పున సృష్టింపబడె ననుట న్యాయము. దేవుడు మనుష్యులకు బుద్ధిని, స్వేచ్ఛను, మంచివాటిని చేయుటకు కావలసిన శక్తిని, అమరత్వమును, సర్వసృష్టిమీది యధికారమును, మఱి ముఖ్యముగ ఆయననుగూర్చిన సరియైన జ్ఞానమును (కొల 3: 10), పూర్ణనీతిని, పరిశుద్ధతను (ఎఫెసీ 4: 24) ఇచ్చెను. మనుష్యుల అసలు స్థితిని చూడగా వారు లోపము లేనివారును (ఆది 1: 31), దేవుని

దయను, ఎడతెగక నొందినవారును (ఆది 1: 28), నిండు సౌఖ్యము గలవారునై యుండిరి.

II, నరుడు పాపాత్ముడైన విధము.—ఏదేనుతోటను కాపాడి, భద్ర పఱచుటకు ఆదాము దానిలో నుంచబడెను. (ఆది 2: 15) మేలుకీడుల తెలివినిచ్చు ఆ యొక్క చెట్టు ఫలములను తప్ప మిగత చెట్లన్నిటి ఫలములను తినుటకు అతనికి దేవుడు సెలవిచ్చెను. (ఆది 2:16,17). నిషేధింపబడిన ఆ చెట్టు ఫలములు తినినయెడల తప్పక చచ్చెదవని దేవుడతనితో మందలించెను (ఆది 2: 17). ఇట్లు దేవుడతని విధే యతను పరీక్షించెను. మనుష్యుడు బలవంతముగా కాదుగాని స్వేచ్ఛాపూర్వకముగా దేవుని సేవింపవలెనని దేవిడిట్టి యేర్పాటుచేసెను. మనుష్యుడు విధేయత, అవిధే యత అను ఈ రెంటిలో నేదో యొక దానిని స్వయముగా నేర్పఱచుకొని దాని ననుసరింపవలసి యుండెను. అతడు విధేయతను ఏర్పఱచుకొని యుండిన యెడల అంతయు బాగుగ జరిగియుండును' అయితే పాపమంతటికి కారకుడైన సాతాను (యోహా. 8: 44; 1. యోహా. 3: 8) సర్పరూపముతో హవ్వయొద్దకు వచ్చి (ఆది 3: 1), ఆమెను మోసపుచ్చి, దేవుని మాటయం దామె సందేహించునట్లును, నిషే ధింపబడిన పండ్లను కోరుకొను లాగునను, చివరకు వాటిని తినునంతగాను ఆమెను శోధించెను (ఆది 3: 4-6) సాతానుచే మోసపోయిన హవ్వ నిషేధింపబడ్డ వాటిని తాను తినుటయే కాక వాటిలో కొన్నిటిని ఆదామునకిచ్చి తినుమని ప్రేరేపింపగా అతడుకూడ తిని దేవునియెడల అవిధేయు డయ్యెను (ఆది 3: 6, 17)

III. నరులు పాపాత్ములగుటచేత కలిగిన ఫలితములు.—ఈ పాపము వలన ఆదాము ఆదియందు తనకుండిన నిర్దోషత్వమును, సౌఖ్యమును పోగొట్టుకొని, ఏదేనులోనుండి త్రోసివేయబడి, శరీరసంబంధమైనట్టియు ఆత్మసంబంధమైనట్టియు మరణమును తనమీదికి తెచ్చుకొని (5) నిత్యనాశనమునకులోనైనవాడాయెను (లూకా 19: 10). మనుష్యులందరును ఆదామునుండి పుట్టినందువలన, వారుకూడ పాపాత్ములై పాపఫలముల ననుభవించుచున్నారు (6).

శరీరమరణము.—మేలు కీడుల తెలివినిచ్చు చెట్టు ఫలములను తిను దిన మున నిశ్చయముగా చచ్చెదరని దేవు డాదాముతో జెప్పెను (ఆది 2: 17). ఆదాము 930 సంll లు జీవించియుండినను (ఆది 5: 5) అతడా నిషేధింపబడిన పండును తిని దేవునియాజ్ఞను మీఱిన దినము మొదలు మృత్యుడు (అనగా చావవలసిన వాడు) అయెను. మనుష్యుల శరీరమిప్పుడు చావుకు లోనగునదియై మొదట నేమంటితో చేయబడెనో మఱల నా మంటిపాలగును (ఆది 3: 19). ముందు జరుగబో

వునది మనకు తెలియదు కావున, మనము చావవలసిన గడియయు, స్థలమును తెలియదు (యాకో 4:14). అయినను మనుష్యుడు ఒక్కసారి మృతినొందవలెనను సంగతి రూఢిగా నియమింపబడెను. (హెబ్రీ 9:27). మనుష్యుని శరీరజీవము ఒక పుష్పము యొక్క చక్కదనమువలె వాడిపోవును. ఆవిరివలె గతించిపోవును. (రోమా 14: 1, 2) దేవుడు మనుష్యునికి దీర్ఘాయువు ననుగ్రహించెను. అది ఎనుబది సంవత్సరములు కావచ్చును. ఇంతియకాక యీ ఆయుస్సు ప్రయాసముతోను దుఃఖముతోను నిండినదై యున్నది, (కీర్త 90: 10). ఆదాము హవ్వల పాపమువలన కలిగిన శాపమునకు మనుష్యులందఱును లోనై, మరణకరమైన శరీరమునకును, దానితోకూడ సమస్తవిధములగు నొప్పులు, బాధలు కష్టములు మొదలగు వాటికన్నిటికిని పాత్రులైరి (ఆది 3: 16-19).

ఆత్మీయమరణము:—అయితే పాపమువలన మనుష్యులకు కలిగినఫలములలో మిగుల భయంకరమైనవి ఆత్మీయమైనవై యున్నవి. బుద్ధిజ్ఞానములు మనుష్యుల కింకనుండినను, అవి పాపాత్ములు కానివారి బుద్ధిజ్ఞానమంతటి సూక్ష్మములైనవి కావు. ఇప్పటివఱకు ఇతర జంతువులమీద మనుష్యులకు అధికారముండినను, అది మునుపటి అధికారమునకంటె యనేకరెట్లు తగ్గిపోయి యున్నది. లౌకిక విషయములలో నేవియో కొన్ని కార్యములు చేయుటకును, కొన్నిటిని విడిచిపెట్టుటకును అతనికి కొంత స్వేచ్ఛ యింక నుండినను, తన స్వంత శక్తివలన ఆత్మీయ విషయములలో నెద్దానినైన చేయునట్టి స్వేచ్ఛ యతనికిలేదు. మనుష్యులు పాపము చేయుటకు శక్తిగలవారేగాని స్వయముగ దేవుని సేవించుటకు వారికేమాత్రము శక్తిలేదు. "నరుల హృదయాలోచన వారిబాల్యమునుండి చెడ్డది" (ఆది. 8: 21). మనుష్యులలో మొదటయుండిన దైవజ్ఞానము, నీతి, పరిశుద్ధతయును పాపమువలన నశించిపోయెను. (కొల 3: 10; ఎఫె. 4: 24). పుట్టుకతోనే అందఱును పాపస్వభావము కలవారును (7) కీడు చేయుటయందు నైజబుద్ధి గలవారునై (8) యుండిరి. ఈలాగు చెడిపోయిన స్వభావమే జన్మపాపమనబడును. పిల్లలును జన్మపాపము గలవారు కావున, వారికి యుక్తవయస్సు రాగానే స్వయముగ పాపములు చేయుట కారంభింతురు (ప్రసంగి 7: 20). గింజలలోనుండి చెట్టు పెరుగురీతిగా జన్మపాపములోనుండి పాపక్రియలు పుట్టును (9). మనము పాపుల మగుటచే జీవమునకాధారభూతుడగు దేవునినుండి వేఱుపడినవారమును, ఆత్మీయముగా మృతులమును (ఎఫె 2: 1). నిత్యనాశనమునకు లోనైనవారము (మత్త. 25: 41.) నై యున్నాము. కావున మనము దేవుని కృపచేత తిరిగి పుట్టి, నిజమైన నీతియందును, పరిశుద్ధతయందును మరల నూతనపఱచబడి దేవుని పోలికగల వారమై యుండవలెను. (10) లేనియెడల మన గతి బహు ఘోరమైనదై

యుండును. మనము నూతనపఱచబడినపిమ్మటకూడ మనలో నింకను శేషించి యుండు దుర్బుద్ధి పరిశుద్ధాత్మచే మనలో కారంభించబడిన నూతన బుద్ధిని విరోధించు చుండును (రోమా 7: 21-23). మనలో నున్న దుర్బుద్ధిని మనము మన జీవితకాల మంతటిలో ఖండించవలెను (రోమా 8: 12, 13). ఈలోకములో మనము ఆ దుర్బుద్ధిని పూర్ణముగా కొట్టివేయ లేక పోయినను, పరలోకములో రూపాంతరము నొంది, మహిమ పఱచబడిన పిమ్మట దానినుండి తప్పింపబడి రక్షణ నొందుదుము (1 కొరింధి 15; 43-49).

---

## 4. దేవుడు న్యాయస్థుడు కావున పాపము చేసినవారిని శిక్షించుటను గూర్చిన బోధ.

అందఱియెడల కరుణ చూపవలెనని దేవుడు అందఱిని అవిధేయతాస్థితిలో మూసివేసి యున్నాడు. రోమా 11: 32.

### భాగములు.

I. దేవుడు ధర్మశాస్త్రము నిచ్చెను.

II. మనుష్యులందఱును దానిని మీఱియున్నారు.

III. దేవుడు పాపాత్ములను శిక్షించును.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| దేవుడు ధర్మశాస్త్రము నిచ్చుట. | నిర్గ. 20. |
| ధర్మశాస్త్ర బోధల సారము. | లూకా 10: 25-37. |
| అంధులు దేవుని యాజ్ఞలను మీఱినవారు | 1. యోహా. 1 |
| అందఱు శిక్షకు పాత్రులైనవారు. | రోమా 3: 1-20 |
| ఇహమందు కలుగు శిక్షలు. | ద్వితీ. 28: 15-67. |
| ఇహమందు కలుగు శిక్షలు. | 2 రాజులు 17: 1-23. |
| ఇక మీదట కలుగబోవు శిక్షలు. | మత్త. 25: 31-46 |

## వేదవాక్యములు.

I. 1. నీ పూర్ణహృదయముతోను, నీ పూర్ణాత్మతోను నీ పూర్ణమనస్సుతోను నీదేవుడైన యెహోవాను ప్రేమింపవలె ననునదే. ఇది ముఖ్యమైనదియు మొదటిది యునైన ఆజ్ఞ. నిన్నువలె నీపొరుగువానిని ప్రేమింపవలెనను రెండవ ఆజ్ఞయు దాని వంటిదే (మత్తయి 22: 37-39.)

2. నీ దేవుడగు యెహోవానైన నేను రోషముగల దేవుడను; నన్ను ద్వేషించువారి విషయములో మూడు నాలుగు తరములవారి పర్యంతము తండ్రుల దోషమును కుమారులమీదికి రప్పించుచు, నన్ను ప్రేమించి నా ఆజ్ఞను గైకొనువారిని వెయ్యి తరముల పర్యంతము కరుణించు వాడనై యున్నాను. (నిర్గ 20: 5, 6.)

II. 3. పాపము చేయు ప్రతివాడును ఆజ్ఞ నతిక్రమించును, ఆజ్ఞాతిక్రమమే పాపము (1 యోహా. 3: 4)

4. హృదయము అన్నిటికంటె మోసకరమైనది, అది ఘోరమైన వ్యాధికలది, దాని గ్రహించగల వాడెవడు? (యిర్మీ. 17:9.)

5. ప్రేమ పొరుగువారికి కీడు చేయదు గనుక ప్రేమ గలిగి యుండుట ధర్మశాస్త్రమును నెఱవేర్చుటయే (రోమా 13: 10.)

6. ఏ భేదమును లేదు; అందరును పాపముచేసి దేవు డనుగ్రహించు మహిమ పొందలేక పోవుచున్నారు (రోమా 3: 23.)

7. పాపముచేయక మేలుచేయుచుండు నీతిమంతుడు భూమిమీద నొకడైనను లేడు (ప్రసంగి 7: 20)

III. 8. వ్యర్థమైన మాటలవలన ఎవడును మిమ్మును మోసపరచ నియ్యకుడి; ఇట్టి క్రియలవలన దేవుని యుగ్రత అవిధేయులైన వారిమీదికి వచ్చును. గనుక మీరు అట్టివారితో పాలివారై యుండకుడి (ఎఫె. 5,6,7)

9. నీ కాఠిన్యమును మార్పుపొందని నీహృదయము ననుసరించి, ఉగ్రత దినమందు (అనగా) దేవుని న్యాయమైన తీర్పు బయలు పడుచుండు దినమందే నీకు నీవే యుగ్రతను సమకూర్చుకొనుచున్నావు (రోమా 3: 5.)

## వి వ ర ము.

I. దేవుడు ధర్మశాస్త్రము నిచ్చెను.—దేవుడు అందరికిని అధికారి యై యున్నాడు (1 తిమో. 6: 15) గనుక, అందరును ఆయన ధర్మశాస్త్రమునకు

లోనగుటవు బద్ధులై యుందురు. అందరును మొదటినుండి లోబడినయెడల క్షేమమును సౌఖ్యమును గలిగియుండి కష్టదుఃఖములు ఎక్కడనైనను ఉండకపోవును.

దేవుడు ధర్మశాస్త్రము నిచ్చిన విధము.—— దేవుడు మనుష్యులను సృజించినపుడే ఆయన తనయాజ్ఞలను వారి హృదయములమీద వ్రాసెను (రోమా 2: 15) అయితే మనుష్యులు పాపములో పడుటవలన మొదట వారి కుండిన జ్ఞానము క్రమక్రమముగ నశించి, వారు అజ్ఞానులైరి (రోమా 1: 21.) కాబట్టి దేవుడు సీనాయి పర్వతము నొద్ద రెండు రాతిపలకలమీద (నిర్గ 28: 18.) తన ధర్మశాస్త్రము వ్రాసి వారి కిచ్చెను (నిర్గ 20: 1.) మనము వానినే పదియాజ్ఞ లందుము. మనము పూర్ణహృదయముతో మన దేవుని, మనవలె మన పొరుగు వానిని ప్రేమింపవలయు ననునదే ఆ యాజ్ఞల సారమై యున్నది (1.)

దేవుడు తన యాజ్ఞలను గూర్చి మందలించిన దేమి?—— దేవుని యాజ్ఞల నందరును గైకొనవలసియున్నారు. వాటిని మీరువారిని మూడు నాలుగు తరముల వారి పర్యంతము శిక్షించెద నని పది యాజ్ఞలలోనే మందలించి యున్నాడు. (2.) "ఈ విధికి సంబంధించిన వాక్యములను గైకొనక పోవుటవలన వాటిని స్థిర పరచినవాడు శాపగ్రస్తుడని" మరియొక చోట చెప్పెను (ద్వితీ. 27: 26 గలతీ 3: 10:) "పాపమువలన వచ్చు జీతము మరణము" (యెహె. 18:4.)

## II. మనుష్యులందఱును దేవుని యాజ్ఞలను మీఱియున్నారు.

దేవుని యెదుట మనుష్యులందరును పాపాత్ములై శిక్షకు పాత్రులైయున్నారు. (3)

మనుష్యుల పాపములు రెండు విధములు.——(1) మనుష్యులుపాపుల నుండి పుట్టుటచేతను (యోబు 14: 4) శరీరము లోనుండి పుట్టినది శరీరముగుట చేతను (యోహా. 3:6.) మనుష్యులందరును పుట్టుకతోనే పాపాత్ములైరి. స్వభావ సిద్ధముగ, వారందరును దైవోగ్రతకు పాత్రులైయున్నారు (ఎఫె 2: 3.) మనుష్యుల మనస్సు దేవునికి విరోధమై యున్నది; అది దేవుని ధర్మశాస్త్రమునకు లోబడదు, ఏమాత్రము లోబడ నేరదు. (రోమా. 8. 7.) వారిహృదయము రాతివలె కఠిన మైనదియు (యెహె. 36: 26,) తిరుగుబాటు చేయునదియునై (యిర్మీ 5: 23.) దేవునియందు భయభక్తులు లేక (రో మా 3: 18,) దురాశేచ్ఛలతో నిండియున్నది. (4) అదిపాపదోషములను ఉబికించు అపవిత్రమైన ఊటగానున్నది. (మత్త. 15: 19.) (2) మనుష్యులతలంపులవలనను, మాటలవలనను క్రియలవలనను అనుదినముదేవునికివిరోధముగ

పాపముచేయుచున్నారు. దేవుడు నిషేధించిన అనేకమైనవాటిని చేయుటద్వారాను, ఆయన ఆజ్ఞాపించినవాటిలో ననేకమైనవాటిని చేయక పోవుటవలనను వారులెక్క లేని పాపములను చేయుచున్నారు. (కీర్తన. 40: 12) వారు తెలియక అనేక పాపములు చేయుదురు. కావున దావీదు నేడు నేను రహస్యముగా చేసినతప్పులు క్షమించుమని వేడుకొనెను. (కీర్తన. 19: 12) దేవునియందు భయభక్తులులేనటువంటి మనుష్యులు చేయునవి యన్నియు పాపముతో గూడినవియై యగును. ఎందుకనగా వారిక్రియలు లోపములేనివై యుండినను వారియుద్దేశములు సరియైనవై యుండవు. మనకార్యములు దేవునికి అనుకూలముగ నుండునట్లు మనము ప్రేమ గలిగినవారలమై వాటిని చేయవలెను. (5).

అందరును పాపాత్ములైరి.—(1 యోహా 5: 12) ఏ భేదమును లేక మనుష్యులందఱును పాపాత్ములై యున్నారు. (6, 7). ఆదాము పాపములో బడినది మొదలు నేటివఱకు ఈలోకమునందు పుట్టిన వారిలో నొక్కడు తప్ప అందఱును పాపములోనే పుట్టి యున్నారు. పాపము లేకుండపుట్టిన ఆ యొక్కడు మన ప్రభువైన యేసుక్రీస్తు. ఆయన పాప మేమియు చేయలేదు. ఆయన నోటను ఏ కపటమును కనబడలేదు. (1. పేతు. 2: 21) ఆయన గాక యీలోకములో పుట్టినవారందరియొక్క మనస్సులు చెడిపోయి అందఱును దుష్టప్రవర్తన గలవారైరి. అందరును త్రోవతప్పిరి. (రోమా 3: 22.) కొందఱు ఆత్రోవనుండి ఎక్కువగా తొలగిపోయి మఱి హేయమైన పాపములను చేయుచున్నారు. కొందఱు అంతటినీచపాపములను చేయకపోయినను మొత్తానికి అందఱును పాపాత్ములే. నీతిమంతుడొక్కడును లేడు (రోమా 3: 10) మనుష్యులచే మిగులమంచి వారుగ నెంచబడిన వారలును దేవుని యాజ్ఞలు మీఱి శిక్షకు పాత్రులైయున్నారు. తనను తాను పొగడుకొనిన పరిసయ్యుడుకూడ తన యెదుట నుండిన సుంకరివలె పాపాత్ముడై యుండెను. (లూకా 3: 9. 14.). అబ్రాహాము సంతతివారమని చెప్పుకొనిన యూదులుకూడ తాము తృణీకరించిన అన్యులవలె పాపులైయుండిరి. (రోమా 3: 9). "మనము పాపము లేనివారమని చెప్పుకొనిన యెడల ఆయన నబద్ధికునిగా చేయుదుము. మఱియు ఆయనవాక్యము మనలో నుండదు." (1. యోహా 1:10.)

అందఱును శిక్షకు పాత్రులు.—పాపము చేయువారిని శిక్షించుట న్యాయము మాత్రముగాక అది అవసరమై యున్నది. సర్కారువారు నేరస్థులను శిక్షింపకపోయిన యెడల తమ కట్టడలను గైకొనువారికి అన్యాయము చేసినవారగుదురు. (రోమా 13: 3, 4; 1. పేతురు 2: 13, 14.) తమ దేశములోని దొంగలను,

ఖూని పనులు జరిగించువారిని, శిక్షింపకూడదని కోరువారెవరు? అదే విధముగా దేవుడును తన న్యాయమును వెల్లడి చేయవలసి యున్నాడు. కావున ఆయనకూడ తన యాజ్ఞలను మీరు వారిని తప్పక శిక్షింప వలెను. అలాగు చేయకపోయిన యెడల తన మాటను తప్పువాడగుట మాత్రమే గాక, తన యాజ్ఞలను ఎన్నడును మీరని వారికి (ఉదాహరణముగా మంచి మాతలకు) అన్యాయము చేసినవాడగును గదా! ఇట్లుండగా పాపమునుగూర్చి చులకనగా మాట్లాడువాడు మూఢుడు. (సామె. 14: 9.) పాపముచే మనుష్యులు దేవుని నిత్యమైన కోపమునకు లోనగుదురు (మత్త 25:41,46) దేవుడు వారిని తప్పక తీర్పులోనికి తెచ్చును. (ప్రసంగి. 11: 9). ఆయన న్యాయవంతుడు (కీర్తన. 129: 4). నీతిన్యాయములు ఆయన సింహాసనమునకు ఆధారములు (కీర్తన 89: 14).

III దేవుడు పాపాత్ములను శిక్షించును.—పాపాత్ముల పాపము ననుబట్టి యీ లోకములో దేవుడు వారిని కొంతమట్టుకు శిక్షించును. అయితే ఆయన యీ లోకములో శిక్షింపక పోయినను పరలోకములో ఆశిక్ష వారికి తప్పక కలుగును. (2 పేతురు 3: 8-10).

పాపమునకు ఈ లోకములో కలుగు శిక్షలు.—ఇట్టి శిక్షలు అనేకములు కలవు. దేవుడు తన యాజ్ఞలను మీరువారిని అనేక విధములగు బాధలచే శిక్షించును. పాపముచేసిన వెంటనే అట్టిశిక్షలు కలుగకపోయినను అవి తప్పక కలుగును. పాపము చేసినవారందరును అట్టి శిక్షలు పొందకతప్పరు. త్రాగుబోతులును, పోకిరివారును తమ మీదికి అనేక శ్రమలు తెచ్చుకొని, తమ దుర్మార్గతలవలన ఆయుస్సును తక్కువచేసికొందురు. తల్లిదండ్రులపాపములవలన పిల్లలు అనేక విధములైన శ్రమల నొందెదరు. మఱియు సర్కారువారు దేవుని సేవకులై యున్నారు. (రోమా 13: 4) కావున దేవుడు వారిమూలముగకూడ నేరములను శిక్షించునని తెలిసికొనవలయును. ఇవియుగాక ఆయన కొన్ని ప్రత్యేకమైన శిక్షలనుకూడ పంపవచ్చును. (1 కొరింథి 10: 5) కఱవులు, తెగుళ్లు మొదలగునవి ఆయాదేశముల మీదికి దేవుడు పంపించు శిక్షలైయున్నవి. ఇట్లు జలప్రళయము (ఆది 6: 8), సొదొమ గొమొఱ్ఱాల నాశనము (ఆది 19: 24) కనానీయులు లయపఱచబడుట (ద్వితీ 9:4-5) నీనెవె బబులోనుల నాశనము (యెష 13) మొదలగునవి పాపము వలన దేవునిచే పంపబడిన ఆయన న్యాయపు తీర్పులైయున్నవి. రోమా మొదలగు గొప్ప రాజ్యములు వాటిలోని దుర్మార్గతవలననే నశించిపోయినవి.

ఇట్టి శిక్ష లనేకములు గలవు. అయితే యెవరికి కష్టనష్టములు సంభవించినను అవి యన్నియు ఆశిక్ష నొందుచున్నవారి పాపములవల్లనే కలిగెనని మనము నిశ్చయించుకొనరాదు. ఎందుకనగా దేవుడు తన భక్తుల మేలు గోరి, వారిని కూడ శిక్షించును (హెబ్రీ 12: 6).

పాపమునకు నరకములో గలుగు శిక్షలు.—తమ పాపముల నిమిత్తము పశ్చాత్తాపపడకయు, క్రీస్తును నమ్మనందున పాపక్షమ పొందని వారందఱును ఇకమీదట నిత్యదండన నొందెదరు (9) దేవుడు "ప్రతివానికి వాని వాని క్రియల చొప్పున ప్రతిఫల మిచ్చు దినము" వచ్చును (రోమా 2:6) ఆ దినమున దుర్మార్గులు కొండలతోను, పర్వతములతోను "మీరు మా మీద పడి దేవుని సన్నిధినుండియు, గొఱ్ఱెపిల్ల ఉగ్రతయొక్క కోశనుండియు మమ్మును మఱుగుచేయుడి" అని బొత్తిగానిరాశపడి చెప్పుదురు (ప్రకటన 6:15-17). "వారు వెలపటి చీకటిలోనికి త్రోసివేయబడెదరు. అక్కడ యేడ్పును పండ్లు కొఱుకుటయు నుండును (మత్త 22:13) వారు సాతానుతోను అతని దూతలతోను అగ్నిగంధకములతో మండు గుండములో పాలుపొందుదురు (ప్రక. 21:8). వారిబాధ సంబంధమైన పొగ యుగయుగములు లేచును (ప్రకటన 14:10,11).



## 5. పాపులను రక్షించుటకు దేవుడు చూపిన ప్రేమనుగూర్చిన బోధ.

దేవుడు లోకము నెంతో ప్రేమించెను. కాగా ఆయన తన అద్వితీయ కుమారుడుగా పుట్టిన వానియందు విశ్వాసముంచు ప్రతివాడును నశింపక నిత్యజీవమును పొందుటకై ఆయన ననుగ్రహించెను.

యోహాను 3:16.

భాగములు.

I. దేవుడు మనలను ప్రేమించుచున్నాడు.

II. దేవుడు తన ప్రేమనుబట్టి మనుష్యులందఱిని రక్షింపనైయొక రక్షకుని పంపెను.

III. దేవుడు మనయెడల చూపిన ప్రేమనుబట్టి మనము దేవుని సేవించుటకు బద్ధులమైయున్నాము.

## అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| దేవుడు మనలను ప్రేమించును | రోమా 5:1-11 |
| ఆయన అందరిని రక్షింపగోరును | యెహె 33:10-20 |
| ఆయన అందరిని రక్షింపగోరును | రోమా 11:25-26 |
| ఆయన గుణపడు పాపులను క్షమించును | యెషయా 1: 1-18 |
| క్రీస్తు రక్తము మనలను పవిత్రులనుగా జేయును | 1 యోహాను 1 |
| రక్షణ నొందని నొల్లనివారి గతి | లూకా 19: 41-44 |
| క్రీస్తు ఒక్కడే రక్షకుడై యున్నాడు | కార్య 4:1-12 |

## వేదవాక్యములు.

I. 1. సంపూర్ణమైన ప్రతివరమును పరసంబంధమైనదై జ్యోతిర్మయుడగు తండ్రియొద్ద నుండివచ్చును; ఆయనయందు ఏచంచలత్వమైనను, గమనాగమనముల వలన కలుగునే ఛాయయైనను లేదు (యాకో. 1:17).

2. చాల కాలము క్రిందట యెహోవా నాకు ప్రత్యక్షమై యిట్లనెను— శాశ్వతమైన ప్రేమతో నేను నిన్ను ప్రేమించుచున్నాను గనుక విడువక నీయెడల కృప చూపుచున్నాను. (యిర్మీయా 31:3).

II. 3. కాలము పరిపూర్ణమైనప్పుడు దేవుడు తన కుమారుని పంపెను; ఆయన స్త్రీయందు పుట్టి మనము స్వీకృత పుత్త్రులము కావలెనని ధర్మశాస్త్రమునకు లోబడియున్నవారిని విమోచించుటకై, ధర్మశాస్త్రమునకు లోబడినవాడాయెను (గలతీ 4: 4,5.)

4. అందరియెడల కరుణచూపవలెనని దేవుడందరిని అవిధేయతా స్థితిలో మూసివేసియున్నాడు (రోమా 11: 32).

5. రాణువ వాడెవడైనను యుద్ధమునకు బోవునప్పుడు తనను దండులో చేర్చుకొనినవానిని సంతోషపెట్టవలెనని యీ సంసార వ్యాపారములలో చిక్కుకొనడు (2 తిమొథె 2:4).

III. 6. యెహోవా ఈమాట సెలవిచ్చుచున్నాడు—రండి మన వివాదము తీర్చుకొందము. మీ పాపములు రక్తమువలె నెర్రనివైనను అవి హిమమువలె తెల్లబడును. కెంపువలె నెర్రనివైనను అవి గొర్రెబొచ్చువలె తెల్లనివగును (యెషయా 1: 18).

7. "అరణ్యములో మోషే సర్పము నేలాగు ఎత్తెనో అలాగే విశ్వసించు ప్రతివాడును నశింపక ఆయన ద్వారా నిత్యజీవము పొందునట్లు మనుష్యకుమారుడు ఎత్తబడవలెను (యోహాను 3:14,15,).

8. నమ్మి బాప్తిస్మము పొందినవాడు రక్షింపబడును ; నమ్మనివానికి శిక్షవిధింపబడును (మార్కు 16: 16).

9. క్రీస్తు యేసుయొక్క మంచి యోధునివలె నాతోకూడ శ్రమ ననుభవించుము (హెబ్రీ 2: 3).

వి వ ర ము.

ఒక నేరస్థుడు న్యాయాధిపతియొక్క సొంత కొడుకైనను వానికి అతడు శిక్ష విధింపవలెను లేదా ఆ న్యాయాధిపతి అన్యాయస్థుడై, తన యుద్యోగమునకు తగినవాడు కాకపోవును. అయితే ఆ న్యాయాధిపతి తన యుద్యోగ ధర్మమునుబట్టి ఆలాగున చేయవలసి యుండినను, నేరస్థుని తండ్రి యగుటచే కుమారుని ప్రేమించుచు, అతడుతన దుర్మార్గతలను విడిచిపెట్టి గుణపడునట్లు అన్నివిధములగు యత్నములను చేయునుగదా? ఆ విధముగ దేవుడు న్యాయాధిపతియై యున్నాడు. ఆయన మనుష్యులకుధర్మశాస్త్రము నిచ్చి, దానిని వారు గైకొనవలయుననియు లేనియెడల శిక్షింతుననియు ఆజ్ఞ నిచ్చి యున్నాడు కావున దాని మీఱువారికి తీర్పువిధించును. మనము ఆ ధర్మశాస్త్రమును మీఱి యున్నాము గనుక ఆయన మనకు శిక్ష విధింపవలసి వచ్చెను. అయినను ఆయన మనకు తండ్రియై యున్నందున మనలను ప్రేమించి మన రక్షణను కోరి యున్నాడు. ఆయన తన న్యాయమునుబట్టి మనలను శిక్షింపవలసి యుండినను, తన బిడ్డలైన వారిలో నెందఱు తన రక్షణను కోరెదరో అట్టి వారందఱును రక్షింపబడు లాగున ఆయన తన ప్రేమనుబట్టి వారికి రక్షణోపాయమును కల్పించి యున్నాడు.

I. దేవుడు మనలను ప్రేమించుచున్నాడు.—దేవుడు అనుదినమును మనకు ననుగ్రహించు దీవెనలలో ఆయన ప్రేమను గుర్తింపగలము. ఆయనవలన మనము దేనిని పొందుటకు యోగ్యులము కాకపోయినను, ఆయన మనకు మేలుచేయక పోనడు (1). "లోకము యెహోవా కృపతో నిండియున్నది" (కీర్తన 33: 5). ఇదియు గాక దేవుడు మన యాత్మ రక్షణార్థము చేసిన వాటిలో తన ప్రేమను ముఖ్యముగా కనబఱచి యున్నాడు. (1. యోహాను 4: 9) తన కుమారుని మనకు నిచ్చుటయందాయన తన గొప్పప్రేమను వెల్లడిచేసెను (ప్ర. వా). "దేవుడు తనను ప్రేమించు వారి కొఱకేవి సిద్ధపఱచెనో, అవి కంటికి కనబడ లేదు, చెవికివినబడ లేదు, మనుష్య హృదయమునకు గోచరము కాలేదు" (1. కొరింథి 2: 9) అను వాక్యమును చూడగా ఆయన ప్రేమవలన మనకు నికమీదట మఱి గొప్ప సౌఖ్యములు కలుగునని తెలిసికొనగలము.

దేవుని ప్రేమ నిత్యమైనది.—దేవుని ప్రేమ శాశ్వతమైనది (2). లోకమును సృజింపక మునుపే ఆయన మనలను క్రీస్తునందు ప్రేమించెను. (2 తిమోథి 1: 9). క్రీస్తును నమ్మువారందఱిని ఆయన రక్షింప నుద్దేశించెను (ఎఫె. 3: 11). మనుష్యులు పాపులగుదురని దేవు డెఱుగును గనుక జగత్తుపునాది వేయబడకమునుపే వారిని రక్షింపవలెనని ఆయన యేర్పాటు చేసికొనెను (ఎఫె. 1: 4-6). ఈ విధముగా ఆయన మనకు చేసిన యుపకారము ద్వారా అత్యధికమైన తన కృపా మహైశ్వర్యములను రాబోవు యుగములలో కనపఱచ నుద్దేశించెను (ఎఫె 2: 6).

II. తన న్యాయమునకు భంగము కలుగనిరీతిగా దేవుడు మనుష్యుల యెడల ప్రేమ చూపెను.—"యెహోవా తన మార్గము లన్నిటిలో నీతిగలవాడు" (కీర్తన 145: 17). ఆయన మనుష్యులను ప్రేమించుటలో తన న్యాయమును నిర్లక్ష్యము చేసి వారిని ప్రేమించుట అనర్థముగ నుండును. మనుష్యులు తన కట్టడలను మీఱినను దానిని లక్ష్యింపక, వారిని ఊరక క్షమించినయెడల దేవు డెంతమాత్రము న్యాయస్థుడు కాడనియు, దుర్మార్గులు తమ దుర్మార్గతలను విడుచులాగున జాగ్రత పుచ్చుకొనక, వారు వాటిలోనే యుండునట్లు వారిని ప్రోత్సాహపఱచు వాడనియు చెప్పవలసి వచ్చును. కావున దేవుడు తన న్యాయమును స్థాపించి, మనుష్యులు తన యాజ్ఞలను లక్ష్యపెట్టి మంచివారగునటుల వారిని రేప గోరినయెడల ఆయన పాపులను మిగుల అవసరముగా శిక్షింపవలెను. అయితే ఆయన అలాగు చేసినయెడల మనుష్యుల గతి యేమగును? నిత్యనాశనమేగదా? కావున దేవుడు మనుష్యుల దురవస్థను జూచి కనికరించి, వారు పొందవలసిన పాపశిక్షను తన కుమారుడైన క్రీస్తుద్వారా తానే భరించుకొందునని నిశ్చయించుకొనెను. అనాదినుండి దేవునికి గల యీ దయగల యుద్దేశము ఆయన ప్రభువైన క్రీస్తు రాకడతోను లోకమును సిద్ధపఱచిన పిమ్మట నెఱవేర్చెను (యోహాను 3: 17): "మన మాయనయందు దేవుని నీతి యగునట్లు పాప మెఱుగని ఆయనను మనకోసము పాపముగా చేసెను (2 కొరింథి 2: 21).

దేవుని ప్రేమయొక్క గొప్పతనము.—మనలను రక్షించుటకు తన కుమారుడైన క్రీస్తు నిచ్చుటచే దేవుడు తన ప్రేమను అన్నిటికంటె తేటగా వెల్లడి చేసెను. ఈవరముకంటె గొప్పదాని నిచ్చుట సర్వశక్తిగల దేవునికి కూడ వీలు దని చెప్పవచ్చును. మఱియు నిందులో మఱి గొప్ప ఆశ్చర్యకరమైన సంగతి నగా: తనకు శత్రువులుగ నుండి నిత్య దండనకు పాత్రులైన వారికి ఈ వరమును చేసెను (రోమా 5: 10). "తన స్నేహితులకొఱకు తన ప్రాణమును పెట్టువాని కంటె ఎక్కువైన ప్రేమగల వాడెవడును లేడు" (యోహాను 15. 13). అయితే

దేవుడు మనయెడల తన ప్రేమను వెల్లడి పఱచుచున్నాడు; ఏలాగనగా మనమింక పాపులమై యుండగా క్రీస్తు మనకొఱకు చనిపోయెను. (రోమా 5: 8). నిశ్చయముగా "దేవుడు ప్రేమయైయున్నాడు" (1యోహా 4: 18).

దేవుడు అందఱిని ప్రేమించును:—మనుష్యు లందఱును రక్షింపబడవలెనని దేవుడు కోరుచున్నాడు. దుర్మార్గుడు మరణము నొందుటవల్ల దేవునికి సంతోషము లేదు (యెహె. 33: 11). లోకపాపములను మోసికొనిపోవుటకు దేవుడు తన కుమారుని పంపెను. (యోహా 1: 29). ఎవనినైనను మినహాయింపకుండ ఆయన అందరికొఱకు రక్షణను సిద్ధపఱచెను. ఈసత్యమునుబట్టి క్రైస్తవమతము అందఱికొఱకైన మతమని చెప్పదగును. అన్యమతములలో ఆయా మతములనుగూర్చి ముచ్చటించుచుండగా ఇది ఫలాని ఫలాని జాతులలో పుట్టినవారికొఱకైనదిగాని యితరులకొఱకైనది కాదని చెప్పుకొనుమాట లిచట చెల్లవు. గొప్పవారేమి, కొద్దివారేమి, ఘనులేమి, అల్పులేమి, స్థితిమంతులేమి, బీదలేమి, విద్వాంసులేమి, మూఢులేమి, బలస్థులేమి, బలహీనులేమి, అందఱును ఈరక్షణలో పాలిభాగస్థులు కాగలరు (5) "ఎవడును నశింపవలయునని యిచ్ఛయింపక అందఱు మాఱుమనస్సుపొంది జీవింపవలెనని (ఆయన) కోరుచున్నాడు." 2 పేతురు 3:9).

III. దేవుడు మనయెడల చూపిన ప్రేమనుబట్టి మనము దేవుని సేవించుటకు బద్ధులమైయున్నాము.—అందఱును రక్షింపబడవలెనని దేవుడు కోరుచున్నాడు కావున అందఱును మారుమనస్సు పొందవలెనని ఆజ్ఞాపించుచున్నాడు. (కార్య 17:30). ఎంతగొప్పపాపులైనను దేవుడు వారిని ప్రేమించి, వారుపశ్చాత్తాపపడి క్రీస్తునందు భక్తినుంచినయెడల వారిని రక్షించును. (6) మనము ఆయనను విశ్వసించినయెడల "ఆయన కుమారుడైన యేసుక్రీస్తు రక్తము ప్రతిపాపమును పరిహరించి మనలను పవిత్రులనుగా చేయును. (1 యోహా. 1: 7). మన పాపము లెంత గొప్పవైనను వాటిని తుడిచివేయగల దేవుని కృప మఱిగొప్పది. పాప మెక్కడ విస్తరించెనో అక్కడ కృప మఱి నిశ్చయముగా విస్తరించెను." (రోమా 5:21).

మనకు పాపక్షమ కలుగులాగున మనము దేవుని ప్రేమను తిరస్కరింపక, దానిని ఆశ్రయించుకొనవలెను.—దేవుని ప్రేమవలని మేలులను మనముపొందగోరినయెడల మనము క్రీస్తునందు భక్తినుంచవలెను. (7) ఇట్లు చేయనివారు దేవుని కృపను వ్యర్థము చేసికొనువారగుదురు (1కొరి. 6: 1); హెబ్రీ 12: 15) క్రీస్తును నమ్మువారు తప్ప మఱి యెవరును ఆయన రక్షణను పొందరు (1 యోహా 5: 20). ఆయనను నమ్మనివారు నశింతురు. (9).

నమ్మనివారియెడల కూడ దేవుడు దీర్ఘశాంతుడై యున్నాడు.— మన దేవుడు దయాదాక్షిణ్యములు గలవాడు (కీర్తన 86:15) ఆయన దీర్ఘశాంతుడు కృపాతిశయముగలవాడు (కీర్తన 103: 10). తప్పుచేసిన వారిని ఆయన తత్క్షణమే నాశనము చేయక (కీర్తన 103: 10), తన యనుగ్రహమువలన వారు గుణపడవలెనని వారివిషయము ఓర్చుకొనును (రోమా 2: 4). మఱియు ఆయన వారిని విడువక, వారు నశింపక గుణపడునట్లు సకల విధముల వారిని రేపుచుండును (మత్త 22:4, 5).

దేవుని ప్రేమను తిరస్కరించువారు నశింతురు — మనుష్యులు గుణపడనందున యీ రక్షణ నొల్లకపోయినయెడల దేవుని ప్రేమ అపరిమితమైనదను వారు రక్షింపబడనేరరు (యెష 5: 4,5). అట్టివారు రక్షింపబడలేని భయంకరమైన గతిగలవారగుదురు (లూకా 19: 41-44). మనుష్యులను రక్షించుటకు దేవుడెంత మట్టుకు పనిచేయగలడో (యోహా 4: 9) అంతమట్టుకదియంతయు క్రీస్తు యేసునందు చేసియున్నాడు. ఈదయగల పనిని మనము నిరర్థకపరచిన యెడల దేవుని యుగ్రతకు పాత్రులమై నిత్యనాశనము నొందెదము (9). క్రీస్తు ఒకడే మార్గమును సత్యమును జీవమునై యున్నాడు. ఆయనద్వారానే కాని యెవడును తండ్రియొద్దకు రాడు (యోహా 14: 6). "మఱి యెవనివలనను రక్షణ కలుగదు; ఈ నామముననే రక్షణ పొందవలెనను గాని ఆకాశము క్రింద మనుష్యులలో నియ్యబడిన మరియే నామమున రక్షణ పొందలేము" (కార్య 4: 12).

---

## 6 రక్షకుని గూర్చినబోధ—ఆయననుగూర్చిన ప్రవచనములు

లేఖనములయందు మీకు నిత్యజీవము కలదని వాటిని పరిశోధించుచున్నారు; అవే నన్ను (క్రీస్తును) గూర్చి సాక్ష్యమిచ్చుచున్నవి.

యోహా. 5: 39.

### భాగములు.

I. క్రీస్తు వంశమునుగూర్చి తెలియజేయు ప్రవచనములు.
II క్రీస్తుయొక్క ఉద్యోగములను తెలియజేయుప్రవచనములు.
III. ప్రవచింపబడిన ఆయా చరిత్ర సంగతులు.

## అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| క్రీస్తునుగూర్చిన మొదటి వాగ్దానము | ఆది. 3:1-20. |
| క్రీస్తు ప్రవక్తయు, యాజకుడును, రాజునైయున్నాడు | జెఖ. 6:9-15. |
| క్రీస్తుయొక్క గుణలక్షణములు | యెష. 11:1-9. |
| క్రీస్తుచేసిన అద్భుత కార్యములు | యెష. 61. |
| క్రీస్తుశ్రమలు | కీర్తన. 22. |
| క్రీస్తుశ్రమలు | యెష. 53. |
| క్రీస్తు పునరుత్థానము | కీర్తన. 16. |

## వేదవాక్యములు.

I. 1. నీకును స్త్రీకిని, నీ సంతానమునకు ఆమె సంతానమునకు వైరము కలుగచేసెదను. అది నిన్ను తలమీదకొట్టును. నీవు దానిని మడిమెమీద కొట్టెదవు (ఆది. 3:15.)

2. షీలో వచ్చువరకు యూదా యొద్దనుండి దండము తొలగదు. అతని కాళ్ళ మధ్యనుండి రాజదండము తొలగదు. ప్రజలు అతనికి విధేయులై యుందురు. (ఆది. 49:10.)

II. 3. వారి సహోదరులలోనుండి నీవంటి ప్రవక్తను వారికొరకు పుట్టించెదను; అతని నోట నా మాటల నుంచెదను. నేను అతని కాజ్ఞాపించునది యావత్తును అతడు వారితో చెప్పును. (ద్వితీ. 18:18)

4. మెల్కీసెదెకు క్రమము చొప్పున నీవు నిరంతరము యాజకుడవై యుందువని యెహోవా ప్రమాణము చేసియున్నాడు. ఆయన మాట తప్పనివాడు (కీర్తన. 110:4.)

5. ఈ సముద్రమునుండి ఆ సముద్రమువరకు, నది మొదలుకొని భూదిగంతములవరకు అతడు రాజ్యము చేయును. అరణ్యవాసులు అతనికి లోబడుదురు. అతని శత్రువులు మన్ను నాకెదరు. రాజులందరు అతనికి నమస్కారము చేసెదరు. అన్యజనులందరు అతని సేవించెదరు (కీర్తన 72, 8,9, 11.)

III. 6. ఆలకించుడి, అడవిలో ఒకడు ప్రకటించుచున్నాడు. ఎట్లనగా అరణ్యములో యెహోవాకు మార్గము సిద్ధపరచుడి. ఎడారిలో మాదేవుని రాజ్యము సరాళము చేయుడి (యెష. 40:3)

7. ఆలకించుము కన్యక గర్భవతియై కుమారుని కని అతనికి యిమ్మానుయేలను పేరు పెట్టును (యెష. 7,14.)

8. బేత్లెహేము ఎఫ్రాతా, యూదావారి కుటుంబములలో నీవు స్వల్పగ్రామమైనను ఇశ్రాయేలీయులను ఏలబోవువాడు నాకొరకు నీలోనుండి వచ్చును; పురాతన కాలము మొదలుకొని శాశ్వతకాలము ఆయన ప్రత్యక్షమగుచుండెను. (మీకా 5; 2).

9. జనములు నీ వెలుగునకు వచ్చెదరు. రాజులు నీ యుదయకాంతికి వచ్చెదరు. బంగారమును ధూపద్రవ్యమును తీసికొనివచ్చెదరు. యెష. 60: 3-6)

10. చీకటిలో నడుచు జనులు గొప్పవెలుగును చూచుచున్నారు. మరణచ్ఛాయగల దేశ నివాసులమీద వెలుగు ప్రకాశించును. (యెష. 9: 2)

11. గుడ్డివారి కన్నులు తెరవబడును. చెవిటివారి చెవులు విప్పబడును. కుంటివాడు దుప్పివలె గంతులు వేయును. మూగవాని నాలుక పాడును. అరణ్యములో నీళ్లు ఉబుకును. అడవిలో కాలువలు పారును. (యెష. 35: 5-6)

12. భూరాజులు యెహోవాకును ఆయన అభిషిక్తునికిని విరోధముగా నిలువబడుచున్నారు. ఏలికలు ఏకీభవించి ఆలోచన చేయుచున్నారు. (కీర్త న 2-3)

13. సీయోను నివాసులారా, బహుగా సంతోషించుడి; యెరూషలేము నివాసులారా, యుల్లాసముగానుండుడి. నీ రాజు నీతిపరుడును రక్షణగలవాడును దీనుడునై గార్దభమును గార్దభపు పిల్లను ఎక్కి నీయొద్దకు వచ్చుచున్నాడు. (జెఖ. 9: 9)

14. అతడు తృణీకరింపబడినవాడును మనుష్యులవలన విసర్జింపబడినవాడును అయెను. వ్యసనాక్రాంతుడుగాను రోగము నెరిగినవాడుగాను మనుష్యులు చూడనొల్లనివాడుగాను ఉండెను (యెష. 53:3).

15. నేను నమ్మికొనిన నా విహితుడు నాయింట భోజనము చేసినవాడు నన్ను తన్నుటకై తన మడిమెనెత్తుచున్నాడు. (కీర్తన. 41:9).

16. వారు నా కూలికై ముప్పది తులముల వెండినితూచి యిచ్చిరి (జెఖ 11:12).

17. గొర్రెలు చెదిరిపోవునట్లు కాపరిని హతము చేయుము (జెఖ. 13:7 .

18. నేను చూపిన ప్రేమకు ప్రతిగా వారు నా మీద పగ బట్టి యున్నారు. అయితే నేను మానక ప్రార్థన చేయుచున్నాను (కీర్తన. 109:4).

19. ఆయన వాని యెముక లన్నిటిని కాపాడును వాటిలో నొక్కటియైనను విరిగిపోదు (కీర్తన. 34,20).

20. అతడు మరణమైనప్పుడు భక్తిహీనులతో అతనికి సమాధి నియమింపబడెను. ధనవంతునియొద్ద అతడుంచబడెను. నిశ్చయముగా అతడు అన్యాయ మేమియుచేయలేదు. ఆయన నోట ఏ కపటమును లేదు (యెష 53:9).

21. పాతాళమునకు నీవు నన్నప్పగింపవు. నీవు. నీభక్తుని గోతిని చూడనియ్యవు. కీర్తన 16. 9)

22. నీవు ఆరోహణమైతివి పట్టబడినవారిని చెరపట్టుకొని పోతివి. మనుష్యుల చేత కానుకలు నీవు తీసికొనియున్నావు (కీర్తన. 68:18).

23. నా ప్రభువుగూర్చి యెహోవా సెలవిచ్చిన వాక్కు: నేను నీ శత్రువులను నీ పాదములకు పీఠముగా చేయువఱకు నా కుడిపార్శ్వమున కూర్చుండుము (కీర్తన. 110: 1).

## వివరము

పాపమువలన పడిపోయిన మనుష్యుని రక్షణకై జగత్తు పునాది వేయబడక పూర్వమే రక్షకుడైన క్రీస్తు ఏర్పఱచబడెనుగాని, ఆయన చాలకాలము వఱకు ఈ లోకములోనికి పంపబడలేదు. ఆదినుండి యీ రక్షకుని రాకడవఱకు గడచిన యీ మధ్యకాలములో జీవించుచుండిన భక్తులకు ఆయననుగూర్చి ఏమియు తెలియదని మనమనుకొనకూడదు. ఎందుకనగా ఆ రక్షకుని రాకడకొఱకు మనుష్యులను సిద్ధపఱచుటకును, వారిని ఆదరించి బలపఱచుటకును ఈ లోకములో నవతరించినట్టి క్రీస్తుయొక్క నరావతారమునుగూర్చి దేవుడు ఆదినుండి తన భక్తులకు తెలుపుచు వచ్చెను. కావున పాతనిబంధన కాలపు భక్తులు క్రీస్తు రాకడకొఱకు అత్యాశతో కనిపెట్టుచుండిరి (లూకా 10: 24).

I. క్రీస్తువంశమునుగూర్చి విచారింపగా, ఆయన (1), స్త్రీ సంతానమనియు, (2) అబ్రాహాము సంతతివాడనియు, (3), యూదా గోత్రమునుండి పుట్టుననియు (4), దావీదు కుమారుడనియు తెలియజేయు ప్రవచనములు కలవు.

1. ఆదాము పాపములో పడినవెంటనే అతని శాపమునకైన పాపము నింక తెలియజేయాక పూర్వమే క్రీస్తు స్త్రీసంతానమున పుట్టుననియు, ఆయన శ్రమపడి హవ్వను మోసపుచ్చిన సాతానునే జయించి, వానిపనులను లయపరచుననియు, దేవుడు ఆతొలికాలమునందే తెలిపెను. (1).

2 అబ్రాహామును దేవుడు పిలిచినతరువాత అతడు దేవుని ప్రజలకు మూలకర్త యగునని దేవుడతనికి మాట యిచ్చినప్పుడు, అతని సంతానములో క్రీస్తు పుట్టునని కూడ వాగ్దానము చేసెను. "నీ సంతానము వలన భూలోకములోని సమస్త జనులు ఆశీర్వదింపబడుదురు" (ఆది. 26:4.) అని దేవుడబ్రాహాముతో చెప్పినమాట క్రీస్తు రాకడతోనే నెఱవేరెను.

3. యాకోబుకు పన్నెండుమంది కొడుకులుండిరి. వారు ఇశ్రాయేలీయుల పన్నెండు గోత్రములకు గోత్రకర్తలైరి. వారిలో యూదా యనువాని గోత్రములో

నుండి క్రీస్తు పుట్టునని దేవుడు యాకోబు ద్వారా తెలియజేసెను. ఈ మాటలు యాకోబు చివరగా తన కొడుకుల నాశీర్వదించినపుడు తన ఆశీర్వాద వాక్యములలో పలికెను (2).

4. దావీదు మహారాజైన పిమ్మట దేవుడు అతని సంతతిని హెచ్చించి రాజ్యమును అతనికి స్థిరపరచెననియు (2. సమూ. 7: 12), అతని రాజ్య సింహాసనమును నిత్యముగా స్థిరపరచెదననియు (2. సమూ. 7: 13) మాటయిచ్చెను. క్రొత్తనిబంధన కాలములో క్రీస్తు దావీదు కుమారుడు అను పేరుచే పిలువబడెను (లూకా 18: 28). క్రీస్తు దావీదు కుమారుడగుటచే ఆయన దావీదువలె ఒక లౌకిక రాజ్యమును స్థాపించునను నిరీక్షణకూడ యూదుల కుండెను (యోహా. 6:15).

II. క్రీస్తుయొక్క ఉద్యోగములనుగూర్చి విచారింపగా ఆయన (1) ప్రవక్తయనియు, (2) యాజకుడనియు, (3) రాజనియు మూడు ఉద్యోగములను గూర్చి తెలియజేయు ప్రవచనములు గలవు.

(1) ఆయన ప్రవక్తయై ప్రజలకు బోధించుచు దేవునిగూర్చిన సంగతులను వారికి తెలుపును (3)

(2) ఆయన యాజకుడై యుండి యజ్ఞము నర్పించి, ప్రజలకొరకు విజ్ఞాపనము చేయును. క్రీస్తునుగూర్చి తెలియజేయు ప్రవచన కీర్తనలలోని సంగతి తేటగా కనబడును (4) అదియుగాక ప్రజల పాపములకొరకు బలుల నర్పించిన యాజకులు, మరిముఖ్యముగా పాతనిబంధన కాలపు ప్రధానయాజకుడు, లోక పాపములకొరకై పరిపూర్ణమైన బలిని అర్పించు గొప్ప ప్రధాన యాజకుడైన యేసుకు ముంగురుతైన వారుగా నుండిరి. (హెబ్రి 9: 11-14).

(3) ఆయన రాజైయుండి యీ లోకమును నేలి, తన భక్తులను కాపాడి, తన శత్రువుల నోడించును. (5)

పై మూడు ఉద్యోగములలో క్రీస్తు ముఖ్యముగా రెండవదానిని నెఱవేర్చుటకు ఈ లోకమునకు వచ్చి మన పాపములకు రావలసిన శిక్షను మనకు ప్రతిగా తానే భరించెను. పాతనిబంధనకాలములో ఆయా జంతువులు బలిగా నర్పింపబడెను, అవి తత్కాలమునకు పాపమును పరిహరించు బలిగా నంగీకరింపబడినను (లేవీ. 1: 4) ఒక జంతువు మనుష్యులకు ప్రతిగా శిక్షనొందుట తగిన ప్రాయశ్చిత్తము కాదని చెప్పవచ్చును, ఎందుకనగా ఎడ్లయొక్కయు మేకలయొక్కయు రక్తము పాపములను తీసివేయుట అసాధ్యము (హెబ్రి 10:4) అని బైబిలు స్పష్టముగా బోధించును. పాపమునకు ప్రాయశ్చిత్తముగా చేయుటయే పాతనిబంధన యజ్ఞముల యుద్దేశమై

యున్నదిగాని మఱియొకటి కాదు (హెబ్రీ 9:9. క్రీస్తు మనకు ప్రతిగా మరణము నొందెననుట నిజమైన సంగతియై యున్నది. ఆయన యిక 700 సం॥లకు మరణ మొందుననగా యెషయా యను ప్రవక్త అది జరిగినట్లుగా తన దివ్య దృష్టియందు చూచి మన యతిక్రమ క్రియలను బట్టి అతడు గాయపఱచబడెను. మన దోషములను బట్టి నలుగ గొట్టబడెను. మన సమాధానార్థమైన శిక్ష అతనిమీద పడెను. అతడు పొందిన దెబ్బలచేత మనకు స్వస్థత కలుగుచున్నది. మన మందఱము గొఱ్ఱెలవలె త్రోవ తప్పి పోతిమి. మనలో ప్రతివాడు తన కిష్టమైన త్రోవకు తొలిగెను. యెహోవా మన యందఱి దోషము ఆయనమీద మోపెను. (యెష. 53:5,6.) అని ప్రవచించెను.

III. ప్రవచింపబడిన ఆయా చరిత్ర సంగతులు. క్రీస్తు చరిత్రలోని విషయములను చూడగా వాటిలో ననేక విషయములను గూర్చి ముందుగా బహు తేటగానే తెలుపబడెను. వాటిలో ముఖ్యములైనవి యేవియనగా: ఆయన రాకడకొరకు మనుష్యులను సిద్ధపరచుటకు ఆయనకు ముందుగా యొహాను వచ్చుట (6); ఆయన కన్యకుండి (7), బేత్లెహేములో పుట్టుట (8); అన్యులు వచ్చి ఆయనకు బంగారమును సుగంధ ద్రవ్యములను అర్పించి ఆయనకు నమస్కరించుట (9), ఆయన అంధకారములోనుండు వారికి వెలు గిచ్చుట (10); గుడ్డివారిని, చెవిటివారిని, కుంటివారిని బాగుచేయుటకు ఆయన కుండు అద్భుతశక్తి (11); దేశాధికారులు ఆయనను విరోధించుట (12); ఆయన సాత్వికుడైన రాజుగా జయోత్సవముతో యెరూషలేములో ప్రవేశించుట (13); ఆయన మనుష్యులచే తృణీకరింపబడి అనేక శ్రమల నొందుట (14); ఆయన తన స్నేహితునిచేత (15), ముప్పదివెండి రూకలకు అమ్మబడుట (16); శిష్యులందరు ఆయనను విడిచి పాఱిపోవుట (17); ఆయన అక్రమస్థులతో నెంచబడుట (యెష. 53: 9. 12), సూర్యుడు తన కాంతిని మానినపుడు (ఆమో. 8: 9) ఆయన గొప్ప బాధ నొంది చనిపోవుట (కీర్తన. 22: 14, 17) శత్రువులచే నిందింపబడినను ఆయన వారికొరకు ప్రార్థనచేయుట (18); ఆయన యెముకలలో నొకటియయినను విరుగకుండుట (19), బల్లెముతో ఆయన పొడువబడుట (జెఖ. 12:10), ధనవంతులతో పాతిపెట్టబడుట (20) మృతులలోనుండి తిరిగి లేచుట (21); పరలోకమునకెక్కుట (22), దేవుని కుడిపార్శ్వమందు కూర్చుండుట (23) అనునవియై యున్నవి. క్రీస్తును గూర్చిన యీవిషయములన్నియు ప్రవక్తలు ముందుగా పలికి యుండిరి.

---

## 7. రక్షకునిగూర్చిన బోధ—క్రీస్తు స్వభావ లక్షణములు.

యేసుక్రీస్తు శరీరమునుబట్టి దావీదు సంతానముగాను మృతులలో నుండి పునరుత్థానమై నందున పరిశుద్ధమైన యాత్మనుబట్టి ప్రభావము చేత దేవుని కుమారుడుగాను నిరూపింపబడిన వాడాయెను. రోమా 1:4.

I. క్రీస్తు దేవుడై యుండినను మనలను రక్షించుటకు మనుష్యుడాయెను.

II. క్రీస్తు మనలను రక్షించుటకు తన్నుతాను తగ్గించుకొనెను.

III. క్రీస్తుయొక్క బిరుదులు.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| యేసు మనవలె మనుష్యుడుగ నుండెను | యోహా 4:10-26 |
| యేసు దేవుడై యున్నాడు | యోహా 5:19-17 |
| వాక్యము శరీరధారి యయ్యెను | యోహా 1:1-18 |
| క్రీస్తు తన్ను తాను తగ్గించుకొనెను | ఫిలిప్పీ 2:1-15 |
| యేసు ఇమ్మానుయేలని పిలువబడును | మత్త 1:18-21 |
| యేసు అభిషేక మొందినవాడు | లూకా 4:16-30 |
| యేసు గొప్ప ప్రధానయాజకుడు | హెబ్రీ 7 |

### వేదవాక్యములు.

I. 1. కాలము పరిపూర్ణమైనప్పుడు దేవుడు తన కుమారుని పంపెను. ఆయన స్త్రీయందు పుట్టి మనము స్వీకృత పుత్రులము కావలెనని ధర్మశాస్త్రమునకును లోబడియున్నవారిని విమోచించుటకై, ధర్మశాస్త్రమునకు లోబడిన వాడాయెను (గల. 4:4, 5).

2. ఆ వాక్యము శరీరధారియై కృపాసత్య సంపూర్ణుడుగా మనలో నివసించెను. మనము తండ్రివలన కలిగిన అద్వితీయ కుమారుని మహిమవలె, ఆయన మహిమను కంటిమి (యోహా 1:14),

3. ఆయన పాపమేమియు చేయలేదు; ఆయన నోటను ఏ కపటమును కనబడలేదు (1. పేతురు 2:22).

4. ఈయన సర్వాధికారియైన దేవుడైయుండి నిరంతరము స్తోత్రార్హుడై యున్నాడు. ఆమేన్ (రోమా 9: 5).

5. ఆదియందు వాక్యముండెను, వాక్యము దేవునియొద్ద నుండెను, వాక్యము దేవుడైయుండెను (యోహా 1: 1).

6. యేసుక్రీస్తు శరీరమునుబట్టి దావీదు సంతానముగాను, మృతులలోనుండి పునరుత్థానమైనందువలన పరిశుద్ధమైన ఆత్మనుబట్టి దేవుని కుమారుడుగాను నిరూపింపబడిన వాడాయెను (రోమా 1: 3, 4).

7. తీర్పు ఒక్కని అపరాధమూలమున వచ్చినదై, మనుష్యు లందఱికి శిక్షావిధి కలుగుట కేలాగు కారణమాయెనో, అలాగే యొక పుణ్యకార్యమువలన కృపాదానము మనుష్యులందఱికి జీవప్రదమైన నీతి విధింపబడుటకు కారణమాయెను." ఎందుకనగా నొక మనుష్యుని అవిధేయతవలన అనేకులు పాపులుగా నేలాగుచేయబడిరో, అలాగే యొకని విధేయతవలన అనేకులు నీతిమంతులుగా చేయబడుదురు (రోమా 5: 18, 19).

8. క్రీస్తుకూడ అనేకుల పాపములను భరించుటకు ఒక్కసారే అర్పింపబడి తన కొఱకు కనిపెట్టుకొని యుండువారికి రక్షణ కలుగునట్లు పాప (భార)ము లేకుండ రెండవసారి ప్రత్యక్షమవును (హెబ్రీ 9: 18)

II. 9. క్రీస్తు దేవుని స్వరూపము కలిగినవాడైయుండి దేవునితో సమానముగా నుండుట విడచిపెట్టకూడని భాగ్యమని యెంచుకొనలేదు; కాని మనుష్యుల పోలికగా పుట్టి దాసుని రూపమును ధరించుకొని తన్నుతానే రిక్తునిగా చేసికొనెను. మఱియు ఆయన ఆకారమందు మనుష్యుడుగా కనబడి మరణము పొందునంతగా అనగా సిలువ మరణము పొందునంతగా విధేయత చూపినవాడై తన్నుతానే తగ్గించుకొనెను. (ఫిలిప్పీ 2: 6-8).

వివరము.

కాలము పరిపూర్ణమైనప్పుడు, దేవుడు తనమాట చొప్పున రక్షకుని ఈ లోకమునకు పంపెను (1). ఆ రక్షకుడు దేవుని జనితైకకుమారుడగు యేసుక్రీస్తు (యోహా 3: 16); ఆయన మనలను రక్షించుటకు (1 తిమో 1. 15) మనుష్యుడై (2), ఈ లోకములో జీవించి, శ్రమపెట్టబడి, మరణమొందెను.

I. క్రీస్తు దేవుడై యుండినను మనలను రక్షించుటకు మనుష్యుడాయెను.

క్రీస్తు నిజమైన మనుష్యుడాయెను.—"ఆయన పరిశుద్ధాత్మవల్ల (లూకా 1: 35) కన్యయైన మరియా గర్భమందు ధరింపబడి ఆమెనుండి పుట్టెను," (లూకా 2: 7). క్రీస్తు కేవలము పాపము లేనివాడు, గాని తతిమ్మా విషయములన్నిటిలో ఆయన మనవలె నుండెను. (3) ఆయనకు కూడా మానవ శరీరాత్మలుండెను. (హెబ్రీ 2:14);

మత్త 26:38). (ఈ వాక్యములలోని ప్రాణమను మాట అసలు భాషలో 'ఆత్మ'యను పదమని తెలిసికొనవలెను). ఆయన తనకు తానే 'మనుష్యకుమారుడ'ను పేరు పెట్టుకొనెను (మత్త 16:13). ఈ బిరుదువలన క్రీస్తు నిజమైన మనుష్యుడనియు, ఆయనలో పాపము లేకపోవుటవలన ఆయన మాదిరియైన పరిపూర్ణ మనుష్యుడనియు తెలిసికొనగలము. క్రీస్తు చరిత్రను చూడగా ఆయన మనుష్యుల యనుభవము లన్నిటిలో ప్రవేశించెనని స్పష్టమగును. ఆయన పుట్టెను (లూకా 2: 42); ఎదిగి పడుచువాడాయెను (లూకా (2:52;) జ్ఞానమందును వయస్సునందును వర్ధిల్లుచుండెను (లూకా 2;52; ఆకలి గొనెను (మత్త 4:2); దప్పిగొనెను (యోహా 4:7); అలసటపడెను (యోహా 4:6); శోధింపబడెను (మత్త 4:1-11); సంతోషించెను (లూకా 10:21;) దుఃఖించెను (మత్త 26:38) అక్రమమును చూచి దాని సహింపజాలని యుద్రేకమును కనబఱచెను (మత్త 21:12, 13); ఏడ్చెను (యోహా 11:35); ప్రార్థించెను (మత్త 26:39); అవమానమును భరించెను (మత్త 26:67); శ్రమపడెను (1 పేతు 2:23;) మృతినొందెను (మత్త 27:50). ఈపై నుదహరింపబడిన విషయములను చూడగా ఆయన నిజమైన మనుష్యుడనుటకవి చాలినన్ని నిదర్శనములై యున్నవి.

క్రీస్తు నిజమైన దేవుడై యున్నాడు.—క్రీస్తు నిజమైన మనుష్యుడు మాత్రముగాక నిజమైన దేవుడునై యున్నాడు. ఆయన తండ్రియొక్క జనితైకకుమారుడు (యోహా 3:16). క్రీస్తు బాప్తిస్మ మొందినపుడును (మత్త 3:17), రూపాంతరము నొందిన సమయమునను (మత్త 17:5)"ఈయన నాప్రియకుమారుడు" అని ఆకాశమునుండి యొక శబ్దము వినబడెను. ఈ లోకము సృష్టింపబడక పూర్వము క్రీస్తు తండ్రియొద్ద దైవమహిమ కలవాడై యుండెను. (యోహా 17:5.) ఆయనే ఆదియందున్న వాక్యము (5). "అబ్రహాము పుట్టకమునుపే ఆయన యుండెను" (యోహా 8:58) "దేవత్వముయొక్క సర్వపరిపూర్ణత శరీరాకారముగా క్రీస్తునందు నివసించుచున్నది" (కొల 2:11). ఆయన తండ్రికి సమానుడు కావున "తండ్రిని ఘనపఱచునట్లుగా అందఱును కుమారుని ఘనపఱచవలెను" (యోహా 5:23). క్రీస్తును తండ్రియు నేకమై యున్నారు (యోహా 10:30). తండ్రి క్రీస్తునందును, క్రీస్తు తండ్రియందు నున్నారు (యోహా 10:38). క్రీస్తునుచూచినవాడు తండ్రిని కూడ చూచియున్నాడు (యోహా 14:9).

క్రీస్తు దేవుడును మనుష్యుడునై యున్నాడు.—ఆయన మనుష్యావతారమును ధరించిన దేవుడు (2) ప్రస్తుతమందాయన తండ్రి కుడిపార్శ్వమున

కూర్చుండి యుండగా ఆయన దేవుడును మనుష్యుడునై యున్నాడు. మఱియు ఆయన నిరంతరమును అట్టివాడై యుండును. (హెబ్రీ 7: 24).

క్రీస్తు మనుష్యావతారమును ధరించుటకు గల కారణము.— దేవుడు మనుష్యుడాయెనను సంగతి మనము గ్రహించుకొనలేనంత లోతైన సంగతియు, ఈలోకములోని మర్మము లన్నిటిలో మిగుల గంభీరమైన మర్మమునై యున్నది. అయితే యిది మన యాత్మరక్షణకు ఆధారమైనది. మనకు రక్షణ కలుగులాగున దేవుని కుమారుడు మనుష్యుడగుట అత్యవసరము (1. తిమొ. 1: 15) క్రీస్తు దేవుడు మాత్రమై యుండి మనుష్యుడు కాకుండిన యెడల మనకు ప్రతిగా దేవుని యాజ్ఞలను నెఱవేర్చి, మన పాపములకొఱకు శ్రమపడి చనిపోవుటకు వీలుపడదు. మఱియు ఆయన మనుష్య మాత్రుడైన యెడల నెంత మంచివాడైనను తనను మాత్రము రక్షించుకొనజాలియుండును గాని యితరులను రక్షించుటకు ఆయనకు శక్తియుండక పోవును. ఆయన దేవుడును మనుష్యుడునై యుండుటచే మన రక్షణకొఱకు చేయబడవలసిన దంతయు చేయగలిగి యుండెను. ఆయన మనుష్యుడై మనకు బదులుగా దేవుని యాజ్ఞలను నెఱవేర్చి మన పాపములను పరిహరించుటకై సిలువమీద చనిపోయెను. ఆయన దేవుడగుటచే ఆయన చూపిన విధేయతయు ఆయన పొందిన శ్రమలును ఇతరులను రక్షించుటకు మితిలేని శక్తిగలవి యయ్యెను. (7, 8).

II. మనలను రక్షించుటకు క్రీస్తు తన్ను తాను తగ్గించుకొనెను.— దేవుని కుమారుడు మనుష్యుడు కాగా ఆయనయొక్క దైవశక్తి ప్రభావము లెంత మాత్రమును తగ్గిపోలేదు. మనుష్యుడైన పిమ్మట కూడ క్రీస్తు సర్వశక్తి గలవాడై యుండెను. (యోహా. 5: 18, 22). ఆయన యొక దిక్కులేని శిశువుగా బేత్లెహేములో పుట్టినపుడు దూతలు ఆయనను "ప్రభువు" అనుటచే (లూకా 2: 11), ఆయన అట్టి దీన స్థితియందును దూతలకు ప్రభువై యుండెనని తెలిసికొనగలము. క్రీస్తు దేవుడై యుండుటను బట్టి ఆయనకు గల శక్తి యంతయు ఆయన దైవమానవుడైనపిమ్మట కూడను ఆయన కుండును (హెబ్రీ 1: 3). అయితే క్రీస్తు ఈలోకములో మనుష్యావతారమందు జీవించిన కాలమునందు తనశక్తినంతటిని ఉపయోగింపలేదు. ఆయనతాను చేసిన యద్భుతములలో నప్పుడప్పుడు అట్టి శక్తినిగూర్చి సూచనలను కొన్నిటిని కనబఱచినను, సాధారణముగా ఆయన తన శక్తి మహాత్త్వములను మఱుగుపఱచెను. ఆయన యితర మనుష్యులవలెను, దరిద్రులలో అతి దరిద్రుడుగను ఉండెను. ఆయన పుట్టినపుడు ఆయనకొఱకు సత్రములోనైన స్థలము దొరకనందున ఆయనను పశువుల తొట్టిలో పరుండబెట్టిరి (లూకా 2: 7) నజరేతు అను నొక పల్లెటూరిలో ఆయన

పెంచబడెను (మత్త. 2: 23). యుక్తవయస్కుడైన పిమ్మట కూడ తల వాల్చుటకైన స్థలము లేనంత దరిద్రతా స్థితిలో నున్నట్లు స్వయముగా చెప్పెను. (మత్త. 8: 20). ఒకప్పుడాయన పన్ను చెల్లింపవలసి వచ్చెను గాని, దాని చెల్లించుటకై ఆయన యొద్ద కొద్దిపైకము సహా లేక పేతురుచే చేప నొకదాని పట్టించి దాని కడుపులో నుండిన రూకను పన్నుకుగాను చెల్లించెను. (మత్త. 17: 27). తనకు సహాయము చేయుటకై పన్నెండు సేనలకంటె నెక్కువమంది దూతలను పిలుచుటకు అధికారముగల వాడై యుండినను (మత్త. 26: 53), ఆయన తన యధికారము నుపయోగింపక, ఏశక్తియు లేనివానివలె తనను శత్రువుల కప్పగించుకొని, వారు తనను పట్టుకొని (మత్త. 26: 50), నిందించి, శ్రమ పెట్టుచుండగా మౌనియై తుదకు వారిచే చంపబడెను. (మత్త. 27).

క్రీస్తుకు ఇట్టి దైవ మహిమ యుండగా ఆయన దాని నెందుకు ఉపయోగింపక మఱుగుపఱచెనని సందేహము కలిగిన యెడల, ఆయన మనలను రక్షించుటకు ఈవిధముగా శ్రమపడి చనిపోవుట యవసరమని తెలిసికొనవలెను. ఏమంటే మన నిమిత్తము క్రీస్తు "మరణము పొందునంతగా అనగా సిలువ మరణము పొందునంతగా విధేయత చూపిన వాడై తన్ను తాను తగ్గించుకొనెను" (ఫిలిప్పీ 2: 8) ఆయన తిరిగి లేచి పరలోకమున కెక్కిన పిమ్మట అదినుండి తనకుగల దైవాధికారమును ఉపయోగింప మొదలు పెట్టెను గాని అంతకు పూర్వము దానిని ఉపయోగింపలేను.

III. క్రీస్తుయొక్క బిరుదులు.—బైబిలులో క్రీస్తుకు పెట్టబడిన బిరుదులను చూడగా ఆయన గుణలక్షణములను తెలిసికొనుట కవి సహాయార్థములుగ నుండును. పాతనిబంధనలో మొదట ఆయన నామము కాపాడబడి (యెష. 7:14) క్రొత్తనిబంధనలో నెత్తి వ్రాయబడిన (మత్త. 1:23). ఇమ్మానుయేలు అను బిరుదులు దేవుడు మనకు తోడు, అని అర్థమగును. దేవుడును మనుష్యుడును ఆయనయందు కూడియుండిరని ఈ నామమువలన తేటపడును. దూతచే ఆయనకు నియ్యబడిన ఆయన సొంతపేరు యేసు అనునదియై యుండెను. దీనికి రక్షకుడు అని అర్థము (మత్త. 1: 21). క్రొత్తనిబంధనలోని క్రీస్తు అను నామమునకును పాతనిబంధనలోని మెస్సీయ అను దానికిని అభిషేకింపబడిన వాడని యర్థము. ఈ బిరుదువలన ఆయన జనులకు రక్షణను కలిగింపనై దేవునివలన అభిషేక మొందిన వాడని తెలియును. మఱియు ఆయన తన శ్రమ మరణాదులవలన దేవునికిని మనుష్యులకును మధ్య సంధిచేసెను కావున ఆయన 'మధ్యవర్తి' యనబడును. (1. తిమొ. 2: 5). ఆయన తండ్రి యెదుట మనకొఱకు విజ్ఞాపనము జేయుచున్నాడు (రోమా 8: 34). కావున ఆయన

ఉత్తరవాది యనబడును (1. యోహా. 2: 1). ఆయన తన్ను తాను బలిగా నర్పించుకొని మన పాపములను పరిహరించుటకు తగిన ప్రాయశ్చిత్తముచేసెను (హెబ్రీ 9: 25, 26) కావున ఆయన గొప్ప ప్రధానయాజకుడు అను బిరుదును పొందెను. (హెబ్రి 4:4).

---

## 8. క్రీస్తునుగూర్చిన బోధ—ఆయన చేసిన అద్భుత కార్యములు.

దేవుడు నజోరీయుడగు యేసు చేత అద్భుతములను మహాత్కార్యములను సూచక క్రియలను మీ మధ్యను చేయించి ఆయనను తన వలన మెప్పుపొందినవానినిగా మీకు కనబఱచెను. అపొ. కార్య. 2: 22.

### భాగములు.

I. క్రీస్తుచేసిన అద్భుతములు.

II. క్రీస్తు అద్భుతములను చేయుటకుగల హేతువులు.

III. క్రీస్తు చేసిన అద్భుతములు ఆయన దైవత్వమును నిర్ధారణ చేయును.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| క్రీస్తు చేసిన మొదటి యద్భుతము | యోహా 1: 1-11 |
| క్రీస్తు కపెర్నహూములో చేసిన అద్భుతములు | మార్కు 1: 21-34 |
| క్రీస్తు పుట్టు గుడ్డివానిని బాగుచేయుట | యోహా 9: 1-34 |
| క్రీస్తు కుంటివానిని బాగుచేయుట | యోహా 5: 1-18 |
| క్రీస్తు చనిపోయినవానిని లేపుట | యోహా 11: 1-40 |
| క్రీస్తు అద్భుతములు చేసెనని ఆయన విరోధులుఒప్పుకొనుట | ,, 11: 47-57 |
| యేసు మెస్సీయా యని అద్భుతములవలన తెలిసికొనుట | మత్తయి 11: 1-19 |

### వేదవాక్యములు.

I. 1 సూర్యుడస్తమించుచుండగా నానావిధరోగములచేత పీడింపబడుచున్న వారు ఎవరెవరియొద్ద నుండిరో వారందఱు రోగులను ఆయన (యేసు) యొద్దకుతీసి

కొని వచ్చిరి; అప్పుడాయన వారిలో ప్రతి వారిమీద చేతు లుంచి వారిని స్వస్థపఱచెను (లూకా 4: 40).

II. 2. అయితే యోహానుకంటె నాకెక్కువయిన సాక్ష్యము కలదు; అదేమనిన నెఱవేర్చుటకై తండ్రియే క్రియలను నాకిచ్చియున్నాడో నేనుచేయుచున్న ఆ క్రియలే తండ్రి నన్ను పంపియున్నాడని నన్నుగూర్చి సాక్ష్య మిచ్చుచున్నవి (యోహా. 5: 36).

III. 3. చంచల హృదయములతో నిట్లనుడి: భయపడక ధైర్యముగా నుండుడి; ప్రతిదండన చేయుటకై మీ దేవుడు వచ్చుచున్నాడు. ప్రతిదండనను దేవుడు చేయతగిన ప్రతీకారమును ఆయన చేయును. గుడ్డివారి కన్నులు తెరవబడును. చెవిటివారి చెవులు వినబడును. కుంటివాడు దుప్పివలె గంతులు వేయును. మూగవాని నాలుక పాడును. అరణ్యములో నీళ్లు ఉబుకును. అడవిలో కాలువలు పారును (యెష. 35: 4-6).

4. నేను నాతండ్రి క్రియలు చేయని యెడల నన్ను నమ్మకుడి. చేసినయెడల నన్ను నమ్మకున్నను తండ్రి నాయందును నేను తండ్రియందును ఉన్నామనిమీరు గ్రహించి తెలిసికొనునట్లు ఆ క్రియలను నమ్ముడని వారితో చెప్పెను (యోహా. 10:37, 38).

వి వ ర ము.

క్రీస్తుచరిత్రను చూడగా ఆయన యనేక యద్భుతకార్యములను చేయుటవలన ఆయన కీర్తి పలెస్తీను దేశమంతటిలో మ్రోగుచుండినటుల తెలిసికొనగలము (మత్త. 4:34; లూకా 4:37). ఆయన చేసిన అద్భుతకార్యములను చూచిన వారందరును విస్మయ మొందుచుండిరి (లూకా 4: 36; మార్కు 7: 37). అట్టి వింతైన శక్తి క్రీస్తులోగాక మఱి యెవరిలోను ఎన్నడు నుండలేదు. గాలివానలు, దయ్యములు, జీవ మరణములు మొదలగునవి యన్నియు ఆయనకు లోబడెను. పాతనిబంధనకాలపు ప్రవక్తలలో కొందఱట్టి యద్భుతములను చేసి రనుమాట వాస్తవమే యైనను వారు బహు అరుదుగా అద్భుతక్రియలను చేసియుండిరి. మఱియు వారు వాటిని తమ సొంతశక్తివలన గాక దేవుని ప్రార్థించి దేవుని సహాయమువలన చేసియుండిరి. కాని, క్రీస్తు వారివలెగాక స్వశక్తిచే అద్భుతములను చేసి (లూకా 7: 14) తన కున్న దైవాధికారమును మహాత్మ్యమును కనబరచెను.

క్రీస్తు చేసిన అద్భుతకార్యము లన్నియు బైబిలులో వ్రాయబడి యుండలేదు. (యోహా. 21: 25). అవి విస్తారముగ నుండుటచే సువార్తికులు వాటి నన్నిటిని వ్రాయ బూనుకొనలేదు. కానాయను నూరిలో పెండ్లి సమయమున నీళ్ళను ద్రాక్షారసముగా మార్చుట యనునది ఆయన చేసిన యద్భుతములలో మొదటిది (యోహా. 2

1-11). అది మొదలు ఆయన యీ లోకమున మనుష్యావతారములో నుండగా అద్భుతములు చేయని దిన మొకటియైనను లేనట్లు కనబడును. స్వస్థత నొందుటకు మనుష్యులు దివారాత్రములు ఆయన యొద్దకు వచ్చుచుండిరి.* (1). ఆయన రోగులను (మత్త. 4 : 23); కుంటివారిని (యోహా. 6 : 1-16). గుడ్డివారిని (యోహా. 9: 1-7), చెవిటి వారిని (మార్కు 7 : 31-37), కుష్ఠరోగులను (లూకా. 17: 11-19) బాగుచేసెను. ఆయన మాట ప్రకారము ఆయన శిష్యులు వలలువేసి గొప్ప చేపల రాసులను పట్టిరి. లూకా 5: 1-11; యోహా. 11 : 6.); ఆయన దయ్యములను వెళ్ళగొట్టెను (మత్త. 8 : 28-34); ఆయన తన మాటవల్ల తుఫానును నిమ్మళింపజేసెను (మత్త. 8:23-37); కొన్ని రొట్టెలను చేపలను తీసికొని వాటితో గొప్ప సమూహములకు భోజనము పెట్టించి తృప్తిపఱచెను. (మత్త 14:15-21); మృతులను బ్రతికించెను (యోహా. 11:43, 44); మఱియు తానే స్వయముగ మృతులలో నుండి సజీవుడై లేచెను. (మార్కు 16 : 1-8).

క్రీస్తు నిజముగా నిటువంటి యద్భుతములను చేసియున్నట్లు ఆయన శత్రువులు సహా యొప్పుకొనిరి. ఆయన చేసిన యద్భుతములలో మోస మేదియైనను నున్నయెడల శత్రువులు దాని బయలుపఱచి మనుష్యు లాయనను నమ్మకుండునట్లు చేయకుందురా ? అయితే నాలాగున చేయక యుండుటయే కాక ఆయన చేసిన యద్భుతములను బట్టి ప్రజలాయనయందు నమ్మిక యుంచుచున్నందున ఆయనపై మఱెక్కువగా అసూయపడి ఆయనను సంహరింప యత్నించిరి (యోహా. 11:47, 48). అదియుగాక ఆయన సాతాను సహాయమువలన నిట్టియద్భుతములను చేయుచున్నాడని ప్రజలకు బోధించి వారాయనను నమ్మకుండునటుల చేసిరి (మత్త. 12 : 24). తామెన్ని యత్నములు చేసినను ప్రజలు క్రీస్తుయొక్క అద్భుతములనుజూచి అంతకంతకు నాయనను ఎక్కువగా విశ్వసించుట జూచి విరోధులు సహింపనోపక తుద కాయనను సంహరించుటకు తీర్మానము చేసికొనిరి (యోహా. 11:50). క్రీస్తుయొక్క శత్రువులు చేసిన యీసంగతులను చూడగా ఆయన అద్భుతములను జేయువాడని వారొప్పుకొనినట్లు స్పష్టమగును. క్రీస్తు సిలువమీద వ్రేలాడు చుండినపుడు సహా వారాయనను జూచి 'వీ డితరులను రక్షించెను, తన్ను తానురక్షించుకొనలేడ'ని దూషించిరి (మత్త. 27: 42). కాని అలాగున దూషణ మాటలను పలుకుచుండగా ఆయన అద్భుతములను చేసెనని యొప్పుకొనిరని మనము గ్రహింపవచ్చును,

క్రీస్తు అద్భుతములు చేసెనను దానికి నవీన పండితులలో కొందఱుచేయు ఆక్షేపణ యేదియనగా : అద్భుతములు సృష్టి క్రమములో కనబడు దేవుని చట్టములకు భిన్నముగ నున్నవి. సృష్టి విషయములలో దేవుని చట్టము లెన్నడును మాఱక ఎన్నడు

నేకరీతిగా నుండును గాన అద్భుతములు చేయుట అసలే యసాధ్యము అని యందురు. అయితే వారు దేవుని శక్తిని యెఱుగక అలాగున వాదింతురు. సృష్టి క్రమమును ఏర్పఱచినవాడు ఆ క్రమమునకు లోనవా? కాడుగదా? మఱియు అద్భుతములను చేయుటకు ఈ సృష్టి క్రమములను మీఱవలసిన యవసరముకూడ లేదు. ఏలాగనిన: మన మొక రాతిని పైకి విసరితిమా, భూమియొక్క ఆకర్షణశక్తినిగూర్చిన చట్టమేమాత్రమును మార్చబడలేదు గాని తత్క్షణమందు తనకంటె మించిన మఱియొక శక్తిలోబడె ననగలము. అలాగుననే దేవుడును అద్భుతములు చేయుటలో సృష్టి క్రమమును రద్దుపఱచలేదు గాని సృష్టిలోని శక్తులకంటె మఱి గొప్ప శక్తులను కనబఱచుటవలన అట్టి మహాత్కార్యములను చేసెను. బలహీనులమగు మనము సహా సృష్టి క్రమమునకు భిన్నముగ నుండు అనేక స్వల్ప విషయములను చేయుచుండగా సర్వశక్తిగల దేవుని కుమారుడు సృష్టి క్రమమునకు భిన్నమైన వాటిని చేయలేడని చెప్పుట కేవలము విపరీతముగ నున్నది.

II. క్రీస్తు అద్భుతములను చేయుటకు గల హేతువులు:— దేవుడు సాధారణముగా అద్భుత కార్యములు చేయడుగాని క్రీస్తు ఈ లోకమునకు అవతారమెత్తి వచ్చి జీవించిన కాలములో అట్టి క్రియలను చేయుట ఆవసరమైయుండెను. క్రీస్తు బహు దీనుడుగా నీ లోకమందు జీవించుచుండెను. కావున ఆయన అట్టి యద్భుతములను చేయక పోయినయెడల మనుష్యు లాయనను ఒక మనుష్యమాత్రుడే యనుకొని ఆయన దైవత్వమును కనుగొన లేకపోవుదురు. అద్భుతములను చేయుటవలన క్రీస్తు తనమహిమను కనబఱచెను. మనుష్యులు తనయందు విశ్వాసముంచవలెనని క్రీస్తు అద్భుతములను చేసెను (యోహా. 2:11). అప్పట్లో ఆయన తన మహాత్మ్యమును కనబఱచ గోరినయెడల ఆయనకు గల ఒక్కటే మార్గము అద్భుతములు చేయుటయై యుండెను. అయితే ప్రస్తుతము మనకాలములో ఆయన దైవత్వము నిర్ధారణచేయబడెను కావున, ఆయన మన నిమిత్తము అద్భుతములను చేయవలసిన యక్కఱ లేదు. క్రీస్తునిర్నిమిత్తముగా నెన్నడును అద్భుతములను చేయలేదు. మఱియు మనుష్యులకు ఆశ్చర్యము కలుగజేయవలెనను తలంపుతో ఆయన వాటిని చేసియుండలేదు. తమ యాశ్చర్యము నిమిత్తమై అద్భుతక్రియలను చేయుమని జను లాయన నడిగినపుడు ఆయన వారిని గద్దించెను (మత్త. 12:89). గాని వారి కోరికె ప్రకారము చేయడయ్యెను.

క్రీస్తు చేసిన యద్భుతములు ఆయన దైవత్వమును నిర్ధారణ చేయును. ఇదియుగాక వాటివలన ఆత్మీయమైనట్టియు, నీతికి సంబంధించినట్టియు విషయములను మనము నేర్చుకొనగలము. అవి దేవుడు మనుష్యులను రక్షించుటకు జూపుచున్న దయను సూచించు గుణములై యున్నవి. మన యాత్మను బలపఱచి రక్షించుటకు ఆయన వాటిని

చేసెను. ఈ లోక చట్టములు ఎంత బలముగలవి యైనను ఎంత మేలైనవియైనను, వాటి యెదుట మనుష్యులెంత ఎన్నిక లేనివారుగా కనబడినను; దేవుని ప్రేమయు, ఆయన శక్తియు వాటికంటె మఱీ బలము గలవై యున్నవని ఆయనయొక్క అద్భుత క్రియలవలన తెలిసికొనగలము. మన మారాధించు క్రీస్తుప్రభువు నిరంతరమును మహా జని శక్తిగల దేవుడైయున్నాడు. దేవుని ప్రేమించువారికి మేలుకలుగుటకై సమస్తమును సమకూడి జరుగునట్లు ఆయన ఆశక్తినే ఇంకను ఉపయోగించు చున్నాడు. (రోమా 8 : 28)

III. క్రీస్తు చేసిన అద్భుతములు ఆయన దైవత్వమును నిర్ధారణ చేయును:— యేసు దేవుని కుమారుడైన మెస్సీయ యని ఆయన జేసిన కార్యముల వలన తెలిసికొనగలము. "రాబోవువాడవు నీవేయా? మేము మరి యొకనికొరకు కనిపెట్టవలెనా?" అని యడుగుటకు యోహాను తన శిష్యులలో కొందరిని యేసునొద్దకు బంపగా యేసు వారిని జూచి— "మీరు వెళ్ళి విన్నవాటిని కన్నవాటిని యోహానుకు తెలుపుడిగుడ్డివారు చూపును పొందుచున్నారు, కుంటివారునడచుచున్నారు కుష్ఠరోగులు శుద్ధులగుచున్నారు, చెవిటివారు వినుచున్నారు చనిపోయినవారు లేపబడుచున్నారు? బీదలకు సువార్త ప్రకటింపబడుచున్నది" అని చెప్పి వాటివలననే తాను మెస్సీయయై యున్నటుల యోహాను తెలిసికొన వలెనని ఆయన వాటి నివ్విధముగ వివరించెను, క్రీస్తు వచ్చినపుడు ఆయన యిటువంటి కార్యములు జేయునను ప్రవచనము పాతనిబంధనలో వ్రాయబడియున్నది (3) కావున క్రీస్తువచ్చి అలాటి కార్యములు చేయగా ఆయనయే తమచే నిరీక్షింపబడిన క్రీస్తు అని యూదులకు స్పష్ట మయ్యెను.

యేసు దేవుని కుమారుడై యున్నాడను సంగతిని నిర్ధారణ చేయుటకై ఆయన అద్భుతములను వింతకార్యములను చేసెను, తండ్రి క్రీస్తును పంపించెనని వాటివలననే మనము తెలిసికొనగలము (యోహా, 5: 36), తన మాటలను బట్టి నమ్మకపోయినను తన క్రియలనుపట్టియైన నమ్మవలెనని తనను నమ్మని వారితో క్రీస్తు చెప్పెను, (4). ఆయన అద్భుతములను జూచియు ఆయనను నమ్మనివారు సొదొమ గొమర్రాల వారి కంటె గొప్ప పాపులనియు (యోహా 15:24,) కఠిన తీర్పునకు లోనగుదురనియు (మత్త. 10:15; 11:23,24) ఆయన చెప్పెను.

క్రీస్తు చేసిన యద్భుతములను జూచి అనేకులు ఆయనను నమ్మిరి. ఆయన చేసిన మొదటి అద్భుతము వల్లనే శిష్యులు ఆయనయందు విశ్వాసముంచిరి (యోహా. 2: 11.) ఆయన చేసిన కార్యములను చేయుటకు మనుష్య శక్తి చాలదని

వాటిని చూచినవారు ఒప్పుకొనవలసివచ్చెను. (మత్త. 8:27). క్రీస్తు సమాధినుండి లేపిన తరువాత జనులలో చాలమంది యేసును విశ్వసించుటను చూచి, ఈ యద్భుతమువలన అందరును ఆయనను విశ్వసింతురేమో యని వారు చేత ఆయనను చంప నిశ్చయించుకొనిరి.

---

9. రక్షకునిగూర్చిన బోధ—ఆయన చేసిన బోధలు.

మనుష్యులు మీ సత్క్రియలను చూచి ఆకాశమందున్న తండ్రిని మహిమ పరచునట్లు మీరును వారియెదుట మీ వెలుగును ప్రకాశింపనియ్యుడి. మత్త. 5:16.

భాగములు.

I. బోధకు లందరిలో క్రీస్తు ముఖ్యుడు.

II. క్రీస్తు బోధించిన సంగతులు.

1. ధర్మశాస్త్రము.
2. సువార్త.
   (a) తననుగూర్చిన సంగతులు.
   (b) తన రాజ్యమును గూర్చిన సంగతులు.

అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| క్రీస్తు తననుగూర్చి బోధించిన సంగతులు | యోహాను 3 |
| క్రీస్తు దేవుని రాజ్యమును గూర్చి చెప్పిన యుపమానములు | మత్త |
| క్రీస్తు దేవుని కృపను ,, ,, ,, | లూకా |
| క్రీస్తు న్యాయపు తీర్పును ,, ,, ,, | మత్త |
| క్రీస్తు చేసిన నీతిబోధలు. | మత్త |
| క్రీస్తు చేసిన నీతిబోధలు. | మత్త |
| క్రీస్తు చేసిన నీతిబోధలు | మత్త |

వేదవాక్యములు.

I. 1. పూర్వకాలమందు నానా సమయములలోను నానా విధములుగాను ప్రవక్తలద్వారా మన పితరులతో మాట్లాడిన దేవుడు, ఈదినముల అంతమందు కుమారుని

ద్వారా మనతో మాటలాడెను. ఆయన (ఆ కుమారుని) సమస్తమునకు వారసునిగా నియమించెను. ఆయన ద్వారా ప్రపంచములను నిర్మించెను (హెబ్రి 1: 1, 2).

II. 2. మనుష్యకుమారుడు ఉపచారము చేయించుకొనుటకు రాలేదుగానియుప చారము చేయుటకును అనేకులకు ప్రతిగా విమోచన క్రయధనముగా తన ప్రాణము నిచ్చుటకును వచ్చెనని చెప్పెను (మత్త. 20: 28).

3. సమస్తమును నా తండ్రిచేత నా కప్పగింపబడియున్నది. తండ్రిగాక యెవడును కుమారుని నెఱుగడు; కుమారుడు గాకను, కుమారుడెవనికి ఆయనను బయలుపఱచ నుద్దేశించునో వాడు గాకను మఱి యెవడును తండ్రి నెఱుగడు (మత్త. 11: 27).

4. తండ్రి యెవనికిని తీర్పుచేయడు. కాని తండ్రిని ఘనపఱచునట్లుగా అందఱును కుమారుని ఘనపఱచవలెనని తీర్పుచేయుటకు సర్వాధికారము కుమారుని కప్పగించి యున్నాడు; కుమారుని ఘనపరచనివాడు ఆయనను పంపిన తండ్రిని ఘన పఱచడు (యోహా. 5: 22, 23).

5. దేవుని రాజ్యమెప్పుడు వచ్చునని పరిసయ్యులు ఆయన నడిగినప్పుడు ఆయన—దేవుని రాజ్యము ప్రత్యక్షముగా రాదు. ఇదిగో దేవుని రాజ్యము మీ మధ్యనే యున్నది గనుక ఇదిగో ఇక్కడనియైనను, అదిగో అక్కడనియైనను చెప్ప వీలుపడదని వారికి ఉత్తరమిచ్చెను (లూకా 17: 20, 21).

## వివరము.

ప్రభువైన యేసునకుగల యుద్యోగములలో ప్రవక్తోద్యోగ మొకటి కావున ఆయన పనిలో బోధించుట యనునది యొక ముఖ్య విషయముగ నున్నది. ఆయన నరావతారములో నుండగా యూదైయలోను, సమరైయలోను, గలిలైయలోను మఱి యొచటను బోయినను ప్రజలకు బోధించుచుండెను. ఆయన దేవాలయమందును మత్త. 20: 1), సమాజమందిరములలోను (లూకా 4: 16, 21), కొండమీదను మత్త. 5: 1, 2), సముద్రతీరముననను (మత్త. 13: 2), యాకోబు నూతియొద్ద అలసట తీర్చుకొనుచుండగను (యోహా. 4: 26), తాను తిరిగిన ప్రదేశములందంతటను బోధించుచుండెను. ఆయన గొప్ప సమూహములకైనను (మత్త. 5: 1, 2), ఒకానొకప్పుడు కొద్దిసంఖ్యగల శిష్యులకైనను (మత్త. 13: 10), మఱియొకప్పుడు నికోదేమువలె ఒంటరిగ తనయొద్దకు వచ్చినవారికైనను (యోహా. 3:1-21), బావి యొద్ద నొంటరిగ నుండ తటస్థించిన సమరైయ స్త్రీవంటి వారికైనను (యోహా. 4:5-26) ఆయన వెనుక దీయక ఉపదేశించెను.

I. బోధకులందఱిలో క్రీస్తు ముఖ్యుడు:—పూర్వమందు దేవుడు ప్రవక్తల ద్వారా తన చిత్తమును మనుష్యులకు తెలియజేసియుండెను గాని కడవరి కాలములో ఆయన తన చిత్తమును తన కుమారునిద్వారా తెలియజేసియున్నాడు (1) క్రీస్తు దేవుని "రొమ్మున నున్నవాడు" (యోహా. 1:18). కాబట్టి ఆయన దేవుని సంగతులను పూర్ణముగా తెలియజేయ గలిగియున్నాడు. ఆయన అట్టి యధికార శక్తితో బోధించినందున ఆయన బోధలను వినినవారు ఆశ్చర్యపడి (మత్త. 7: 28, 29), ఆయన దేవుని యొద్దనుండి వచ్చిన బోధకుడని యొప్పుకొనవలసి వచ్చెను (యోహా. 3: 2). ఆయన బోధించినది రద్దుపఱచబడ నేరని పూర్ణసత్యమై యుండెను (లూకా 21:33). ఆయన బోధించిన సత్యములు అన్నిటికంటె ఉన్నతమైనవి (హెబ్రీ 2: 2, 23). దేవుని గూర్చి మనము తెలిసికొనవలసిన వాటి నన్నిటిని ఆయన బయలుపఱచెను. శిష్యులను సమస్త సత్యములోనికి నడిపించుటకు పంపబడిన పరిశుద్ధాత్మ (యోహా. 16: 13) క్రీస్తు తన శిష్యులకు బోధించియుండిన వాటినే వారికి తేటపఱచెను గాని క్రొత్త విషయములను బోధించ కుండెను (యోహా. 14:26).

II. యేసు బోధించిన సంగతులు:—1. క్రీస్తు ధర్మశాస్త్రమును బోధించి దాని అంతర్య విషయములను దెలిపెను. కొండమీది ప్రసంగములో ఆయన దీనినిగూర్చి బహుతేటగా బోధించెను (మత్త. 5-7). మనుష్యులు కల్పించిన వెలుపలి కట్టడల నాయన కొట్టివేసి, వెలుపలి యాచారముల నాచరించుటవలన గాక, మనసునందు దేవునిని, మన పొరుగువానిని పూర్ణముగా ప్రేమించుటవలన (మత్త 22: 37, 39) దేవుని ధర్మశాస్త్రమును గైకొనవలెనని బోధించెను. 2. క్రీస్తు బోధకుడుగ నుండి ముఖ్యముగా సువార్తను ప్రకటించెను. దేవుడీలోకమునందొక రాజ్యము నేర్పఱచి మనుష్యులు దానిలో ప్రవేశింపవలెనని హెచ్చరిక చేయుచున్నట్లు ఆయన తన సువార్తద్వారా బోధించెను (లూకా 4: 21). క్రీస్తు మొదట తనను గూర్చియు తరువాత దేవుని రాజ్యమునుగూర్చియు బోధించిన రెండు విషయముల నిచట విచారింప వలయును.

క్రీస్తు తననుగూర్చి తాను ప్రకటించిన విషయము లేవి యనగా: మనుష్యులకు నిత్యజీవము కలుగులాగున తాను పరలోకమునుండి వచ్చుట (యోహా. 31: 3 17). తన ప్రాణమును విమోచన క్రయధనముగా పెట్టుటవలన వారిని రక్షించుట (2) తానే మార్గమును, సత్యమును, జీవమునై యున్నాననుట (యోహా. 14: 6) తనద్వారానేకాని యెవడును దేవుని యొఱిగి ఆయనయొద్దకు చేరలేడనుట (3); తన నామమందే మనుష్యులందఱికి మారుమనస్సును, పాపక్షమమును ప్రకటింపబడవలెననుట (లూకా

24: 27.); రక్షణ పొందుటకు తనయందలి విశ్వాసము అత్యావసరమనుట (యోహా. 3: 16.); తనను విశ్వసించనివారు శిక్షకు లోనగుదురనుట (యోహా. 3: 17.); ఆయనరక్షకుడు మాత్రముగాక మనుష్యులకు తీర్పుచేయువాడునై యున్నాడనుట (5); ప్రతివారికి వారివారి క్రియల చొప్పున ప్రతిఫల మిచ్చుటకై తాను మరల వత్తునని చెప్పుట (మత్త. 16: 27), మొదలగునవియై యున్నవి.

దేవుని రాజ్యమునుగూర్చి క్రీస్తు బోధించిన విషయము లెవ్వి యనగా:—ఆ రాజ్యము సమీపముగ నున్నది. (మత్త. 4:17). అది యీలోక సంబంధమైనదికాక (యోహా. 18: 36.) మన హృదయములలోని రాజ్యమై యున్నది. (6). ఆరాజ్యమునకు క్రీస్తే రాజై యున్నాడు. (యోహా. 18: 37.) అందులో చేరువారందఱికి వినయ గుణ ముండవలెను. అతివినయులు ఆ రాజ్యములో గొప్పవారు (మత్త. 18: 4.) వారూరక ప్రభువా! ప్రభువా! యని పలుకక తమ నడతద్వారా ఆయన చిత్తమును నెఱవేర్చుచు ఆయనకు విధేయులై యుండవలెను. (మత్త 7: 21) ఆరాజును ఆయన రాజ్యములో చేరువారికిని ద్రాక్షావల్లితో దాని తీగెల కున్నంతటి తీక్ష్ణ సంబంధ ముండవలెను. (యోహా 15: 5, 6) ఈ రాజు తన రాజ్యములో నున్నవారిని యేలువాడు మాత్రము గాక వారిని ప్రేమించి, తన స్నేహితులనుగ నెంచువాడై యుండును (యోహా 15: 15) అనునవి.

క్రీస్తు తన బోధను తేటపఱచుటకై అనేక పర్యాయములు ఉపమానరీతిగా బోధించెను. ముఖ్యముగా దేవుని రాజ్యమును గూర్చిన వాటిని వివరించుటకాయన అట్టి యుపమానముల నుపయోగించెను. ఆయన మనచుట్టు జరుగుచునుండు సాధారణ విషయములను దృష్టాంతములనుగా తీసికొని వాటిద్వారా దేవుని రాజ్యముయొక్క వృద్ధినిగూర్చి అనగా అది సర్వలోకములో వ్యాపింపచేయబడి, మనుష్యులను మనురుపాటు చేయువరకు దానికి కలుగబోవు బాహ్యవృద్ధినిగూర్చియు (మత్త 13:31,32), దాని ఆంతర్య వృద్ధినిగూర్చియు (మత్త 13: 3.) వివరించెను. లూకా 15: 8, 32 లో నున్నట్లు దేవుడు మనుష్యులను రక్షించుటకు ఆశించుచున్నాడని క్రీస్తు బోధించెను. రక్షణను తిరస్కరించు వారినిగూర్చి ఆయన చేసిన బోధ మత్త 22: 2-14 లో కనబడును. దేవుని రాజ్యములోనికి మనుష్యులు చేర్చబడుటనుగూర్చినబోధ మత్త 13: 47-50 లోను, ఈ లోకమందు మంచివారును చెడ్డవారును క్రీస్తు రాజ్యములో కలిసి యుందురను దాని విషయమైబోధ మత్త. 13: 24-30 లోను చూడవచ్చును.

ఇవియు గాక ఆయన తన రాజ్యమునుగూర్చి యీ దిగువ విషయములను కూడ తెలిపెను. అందులో చేరువారు మంచి క్రియలను చేయని యెడల వారునాశ

నము చేయబడెదరు. (లూకా 18: 6-9.), దేవుని క్షమను కోరువారు ఇతరు
క్షమించవలెను. (మత్త. 18. 23-35.) వారు అక్కఱ కలవారికి సహాయము చే
వలెను (లూకా 10: 30-37). ఈలోక సంపదల నాశింపరాదు. లూకా 12: 1
21); నమ్మకముతో క్రీస్తును సేవింపవలెను (మత్త 25: 14-30.) తమకు కలుగబో
మోక్షమును దేవుడు బహుమానముగ నిచ్చునేకాని తమ పుణ్యకార్యములను
కాదని తెలిసికొనవలెను. (మత్త 20: 1-16), ఆయన రాజ్యములో చేరియుం
భక్తిపరులకును, భక్తిహీనులకును, మోక్షమందు కలుగబోవు స్థితి భేదములు లూ
16: 19-31 లో కనబడును; ఆయన లోకమునకు తీర్పుచేయుటకతలంచని గడియ
వచ్చును (మత్త 24: 43). కావున మన మెల్లప్పుడు సిద్ధముగా నుండవలెననికు
క్రీస్తు బోధించెను (మత్త 25: 1-13),

క్రీస్తు చేసిన నీతి బోధలు:—మనము విశ్వాసమువలన గాక మతి
వలన నైనను రక్షింపబడలేము, అయినను మనము మన విశ్వాసమునకనుకూల
నడకలవారమై, దాని ద్వారా మన విశ్వాసమును కనబఱచవలెను; లేని యెడ
మన విశ్వాసము నిజమైన విశ్వాసము కానేరదు. భక్తులు తమ సత్క్రియల
పఱచవలెను( (మత్త. 5: 16). వారు పూనుకొనవలసిన సత్క్రియ లెట్టివో వాట
క్రీస్తు అనేక బోధలవలన తేటపఱచెను. (మత్త 5:48). వారు అన్నిటికంటె దేవు
తమవలె తమ పొరుగువారిని ప్రేమింపవలెను (మత్త. 27: 37, 39).

ఇతరులు తమయెడల నేమి జరిగింపవలెనని క్రైస్తవుడు కోరునో అతడు
వారి యెడల దానినే చేయవలెను (మత్త. 7: 12). క్రైస్తవుడు అందఱియెడల దు
గాను మనస్సులో పగనుంచుకొనకయు, దూషణమాటలను పలుకకయు నుండవలె
(మత్త 5: 21, 22), అత డెవరికిని విరోధముగానైనను తప్పుచేసిన యెడల, అత
యెదుట దానిని ఒప్పుకొని, తన తప్పిదమువలన కలిగించిన నష్టమును తానే భరిం
కొనవలెను. (మత్త. 5: 23-24) ఇతరులు తనకు విరోధముగా చేసిన తప్పుల
క్షమించు మనస్సుగలవాడై యుండవలెను. (మత్త. 6: 14, 15). శత్రువులపై క
తీర్పుకొనక, కీడునకు ప్రతిగా మేలుచేసి వారిని ప్రేమించవలెను. (మత్త. 5: 38-4
తన పాపములను కలపోసికొనుచు, ఇతరులు చెడ్డవారని వారినిగూర్చి తీర్పుచేయక
వారి క్రియల విషయము దయగల భావముతో చూడవలెను. (మత్త. 7:27,28). ఒట్ల
లను, సకల విధములగు దుర్భాషలను విడిచిపెట్టవలెను. మత్త 5: 33-37). కష్టము
లోనున్నవారికి సహాయము చేయవలెను. కాని తన్నితరులు చూచి మెచ్చుకొందుర
కోరికతో అట్టి ధర్మకార్యములను చేయరాదు (మత్త. 6:1-3). నిత్యము యథార్థము

నుండవలెను (మత్త. 7: 18, 21). అయితే డంబముగా నేమియుచేయకయు (మత్త. 6: 5-18), అన్నవస్త్రముల విషయమై చింతింపకయు, తండ్రియైన దేవుని నమ్మికొని నెమ్మది బొంది యుండవలెను (మత్త. 6:25-34). మరియు ఏవి క్రైస్తవ జీవమునకు ఆటంకముగ నుండునో అట్టివాటి నన్నిటిని విసర్జింపవలెను. (మత్త. 5: 29, 30).

## 10. రక్షకునిగూర్చిన బోధ—క్రీస్తు పూర్ణ పరిశుద్ధుడు.

పవిత్రుడును, నిర్దోషియు నిష్కల్మషుడును పాపులలో చేరక ప్రత్యేకముగా నున్నవాడును ఆకాశమండలముకంటె మిక్కిలి హెచ్చయిన వాడునైన ప్రధాన యాజకుడు మనకు సరిపోయిన వాడు. హెబ్రీ 7: 26.

### భాగములు.

I. క్రీస్తు పరిశుద్ధుడు.
   1. దేవుని యెడల చేయవలసిన వాటిలోను.
   2. మనుష్యుల యెడల చేయవలసిన వాటిలోను.

II. క్రీస్తు పరిశుద్ధత ఆయన దైవత్వమును నిర్ధారణ చేయును.
   క్రీస్తు పరిశుద్ధత మనకు మాదిరిగా నున్నది.

V. క్రీస్తు తన పరిశుద్ధతనుబట్టి దేవుని యాజ్ఞలను మన కొఱకు పూర్ణముగా నెఱవేర్చెను.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| విరోధులు క్రీస్తుమీద తప్పుమోపలేక పోవుట. | యోహా. 8: 31-59. |
| పిలాతు సాక్ష్యము. | యోహా. 18: 28-19: 6. |
| క్రీస్తు శోధింపబడుట | మత్త. 4: 2-16. |
| క్రీస్తు చూపిన పూర్ణవిధేయత. | మత్త. 26: 36-46. |
| క్రీస్తు పాప రహితుడు. | హెబ్రీ 7. |
| క్రీస్తు మనకు మాదిరియై యున్నాడు. | 1. పేతురు 2: 18-25. |
| క్రీస్తు విధేయతవలనిస్థ ఫలములు. | రోమా 5. |

## వేదవాక్యములు.

I. 1. నాయందు పాప మున్నదని మీలో నెవడు స్థాపించును? (యోహా. 8: 46).

2. నాయంతట నేనేమియు చేయలేను; నేను వినునట్లుగా తీర్పుచేయు చున్నాను. నన్ను పంపినవాని చిత్తప్రకారమే చేయగోరుదును గాని నాయిష్టప్రకారము చేయగోరను గనుక నా తీర్పు న్యాయమైనది (యోహా. 5: 30).

3. మనుష్యకుమారుడు ఉపచారము చేయించుకొనుటకు రాలేదు గాని యుపచారము చేయుటకును అనేకులకు ప్రతిగా విమోచనక్రయధనముగా తన ప్రాణము నిచ్చుటకును వచ్చెను (మత్త. 20: 28.)

II. 4. ఆయన పాపమేమియు చేయలేదు; ఆయన నోటను ఏ కపటమును కనబడలేదు. ఆయన దూషింపబడియు బదులు దూషింపలేదు; ఆయన శ్రమ పెట్టబడియు బెదరింపక న్యాయముగా తీర్పుచేయు దేవునికి తన్ను తానప్పగించుకొనెను. (1 పేతురు 2: 22, 23).

III. 5. నేను సాత్వికుడను దీనమనస్సుగలవాడను గనుక మీ మీద నా కాడి యెత్తుకొని నా యొద్ద నేర్చుకొనుడి. అప్పుడు మీ ప్రాణములకు విశ్రాంతిదొరుకును (మత్త. 11: 29).

IV. 6. కాలము పరిపూర్ణమైనప్పుడు దేవుడు తన కుమారుని పంపెను; ఆయన స్త్రీయందు పుట్టి మనము స్వీకృత పుత్రులము కావలెనని ధర్మశాస్త్రమునకు లోబడి యున్నవారిని విమోచించుటకై, ధర్మశాస్త్రమునకు లోబడినవాడాయెను (గల. 4: 4, 5).

7. ఒక మనుష్యుని అవిధేయతవలన అనేకులు పాపులుగా నేలాగు చేయబడిరో, ఆలాగే ఒకని విధేయతవలన అనేకులు నీతిమంతులుగా చేయబడుదురు. (రోమా 5: 19).

## వివరము.

I. క్రీస్తు పరిశుద్ధుడు:—పాపలోకములో నివసించినను క్రీస్తు పాపము లేని పరిశుద్ధుడై యుండెను. ఆయన యొక్కడు మాత్రము అన్నిటికంటె దేవుని నెక్కువగాను, తన పొరుగువానిని తనవలెను ప్రేమించి దేవుని యాజ్ఞలను పూర్ణముగ నెరవేర్చెను. పాపములో పడుటచే మనుష్యులందరికి కలిగిన దుష్ట స్వభావము (రోమా 5: 19, యోహా. 3: 6) క్రీస్తుకు బొత్తిగా లేక యుండెను. ఎందుకనగా ఆయన పరిశుద్ధాత్మవలన పుట్టెను. (లూకా 1: 35) మరియు ఆయన తన జీవిత

కాలమంతటిలో నే పాపమును ఎఱుగడు. ఆయన పాప మేమియు చేయ లేదు; ఆయననోటను ఏ కపటమును కనబడ లేదు. (1 పేతురు 2:22). ఆయన పరిశుద్ధుడు నీతి మంతుడునైయుండెను (కార్య. 3:14). ఆయన దేవుని మహిమ యొక్క తేజస్సును ఆయన తత్వముయొక్క మూర్తిమంతమునై యుండెను (హెబ్రీ 1:3). కావున ఆయన పరిశుద్ధత దేవుని పరిశుద్ధతయే యని తెలిసికొనవలెను. ఆయన పవిత్రుడును, నిర్దోషియు, నిష్కల్మషుడును పాపులలో చేరక ప్రత్యేకముగా నున్నవాడునై (ప్రా వా॥) నిర్దోషముగాను, నిష్కళంకముగాను నుండెను. (1. పేతురు 1:19).

క్రీస్తు శోధింపబడినను పాపము చేయలేదు:— క్రీస్తు నిజమైన మనుష్యుడగుటచే ఆయనకు కూడ శోధనలు కలిగెను (మత్త. 4: 1). ఆయన సమస్త విషయములలో మనవలె శోధింపబడెను. (హెబ్రీ 4:15). సాతాను శోధన లెంత బలము గలవియైనను, ఎంత యుక్తిగలవియైనను ఆయన యాశోధనలకెన్నడును లోబడ లేదు (మత్త. 4: 3-10). ఆయనయొక్క ప్రబల విరోధులు ఆయన చెడ్డవాడని జనులకు చూపుటకై ఎంతగా కోరినను వారాయన నడతలో నేదో యొక చిన్న అక్ర మమును సహా చూపలేకపోయిరి (1). జనులు తమ పాపముల నొప్పుకొని క్షమాపణ కేడవలెనని ఆయన వారికి మాటి మాటికి బోధించినను (లూకా 11:4), తనకు పాప మున్నదని ఒప్పుకొనినట్లు ఆయన చేసిన ప్రార్థన లన్నిటిలో నొక దానిలోనైనను ఏ సూచనయైనను కనబడదు. ఇందువలన క్రీస్తునకు (కర్మ) పాపముకూడ లేదని తెలిసికొన గలము. ఆయన తన పాపములకొఱకు గాక కేవలము మన పాపములకొఱకే చనిపోయెను (1. పేతు. 2: 24).

I. దేవునియెడల తాను చేయవలసిన వాటిలోను క్రీస్తు పరిశుద్ధుడైయున్నాడని చూడగలము:—ఎట్లనగా ఆయన దేవుని నిండు మనస్సుతో ప్రేమించెను. పన్నెండేండ్ల యీడుగలవాడై యున్నప్పుడు దేవాలయములో నుండగా ఆయన తన తండ్రి పనిమీదనుండెను (లూకా 2:49). తన జీవితకాల మంతటిలో ఆయన తండ్రి చిత్తప్రకారమే చేయ నుద్దేశించెను. గాని తన యిష్టానుసారముగా చేయలేదు (2). దేవుని చిత్తమును పూర్ణముగా నెఱవేర్చుటచే ఆయన తనకు మరణము సమీపముగా నున్నప్పుడు తనతండ్రితో "తండ్రీ! చేయుటకు నీవు నాకిచ్చిన పని నేను పూర్ణముగా నెఱవేర్చి భూమిమీద నిన్ను మహిమపఱచితి ననెను. (యోహా. 17: 4). లోకరాజ్యములు వాటి వైభవమును పొందుటకంటె వినయముగా దేవుని సేవించుటయే ఆయన కిష్టమైయుండెను (మత్త. 4:8-10). దేవుని చిత్తము

ననుసరించుటవల్ల ఆయన కెన్నియో బాధలు కలిగెను (లూకా 18:31). అయినను ఆయన వెనుకతీయక సంతోషముతో దాని నెఱవేర్చి సిలువమరణ పర్యంతము విధేయుడయ్యెను (ఫిలిప్పీ 2: 8).

2. మనుష్యుల యెడల తాను చేయవలసియుండిన వాటిని చూచినను క్రీస్తు పరిశుద్ధుడైయున్నాడు:—— మనుష్యుల కొఱకు క్రీస్తు పొందిన శ్రమలను విచారింపగా ఆయన వారిని పూర్ణముగా ప్రేమించెనని స్పష్టమగును. (3). ఆయన వారి శరీర కష్టమును బాధలను చూచి వారియందు జాలిపడెను. తన కెంత ప్రయాసకరముగా నున్నను (లూకా 4: 40), బాధల యందున్న వారికి సహాయము చేయలేనని యెన్నడును చెప్పలేదు. మనుష్యులు తనతో మనవి చేయకపోయినను ఆయన వారి యక్కఱలను జూచి కనికరపడి వాటిని తీర్చెను (యోహా. 5: 5-9; లూకా 7: 11-13). అలాగు చేయుటవలన శత్రువులచేత తనకు దూషణలు కలుగునని (మత్త 12:10-13) ఆయన వారికి మేలుచేయ మానుకొనలేదు. క్రీస్తు ముఖ్యముగా మనుష్యుల ఆత్మీయ అక్కఱలను జూచి వారికి సహాయము చేయగోరెను. ఆయన సమూహములను చూచి వారు కాపరిలేని గొఱ్ఱెలవలె విసికి చెదిరి యున్నందునవారిమీద కనికరపడెను (మత్త. 9:36). వారిని వారి దౌర్భాగ్యస్థితిలోనుండి రక్షించుటకు క్రీస్తు ఇష్టపూర్వకముగా చెప్పశక్యముగాని గొప్పశ్రమలను సహించి చివరకు అవమానకరమైనదిగా నెంచబడిన సిలువమీద చంపబడెను (తీతు 2: 14). ఆయన మనుష్యు లందఱిని ప్రేమించి, అందఱికొఱకు చనిపోయి అందఱికి సువార్త ప్రకటింపవలెనని యాజ్ఞాపించెను (మార్కు 16: 15). అందఱిలో నీచులుగా నెంచబడిన వారిని కూడ ఆయన ప్రేమించెను. కావుననే ఆయన పాపులతోను సుంకరులతోను కలసి వారితోకూడ భోజనము చేసెను (లూకా 15: 1, 2). తన శత్రువులను సహా ప్రేమించి, తనను సిలువ వేసిన వారికొఱకు ప్రార్థించెను (లూకా 23: 34).

II. క్రీస్తు పరిశుద్ధత ఆయన దైవత్వమును నిర్ధారణచేయును:—— మనుష్యమాత్రు డేలాగు క్రీస్తుచేసిన అద్భుతకార్యములను చేయజాలడో, అలాగుననే అతడు క్రీస్తుయొక్క పరిశుద్ధ నడతను కూడ అవలంబింపజాలడు. ఆదాము పాపము చేసినది మొదలు మనుష్యు లందఱికి చెడ్డ నైజ స్వభావముకలదు (రోమా 8: 7). అన్యులలోని అతి శ్రేష్ఠులు సహా క్రీస్తు నెదుట నెంతో యధములు. పాతనిబంధన కాలపు ప్రవక్త లెంత గొప్ప భక్తులైనను వారును పాపము చేసినవారే. క్రైస్తవులు పరిశుద్ధ నడత నవలంబింపనై క్రీస్తువలన శక్తి నొందినను (గల. 2: 20), చాల

లోపములతో నిండినవారై యున్నారు (రోమా 7:21-24). క్రీస్తు తప్ప మరి యెవడును పాపరహితుడు కాడు. మరియు క్రీస్తు పాపరహితు డగుటచే ఆయన చెప్పుకొనినట్లాయన దేవుని కుమారుడని తెలిసికొనగలము.

III. క్రీస్తు పరిశుద్ధత మనకు మాదిరిగా నున్నది.—క్రీస్తు దేవుని మనుష్యులను పూర్ణముగా ప్రేమించినట్లు మనముకూడ ఆయన యడుగుజాడలనుబట్టి నడుచుకొనవలెను. (1 పేతు 2: 21). మనము దేవుని యాజ్ఞలను నెరవేర్చవలెనని చూపుటకై ఆయన వాటిని నెఱవేర్చెను (పేతురు 1: 15). మనము ఆయన కాడి నెత్తుకొని ఆయనవలెను నేర్చుకొనవలెను. (4). ఆయన యందున్నవారమని చెప్పుకొనువారు ఆయనవలె నడుచుకొనవలెను (1యోహా. 2: 6). ఆయన మనలను ప్రేమించినట్లు మనమును ఒకరి నొకరము ప్రేమించవలెను (యోహా 13: 34).

IV. క్రీస్తు తన పరిశుద్ధతనుబట్టి దేవుని యాజ్ఞలను మన కొఱకు పూర్ణముగా నెఱవేర్చెను.— క్రీస్తు పూర్ణపరిశుద్ధుడై నందున మనకు ప్రతిగా దేవుని చిత్తమును ఆయన యాజ్ఞలను పూర్ణముగా నెఱవేర్చెనను నదే యీ బోధవలన మనకు గలుగు ముఖ్య ఆదరణయై యున్నది. (రోమా 5: 18, 19). దేవుని ధర్మశాస్త్రమును గైకొనువాడు ప్రతిఫలము పొందుటకు పాత్రుడు (రోమా 4: 4). క్రీస్తు అనాదినుండి సర్వమహిమయు గలవాడు (యోహా 17:5). కావున ఆయనకు తన స్వకార్యములవలని పుణ్యము అవసరము లేదు. అట్టి పుణ్యకార్యములు మనకెంతో యవసరముగా నున్నవి కాని మనము స్వయముగా వాటిని సంపాదించుకొనలేము (రోమా 3:21). ఇట్లుండగా క్రీస్తు ధర్మశాస్త్రమునకు లోబడి మన పక్షముగా పుణ్యకార్యములను చేసెను (6). మనము మోక్షమునకు అర్హులగుటకు మన పాపములు తీసివేయబడుట మాత్రముగాక, మనకు నీతికూడ అవసరమైయున్నది. దానిని సంపాదింపనైనను మనకు శక్తి లేకపోవుటచే క్రీస్తు తన పూర్ణవిధేయత వలన అట్టి నీతిని మనకొఱకు సంపాదించెను. మరియు ఆయన తనయందు విశ్వాసముంచు వారందఱికి దాని నిచ్చును (రోమా 3: 22). ఆదాము అవిధేయతవలన అనేకులు ఏలాగు పాపులుగా చేయబడిరో అలాగు క్రీస్తు విధేయతవలన అనేకులు నీతిమంతులుగా చేయబడుదురు (7). క్రీస్తుమనకు జ్ఞానమును, నీతియును, పరిశుద్ధతయును విమోచనమును ఆయెను (1కొరి 1: 31).

## II. రక్షకునిగూర్చిన బోధ—క్రీస్తు శ్రమ మరణాదులవలని ఫలము

ఆయన మన అపరాధముల నిమిత్తమప్పగింపబడి మన నీతిమంతులముగా తీర్చబడుటకై లేపబడెను. రోమా 4: 25.

### భాగములు.

I. ప్రాయశ్చిత్తము లేనిదే పాపము క్షమింపబడనేరదు.

II. క్రీస్తు శ్రమ మరణాదులు.

III. క్రీస్తు శ్రమ మరణాదులవలని ఫలములు.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| ప్రాయశ్చిత్తముయొక్క అవశ్యకత. | హెబ్రీ |
| పాతనిబంధన యజ్ఞములలో గొప్పది. | లేవీ |
| క్రీస్తు శ్రమలు. | మత్త. |
| క్రీస్తు మరణము. | మత్త. |
| క్రీస్తు మనకొరకు శ్రమ మరణములను పొందెను. | యెష. |
| దేవుడు లోకమును సమాధానపరచుకొనెను | 2 కొరి. 5:11. |
| విశ్వాసమువలన క్రీస్తు నీతి మనకు కలుగును. | రోమా 3: 19. |

### వేదవాక్యములు.

I. 1 ధర్మశాస్త్ర ప్రకారము సమస్త వస్తువులును రక్తముచేత శుద్ధిచేయబడుననియు, రక్తము చిందింపకుండ పాపపరిహారము కలుగదనియు చెప్పవచ్చు (హెబ్రీ 9: 22).

2. ప్రధాన యాజకుడు ప్రతిసంవత్సరము తనదికాని రక్తము తీసికొని పరిశుద్ధ స్థలములోకి వెళ్లినట్లు, ఆయన అనేకపర్యాయములు తన్నుతా నర్పించుకొనుటకు వెళ్ళలేదు. అట్లయిన యెడల జగత్తు పునాది వేయబడినది మొదలుకొని ఆయన అనేకపర్యాయములు శ్రమపడవలసి వచ్చును. అయితే ఆయన యుగముల సమాప్తియందు తన్నుతానే బలిగా నర్పించుకొనుటవలన పాపనివారణ చేయుటకై ఒక సారే ప్రత్యక్షపరచబడెను (హెబ్రీ 9: 25, 26).

II 3. ఆయన తన పండ్రెండుమంది శిష్యులను పిలిచి-ఇదిగో యెరూషలేమునకు వెళ్లుచున్నాము; మనుష్యకుమారుని గూర్చి ప్రవక్తలచే వ్రాయబడిన మాటలన్నియు నెఱవేర్చబడును. ఆయన అన్యజనుల కప్పగింపబడును; వారాయన నపహసించి అవమానపఱచి ఆయనమీద ఉమ్మివేసి ఆయనను కొరడాలతో కొట్టి చంపుదురు; ఆయన మూడవ దినమున మరల లేచునని చెప్పెను (లూకా) 18:31-33)

III. 4. మనయతిక్రమ క్రియలనుబట్టి అతడు గాయపఱచబడెను; మనదోషములనుబట్టి నలగగొట్టబడెను. మన సమాధానార్థమైన శిక్ష అతని మీద పడెను. అతడు పొందిన దెబ్బలచేత మనకు స్వస్థత కలుగుచున్నది. (యెష 535: )

5. మనలను దేవునియొద్దకు తెచ్చుటకు, అనీతిమంతులకొఱకు నీతిమంతుడైన క్రీస్తు శరీర విషయములో చంపబడియు, ఆత్మ విషయములో బ్రతికింపబడి పాపములను పరిహరించుటకు ఒక్కసారే శ్రమపడెను (1 పేతురు 3:8)

6. విశ్వాస మూలమున మనము నీతిమంతులముగా తీర్చబడి మనప్రభువైన యేసుక్రీస్తు ద్వారా దేవునితో సమాధానము గలిగి యుందము (రోమా 5:1)

వివరము.

మనుష్యులందఱి పాపములకొఱకు తగిన ప్రాయశ్చిత్తము చేయుటకై క్రీస్తు శ్రమపడి చనిపోయెను.

1. ప్రాయశ్చిత్తము లేనిది పాపము క్షమింప బడనేరదు:—తప్పుచేసినవాడు ఆ తప్పును బట్టి శిక్షనొంది అలాగు దానిని క్రమపఱచక పోయిన యెడల ఈలోక వ్యవహారములలో తొందరలు కలుగునను సంగతి మన కందఱికి స్వాభావికముగా తెలిసిన విషయమై యున్నది. నేరస్థుడు శిక్షనొందక పోయిన యెడల మనుష్యులలో న్యాయము చెడును. మనుష్యుల విషయములో నిట్లుండగా పాపము నేమాత్రము సహింపలేని దేవుని విషయములో అది మఱి రూఢిగా అట్లుండును గదా? శిక్ష లేనిది పాపము క్షమింపబడ నేరదని మనుష్యుల మొదటినుండి స్వాభావికముగా తెలిసికొని యొప్పుకొందురు. అదే సత్యమును బైబిలుకూడ నిరాఘణ చేయును. రక్తము చిందింపకుండ పాపము క్షమింపబడనేర దనునది దాని బోధయై యున్నది (1). పాతనిబంధనలోని పాపమేధయాగము వలన (నిర్గ. 29:36-38). ముఖ్యముగా ప్రధాన యాజకుడు ఏటేట చేసిన ప్రాయశ్చిత్తార్థమై గొప్ప యాగము వలన (లేవీ. 16:-11-15) ప్రాయశ్చిత్తము లేనిది పాపము క్షమింపబడ నేరదను గొప్ప సత్యమును దేవుడు తన ప్రజలకు బహు దృఢముగా బోధింప నుద్దేశించెను. ఇశ్రాయేలీయులు చేసిన ఆ పశువుల బలులు పాపమును పరిహరించుటకు చాలినవి.

కాకపోయినను (హెబ్రీ 10:4), లోకరక్షకుడైన యేసుక్రీస్తు అందరికొఱకు చేసిన పూర్ణమైన ప్రాయశ్చిత్తమునకు ముంగుఱుతులై యుండెను (హెబ్రీ 9:23; 10: 1.) వాటివలన సూచింపబడిన క్రీస్తుయజ్ఞముయొక్క పుణ్యమునుబట్టి అవి తత్కాలమున కంగీకరింపబడిన ప్రాయశ్చిత్తములై యుండెను (రోమా 3: 25; హెబ్రీ 9 : 9-12). క్రీస్తుఒక్కడే గొప్ప ప్రధానయాజకుడును (హెబ్రీ 4: 14 పాపము కొఱకైన నిజమైన ప్రాయశ్చిత్తమునై యుండెను. (2).

II. క్రీస్తు శ్రమ మరణాదులు:—క్రీస్తు ఈ లోకములో నున్న కాలమంతటిలో శ్రమపడెనని తెలిసికొనవలెను. ఆయన మనుష్యుల కష్ట దుఃఖము లన్నియు అనుభవించుకొనెను. అదియుగాక విరోధులు ఆయనను ఎడతెగకుండ హింసించుచుండిరి (హెబ్రీ 12:3). నిష్కళంకుడైన క్రీస్తు ఈ లోక కల్మషములలో నివసించి తిరుగుట ఆయనకు ఎంత బాధకరముగ నుండెనో దాని నూహింపగలవా రెవరు? ఆ శ్రమలు ఆయన జీవితకాలాంతమందు మఱీ అధికమాయెను. గెత్సేమనె తోటలో ఆయన పొందిన శ్రమలు మత్త. 26: 36. 44, శత్రువు లాయనను పట్టుకొనుటవలన కలిగిన యవమానము మత్త. 26: 47-56). యూదుల అధికారులవలనను, రోమకగౌర్నరువలనను విమర్శింపబడి, అన్యాయమును పొంది శిక్షకు అప్పగింపబడుటవలని బాధలును, చివరకు సిలువ మరణమును (మత్త 26:57-27: 51) ఆయన శ్రమల ఉన్నత స్థితి లేక శిఖరమని చెప్పదగును.

ఈ శ్రమలు ఆయనను హఠాత్తుగా వచ్చినవనియు వాటివలన ఆయన పని నిరర్థకమైనదనియు తలచుకొనరాదు. వీటిని పొందుటకే, ఆయన యీ లోకమునకు వచ్చెను (మత్త 20:28) క్రీస్తు ముందుగనే ఎఱిగియున్నట్లు దేవుని సంకల్పము చొప్పున అవి జరిగెను (1 పేతురు 1: 19 20) అట్టిశ్రమలు కలుగునని ఆయన తన శిష్యులతో ముందుగా చెప్పి, వాటిని పొందుటకు స్వయముగా వెళ్ళెను (3) ఆయన ప్రాణము నెవడును తీసికొనలేదు; తీసికొన జాలడు. ఆయనే స్వయముగా దానిని పెట్టెను (యోహా. 10: 18). ఆయనను పట్టుకొన వచ్చిన జన సమూహము ఆయన సెలవు లేనిది ఆయనను పట్టుకొనలేక పోయెను (యోహా. 18: 6, మత్త. 26: 53, 54) అయితే తాను మనపాపములకు తగిన శిక్షను పొంది, వాటిని భరించుకొను లాగున తన్ను పట్టుకొనుటకును, చంపుటకును ఆయనే వారికి సెలవిచ్చెను (లూకా 24: 46).

III. క్రీస్తు శ్రమ మరణాదులవలని ఫలములు:—క్రీస్తు మరణము దేవుని ప్రేమను వెల్లడి చేసెను (యోహా. 3: 16). మఱియు దేవుడు పాపము నెంతగా

అసహ్యించుకొనునో దానిని బైలుపఱచెను. శ్రమలలో మన మెంతటి యోర్పుకన బఱచవలయునో దానినికూడ ఆయన మరణమువలన నేర్చుకొనగలము (హెబ్రీ 12:2). మఱియు అన్యాయ మరణమునుకూడ ఎట్టి స్థిరబుద్ధితో నొందవలెనో అదియు, దానివలన తెలిసికొనగలము. అయితే యీ బోధలు ఎంత దివ్యమైన వైనను అవి ఆయన మరణముయొక్క ముఖ్యోద్దేశములు కావు. ఏమనగా మన పాపములకొఱకు ప్రాయచిత్తము చేయుటయే ఆయన మరణముయొక్క ముఖ్యోద్దేశమై యున్నది (ప॥ వా॥). మనదోషములకై దేవుడు మనకు విధింపవలసిన శిక్షను ఆయన భరించి, వాటిని పరిహరించెను (4). ఆయన మనకు ప్రతిగా నిలిచి మనమొందవలసిన శిక్షను తానేపొందెను (రోమా 5: 6-8; 2కొరింధి 5: 21). ఆయన శ్రమలు ఇతరులు (కొఱకైనవి 6)

ఆయన శ్రమలచే సంపాదించబడిన పుణ్యము అందఱికి చాలును.—సర్వలోకములో నున్నవారందఱి పాపములకొఱకు క్రీస్తు పూర్ణ ప్రాయశ్చిత్తము చేసెను (యోహాను 1: 7; 2: 2). ఆయనపొందిన శ్రమ మరణములు అందఱు నొందవలసిన శ్రమ మరణములకు సాటియైనవి. మనకు ప్రతిగా ఆయన వాటిని పొందెను. అదియుగాక మనము పొందవలసిన వాటిని ఆయన భరించెను (1 పేతురు 2: 24) ఆయనశ్రమలెంత గొప్పవో మనము గ్రహింపజాలము. గెత్సెమెనె తోటలో ఆయన చెమట రక్తబిందువులై కారుటను (లూకా 22:24,) "సాధ్యమైతే యీగిన్నె నాయొద్దనుండి తొలగిపోనిమ్ము" అని అప్పుడాయనజేసిన ప్రార్థనను (మత్త. 26: 39), "నాదేవా! నాదేవా! నన్నేల చెయి విడిచితివి" అని సిలువమీద ఆయన మొఱబెట్టుటను మనము చూచి వినినయెడల ఆయన శ్రమలెంత గొప్పవో కొంతవరకు ఊహింపగలము. మానవకోటియొక్క దోషముల భారమును, పాపములమీద దేవునికి గల ఉగ్రతయొక్క యావత్తు భారమును యేసుమీద పడెను. అంతటి గొప్ప భారమును భరించుకొనుటకు దైవమానవుడైన సర్వశక్తిగల క్రీస్తుకుకూడ మిగులకష్టతరముగా నుండెను (మత్త. 26:39). ఆయన యాకొద్దికాలములలోనే అమితములైన శ్రమలను బాధలను పొందెను. ఆవిధముగ నాయన తన మరణమువలన అందఱి పాపములకొఱకు పూర్ణ ప్రాయశ్చిత్తము చేసెను (తీతు 2:14) ఆయన మనకుగాను శాపగ్రాహియై మనలను శాపమునుండి విమోచించెను (గల. 3: 13) తన రక్తమువలన మనకుగాను నిత్యమైన విమోచనము సంపాదించి (హెబ్రీ 9: 11). పాప నివారణచేయుటకై ఒక్కసారే ప్రత్యక్షపఱచబడెను (హెబ్రీ 9: 26).

దేవునికి పాపముమీద నుండవలసిన యుగ్రత యీ విధముగ తీరిపోయెను.—దేవుడు వారి యపరాధములను వారిమీద మోపక క్రీస్తునందు

లోకమును తనతో సమాధానపఱచుకొనెను (2 కొరి. 5:19). దేవుడు న్యాయము చేయవలెను కావున, పాపమును క్షమింప గూడదను మాట యిక చెల్లదు. ఏలననగా క్రీస్తుచేసిన ప్రాయశ్చిత్తమునుబట్టి దేవుడు పాపమును ఉచితముగా క్షమింపగలడు (రోమా 3:26). దేవుని ధర్మశాస్త్రము విధించినది యావత్తు క్రీస్తువలన నెరవేర్చబడగా దేవుడికను తన న్యాయమునుబట్టియు, ప్రేమనుబట్టియు పాపములను క్షమింపక తప్పదు (1యోహా. 1:9). క్రీస్తుద్వారా పాపక్షమను కోరువారందఱు దాని పొందగలరు (లూకా 24: 47). ఆయన సిలువరక్తముచేత సంధిచేసి ఆయన ద్వారా సమస్తమును సమాధానపఱచుకొనెను (కొల. 1: 20.)

క్రీస్తు శ్రమ మరణాదులవలన గలిగిన పుణ్యము విశ్వాసము ద్వారామనకు లభించును.—క్రీస్తు శ్రమ మరణాదులవలని మేలులను మన మనుభవించుకొనుటకై మనము వాటిని విశ్వాసమువలన పరిగ్రహించుకొనవలెను (యోహా. 3: 14, 15). రక్షణపొంద నొల్లనివారు ఏలాగైనను దానిని పొందునటుల దేవుడేమాత్రము వారిని బలవంతపఱచడుగాని, ఎవరు క్రీస్తునందు భక్తియుంచుకొందురో అట్టివారికి క్రీస్తుచేసిన ప్రాయశ్చిత్తమువలని పుణ్యమంతయు నియ్యబడును. అట్టివారికి క్రీస్తునీతి ఆరోపింపబడును (రోమా 4: 22, 23). క్రీస్తునిమిత్తము దేవుడు వారిని నీతిమంతులనుగా నెంచును (రోమా 4:5) విశ్వాసమూలముగా నీతిమంతులమని తీర్చబడి దేవునితో సమాధానము కలిగియుండి (6). క్రీస్తుద్వారా దేవుని యుగ్రతనుండి రక్షింపబడుదుము (రోమా 5:9).

---

## 12. రక్షకునిగూర్చిన బోధ—క్రీస్తు పునరుత్థానము.

నిద్రించిన వారిలో ప్రథమ ఫలముగా క్రీస్తు మృతులలోనుండి లేపబడియున్నాడు. 1కొరి. 15: 20.

### భాగములు

I. క్రీస్తు నిజముగా లేచెను.

II. క్రీస్తు లేచిన పిమ్మట అనేక పర్యాయములు తన శిష్యులకు కనబడెను

III. క్రీస్తు పునరుత్థానముయొక్క ప్రాముఖ్యత.

## అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| క్రీస్తు కుళ్లును చూడలేదు, | కీర్తన. 16. |
| క్రీస్తు పునరుత్థానము. | మార్కు 16. |
| క్రీస్తు పునరుత్థానము. | లూకా 24. |
| క్రీస్తు పునరుత్థానము. | యోహా. 20. |
| క్రీస్తు పునరుత్థానము. | యోహా. 21. |
| క్రీస్తు పునరుత్థానమువలని ఫలములు, | 1. కొరి 15: 20-59. |
| క్రీస్తు పునరుత్థానమువలని ఫలములు. | 1. థెస్స. 4: 13-5: 11 |

## వేదవాక్యములు.

I. 1. ఆయన పాతాళములో విడువబడలేదనియు ఆయన శరీరము కుళ్లి పోలేదనియు దావీదు ముందుగా తెలిసికొని క్రీస్తుయొక్క పునరుత్థానమును గూర్చి చెప్పెను. ఈయేసును దేవుడు లేపెను. దీనికి మేమందరము సాక్షులము (కార్య. 2: 31, 32).

II. 2. లేఖనముల ప్రకారము క్రీస్తు మన పాపముల నిమిత్తము మృతి బొందెను, సమాధిచేయబడెను, లేఖనముల ప్రకారము మూడవదినమున లేపబడెను. ఆయన కేఫకును తరువాత పండ్రెండుగురికిని అగపడెను. అటుపిమ్మట ఐనూటి కెక్కువైన సహోదరుల కొక్క సమయమందే కనబడెను, వీరిలో చాలామంది యిప్పటివఱకు నిలిచి యున్నారు, కొందరు నిద్రించిరి: తరువాత ఆయన యాకోబు కును, అటు తరువాత అపొస్తలుల కందరికిని కనబడెను. . అందరికి కడపట అకాల మందు పుట్టినట్లున్న నాకును కనబడెను (1 కొరి 15: 3-8).

III. 3, యేసుక్రీస్తు మృతులలోనుండి పునరుత్థానమైనందువలన పరిశుద్ధమైన యాత్మను బట్టి ప్రభావముచేత దేవుని కుమారుడుగ నిరూపింపబడిన వాడాయెను (రోమా 1: 5)

4, ఆయన మన యపరాధముల నిమిత్తమప్పగింపబడి మనము నీతిమంతు లముగా తీర్చబడుటకై లేపబడెను (రోమా 4: 25):

5. క్రీస్తు మృతులలోనుండి లేపబడి యున్నాడని ప్రకటింపబడుచుండగా మీలోకొందఱు—మృతుల పునరుత్థానము లేదని యెట్లు చెప్పుచున్నారు? మృతుల పునరుత్థానము లేనియెడల క్రీస్తుకూడ లేపబడి యుండలేదు (1 కొరి 15: 12, 13).

6. సహోదరులారా! నిరీక్షణలేని యితరులవలె మీరు దుఃఖపడకుండు నిమిత్తము నిద్రించుచున్న వారినిగూర్చి మీరెరుగకుండుట మాకిష్టములేదు. యేసుమృతి

పొంది తిరిగి లేచెనని మనము నమ్మినయెడల అదేప్రకారము యేసునందు నిద్రించిన వారిని దేవుడాయనతో కూడ వెంటబెట్టుకొని వచ్చును (1. థెస్స. 4: 13, 14).

## వివరము.

క్రీస్తు "నేనే పునరుత్థానమును జీవమునై యున్నానని" బోధించెను (యోహా. 11: 25) నిరంతరము ఏకరీతిగా నుండు సజీవుడగు దేవుని కుమారుడు జీవమునకు కర్త యగుటచే, ఇతరులను బ్రతికించిన దేకాక తాను మరణమువలన బంధింపబడ లేకపో యెను. పాతనిబంధనలో ప్రవచింపబడినట్లుగను (కీర్తన. 16: 10), తాను ముందుగా తెలిపినట్లుగను (మత్త. 16: 21.) ఆయన చనిపోయి మూడవ దినమున లేచెను. తన ప్రాణము పెట్టుటకును దానిని తిరిగి తీసికొనుటకు ఆయనకు అధికారము కలదు (యోహా. 10: 18).

I. క్రీస్తు నిజముగా లేచెను.—ఆయన మరణము తురకవారు చెప్పునట్లుగ మాయ మరణము కాదు (లూకా 24; 46, యోహా, 19, 33) అదేవిధముగా ఆయన పునరుత్థానము మాయ కాదుగాని చనిపోయిన పిమ్మట ఆయన నిజముగా మరల బ్రదికెను. లేచినపిమ్మట ఆయన ఆత్మస్వరూపియై శిష్యులకు కనబడక, అదివరకు కాయన యుండిన శరీరముతోనే వారికి కనబడెను. వారాయన దేహమును ముట్టిరి. మరియు ఇతరుల దేహములవలె ఆయన దేహమునకు ఎముకలును, మాంసముండెను (లూకా 24: 37-39). మరణకాలమున ఆయన ప్రక్కకాలుసేతు లందు పొందినట్టియు గాయములు ఆయనలేచిన పిమ్మట కూడ కనబడెను (యోహా, 20: 25-27). అయితే ఆయన లేచిన పిమ్మట మనశరీరమునకు లేని దివ్యగుణములు ఆయన శరీరము నందెను. మన దేహమున నుండు బంధకములు ఆయన దేహమున నుండలేదు. కావున క్రీస్తు తన కిష్టము వచ్చినట్లు దృశ్యుడుగాను, అదృశ్యుడుగాను కాగలిగెను (లూకా 24:15 31). తలుపులు మూయబడి యుండినను ఆయన లోపల ప్రవేశించుట కవి అడ్డుగా నుండలేక పోయెను (యోహా. 20: 19). ఆయన శరీరము మార్చబడి మహిమ పరచబడిన దాయెను (1 కొరి 15: 4:-45). మన పునరుత్థానమునకు తరువాత మనకును అట్టి మహిమదేహములు కలుగును (ఫిలిప్పీ 3: 21).

క్రీస్తు సిలువవేయబడిన తరువాత శిష్యులు బొత్తిగా అధైర్యపడి, మరల లేచు నని ఆయన చేసిన వాగ్దానమును మరచి, దేవుడీలోకమునకు పంపగల రక్షకుడు ఆయనే (యేసే) యనినమ్మికొనరైరి (లూకా 24:21). పరిసయ్యులూహించినట్లుగా (మత్త 27: 63, 64), క్రీస్తు శవమును దొంగిలించి, ఆయన లేచెనని చెప్పి ప్రజలను

మోసపుచ్చవలెనను బుద్ధి శిష్యులకేమాత్రముండలేదు. ఒకవేళ అట్టి బుద్ధి వారికి నుండినను, పరిసయ్యులు ఆయన సమాధికి ముద్ర వేయించి, అచట కావలివారి నుంచిరి గనుక, అట్టి మోసమును చేయుటకు వారికేమాత్రమును అవకాశముగలుగలేదు. (మత్త. 27:66)

క్రీస్తు నిజముగా లేచెననుటకు శిష్యులలో కలిగిన మార్పు ముఖ్య నిదర్శనమై యున్నది. వారు క్రీస్తు మరణమువలన బొత్తిగా నిరాశపడి అవిశ్వాసులైరి. ఎదిరింప కూడని సాదృశ్యము వలననే గాని మఱి దేనివలనను వారు మఱల విశ్వాసులు కాలేదు. క్రీస్తు లేచెనను వార్త మొదట స్త్రీలవలన విన్నప్పుడు "వారి (స్త్రీల) మాటలు వీరి (శిష్యుల) దృష్టికి వెఱ్ఱి మాటలుగా కనబడెను" (లూకా 24: 11). శిష్యులలో నొకడగు థోమా 'నే నాయన చేతులలో మేకుల గురుతును చూచి నా వ్రేలు ఆ మేకుల గురుతులో పెట్టి నా చేతిని ఆయన ప్రక్కలో నుంచితేనే కాని నమ్మ'నని చాల అవిశ్వాసముతో చెప్పెను. అయినను అట్టి యవిశ్వాసి సహా క్రీస్తును కన్నులార చూచి 'నా ప్రభువా! నా దేవా!' యని ఒప్పుకొనవలసి వచ్చెను (యోహా. 20: 25–28). ఇట్టి సాక్షుల సాక్ష్యము నమ్మతగిన దని అందఱు ఒప్పుకొనవలసి వచ్చును.

II. క్రీస్తు లేచిన తరువాత ఆయన యనేక పర్యాయములు శిష్యులకు కనబడెను.—క్రీస్తు లేచిన పిమ్మట నలువది దినములు ఈ లోకములో నుండి శిష్యులకు కనబడెను. ఆయనను గూర్చి శిష్యులకు అనేక సందేహము లుండెనుగాని, ఆ నలువది దినములలో ఆయన వారికి మాటి మాటికి కనబడు చుండినందున (కార్య. 1:3) వారి సందేహము లన్నియు తీరిపోయెను (లూకా 24:25). ఈస్టరు దినమున కొందఱు స్త్రీలు అత్యుదయమున లేచి ఆయన సమాధి కడకు వెళ్ళి అది ఖాళీగా నుండుటను అందులో దూత లుండుటను చూచి తత్తరపడుచుండగా, ఆ దూతలు వారికి అభయ మిచ్చి "ఆయన యిక్కడ లేడు. ముందుగా చెప్పియున్నట్లు ఆయన లేచెనని చెప్పిరి (మార్కు 16: 6). మగ్దలయూరి మరియ క్రీస్తును తోటలో చూచి ఆయన తనను పిలుచువఱకు ఆయనను గుర్తెరుగక ఆయన తోటమాలియై యుండు నని యనుకొనెను (యోహా. 20: 14–15). ఆయన పేతురునకును, (లూకా 24: 34), ఎమ్మాయికి వెళ్లు ఇద్దఱికిని రెండు సారులు పన్నెండుమంది అపొస్తలులకును (యోహా. 20: 19–29) కనపడెను. తరువాత కొందరు శిష్యులు చేపలు పట్టుచుండగా వారికి కనబడెను. (1. కొరి. 15:6) అపొస్తలు లందఱికి కడసారి కనబడెను (1. కొరి. 15:7). వారిని ఒలీవకొండ మట్టుకు వెంటబెట్టుకొని వెళ్ళి, వారు చూచుచుండగా

పరలోకమున కెక్కెను (కార్య 1:9,12). ఆరోహణమునకు తరువాత కూడ ఆయన పౌలునకు కనబడెను (1. కొరి 15: 8, కార్య. 9: 3–15, 22: 17—18). ఈ దర్శనముల వలన శిష్యులలో గొప్ప మార్పు కలిగెను. అటు పిమ్మట వారు మునుపటివలె నిరాశపడి, అధైర్యపరులై యుండక, సంతోషముతోను ధైర్యముతోను నిండుకొనిన వారై, పరిశుద్ధాత్మ వాగ్దానముకొఱకు కనిపెట్టుచు, ఆయనను పొందినతోడనే (కార్య. 2: 1–4.) అంతటను తిరుగుచు చనిపోయి తిరిగి లేచిన క్రీస్తు విషయమైన సువార్తను ప్రకటించుచుండిరి (మార్కు 16: 20). కొంతకాలమునకు పిమ్మట క్రైస్తవులను హింసించిన పౌలు కూడ మాఱు మనస్సును పొంది, ఆ సువార్తనే ప్రకటించుచు క్రీస్తు పేరట అన్నివిధములగు కష్టములను సహించెను (2. కొరి. 11: 23–28) ఇంతటి గొప్ప మార్పు క్రీస్తు నిజముగా లేచెనను నిశ్చయత వలననే గాని మఱి దేని వలనను కలుగ లేదు.

III. క్రీస్తు పునరుత్థానముయొక్క ప్రాముఖ్యత.—యూదాను ప్రతిగా మఱి యొకని అపొస్తలునిగా నేర్పఱచుకొనినపుడు అపొస్తలుడుగ నేర్పఱచబడువాడు క్రీస్తు పునరుత్థానమును గూర్చి సాక్షియై యుండవలెనని అపొస్తలులు బహు జాగ్రతగా చూచుకొనిరి (కార్య. 1: 22). వారు చేసిన బోధలకు క్రీస్తు పునరుత్థానము ఆధారమై యున్నది (కార్య2: 23–24). పునరుత్థానము లేనిది క్రీస్తు దేవుడని వారు మనుష్యులచేత ఒప్పింపలేక పోవుదురు. పునరుత్థానము లేని యెడల క్రీస్తు ఎంతె మంచివాడైనను ఎంత అన్యాయముగా చంపబడినను, ఆయన మనుష్య మాత్రుడే యని యొప్పుకొనవలసి వచ్చును. అయితే ఆయన పునరుత్థానము ఆయన దైవత్వమును నిర్ధారణచేయును (యోహా 20: 28; కార్య. 2:36). మనుష్య మాత్రుడు క్రీస్తువలె మరణమునుండి లేచి ఆకాశమున కెక్కుట అసాధ్యము. క్రీస్తు దేవుని కుమారుడనని చెప్పుకొనెను. ఆయన అట్టివాడు కాక, కపటముగా ఆ మాట చెప్పుకొన్నయెడల దేవుడాయనను లేపునని నమ్మగలమా? నమ్మలేము గదా? క్రీస్తుబాప్తిస్మము పొందినపుడు ఆకాశమునుండి వినబడిన శబ్దమును, అది మొదలు ఆయన చేసిన అద్భుతములును, ఆయన పరిశుద్ధ నడతయు, దివ్య బోధలును, ఆయన దేవుని కుమారుడను సంగతి వాస్తవమని రూపించినవి. అయితే ఆయన పునరుత్థానము దానిని ఎక్కువగా రూఢిచేసి స్థిరపచెను. క్రీస్తు చెప్పిన దంతయు సత్యమని దానివలన స్పష్టమగును క్రీస్తు ఇతరులవలె చనిపోయినను, ఆయన యితరులవలె మరణముచే బంధింపబడలేక పోయెను (కార్య (2:24–31) ఆయన పునరుత్థానమైనందున ప్రభావముతో దేవుని కుమారుడుగా నిరూపింపబడినవాడాయెను (రోమా 1:4)

క్రీస్తుపునరుత్థానము ఇంకొక గొప్ప సంగతిని స్థిరపఱచును. అది యేదనగా, క్రీస్తు తన మరణమువలన చేసిన ప్రాయశ్చిత్తము మనపాపములు పరిహరించుటకు చాలుననియు, దేవుడు దాని నంగీకరించెననియు దానివలన తెలియును:—మన పాపముల వలన మనము పొందవలసిన శిక్షను అయన పూర్ణముగా పొందెను (1 కొరి. 15:3.) పునరుత్థానము పై సంగతిని రూఢిపఱచు దేవుని సాక్ష్యమై యున్నది. అయన చేసిన ప్రాయశ్చిత్తము మన పాపములను పరిహరించుటకు చాలక పోయిన యెడల అయన చావున లోనైనవాడగునని తెలిసికొనవలెను. అయితే అయన లేచెను కావున విమోచన క్రయధనము పూర్తిగా చెల్లింపబడెననియు,అయన ప్రాయశ్చిత్తము పూర్తియయ్యె ననియు తెలిసికొనగలము(రోమా 8: 34; 1 థెస్స. 1: 10). అయన మన పాపముల కొఱకప్పగింపబడి మనకు నీతి కలుగుటకై లేచెను (రోమా 4:25) అయన మన పక్షముగా పాపమును, మరణమును, నరకమును జయించి జీవమును అక్షయతను వెలుగున పెట్టెను (2. తిమొ 1: 10).

క్రీస్తు పునరుత్థానము మన పునరుత్థానమునుకూడ నిరూపించును:—క్రీస్తు లేచినట్లుగా మృతులందఱును లేతురు (1 కొరి. 15: 12, 18; 1 థెస్స. 4: 14). మొదట క్రీస్తును లేపిన దేవుడు మనలను కూడ లేపును (1. కొరి. 15: 20). సమాధులలో నుండు వా రందఱు క్రీస్తు శబ్దమును విని, మేలు చేసినవారు జీవపునరుత్థానమునకును కీడు చేసినవారు తీర్పుపునరుత్థానమునకును బైటికి వచ్చు కాలము వచ్చును (యోహా. 5: 28, 29). క్రీస్తు పునరుత్థానమువలన యిక అయన యందు విశ్వాసులకు మృత్యుభీతి లేదు (1 కొరి. 15: 55-57). అట్టి విశ్వాసుల మరణము నిద్రవంటిది (1 థెస్స 4: 13, 14) క్రీస్తు తన మాటవలన మేలు కొల్పు కాలము వచ్చును. అప్పుడు అయన మన దీన శరీరమును తన మహిమగల శరీరమునకు సమరూపము కల దానినిగా మార్చును (ఫిలిప్పీ 3:21).

---

## 13. రక్షకునిగూర్చిన బోధ—క్రీస్తు ఆరోహణము.

మీరు వెళ్ళి సమస్తజనులను శిష్యులగా చేయుడి; తండ్రి యొక్కయు కుమారుని యొక్కయు పరిశుద్ధాత్మయొక్కయు నామములోనికి వారికి బాప్తిస్మ మిచ్చుచు నేను మీకే యే సంగతుల నాజ్ఞాపించితినో వాటినన్నిటిని గైకొనవలెనని వారికి బోధించుడి. ఇదిగో నేను యుగసమాప్తిపర్యంతము సదాకాలము మీతోకూడ నున్నాను.

మత్త. 28: 19, 20.

### భాగములు.

I. దైవమానవుడైన క్రీస్తు హెచ్చింపబడెను.

II. హెచ్చింపబడిన క్రీస్తు మనకొఱకు విజ్ఞాపనముచేయును.

III. హెచ్చింపబడిన క్రీస్తు అన్నిటిని ఏలును.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| క్రీస్తు ఆరోహణము. | కార్య. 1: 1-11. |
| క్రీస్తు హెచ్చింపబడుట. | ఫిలి. 2: 1-11. |
| క్రీస్తు హెచ్చింపబడుట. | కొల. 1: 9-24. |
| క్రీస్తు మనకు మధ్యవర్తి. | రోమా 8:31-39. |
| మధ్యవర్తి ప్రార్థన. | యోహాను 17. |
| క్రీస్తు మహిమా ప్రభావములు. | ప్రకటన 1. |
| క్రీస్తుతోకూడ నుందుము. | 1 థెస్స. 4: 13-18. |

### వేద వాక్యములు.

I. పరలోకమునందున్న వారిలోగాని, భూమిమీద నున్న వారిలోగాని, భూమి క్రింద నున్నవారిలోగాని ప్రతివాని మోకాలును యేసు నామమున వంగునట్లును, ప్రతివాని నాలుకయును తండ్రియైన దేవుని మహిమార్థమై యేసుక్రీస్తు ప్రభువని యొప్పుకొనునట్లును, దేవుడు ఆయనను అధికముగా హెచ్చించి, ప్రతి నామమునకు పైనామమును ఆయనకనుగ్రహించెను. (ఫిలి 2: 9-11).

II. 2. శిక్షవిధించువాడెవడు ? చనిపోయినవాడు క్రీస్తు యేసే; అంతే కాదు, మృతులలోనుండి లేచినవాడు ఆయన. ఆయన దేవుని కుడిపార్శ్వమున నున్నవాడై, మనకొఱకు విజ్ఞాపనము కూడ చేయుచున్నాడు (రోమా 8: 34).

3. ఆకాశమండలముగుండ వెళ్ళిన దేవునికుమారుడైన యేసు అను గొప్ప ప్రధానయాజకుడు మనకు కలిగియున్నాడు గనుక మన మొప్పుకొనినదాని గట్టిగా చేపట్టుదము. మన ప్రధానయాజకుడు మన బలహీనతలయందు మనతో సహానుభవము లేనివాడు కాడుగాని పాపవిషయములో తప్ప సమస్తవిషయములలోను మనవలెనే శోధింపబడినవాడు (హెబ్రి 4.14, 15)

III 4. పితరులు వీరివారు; శరీరమునుబట్టి క్రీస్తు వీరిలో పుట్టెను. ఈయన సర్వాధికారియైన దేవుడైయుండి నిరంతరము స్తోత్రార్హుడైయున్నాడు. ఆమెన్ (రోమా 9: 5)

5. నీవు నా కనుగ్రహించిన వన్నియు నీ వలననే కలిగినవని వారిప్పు డెరిగియున్నారు. నేను వారికొరకు ప్రార్థన చేయుచున్నాను, లోకముకొరకు ప్రార్థన చేయుటలేదు; నీవు నా కనుగ్రహించి యున్నవారు నీవారైనందున వారికొరకే ప్రార్థన చెయుచున్నాను. నావన్నియు నీవి, నీవియునావి. వారియందు నేను మహిమపరచబడియున్నాను. నే నికను లోకములో నుండను గాని వీరు లోకములో నున్నారు. నేను నీ యొద్దకువచ్చుచున్నాను. పరిశుద్ధుడవైన తండ్రీ! మనమేకమైయుండునట్లు నీవు నాకనుగ్రహించిన నీ నామమందు వారిని కాపాడుము (యోహా 17: 8-11)

6. ఆ మీదట సజీవులమై మిగిలి యుండు మనము వారితోకూడ నేకముగా ప్రభువు నెదుర్కొనుటకు ఆకాశమండలమునకు మేఘములమీద కొనిపోబడుదుము. కాగా మనము సదాకాలము ప్రభువుతోకూడ నుందుము (1. థెస్స 4: 17)

వి వ ర ము.

తాను లేచినట్లు శిష్యులకు దృఢమైన నిదర్శనములను చూపవలెనని క్రీస్తు లేచిన పిమ్మట నలుబది దినములవరకు ఈ లోకమునందుండి వారికి కనబడెను. (కార్య. 1: 3) తరువాత ఆయన వారితోకూడ ఒలీవ కొండయొద్దకు వెళ్ళి (కార్య. 1: 12) వారు చూచుచుండగా (కార్య 1: 9) పరలోకమునకు చేర్చుకొనబడి దేవుని కుడిపార్శ్వమున కూర్చుండెను. (మార్కు 16: 19)

I క్రీస్తు హెచ్చింపబడెను—ఆయన యీ భూమిమీద నుంటుండగా మనుష్యుల రక్షణనిమిత్తము తన్ను తాను తగ్గించుకొని మరణపర్యంతము, అనగా సిలువ మరణ పర్యంతము విధేయుడాయెను (ఫిలి. 2: 8) కాబట్టి దేవుడాయనను

మిక్కిలి హెచ్చించి, అన్నిటికి పైనామము ఆయనకనుగ్రహించెను (1) క్రీస్తు ఈ లోకములో చేయబూనుకొనిన పని నెఱవేర్చినందున, తాను మొదట ఏస్థలమునుండి వచ్చెనో ఆ పరలోకమునకు ఎక్కి వెళ్ళి, తాను దేవుని కుమారుడగుటచే తన కుండు పూర్వమహిమలో చేరెను (యోహా. 17: 5) క్రీస్తు తనను తాను తగ్గించుకొనుటద్వారా చేయవలసిన పని పూర్తియైనందున ఆయన ఆ యణువాస స్థితిని విడిచి తన సింహాసనమునందాసీనుడాయెను.

నరావతార మెత్తిన క్రీస్తు హెచ్చింపబడెను.—క్రీస్తు దేవుడగు టచే ఆయన యెచ్చు తగ్గులులేక నిన్న నేడు నిరంతరము ఒక్కలాగుననే యున్నాడు (హెబ్రీ 13: 8) అయితే ఆయన మానవుడగుటచే తనకు గలశక్తి ప్రభావములను మఱుగుపఱచి తన్ను తాను తగ్గించుకొనెను. ఈవిధముగా మానవుడైన క్రీస్తు తన ఆరోహణ కాలమందు హెచ్చింపబడెను. ఆయన యీ లోకమందు జీవించియుండ గా పరలోకమందును భూమిమీదను నాకు సర్వాధికారమియ్యబడి యున్నదని తన శిష్యులతో జెప్పెను (మత్త 28: 18) ఆ యధికారమును వహించుకొనుటకే ఆయన పరలోకమున కెక్కెను.

క్రీస్తు దేవునికుడి పార్శ్వమున కూర్చుండెను.— (మార్కు 16: 19) అనగా దేవుని శక్తిలో పాలిభాగస్థుడయ్యెను. దేవుడు ఆత్మస్వరూపి కావున ఆయనకు హస్తములు లేవు. అయితే మనుష్యులు తమ చేతులవలన తమ శక్తిని సాధారణముగా కనబఱతురు గనుక దేవుని శక్తిని సూచించుటకై అలంకారరీతిగా ఆయనకు హస్తములున్నట్లు మాటలాడెదము. క్రీస్తు దేవుని కుమారుడై నిత్యానాదినుండే దేవునియొద్దనుండెను (యోహా. 1: 1-3). ఆయన దేవుని శక్తి ప్రభావములలో పాలిభాగస్థుడై తండ్రితోను పరిశుద్ధాత్మతోనుకూడ దేవుడై యున్నాడు. ఇట్లుండినను మానవుడైన క్రీస్తు తనఆరోహణమునకు పూర్వము దేవుని కుడిపార్శ్వమున కూర్చుండక, ఆరోహణ సమయమందే దేవమానవుడైన ఆయన ఔన్నత్య స్థితనొంది పరలోక భూలోకములమీది సర్వాధికారమును వహించుకొనెను. తండ్రి క్రీస్తును మృతులలోనుండి లేపి సమస్తమైన ఆధిపత్యముకంటెను అధికారముకంటెను ఈ యుగ మునందు మాత్రమేకాక రాబోవు యుగమునందును పేరుపొందిన ప్రతి నామము కంటెను ఎంతో హెచ్చుగా పరలోకమునందు తన కుడిపార్శ్వమున కూర్చుండ బెట్టుకొని యున్నాడు. మఱియు సమస్తమును ఆయన పాదములక్రింద నుంచెను (ఎఫెసీ 1: 20-22) ఆయన దూతలమీదను అధికారులమీదను శక్తులమీదను అధికారము పొందినవాడయ్యెను (1. పేతురు 3: 22)

II క్రీస్తు ఇప్పుడు కూడ దైవ మానవుడై యున్నాడు.—ఆయన ఆరోహణ కాలమున మానవుడై యుండకపోలేదు. ఆయనతన మనుష్యత్వమును బట్టి హెచ్చింపబడెనే కాని మఱి దేనినిబట్టియు కాదు. ఈ భూమిమీద నుండుండగా నేలాగు దైవమానవుడై యుండెనో అదేవిధముగా ఇప్పుడు దేవుని కుడిపార్శ్వమునందుండినను, ఆయన దైవమానవుడై యున్నాడు. దైవమానవుడను క్రీస్తు ఇప్పుడు ప్రపంచమంతటను ప్రభుత్వము చేయుటవల్ల, నిజమైన మనుష్యుడు సమస్తమును ఏలుచున్నాడని తెలిసికొనవలెను. ఇది చేయుచున్న క్రీస్తు మనవంటి మనుష్యుడే, కాని ఆయనకు పాపములేదు. మఱియు ఆయన పూర్ణముగా మహిమపఱచబడెను (రోమా 9:5; 1. తిమో. 3:16).

III. హెచ్చింపబడిన క్రీస్తు మనకొఱకు విజ్ఞాపనముచేయును.—క్రీస్తు దేవుని కుడిపార్శ్వము నందుండి మనకొరకువిజ్ఞాపనము చేయుచున్నాడు (2). ఆయన మనపక్షముగా తండ్రిని వేడుకొనును. మన పాపములను పరిహరించుటకు తన రక్తమును ధారపోసిన ఆయన (కొల. 1:14) తన నిర్మల ప్రవర్తనవల్లను, నిర్దోష మరణమువల్లను సంపాదించిన పుణ్యమును బట్టియు నీతినిబట్టియు మన పక్షముగా వేడును. ఇట్లు ఆయన నిరంతరమును చేయుచున్నాడు (హెబ్రీ 7:25) పరలోకములో మన పక్షముగా నిపుడుగొప్ప ప్రధానయాజకుడుగానున్నాడు; ఆయన మన బలహీనతలను ఎఱుగనివాడు కాడు. ఎందుకనగా ఆయన సమస్త విషయములలో మనవలె శోధింపబడెను గాని పాపము లేనివాడుగా నుండెను (3). ఆయన కూడ మానవుడయ్యెను గనుక మన యక్కఱలన్నిటిని అనుభవ పూర్వకముగా తెలిసికొనెను. పాతనిబంధన కాలములో ప్రధానయాజకుడు ఏలాగు దేవుని సన్నిధానమును సూచించు అతిపరిశుద్ధ స్థలములో చేరి ప్రజలకొఱకు ప్రార్థన చేసెనో (నిర్గ. 28:33), అలాగు క్రీస్తు దేవుని సన్నిధానము నందుండి మనకొఱకు ఎల్లప్పుడును ప్రార్థనచేయును (హెబ్రీ 9:24). తండ్రి తానే మనలను ప్రేమించుచు తన కృపను దయను మన కనుగ్రహించుటకు మనస్సుగలవాడైయున్నాడు (యోహా. 16:27) మనకొఱకు చనిపోయిన క్రీస్తు మన పక్షముగా ఆయనను వేడుకొని నట్లయిన ఆయన మఱి రూఢిగా మనకు కృప నిచ్చునుగదా? కనుక మనము కరుణింపబడి సమయోచితమైన సహాయముకొఱకు కృపపొందునట్లు ధైర్యముతో కృపాసనము నొద్దకు చేరుదము హెబ్రీ 4:16).

VI హెచ్చింపబడిన క్రీస్తు అన్నిటిని ఏలును.—క్రీస్తు దేవుని కుడి పార్శ్వమున కూర్చుండి, అన్నిటికి రాజుగాను ప్రభువుగాను నుండును. తండ్రి ఆయన చేతికి సమస్తమును అప్పగించెను (యోహా. 13:3). తన శత్రువుల నందఱిని

తన పాదముల క్రింద నుంచు పర్యంతము ఆయన రాజ్య పరిపాలన చేయుచుండవలెను (1కొరి. 15:25). ఆయన రాజ్యమును చూడగా ఆయన తన శక్తిని కనబఱచు రాజ్యము, కృపను కనబఱచు రాజ్యము, మహిమను కనబరచు రాజ్యము అని మూడు విధములుగా నున్నది.

క్రీస్తు తనశక్తిని కనబఱచు రాజ్యములో మనుష్యులందఱు మాత్రము గాక ప్రపంచములోని సమస్తమును చేరియున్నది ఆయన సర్వాధికారియైన దేవుడై ప్రపంచమంతటిని ఏలును. మనుష్యులలో మంచివారికి చెడ్డవారికి, మాతలనసృష్టింపబడిన ప్రతి దానికి ఆయన అధికారియై యున్నాడు. సమస్తమును ఆయన పాదముల క్రింద నుంచబడెను (హెబ్రీ 2:8), ఆయన ఘనతయు, శాశ్వతమైన శక్తియు కలిగి, రాజులకు రాజును ప్రభువులకు ప్రభువునై యున్నాడు (1 తిమొ. 6:15,16).

క్రీస్తు తనకృపను కనబఱచు రాజ్యమునందు ఈ లోకములో నుండు నిజమైన భక్తులందఱును చేరుదురు (5) ఆయన సంఘ మనబడు ఈ రాజ్యములో (కొల. 1:13-18). తాను తన విధేయతవలనను, తన శ్రమవలనను సంపాదించిన మేలులన్నిటిని ఆయన విశ్వాసుల కిచ్చును (కొల. 1:21, 22). ఆయన తన వాక్యమువలనను (యోహా. :17: 18), సంస్కారములవలనను (యోహా. 3:3. ఎఫె. 5:26) విశ్వాసులను తనవారినిగ జేర్చి, కాపాడి సంరక్షించును (యోహా. 10: 28) వారి శరీరమునకుగాని (మత్త 6: 33), ఆత్మకుగాని (రోమా 8: 32) ఆక్కఱగా నున్నవాటి నన్నిటిని వారికి ననుగ్రహించి యుగ సమాప్తి పర్యంతము సదాకాలము వారితో కూడ నుండును (మత్త 28:20).

క్రీస్తు తన మహిమ కనబఱచు రాజ్యములో మంచి మాతలును చని పోయిన భక్తులందఱును చేరియుందురు (ప్రక. 2:10) లోకాంతమున క్రీస్తు తన కృపను కనబఱచబోవు రాజ్యము. ఈ రాజ్యములోనే చేరియుండును గానివేఱుగా నుండదు. ఆ కాలమునందు క్రీస్తు మృతులను బ్రతికించును. అపుడు లేపబడబోవు భక్తులను, ఆ కాలములో నింక జీవించియుండు భక్తులను క్రీస్తు తనయొద్ద మోక్షమందు చేర్చికొనును (6). క్రీస్తు ఎచట నుండునో అచట ఆయన భక్తులు నుందురు (యోహా. 17:24) అక్కడవారు నిత్య మహిమలో జీవించి క్రీస్తుతోకూడ నేలుదురు (ప్రక. 3:21).

---

## 14. పరిశుద్ధాత్మను, ఆయనవలన గలుగు నూతన జన్మమును గూర్చినబోధ.

తండ్రియొద్దనుండి మీయొద్దకు నేను పంపబోవు ఆదరణకర్త, అనగా తండ్రి యొద్దనుండి బయలుదేరు సత్యస్వరూపియైన ఆత్మ వచ్చినప్పు డాయన నన్నుగూర్చి సాక్ష్యమిచ్చును. యోహాను 15:26.

### భాగములు.

I. పరిశుద్ధాత్మను గూర్చిన బోధ.
II. పరిశుద్ధాత్మ చేయు కార్యములు.
III. తన కార్యములను నెఱవేర్చుటకై పరిశుద్ధాత్మ ఉపయోగించు సాధనములు.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| పరిశుద్ధాత్మనుగూర్చిన వాగ్దానము. | యోహా 14 : 14-31 |
| పరిశుద్ధాత్మ చేయు కార్యములు. | యోహా 16. |
| పరిశుద్ధాత్మ కుమ్మరింపబడుట. | కార్య 2: 1-21 |
| పరిశుద్ధాత్మ లక్షణములు. | కీర్తన 139 |
| పరిశుద్ధాత్మ అనుగ్రహించు జ్ఞానము. | 1 కొరి 2 2 |
| పరిశుద్ధాత్మచే నడిపింపబడుట. | రోమా 8: 1-17 |
| దేవుని వాక్యము దైవశక్తి స్వరూపము | రోమా 1: 1-16 |

### వేదవాక్యములు.

I. 1. ఆదరణకర్త అనగా తండ్రి నా నామమున పంపబోవు పరిశుద్ధాత్మ సమస్తమును మీకు బోధించి నేను మీతో చెప్పిన సంగతు లన్నియు మీకు జ్ఞాపకము చేయును (యోహా 14: 26).

2. ప్రవచన మెప్పుడును మనుష్యుని యిచ్ఛనుబట్టి కలుగలేదు గాని మనుష్యులు పరిశుద్ధాత్మవలన ప్రేరేపింపబడినవారై దేవుని (సహాయము) చేత బోధించిరి (2. పేతు. 1:21).

II 3. ప్రకృతి సంబంధియైన మనుష్యుడు దేవుని ఆత్మ విషయము నంగీకరింపడు. అవి అతనికి వెఱ్ఱితనముగా నున్నవి. అవి ఆత్మానుభవముచేతనే వివేచింపదగును గనుక అతడు వాటిని గ్రహింపజాలడు (1కొరి. 2:14)

4. యేసు ఇట్లనెను-ఒకడు నీటి మూలముగాను, ఆత్మ మూలముగాను జన్మించితేనే కాని దేవుని రాజ్యములో ప్రవేశింపలేడని నీతో యథార్థము చెప్పుచున్నాను. శరీర మూలముగా జన్మించినది శరీరమును, ఆత్మమూలముగా జన్మించినది ఆత్మయునై యున్నది (యోహా. 3: 5,6)

5. మరల భయపడుటకు మీరు దాస్యపు ఆత్మభావమును పొందలేదుగాని స్వీకృత పుత్రాత్మభావమును పొందితిరి ఆ ఆత్మభావము కలిగినవారమై మనము నాయనా తండ్రీ అని మొఱ్ఱపెట్టుచున్నాము. మనము దేవుని పిల్లలమని ఆత్మ తానే మన ఆత్మతో కూడ సాక్ష్యమిచ్చుచున్నాడు. మనము పిల్లలమైతే వారసులము, అనగా దేవుని వారసులము. క్రీస్తుతోగూడ మహిమ పొందుటకు ఆయనతో శ్రమ పడిన యెడల క్రీస్తుతోటి వారసులము (రోమా 8: 15-17).

III. 6. దేవుని వాక్యము సజీవమై బలముగలదై రెండంచులుగల యెటువంటి ఖడ్గము కంటెను వాడిగా నుండి ప్రాణాత్మలను కీళ్ళను మూలుగను విభజించునంత మట్టుకు దూరుచు, హృదయముయొక్క తలంపులను ఆలోచనలను శోధించుచున్నది (హెబ్రీ 4: 12).

7. సువార్తను గూర్చి నేను సిగ్గుపడువాడను కాను. ఏమనగా నమ్ము ప్రతి వానికి, మొదట యూదునికి హెల్లేనీయునికికూడ రక్షణ కలుగచేయుటకు అది దేవుని శక్తియై యున్నది (రోమా 1: 16).

8. మేము ఆయనతోటి పనివారమై మీరు పొందిన దేవుని కృపను వ్యర్థము చేసికొనవద్దని మిమ్మును వేడుకొనుచున్నాము (2 కొరి. 6: 1).

## వివరము.

1. పరిశుద్ధాత్మను గూర్చిన బోధ:— పరిశుద్ధాత్మ పరిశుద్ధ త్రిత్వములోని మూడవమూర్తియైయున్నాడు. ఆయన తండ్రి కుమారుల యొద్దనుండి బయలుదేరువాడై (1), నిసీయ విశ్వాస ప్రమాణములో వివరింపబడినట్లు తండ్రి కుమారులతో కూడ ఆరాధింపబడి మహిమ పఱచబడును. తండ్రివలెను, కుమారునివలెను పరిశుద్ధాత్మ కూడ నిజమైన దేవుడై మహిమ ప్రభావములయందు వారికి సమానుడై యున్నాడు. దీనికి నిర్ధారణ లేవియనగా: "క్రీస్తు సమస్త రాష్ట్రముల వారికి బాప్తిస్మ మియ్యనై తన శిష్యులను పంపుచు "మీరు తండ్రియొక్కయు కుమారునియొక్కయు, పరిశుద్ధాత్మ యొక్కయు నామమున బాప్తిస్మమియ్యుడి" అని వారికి నాజ్ఞాపించెను (మత్త. 28:19). మఱియు క్రొత్తనిబంధన యా

ర్వచనమును అనగా "ప్రభువైన యేసుక్రీస్తు కృపయు దేవుని ప్రేమయు పరిశుద్ధాత్మ సహవాసమును మీ కందఱికిని తోడై యుండును. గాక (2. కొరి. 13:14) యనుమాటలను చూడగా పరిశుద్ధాత్మ తండ్రికిని, కుమారునికిని సముడై యున్నాడు. అదియు గాక బైబిలులో పరిశుద్ధాత్మ 'యెహోవా ఆత్మ' అనియు (2. సమూ. 23. 2.) 'ప్రభువుయొక్క ఆత్మ' యనియు (2. కొరి. 3: 17), 'దేవుడు' అనియు (కార్య. 5: 3, 4), అనబడును. ఆయన నిత్యుడును (హెబ్రీ 9: 14), సర్వశక్తిమంతుడును (రోమా 15: 19)· సర్వజ్ఞానియు (1. కొరి. 2: 10, 12), సర్వవ్యాపియునై (కీర్తన. 139: 7) దైవలక్షణములు గలవాడై యున్నాడు. ప్రపంచమును సృష్టించుట యందును (ఆ. 1: 2.) దాని కాపాడుట యందును (యోబు 33: 4(. ఆయన తండ్రితో కూడ) పని చేయుచున్నాడు. పూర్వ ప్రవక్తలును బోధకులును ఆయన యావేశమువల్లనే ప్రవచించి. బోధించి (2), ఆయన యావేశము ద్వారా బైబిలును కూడ వ్రాసిరి (2 తిమొ. 3: 16)· ఆయన క్రీస్తు చేసిన ప్రాయశ్చిత్తమును సఫల పఱచుచు, మనుష్యులను పవిత్రపఱచు చున్నాడు. ఈ పని పరిశుద్ధాత్మవలన గాక మఱియెవనివలనను కలుగుట లేదు. పై చెప్పబడిన వన్నియు పరిశుద్ధాత్మయైన దేవుని కార్యములై యున్నవి.

పరిశుద్ధాత్మ ప్రత్యేకమూర్తియై యున్నాడు.—పరిశుద్ధాత్మ దేవుడు కనబరచు ఒక శక్తి మాత్రమై యున్నాడని యనుకొనరాదు. ఆయన పరిశుద్ధ త్రిత్వములో తనంతట తాను తెలివి గలిగినట్టియు, స్వేచ్ఛ గలిగినట్టియు ప్రత్యేక మూర్తి (Person) యై యున్నాడు. ఆయన దేవుని యాత్మ యనియు, క్రీస్తు ఆత్మ యనియు అనబడును. ఇట్టి వాడైన ఈ ఆత్మ విశ్వాసులలో నివసింపవలెనని చెప్పబడియున్నది. (రోమా 8: 9) అయితే విశ్వాసులలో నివసింపవలసిన యాత్మ విశ్వాసుల సుగుణమని కాదుగాని, ప్రత్యేక దేవుని యాత్మ అను మూర్తి (Person) ని సూచించును. పెంతెకోస్తు దినమున పరిశుద్ధాత్మ కుమ్మరింపబడెను. (కార్య. 2), అనగా అపోస్తలులు క్రొత్త బుద్ధి ధైర్యము ఆసక్తి మొదలగు సుగుణములతో నింపబడిరని మాత్రముగాక (పరిశుద్ధాత్మ) దేవుడు వారి హృదయములలో ప్రవేశించెనని తెలిసికొనవలెను. తెలివియు, స్వేచ్ఛయు గలవారు తప్ప మఱి యితరులు చేయజాలని మంచి కార్యములను పరిశుద్ధాత్మ చేయును. ఈ విధముగా ఆయన నరులతో వాదించును. (ఆది. 6: 2.). లోకమును ఒప్పుకొనచేయును. (యోహా. 16: 8), క్రీస్తు గూర్చి సాక్ష్యము నిచ్చును (ప్ర. వా) బోధించును. (1), నడిపించును (యోహా. 16: 13), భక్తులను ఆదరించును (కార్య. 9: 31) మన దౌర్బల్యమును చూచి సహాయము

చేయును. (రోమా 8: 26). పరిశుద్ధపఱచును (రోమా. 15: 15) తండ్రికుమారుల వలె ఆయనయు స్వేచ్ఛాపరుడై ఇట్టి కార్యములను చేయును.

II. పరిశుద్ధాత్మయొక్క కార్యములు.—మనకు రక్షణ కలుగునట్లు క్రీస్తు మనకొఱకు చేసిన కార్యము లెంత యవసరములైనవో, పరిశుద్ధాత్మ మన హృదయము లలో చేయు కార్యములు అంత అవసరములైనవి. క్రీస్తు అందఱికొఱకు చనిపోయి రక్షణ పొంద గోరువారందరు రక్షణ పొందుటకుగాను తాను నెరవేర్చవలసినది యంతయు నెరవేర్చెను. ఆయన సిలువమీద చనిపోవుచుండగా "సమాప్తమైనది" (యోహా. 18, 30). అని చెప్పి ఆ రక్షణ కార్యములన్నిటిని పూర్తిచేసెను. ఆయన పూర్ణముగా నీతిమంతుడై మనుష్యుల పాపముల కొరకు భరింపవలసిన శిక్షను నిండుగా భరింపగా న్యాయస్థుడైన దేవుడు ఇకను తన న్యాయమునను బట్టి పాపులను శిక్షింపక వారిని ఉచితముగా క్షమించుటకు వీలయ్యెను. అయితే అది యిట్లుండగా మనుష్యులు రక్షణను పొందుటకు కోరిక గలవారగునట్లును, శక్తిమంతులగునట్లును, వారు మార్చబడుట యవసరము (3). ఇట్టి మార్పుకు నిజ విశ్వాసమే మూలము? మనుష్యుల పక్షముగా క్రీస్తు ఎంత దివ్య కార్యములు చేసినను వారికి ఆయనయందు విశ్వాసము లేక పోయినయెడల వారు నశించిపోదురు (మార్కు 16: 16:) కావున ఇట్టి విశ్వాసము వారిలో పుట్టుట అత్యవసరముగ నున్నది. ఇట్టి విశ్వాసము మనుష్యు లలో పుట్టించుటయే పరిశుద్ధాత్మయొక్క పనియై యున్నది. ఇదిచిన్న మార్పు కాక, మన మనస్సును పూర్ణముగా మార్పుకార్యమై యున్నది. ఈ గొప్ప మార్పు బైబిలులో నూతన జన్మమనబడును. (4), (తీతు. 3: 5).

ఈ నూతన జన్మము మనకు అవసరమై యున్నది.—మనము స్వాభావికముగా ఆత్మ విషయములలో చచ్చినవారము కావున ఈ నూతన జన్మము మనకు మిగుల అవసరమై యున్నది. దేవునివలన మనకు గలుగు ఆత్మీయ జీవము పాపమువలన చెడగొట్టబడెను. (ఎఫెసీ 4: 18), మన అపరాధముల చేతను, పాపములచేతను చచ్చినవారమైతిమి (ఎఫెసీ 2:1) కావున ఆత్మీయబోధలను వివేచించుటకును (1. కొరి. 2: 14), మన దౌర్భాగ్యస్థితిని తెలిసికొనుటకును, మన పాపములను బట్టి పశ్చాత్తాపబడుటకును. మనరక్షకుడైన క్రీస్తునందు భక్తి నుంచుటకును మనకు సొంత శక్తిలేదు. కావున మనము నూతన జన్మము పొందవలెను: శరీర రీతిగ కాదుగాని ఆత్మ రీతిగ మనము నూతన జన్మము పొందవలెను. లేని యెడల దేవుని రాజ్యములో ప్రవేశింపలేము (యోహా. 3: 1–6). క్రీస్తుయేసునందలి విమోచనమును (రోమా 3: 24), విశ్వాసము ద్వారా మన సొంతదానినిగా చేయుటకు మనలో ఒక

నూతనమైన ఆత్మీయ జీవము మొదట కలుగవలయును. ఆ జీవమును దేవుడు కాక మరి యెవడును పుట్టింపజాలడు. దేవునికి అనుకూలమైన వాటిని మనము కోరి చేయునట్లుగా మనలో పనిచేయువాడు దేవుడే (ఫిలిప్పీ 2:13). "పరిశుద్ధాత్మవలన గాని యెవడును యేసు ప్రభువని చెప్పలేడు" (1. కొరి 12: 3). నూతన జన్మము వలన కలిగిన మార్పుపొందినవారు 'దేవుని మూలముగా పుట్టినవారు' అని 1. యోహా 5: 4 లోను, 'ఆత్మమూలముగా జన్మించినవారు' అని యోహా 3: 8 లోను చెప్పబడియున్నది. కావున ఈ గొప్ప మార్పు పరిశుద్ధాత్మయైన దేవుని వలన కలుగుచున్నదని రూఢిగా తెలిసికొనగలము. కనుక మన మిదివఱకున్నట్లు స్వాభావికముగా దైవోగ్రతకు లోనైనవారము కాక (ఎఫెసీ 2: 3). పరిశుద్ధాత్మవలన నూతన జన్మము నొంది దేవునిబిడ్డలమై, నిత్యజీవమునకు వారసుల మగుదుము (5).

III. తన కార్యములను నెఱవేర్చుటకై పరిశుద్ధాత్మ ఉపయోగించు సాధనములు.—మనుష్యులు తమ తమ పనులను చేయుటకై సాధనముల నుపయోగించుచున్నట్లు దేవుడు కూడ తనకార్యములను నెఱవేర్చుటకై సాధనముల నుపయోగించుచున్నాడని ప్రపంచములోని సంగతులను విచారింపగా తెలిసికొనగలము. దృష్టాంతముగా భూమికి వేడిమి నిచ్చుటకై సూర్యుని, భూమిని తడుపుటకై మేఘములను ఆయన సాధనములుగ నుపయోగించుచున్నాడు. అట్లుండగా ఆత్మీయ కార్యములను నెఱవేర్చుటకై (పరిశుద్ధాత్మయైన) దేవుడు సాధనముల నుపయోగించుట జూచి మన మాశ్చర్యపడవలసిన పనిలేదు. దేవుని వాక్యము, బాప్తిస్మము, ప్రభురాత్రి భోజనమునను దేవునిసంస్కారములు పరిశుద్ధాత్మ ఉపయోగించు సాధనములై యున్నవి. వాటి ద్వారా పరిశుద్ధాత్మ మన హృదయములను తండ్రియైన దేవుని కృపచే రేపి బలపఱచును కావున అవి కృపాసాధనము లనబడును. మనము మన పాపములను తెలిసికొని, పశ్చాత్తాపపడి, విశ్వసించి, మన జీవిత కాలాంతమువఱకు ఆ విశ్వాసము నందు నిలుకడగా నుండులాగున పరిశుద్ధాత్మ వీటి ద్వారా మనలో పనిచేయును.

దేవునివాక్యము.—పరిశుద్ధాత్మ దేవుని వాక్యముద్వారా మనుష్యులహృదయములను రేపును. బాప్తిస్మము, ప్రభురాత్రి భోజనము అను సంస్కారములను చూడగా వానిలోకూడ దేవునివాక్యమును, దానితోగూడిన ఆజ్ఞయు, దీవెనయు ముఖ్యములైనవై వాటిని (సంస్కారములను) సఫలపఱచును. పరిశుద్ధాత్మావేశమువలన కలిగిన ధర్మశాస్త్రము, సువార్త (2. తిమో 3:16) అను వాక్యము ద్వారానే పరిశుద్ధాత్మ తన కార్యములను విశేషముగా చేయును. ఆ వాక్యములో ఆయన యెల్లప్పుడు నుండి, మనుష్యులు చేయవలసిన వాటిని వారికి తెలుపుటమాత్రము గాక వాటినిచేయుటకు గావలయుశక్తి సహాయములను ఆ వాక్యము ద్వారానే కలిగించును (6, 7).

మఱియు వాక్యములో నెల్లప్పుడు నుండు పరిశుద్ధాత్మ, ఆ వాక్యము ద్వారా తాను చేయబూనిన పనిని ఎదిరింపనిహారినందఱిని మాఱుల జన్మింపజేసి, మాఱుమనస్సు నొందించి, నూతనపఱచి, పరిశుద్ధపఱచును.

బాప్తిస్మము.—పిల్లలుకూడ స్వాభావికముగా పాపాత్ములైయున్నారు (కీర్త న. 51: 5, యోబు 14: 4). కావున వారుకూడ ఈనూతన జన్మమును పొందవలెను. దేవునివాక్యమును గ్రహించుకొనుటకు వారికింక శక్తి లేకుండగా పరిశుద్ధాత్మ బాప్తిస్మముద్వారా వారిలో నీ క్రొత్తజీవము ఆరంభింపజేయును. బాప్తిస్మము నూతన జన్మ సంబంధమైన స్నానమును, పరిశుద్ధాత్మ మనకు నూతన స్వభావమును కలుగ జేయుట యునైయున్నది (తీతు 3:5.) పిల్లలు ఎదుగుచుండగా ఈ నూతన జీవము దేవుని వాక్యముచేత పోషింపబడుచు వారిలో నభివృద్ధి నొందును.

తన కార్యములను నెఱవేర్చుటకై పరిశుద్ధాత్మ మనుష్యులను కూడ సాధనములుగ నుపయోగించును.—ఇందునిమిత్తమై ఆయన క్రైస్తవ సంఘమును స్థాపించి దేవునివాక్యమును ప్రకటించుటకును, సంస్కారములను ఆచరించుటకును దానికి పనిని అప్పగించెను. ఈ విధముగ క్రైస్తవులు దేవునితోటి పనివారగుదురు (1. కొరి 3:9). ఇంతగొప్ప అధికృతయున్నందున దేవుని కృపను వ్యర్థము చేసికొన వద్దని భక్తులు మనుష్యులను వేడుకొనుచున్నారు (8) మఱియు దేవుని విషయమైన భయము నెఱిగి, ఆయన పాపమును తప్పకశిక్షించునని తెలిసికొని మనుష్యులు క్రీస్తును నమ్మి రక్షణపొందవలెనని వారిని వేడుచున్నారు (2 కొరి. 5:11.)

---

## 15. పరిశుద్ధాత్మ మనలో మాఱుమనస్సును పుట్టించునను దాని గూర్చిన బోధ.

మీరు విశ్వసించినవారై కృపచేత రక్షింపబడి యున్నారు; ఇది మీ వలన కలిగినది కాదు దేవుని వరమే. ఎఫెసీ 2: 8.

భాగములు.

I. మాఱుమనస్సు అనగా నేమి ?

II. పరిశుద్ధాత్మ మనలో మాఱుమనస్సు పుట్టించు విధము.

1. మనలను పిలుచుటవలన.
2. మనకు వెలుగిచ్చుటవలన.
3. మనము సువార్త పిలుపునకు లోబడుటకై శక్తి నిచ్చుటవలన.
4. మనలో పశ్చాత్తాపము కలుగ జేయుటవలన.
5. మనలో విశ్వాసము పుట్టించుటవలన.

## III మారుమనస్సును గూర్చిన మఱి కొన్ని విషయములు,

1. మనము మారుమనస్సును పొందవలసిన దెప్పుడు ?

2. పరిశుద్ధాత్మ పనిని నిరర్థకపఱచుటకై మనకు శక్తికలదు.

అంత్యదశలో నుండువారు మారుమనస్సు నొందగలరా ?

## అనుదిన వేద పాఠములు.

| | |
|---|---|
| మారుమనస్సు నొందుట యవసరము. | కార్య 2: 37 - 17. |
| పరిశుద్ధాత్మ మనలను పిలుచుటనుగూర్చి | 2 కొరి 5: 11-6:2. |
| పరిశుద్ధాత్మ మనకు జ్ఞానదీప్తిగా నుండును. యోహా | 15: 26 - 16: 11. |
| పరిశుద్ధాత్మ మనకు జ్ఞానదీప్తిగా లోబడు శక్తినిచ్చును. | ఎఫెసీ 2: - 10. |
| పరిశుద్ధాత్మ మనకు మనలో పశ్చాత్తాపము కల్గించును. | లూకా 15:11-32. |
| పరిశుద్ధాత్మ మనకు మనలో విశ్వాసము పుట్టించును, | రోమా 10: 1 - 7. |
| పౌలు మారుమనస్సు పొందిన విధము. | కార్య 9: 1 - 22. |

## వేదవాక్యములు.

I 1. యెహోవా సముఖమునుండి విశ్రాంతి కాలములు వచ్చునట్లును, మీ కొఱకు నియమించిన క్రీస్తుయేసును ఆయన పంపునట్లును మీ పాపములు తుడిచి వేయబడు నిమిత్తము మారుమనస్సు నొంది తిరుగుడి (కార్య. 3: 19-20).

2. దైవ చిత్తానుసారమైన దుఃఖము పశ్చాత్తాపమునకు అవసరము లేని రక్షణార్థమైన మారుమనస్సును కలుగజేయును గాని, లోకసంబంధమైన దుఃఖము మరణమును కలుగజేయును (2 కొరి. 7: 10).

II. 3. దేవుడు మాద్వారా వేడుకొనినట్లు మేము క్రీస్తు రాయబారులమై దేవునితో సమాధాన పడుడని క్రీస్తు పక్షముగా మిమ్మును బతిమాలుకొనుచున్నాము. ఎందుకనగా మన మాయనయందు దేవుని నీతి యగునట్లు పాప మెఱుగని ఆయనను మనకోసము పాపముగా జేసెను (2. కొరి 5: 20-21).

4. ఆయన వచ్చి పాపమునుగూర్చియు, నీతినిగూర్చియు, తీర్పునుగూర్చియు లోక మొప్పుకొన చేయును (యోహా. 16: 8).

5. తండ్రియొద్దనుండి మీ యొద్దకు నేను పంపబోవు ఆదరణ కర్త అనగా తండ్రియొద్దనుండి బయలుదేరు సత్యస్వరూపియైన ఆత్మవచ్చినప్పుడాయన నన్నుగూర్చి సాక్ష్యమిచ్చును (యోహా. 15: 26).

6. దేవుడు కరుణా సంపన్నుడైయుండి మనము అపరాధములచేత చచ్చిన వారమై యుండినప్పుడు సహా, మన యెడల చూపిన తన మహా ప్రేమచేత మనలను క్రీస్తుతో కూడ బ్రతికించెను. కృపచేతనే మీరు రక్షింపబడియున్నారు. ఎఫెసీ 2: 4, 5).

7. నేను లేచి నాతండ్రియొద్దకు వెళ్ళి—తండ్రీ నేను పరలోకమునకు విరోధముగాను, నీ యెదుటను పాపము చేసితిని; ఇక మీదట నీ కుమారుడనని పించుకొనుటకు యోగ్యుడనుకాను; నన్ను నీకూలివాండ్లలో నొకనిగా పెట్టుకొనుమని అతనితో చెప్పెద ననుకొని లేచి తండ్రియొద్దకు వచ్చెను (లూకా 15: 18, 19).

III. 8 ఇదిగో నేను తలుపుయొద్ద నిలుచుండి తట్టుచున్నాను. ఎవడైనను నా స్వరము విని తలుపు తీసిన యెడల నే నతని యొద్దకు వచ్చియతనితో నేనును నాతోకూడ నతడును భోజనము చేయుదము (ప్రకటన 3: 20).

## వివరము.

విశ్వాసులు కాని వారందఱును యేసుక్రీస్తునందు భక్తినుంచి మారుమనస్సు నొందుట అవసరమై యున్నది. అట్టిమాఱుమనస్సును పొందవలసిన వారెవరనగా—చిన్నతనములో నూతనజన్మమును కలిగించు బాప్తిస్మము నొందనివారందరును; బాప్తిస్మము నొందినను దాని మూలముగా తాము పొందిన కుమార స్థితిని తమ దుర్మార్గతవలన గాని, అవిశ్వాసమువలనగాని పోగొట్టుకొనిన వారందరునై యున్నారు.

1 మాఱుమనస్సు అనగా నేమి? మనము సాతాను బిడ్డలము కాక దేవుని బిడ్డల మగునట్లు పరిశుద్ధాత్మ మనలో నూతనమైన ఆత్మీయ జీవమును పుట్టించును. కావున ఆయన మనలో జరిగించు ఆ కార్యమునకు పేరు పెట్టిన యెడల, దానిని మారుమనస్సు అని పిలువవలెను (1) ఏలననగా పాపమును, స్వంత దురేచ్ఛలను తృప్తిపఱచుకొనగోరు మన చెడ్డ బుద్ధి ఆ కార్యమువలన మాఱిపోయి దేవుని ప్రేమించు మంచి బుద్ధి మనలో బుట్టును. మాఱుమనస్సు అను నీ కార్యములో పాపము విషయమైన దుఃఖము దేవుని మాత్రము ఆశ్రయించుకొను విశ్వాసము అను రెండు విషయములు గలవు. మనము నిజముగా పశ్చాత్తాపపడిన యెడల, మన పాపములను పరిహరించుటకు శక్తిగల క్రీస్తును ఆశ్రయించు కొనుటకై మనకు ఆ పశ్చాత్తాపమువలన హెచ్చరిక కలుగును. కాబట్టి మన విశ్వాసమునకు పశ్చాత్తాపమును మార్గదర్శినిగ నెంచదగును (2) పాపము విషయమై దుఃఖము ద్వారా

మనము రక్షకుని నాశ్రయింపక పోయిన యెడల మనలో నిరాశ కలుగునే కాని విశ్వాసము కలుగనేరదు. క్రీస్తును ఎఱుగనని బొంకిన పేతురు సరిగా పశ్చాత్తాపపడి క్రీస్తును విశ్వసించెను (లూకా 22: 62) ఆయనను అప్పగించిన యూదాకూడా విచారపడెను గాని అతడు క్రీస్తు తట్టు తిరుగక పోయినందున నిరాశపడి ఉరిపెట్టుకొని చచ్చెను (మత్త 27: 3-5)

## II పరిశుద్ధాత్మ మనలో మారుమనస్సు పుట్టించువిధము.

1. ఆయన మనలను సువార్తవలన పిలుచును.—— మనము మన పాపములను విడిచిపెట్టి క్రీస్తును విశ్వసింపవలెనని పరిశుద్ధాత్మ సువార్త ద్వారానే మనలను పిలిచి రేపును (3) అందువలననే దేవుని వాక్యము పరిశుద్ధాత్మ ప్రేరేపణ ద్వారా వ్రాయబడి (యోహా. 20: 21) ప్రకటింపబడుచు నున్నది (1. కొరి 1: 21) క్రీస్తు యేసునందుండు దేవుని ప్రేమను పరిశుద్ధాత్మ మనకు తెలిపి, ఆయన ప్రేమవలన గలిగిన రక్షణలో పాలి భాగరులు కావలెనని మనను రేపును. ఆ రక్షణకు సంబంధించిన వన్నియు సిద్ధబఱచబడినవి (మత్త 22: 4) గనుకను, అందఱిని రక్షింపవలెనని దేవుడు కోరుచున్నాడు. (1. తిమొథి 2: 4) గనుకను, క్రయధన మేమియు నివ్వకయే అందఱును క్రీస్తును నమ్మి రక్షణ నొందవలెనని పరిశుద్ధాత్మ మనందఱిని పిలుచుచున్నాడు.

2. ఆయన మనకు నూతన జ్ఞానము అను దీప్తినిచ్చి మనలను వెలిగించును.——మనము అంధకార యుక్తమైన మనస్సుగలవారమై మనలోనుండు అజ్ఞానముచేత దేవునివలన గలుగు జీవమునుండి వేఱుపరచ బడినవారమై (ఎఫె. 4: 18) స్వయముగా మన దౌర్భాగ్య పాపపు స్థితిని గుర్తెఱుగక, దేవుడు తన దయవలన మనలను రక్షింపక పోయినయెడల తప్పక నశించిపోదుమని కూడ తెలిసికొన లేక యున్నాము. అయితే యీ పైసంగతులను పరిశుద్ధాత్మ ధర్మశాస్త్రము ద్వారాను (4), సువార్త ద్వారాను (5), మనకు తెలిపి మన పాపపు స్థితిని, అట్టిస్థితిలోనుండి మనలను రక్షింపవలెనని కోరుచున్న దేవుని ప్రేమను గుర్తెరుగునట్లు మన మనస్సులకు వెలు గిచ్చును.

ధర్మశాస్త్రము ద్వారా పరిశుద్ధాత్మ మనము చేయవలసిన వాటినిచేయ గూడని వాటిని మనకు తెలియ చేయును. అదియు గాక చేయవలసిన వాటిని చేయక పోవుటవలనను చేయగూడని వాటిని చేయుటవలనను మనము దోషులమై (రోమా 2: 3) దేవుని శిక్షకు పాత్రులమైతిమనియు, రక్షించువాడు లేక పోయిన యెడల తప్పక నశింతుమనియు (లూకా 13: 3, 5) మనకు తెలియచేయును.

సువార్త ద్వారా పరిశుద్ధాత్మ (దేవుడు) మనకు తన యమిత ప్రేమను వెల్లడి పఱచును (రోమా 5: 6-8) ఎట్లనగా దేవుని కుమారుడు మనుష్యుడై ఈ లోకములో నవతరించి, మనకొఱకు శ్రమపడి చనిపోయెననియు, మనము గుణపడి మన పాపముల విషయము పశ్చాత్తాపపడి క్రీస్తే మన రక్షకుడని ఆయనయందు భక్తి నుంచిన యెడల దేవుడు మన పాపములను క్షమింప గోరుచున్నాడనియు (2. పేతురు 3: 9) తెలియ జేయును.

3. మనము సువార్తపిలుపునకు లోబడుటకు పరిశుద్ధాత్మ మనకు శక్తినిచ్చును. మనము పాపములచేతను అపరాధములచేతను చచ్చినవారమై యున్నందున సువార్త బోధలకు లోబడుటకు శక్తిహీనులము కాగా పరిశుద్ధాత్మ వాక్యములోనుండి ఆ వాక్యము ద్వారా మనము విశ్వసింపవలెనని మనకు బోధించుట మాత్రము గాక అలాగు చేయుటకు కావలయుశక్తినికూడ నిచ్చును. (ఎఫెసీ 2:4-5) నాయీను విధవ కుమారుడు చనిపోయినపుడు (లూకా 7: 14) క్రీస్తు అతని శవముతో మాట్లాడగా అది జీవముగలదయ్యెను ఎందుకనగా క్రీస్తు మాట జీవముగల దేవునిమాటయై యున్నది. అటువలెనే పాపములవలన చచ్చినవారమై మనము స్వయముగా పశ్చాత్తాపపడి క్రీస్తును విశ్వసింపలేముగాని, వాక్యము దేవుని వాక్యమగుటచే పశ్చాత్తాపపడి విశ్వసించుటకై అది మనలను బలపఱచును.

4. మనము పరిశుద్ధాత్మ పనిని నిరర్థకము చేయక పోయిన యెడల ఆయన మనలో పశ్చాత్తాపమును పుట్టించును.—మన నడతకును దేవుని వాక్యమునకును గల వ్యత్యాసమును పరిశుద్ధాత్మ మనకు చూపి దేవుని దృష్టికి మనమెంత ఘోరపాపులమో (కీర్తన. 51: 3, 4) మనకు తెలుపగా మనము మన పాపముల విషయము వాస్తవముగా విచారపడి (లూకా 22: 62) వాటిని మానివేయం చుకొని (కీర్తన. 51:10) క్షమాపణ పొందగోరు మనస్సుగలవార మగుదుము (కీర్తన.51: 3, 9, లూకా 18: 13; 15: 18)

5. పరిశుద్ధాత్మ మనలో విశ్వాసము పుట్టించును. రక్షణను పొందుటకైన యాశను పరిశుదాత్మ మన హృదయములో పుట్టించిన తరువాత, మన పాపము లన్నిటిని పూర్ణముగా పరిహరించుట శక్తిగల రక్షకుడయిన క్రీస్తును మనకు చూపును (1. యోహాను 2: 2) మనలను రక్షించుటకై క్రీస్తు చేసిన క్రియలను పొందిన శ్రమలను మనకు తెలిపి, దేవుడు ఆయననిమిత్తం మనలను రక్షింప నిశ్చయించుచున్నాడని మనకు తేటపఱచును. ఈ విధముగా మనము క్రీస్తునందు

విశ్వాసముంచుటయును, దేవుడు మన పాపములను రూఢిగా క్షమించెనని నమ్ముటయును పరిశుద్ధాత్మ మనలను ఒప్పింపచేయును.

## III మారుమనస్సునుగూర్చిన మరికొన్ని విషయములు.

1. మనము మారుమనస్సును పొందవలసిన దెప్పుడు? ఫలాని దినమున ఫలాని గడియలో నేను మారుమనస్సు పొందితినని కొందరనగలిగినను అనేకులు ఆ కాలమును గూర్చి తెలియక యుందురు. చిన్నతనమునందు బాప్తిస్మము నొంది దేవుని బోధలో పెంచబడుచు విశ్వసించుచున్నారు. మొదటినుండి దేవుని బిడ్డలై మారుమనస్సునొంది పశ్చాత్తాపపడి విశ్వసించువారై యుందురు. కావున అట్టివారికి ఇక మారుమనస్సు అక్కఱలేదు (2 తిమొ 3:15)

అపొస్తలులలో పౌలు తప్ప మరి యెవడును తాను మారుమనస్సు నొందిన సరియైన కాలమున చెప్పలేక పోయెను (కార్య 19:1-20). అపోస్తలుల విశ్వాసము క్రమక్రమముగా వృద్ధియైనట్లు కనబడును. పెంతెకోస్తు దినమునకు పూర్వము కూడ వారు క్రీస్తును నమ్మియుండిరి (మత్త. 16:16) గాని, ఆదినమున పరిశుద్ధాత్మ కుమ్మరింపబడినప్పుడే వారి విశ్వాసము జయకరమైన దాయెను (కార్య. 2). అటువలెనే ఇప్పుడు కూడ చాలమంది క్రమక్రమేణ మారుమనస్సు నొందెదరు. మనము మారుమనస్సు పొందిన కాలమును గూర్చి తెలిసికొనుటకై చింతింపవలసిన పనిలేదుగాని దానిని పొందియున్నామా? లేదా? మనము పశ్చాత్తాపపడి విశ్వసించువారమా? కామా? అను దానిగూర్చి చింతింపవలయును.

2. పరిశుద్ధాత్మ పనిని నిరర్థకపఱచుటకై మనకు శక్తి కలదు. పరిశుద్ధాత్మ సువార్తకు లోబడుటకై మనకు శక్తినిచ్చునుగాని మన మాయన పనిని నిరర్థకపఱచగలము. చాల మంది సువార్తకు లోబడ నొల్లక (2. థెస్స. 1:8.) తమ హృదయములను కఠినపఱచుకొని (రోమా 2:5.), దేవుని యాత్మను దుఃఖపఱచెదరు (ఎఫె. 4:30). అయినను ఆయనత్వరగా కోపపడక మిక్కిలి యోర్పుతో మనల నిరంక రేపుచున్నను మనము లోబడక మాటిమాటికి ఆయనను తిరస్కరించినయెడల చివఱ కాయన మనలను రేపుట మానును (కార్య. 19:9). అనుకూల సమయము కాఱకనిపెట్టిన (కార్య. 24:25) ఫేలిక్సువలె మనము ఆయనను తిరస్కరింప కూడదు. అట్టి సమయ మెన్నటికిని రాదు. పాపమును విడిచి నీతి ననుసరించుట మన దుష్టబుద్ధికి ఎప్పుడైనను అనుకూలముగనుండదు. ఎప్పుడు సువార్తపిలుపు వినబడునో తత్క్షణమందే దానికి లోబడవలయును (హెబ్రీ 3:7,8). అలాగు చేయని యెడల కన్నీళ్లతో శ్రద్ధగా వెదకినను దేవుని యాశీర్వాదము దొరకని సమయము తటస్థింప

వచ్చును (హెబ్రీ 12:17). నేడే మంచి అనుకూల సమయము. ఇదే రక్షణదినము (2. కొరి. 6:2). రేపేమి సంభవించునో మనము తెలియదు (యాకో. 4:14). కావున సమయము తటస్థించినపుడే త్వరపడి విశ్వసింతము.

3. అంత్యదశలో నుండువారు మారుమనస్సు నొందగలరా? అంత్యదశలో నున్నవారు నిజముగా పశ్చాత్తాపపడి విశ్వసించిన యెడల రక్షణ పొందగల రనుటకు సిలువమీద దొంగ దృష్టాంతముగ నున్నాడు. అయితే అంత్యదశలో మారుమనస్సు పొందవచ్చును కావున అప్పటివఱకు దాని నాపి యుంచుదమని యెంతమాత్రము అనుకొనరాదు. అంత్యకాలమున మారుమనస్సు నొందుటకు తీరికయుండునని యెవరనగలరు? చాలమంది అకస్మాత్తుగా కాలము చేతురుగదా? మఱియు మారుమనస్సు మనశక్తిచేగాక పరిశుద్ధాత్మశక్తివలన కలుగును. గనుక తనజీవితకాల మంతటిలో పరిశుద్ధాత్మ ప్రేరేపణల నెదిరించుచున్న నట్టివారు మారుమనస్సు పొందుటకు కావలసినశక్తికి ఆయన యిచ్చునని ఎవరనగలరు? బైబిలులో అనేకులైన దుర్మార్గులను గూర్చి చెప్పబడియున్నదిగాని వారిలో అంత్య దశయందు పశ్చాత్తాపపడి రక్షణ నొందిన వాడొక్కడే. అంత్యదశలో తమ పాపములలోనే చనిపోయిన వారెందరో తలంచుకొనుడి. నిజముగా పశ్చాత్తాపపడి విశ్వసించువారిలో నెవరును నిరాశపడకుండునట్లు ఆ దొంగనుగూర్చిన యుదాహరణము వ్రాయబడి యున్నది. అయితే మనము బుద్ధిపూర్వకముగాను మూర్ఖత్వమువలనను మారుమనస్సు నొందుట నాపివేయకుండవలెనని తెలిసికొనుటకై ఈఒక్క దృష్టాంతము మాత్రమే బైబిలులో వ్రాయబడియున్నది.

---

## 16. విశ్వాసమును గూర్చిన బోధ.

నమ్మి బాప్తిస్మము పొందినవాడు రక్షింపబడును. నమ్మనివానికి శిక్ష విధింపబడును. మార్కు 16:16.

### భాగములు.

I. లోక వ్యవహారములలో కూడ విశ్వాసము అవసరమై యున్నది.

## II. దేవునియం దుంచవలసిన విశ్వాసము.

1. సువార్తవిషయములు తెలిసికొని నమ్ముటయైయున్నది.
2. దేవునిమీద ఆనుకొనుటయై యున్నది.
3. అది నిజముగా పశ్చాత్తాపపడినవారికి తప్ప మరి యెవరికి నుండదు.
4. దానిలో సంశయము లుండవు
5. అది మన మరణపర్యంతము అంతకంతకు వృద్ధి నొందును.

## III. విశ్వాసమును నిరర్థకపఱచ కుండునట్లు మనలో నుండవలసిన జాగరూకత.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| విశ్వాసమునకు తెలివి యవసరము. | రోమా 10: 1-18. |
| విశ్వాసమునకు తెలివి చాలదు. | యాకో. 2: 14-26. |
| విశ్వాసమనగా దేవుని మాటను నమ్మిట. | రోమా 4. |
| విశ్వాసము కనబడని వాటిని నమ్మును. | హెబ్రీ. 11. |
| చూడకయే నమ్మువారు ధన్యులు. | యోహా. 20: 19-31. |
| విశ్వాసి ధైర్యము. | 2. తిమొ. 4: 1 7. |
| విశ్వాసుల జయగీతము. | రోమా 8: 26 39. |

### వేదవాక్యములు.

1. ఆయన యందు విశ్వాసముంచువానికి తీర్పు చేయబడదు గాని విశ్వసింపని వాడు దేవుని అద్వితీయ కుమారుని నామమందు విశ్వాసముంచలేదు గనుక వాని కింతకు మునుపే తీర్పు చేయబడెను (యోహా. 3: 18.)

II. 2. తాము విశ్వసింపని వానికెట్లు ప్రార్థన చేయుదురు? వినినవాని నెట్లు విశ్వసించుదురు? ప్రకటించువాడు లేకుండ వారెట్లు విందురు? (రోమా 10: 14).

3. క్రీస్తు ప్రేమనుండి మనల నెడబాపు వాడెవడు? శ్రమయైనను బాధయైనను హింసయైనను కఱవైనను వస్త్రహీనత యైనను ఉపద్రవమైనను ఖడ్గమైనను మనల నెడబాపునా? ఇందుకు ప్రమాణముగా వ్రాయబడిన దేమనగా—మేము నీ నిమిత్తము దిన మెల్ల చంపబడుచున్నాము; వధకైన గొఱ్ఱెలుగా ఎంచబడుచున్నాము. అయినను మనలను ప్రేమించినవాని ద్వారా మనము వీటన్నిటిలో నత్యధిక విజయము పొందుచున్నాము. మరణమైనను జీవమైనను దేవదూతలైనను ప్రధానులైనను ఉన్నవి యైనను రాబోవునవి యైనను అధికారులైనను ఎత్తయినను లోతైనను సృష్టింపబడిన

మఱి యేదైనను మన ప్రభువైన యేసుక్రీస్తు ద్వారా కనపఱచబడియున్న దేవుని ప్రేమనుండి మనల నెడబాప నేరవని రూఢిగా నమ్ముచున్నాము (రోమా-8: 35-39).

III. 3. దేవునికి అయన కృపా వాక్యమునకును మిమ్ము నప్పగించుచున్నాను. అయన మీకు క్షేమాభివృద్ధి కలుగచేయుటకును పరిశుద్ధపఱచబడిన వారిలో స్వాస్థ్యమును గ్రహించుటకును శక్తిమంతుడు (కార్య. 20: 32)

5. నా కుమారుడవైన తిమోథెయూ నీవు విశ్వాసమును మంచిమనస్సాక్షియు కలిగినవాడవై నిన్నుగూర్చి ముందుగా చెప్పబడిన ప్రవచనముల చొప్పున ఈ మంచి యుద్ధము జరిగింపవలెనని వాటినిబట్టి యీ ఆజ్ఞను నీ కప్పగించుచున్నాను. అట్టి మన స్సాక్షిని కొందఱు త్రోసివేసి విశ్వాసవిషయమై ఓడబద్దలైపోయినవారివలె చెడియున్నారు (1. తిమొ 1: 18:19

## వి వ ర ము.

విశ్వాసము లేనిది యెవరికైనను మోక్షము దొరకదు. విశ్వసించువారు రక్షింపబడుదురని దేవుడు వాగ్దానము చేసెను. అయితే అట్టివాగ్దానము మఱి యెవరికిని చేయబడ లేదు. (1)

I. ఈ లోక వ్యవహారములలోకూడ విశ్వాసము అవసరమైయున్నది.—విశ్వాసము లేనిది యీలోక వ్యవహారములు జరుగ నేరవు. తల్లిని నమ్ముటచే బిడ్డ బ్రతుకును. వ్యాపారములుచేయువారు ఫలాని ఫలాని వ్యాపారములవలన లాభము దొరకునని నమ్మి క్రయ విక్రయములు చేయుదురు. మఱియు వారు తాము పరుల కెవరవస్తువులు కొందురో వారిని తామెవరికి వాటిని "అప్పిచ్చెదరో వారిని నమ్మకపోయినయెడల వ్యాపారము జరుగ నేరవు. మనమును అనేక విషయములయందు ఇతరులను నమ్మవలసియున్నాము. మనము చూడ లేనివాటినిగూర్చి తగిన సాక్షులను నమ్ముటవలనే తెలిసికొనగలముగాని మఱియేవిధముగానయినను తెలిసికొన లేము. మన జీవమునకు అవసరమైనవి దొరుకునని నమ్మి మన మనుదినమును బ్రతుకుచున్నాము రెలుబండిని చేయించినవారిని దాని నడిపించువారిని నమ్మి ప్రయాణస్థులు ఆ బండి నెక్కి ప్రయాణము చేయుదురు. మనతోటి మనుష్యులను నమ్మకపోయినయెడలమన లౌకిక వ్యవహారములు జరుగ నేరవు. కావున దేవుని నమ్మనివారు దేవునికంటె మనుష్యులే నమ్మతగిన వారనునట్లుగ నున్నది"

II. దేవుని యందుంచవలసిన విశ్వాస మెట్టిది?—విశ్వాసము లేకుండ ఒకడు దేవుని కిష్టుడై యుండుట అసాధ్యము (హెబ్రీ 11:6) గనుక, విశ్వాస మెట్టిదో జాగ్రత్తగ పరిశీలన చేయవలయును.

**I. విశ్వాస మున్నయెడల మనము సువార్త విషయములను తెలిసికొని నమ్మెదము.**—ఇట్టి తెలివి మాత్రముగాక, మఱి యితర విషయములును లేకపోయిన యెడల అది సరియైన విశ్వాసము కానేరకపోయినను ఇట్టి తెలివిలేనిది విశ్వాసముంచుట అసాధ్యము. క్రీస్తునుగూర్చియు, క్రీస్తు మనకొఱకు చేసినదానిగూర్చియు మనకు తెలియనియెడల మన మాయనను విశ్వసింపలేముగదా (2). ఇందువల్లనే సువార్తను మనుష్యులందఱికి ప్రకటింపవలెనని క్రీస్తు తన శిష్యులకాజ్ఞాపించెను (మార్కు 16: 15). ఇందువల్లనే క్రీస్తు మనకొఱకు చేసినది యావత్తును మనము సరిగా తెలిసికొనులాగున పరిశుద్ధాత్మ ప్రేరేపణచే వ్రాయబడిన బైబిలు మనకు నను గ్రహింపబడెను. ఇందునుబట్టియే క్రైస్తవులు క్రీస్తు ఆజ్ఞలకు లోబడి సువార్తను ప్రకటించుటకై స్వదేశీయులకును విదేశీయులకును బోధకులను పంపుచున్నారు.

**మనము క్రీస్తునుగూర్చిన సంగతులను తెలిసికొనుట మాత్రము గాక వాటిని నమ్మవలెను.**—ఒకడు చెప్పిన వాక్యము సత్యమని నమ్మకపోయిన యెడల అతనిని కూడ నమ్మలేము గదా. అటువలెనే బైబిలులో వ్రాయబడియున్న దేవుని వాక్యము సత్యము అని నమ్మకపోయిన యెడల దేవునిని కూడ నమ్మజాలము. దేవుని వాక్యము సత్యమని నమ్ముట మన విశ్వాసములో నొక ముఖ్య విషయమై యున్నది. ఈలాగు అబ్రాహాము దేవుడు తనకు చేసిన వాగ్దాన విషయమై సందేహించక వాగ్దానము చేసిన వాడు దాని నెఱవేర్చుటకు సమర్థుడని దేవుని మాటను నమ్మెను (రోమా 4: 20). విశ్వసించువాడు కనబడనివి యున్నవని రూఢిగా నమ్మును (హెబ్రీ 11: 1) ఇట్టివారినిగూర్చి మన ప్రభువు చూడకయే నమ్మినవారు ధన్యులు (యోహాను 20: 29) అని చెప్పెను. అయితే క్రీస్తునుగూర్చిన సంగతులను తెలిసికొనుట యెంత అవసరమైనదైనను, ఆలాగు తెలిసికొనుట మాత్రముచేతనే ఒకనికి నిజ విశ్వాసమున్నదని చెప్ప వీలుకాదు. ఎందుకనగా దురాత్మలకు దయ్యములకు సహా అట్టి తెలివి యుండవచ్చును (యాకో. 2:9). అయితే వారిలో విశ్వాస ముండనేరదు.

**2. క్రీస్తుమీద ఆనుకొనుటయే విశ్వాసములోని ముఖ్యవిషయము.**—విశ్వసించువాడు క్రీస్తు పుణ్యమును నమ్మి తన భారము యావత్తు ఆయనమీద నుంచును. దేవుని కుమారుడగు క్రీస్తు మనుష్యులందఱి పాపములకొఱకు చనిపోయెనని ప్రతివాడును నమ్మవలసినదే కాని యింతమట్టుకు మాత్రము నమ్ముట పూర్ణవిశ్వాసము కానేరదు. క్రీస్తు నా పాపములను పరిహరించుటకు చనిపోయె

ననియు, దేవుడు క్రీస్తు పేరట నా పాపము లన్నిటిని క్షమించు ననియు తెలిసికొనుటయే విశ్వాసము. క్రీస్తు మనకొఱకు చేసిన దానిని మనము విశ్వాసమువల్ల మన స్వంత దానినిగా చేసికొని యంగీకరింతుము. అందు వలన ఆయన ద్వారా మనకు రక్షణ రూఢియని తెలిసికొందుము (2 తిమొ 1: 12; ఎఫె 3: 12). క్రీస్తు రక్తము మన పాపములను కడిగి వేసెనని రూఢిగా తెలిసికొను టయే విశ్వాసము (1 యోహా. 1: 7). విశ్వాసి పౌలువలె దేవుని కుమారుడు నన్ను ప్రేమించి నా కొఱకు తన్నుతాను అప్పగించుకొనెనని (గల 2: 20). చెప్పును. దేవుడు మాట యిచ్చినట్లుగా క్రీస్తు నిమిత్తము మన పాపములను క్షమించి మనలను మోక్షమునకు వారసులనుగా చేసెనని విశ్వాసి తెలిసికొనును.

3. నిజముగా పశ్చాత్తాపపడిన వారికి తప్ప మఱి యెవరికి నిజ విశ్వాస ముండ నేరదు.—పశ్చాత్తాపపడువారి పాపములను క్షమించెదనని దేవుడు మాటయిచ్చెను. అయితే మఱియెవరి విషయములోను అటువంటి మాటయియ్య బడలేదు. కావున పశ్చాత్తాపపడనివారు తమ యాదరణకై నమ్ముకొనుటకు వారికి దైవ వాగ్దానము లేవియు లేవు గదా? ఇదియు గాక రక్షించువాడు లేకపోయిన యెడల నశింతునని తెలిసికొనని యొకడు క్రీస్తును తన రక్షకునిగా కోరి ఆయనను నమ్మలేడు. తాను పాపమువలన నశించి పోదునని నిజమైన పశ్చాత్తాపమువలన ముందుగా తెలిసికొనువాడు క్రీస్తు కరుణను నమ్ముటకు సిద్ధముగా నుండును.

4. నిజ విశ్వాసములో సంశయము లుండవు.—నిజ విశ్వాసమునకును, సంశయములకును సంబంధ మేమియు లేదు (యాకో 1:6, 7). మాట తప్పనివాడగు (సంఖ్యా 23: 19) దేవుని వాగ్దత్తములు విశ్వాసమునకు ఆధారమై యుండుటచే మనకు నిత్యజీవము రూఢిగా దొరకుననను నిశ్చయత కలుగును. మన రక్షణ మనము చేసిన క్రియలమీద ఆనియుండునది కాక క్రీస్తు చేసినదానిమీదను, క్రీస్తు నిమిత్తము మనకు నిత్యజీవము నిచ్చెనని చెప్పిన దేవుని స్పష్టమైన మాటమీదను (యోహా 3: 16) ఆని యుండును. క్రీస్తు చేసినది లోపరహితమైనదిగను, పూర్ణమైనదిగను ఉన్నది. దేవుడు మాట నిచ్చినయెడల దానిని తప్పక నెఱవేర్చును (2 తిమొ 2; 13). కావున దేవుడు తనను రూఢిగా రక్షించునని క్రైస్తవుడు రూఢిపఱచుకొన గలడు. ఆలాగు నిశ్చయపఱచుకొనుట అతని విధియై యున్నది.

విశ్వాసులకు సంశయము లెన్నడును కలుగ కుండునట్లు కూడదను వారిని విశ్వాసమునుండి తొలగించుటకై సాతాను ఎడతెగని ప్రయత్నములు చేయుచు

(1 పేతు 5: 8) వారు దేవునిదయనుగూర్చియు. క్షమాపణనుగూర్చియు సందేహపడి విశ్వాసమును విడిచిపెట్టునట్లు వారిని శోధించును. అయితే అట్టిసందేహములనుజయించు టకు పరిశుద్ధాత్మ క్రైస్తవులను బలపఱచును (1 కొరి 3: 16) ఆయన వారిహృదయ ములలో నివసించుచు వారు దేవునిబిడ్డలని వారి యాత్మలతోకూడ సాక్ష్య మిచ్చును (రోమా 8: 16) ఆత్మద్వారా అట్టి సంశయములు నివర్తియైన పిమ్మట వారి విశ్వా సము మఱి బలపడి పౌలువలె 'నేను నమ్మినవాని నెఱుగుదును' అనునంతటి నమ్మకము తో గట్టిగా క్రీస్తును విశ్వసించి మనోనెమ్మది కలిగియుందురు.

5. విశ్వాసము మన మరణ పర్యంతము అంతకంతకు వృద్ధినొందవలెను—విశ్వాస మెంత కొద్దిదియైనను అది నిజ విశ్వాసమైనయెడల మనలను రక్షించును. అయితే అది యనుదినమును వృద్ధినొందవలసియున్నది, అది వృద్ధియగు నట్లు మన మనుదినమును ప్రార్థనచేసి (మార్కు 9: 24) దేవుని వాక్యమును ఆయన సంస్కారములను ఉపయోగింపవలయును. ఈ విధముగ చేసినయెడల మన విశ్వాసము వృద్ధినొందును (2 థెస్స 1: 3) అప్పుడు మనము క్రీస్తునందు వేరుపారిన వారమై ఆయనమీద కట్టబడి యుందుము (కొల 2: 7) మఱియు మనము దేవుని మఱి యెక్కువగా నమ్మి (ఎఫెసీ 3: 16-19) ఆయనయందెక్కువ సంతోషమును నెమ్మ దిని కలిగియుందుము (రోమా 15: 13) అదియుగాక దేవునిని (రోమా 5: 5) మన పొరుగువారిని (1. థెస్స 3: 12) ఎక్కువగా ప్రేమించి, పాపమును జయించు టకు ఎక్కువ బలమును కలిగియుందుము (1. యోహా. 5: 4) విశ్వాసము అస్థిరమైనదై యుండక స్థిరత కలదై యుండవలెను. (కొల 1: 23) మనము నిత్యమును నమ్మవలెను మనము చేయున దంతయు విశ్వాసముతో గూడినదై యుండ వలెను. క్రీస్తు ప్రేమనుండి ఏదియు మనలను ఎడబాప నేరదు (3) జీవకిరీట మొందు నట్లు మనము మరణ పర్యంతము నమ్మకముగా నుండవలెను. (ప్రక 2: 10)

III. విశ్వాసమును నిరర్థకపఱచ కుండునట్లు మనము జాగరూ కత కలిగియుండవలెను—ప్రార్థనవల్లను దేవుని వాక్య ధ్యానమువల్లను మన విశ్వాసము వృద్ధియగును. (4) వీటిని దినదినమునుచేయని యెడల విశ్వాసముక్షీణించి మృతమగును. కొందఱు కొంతకాలము నమ్మి శోధనకాలములో వెనుకపడెదరు. (లూకా 8: 13) కొందఱు ఫలానిది పాపమని ఎఱిగియుండియు దానిని చేయుటవల్ల విశ్వాసమును నిరర్థకపఱచెదరు (5) క్రీస్తుకు లోబడక (ఏఫె 3: 17) ఆయన యాత్మ ప్రేరేపణలను లక్ష్యింపక పోయినయెడల మనలోని విశ్వాసము తప్పక చెడిపోవు ను. విశ్వాసము చెడినయెడల మనరక్షణకూడ చెడును. క్రీస్తుకు లోబడక దుర్మార్గులైన

వారు నిజమైన పశ్చాత్తాపమును, విశ్వాసమును తిరిగి పొందిననే తప్ప వారికి రక్షణ సిద్ధింప నేరదు.

## 17. క్రియలవలన గాక విశ్వాసమువలననే రక్షణ కలుగునను బోధ.

ధర్మశాస్త్రమునకు వేఱుగా దేవుని నీతి ప్రత్యక్ష మగుచున్నది. అది యేసుక్రీస్తు నందలి విశ్వాస మూలమైనదై, నమ్మువా రందఱికి కలుగు దేవుని నీతియై యున్నది. రోమా 3: 21 22.

### భాగములు.

I. విశ్వాసము మూలముగా రక్షింపబడుదుము.

II. విశ్వాసము మూలముగా నీతిమంతులమని తీర్చబడుదుము.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| రక్షణ పొందుటకు ఏమి చేయవలెను. | కార్య 16: 19–34. |
| క్రియలవలన నీతి కలుగదు. | రోమా 3: 1–20. |
| విశ్వాసమువలన నీతి కలుగును. | రోమా 3: 21–31. |
| మనము చేయలేని వాటిని క్రీస్తు చేసెను. | రోమా 8: 1–11. |
| విశ్వాసమూలమైన నీతి యెట్టిది? | ఫిలి. 3: 1–16. |
| విశ్వాసముద్వారా అబ్రాహామునకు కలిగిన నీతి. | ఆది 15. |
| విశ్వాసము వలన మనము జీవింతుము. | గల. 3: 1–14. |

### వేదవాక్యములు.

I. 1. ధర్మశాస్త్రసంబంధమయిన క్రియలు లేకుండ విశ్వాసమువలననే మనుష్యులు నీతిమంతులుగా తీర్చబడుచున్నారని యెంచుచున్నాము (రోమా 3: 28)

II. 2. విశ్వాస మూలమున మనము నీతిమంతులముగా తీర్చబడి, మన ప్రభువైన యేసుక్రీస్తుద్వారా దేవునితో సమాధానము గలిగియుందము (రోమా 5: 1)

3. మన మాయనయందు దేవుని నీతియగునట్లు పాపమెరుగని ఆయనను మన కోసము పాపముగా చేసెను (2 కొరి 5: 21)

4. క్రీస్తు యేసునందు జీవము నిచ్చు పరిశుద్ధాత్మయొక్క నియమము పాపమరణముల న్యాయమునుండి నన్ను విడిపించెను. శరీరము ననుసరింపక ఆత్మననుసరించియే నడుచుకొను మనయందు ధర్మశాస్త్రి సంబంధమైన నీతివిధి నెఱవేర్చబడవలెనని పాప (పరిహారము) నిమిత్తము దేవుడు తన స్వకీయ కుమారుని పాపశరీరాకారముతో పంపి ఆయన శరీరమందు పాపమునకు శిక్ష విధించెను. ఎందుకనగా శరీర స్వభావమును బట్టి ధర్మశాస్త్రము బలహీనమాయెను. గనుక అది దానికసాధ్యమాయెను (రోమా 8: 2-4)

5. క్రీస్తు యేసునందున్న వారికి ఏశిక్షావిధియు లేదు (రోమా 8: 1).

## వివరము.

I. విశ్వాస మూలముగా రక్షింపబడుదుము.—మోక్షములో చేరు వారు తమ పుణ్యమును బట్టి కాదు (2. తిమొ 1:9). గాని, క్రీస్తుపుణ్యమును బట్టియే అట్టిభాగ్యము నొందెదరు (ఎఫె. 1:7). రక్షణ దేవుని దానమై యున్నది. (ఎఫె. 2: 8). దేవుడు ఉచితముగా నిత్తునని చెప్పిన రక్షణను మన మంగీకరింపగలముగాని దానిని స్వయముగా సంపాదించుకొన జాలము (రోమా 4:5). క్రియలవలన గాక ఈ విశ్వాసమూలముగానే మనము రక్షింపబడుదుము. (2. గలతీ 2:16).

కృప, విశ్వాసము అను మాటలు,—దేవుని కృపను బట్టియు (2 తిమొ. 1: 10; తీతు 3: 6) మన విశ్వాసమును బట్టియు (రోమా 5: 1) రక్షణ సిద్ధించునని రెండువిధములుగా చెప్పబడియుండినను ఆ రెండిటి భావము ఒక్కటే కృపను బట్టి రక్షణ కలుగుననగా మన పుణ్యమునుబట్టి కాదుగాని క్రీస్తు పుణ్యమును బట్టి దేవుడు ఉచితముగా రక్షణ నిచ్చునని యర్థమగును. విశ్వాసమును బట్టి రక్షణ కలుగుననగా దేవుడుచితముగా నిచ్చు ఆ రక్షణ విశ్వాసము వల్ల మన స్వంతది యగునని అర్థము.—ఈ రెంటికిగల సంబంధము ఎఫె. 2: 8 లో చక్కగా కనబడును.

విశ్వాస మూలముగా రక్షణకలుగును.—విశ్వాసమూలముగా మనుష్యులను రక్షించుటకు దేవు డిచ్ఛయించుచున్నాడు. (1. తిమొ 2:4-6). క్రీస్తునందు విశ్వాసముంచు ప్రతివాడు నశింప నిత్య జీవము పొందులాగున (యోహా. 3:16). దేవుడు తన యధిక ప్రేమచేత తన ప్రియకుమారుడైన క్రీస్తును ఈ లోకమునకు పంపెను. క్రీస్తు ఈ లోకములో తన పనిని పూర్తిచేసిన పిమ్మట నమ్మి బాప్తిస్మము పొందినవాడు రక్షింపబడును: నమ్మనివానికి శిక్ష విధింపబడును. (మార్కు 16: 16.)

అని సర్వలోకములో ప్రకటించుటకు తన శిష్యుల కాజ్ఞాపించెను, ఫిలిప్పియి పట్టణ మందలి చెరసాల నాయకుడు రక్షణపొందుటకు నే నేమి చేయవలెనని యడుగగా పౌలు: ప్రభువైన యేసునందు విశ్వాసముంచుము, అప్పుడు నీవు రక్షణ పొందెదవని చెప్పెను. (కార్య 16.31).

విశ్వాస మూలముగా రక్షణ కలుగును. ఎట్లనగా విశ్వాసము దేవుడు దయతో నిచ్చు రక్షణను కృతజ్ఞతతో నంగీకరించును. కావున అది రక్షణకు సాధనమై యున్నది. అయితే దానిని పుణ్యకార్యముగా నెంచకూడదు. ఏమనగా ఇది దానముగ నియ్యబడు దానిని పుచ్చుకొనుటకై భిక్షకుడు తన చేతిని చాపినట్లుగ నున్నది. దానమును చేతి మూలముగానే పుచ్చుకొనినను చేతిని చాపుట పుణ్యకార్యమునుగ నెంచముగదా? ఆ విధముగనే దేవుని రక్షణదానమును విశ్వాసమూలముగ మనము పొందుచున్నను మన విశ్వాసమును పుణ్యకార్యముగ నెంచకూడదు.

II. విశ్వాసమూలముగా నీతిమంతులమని తీర్చబడుదుము.—నీతికాని దేదియైనను మోక్షమున ప్రవేశింపజాలదు. కాబట్టి మోక్షములో ప్రవేశింపగోరువారు ముందుగా దేవునివలన నీతిమంతులుగా తీర్చబడిననే తప్ప అందులో ప్రవేశించుటకు వీలుపడదు. విశ్వాసము మూలముగానే మనము నీతిమంతులముగా తీర్చబడుదుము (2) దాని వలననే మనము క్రీస్తును ఆశ్రయించుకొని- మనకు నీతి కలుగుటకై మనకు ప్రతిగా చేయబడవలసిన దంతయు ఆయన పూర్తిగా చేసెనని యొప్పుకొందుము (3. 4) క్రీస్తును విశ్వసించిన యెడల మన మాయనద్వారా దేవుని ధర్మశాస్త్రమును పూర్తిగా నెఱవేర్చినట్లుగ నున్నది. (4) మఱియు దేవుడు మన దోషమును చూడక మనము మన విశ్వాసమువల్ల ధరించుకొని క్రీస్తు నీతిని చూచి మనలను నీతిమంతులనుగా నెంచును (ఫిలిప్పీ 3: 9).

నీతిమంతులముగా తీర్చబడుట యనగా నేమి?—ఈ నీతి మనకు న్యాయశాస్త్రము నిచ్చి దానిని బట్టి మనకు న్యాయము తీర్పుచేయు దేవుని కార్యమై యున్నది. ఈ కార్యములలో మనము పాపము నుండియు, వాటికి రావలసిన శిక్షనుండియు క్రీస్తు పుణ్యమును బట్టియే విడుదల నొందిన వారమని విశ్వసించు మనవిషయమై దేవుడు తీర్పుచేయును. (5). అందువలన మన పాపదోషము పరిహరింపబడును. అదియుగాక మనము పాపమువలన లోనైన దేవుని యుగ్రతనుండియు, ఆయన శిక్షనుండియు తొలగింపబడి ఆయన దయకు పాత్రులమగుదుము. (2).

మనము మన క్రియల వలన నీతిమంతులముగా తీర్చబడ జాలము. ఎవరు దేవుని ధర్మశాస్త్రమును పూర్ణముగా నైకొన గలరో వారు తమ క్రియలవలన

రక్షణ పొందగలరు (రోమా 4: 4). అయితే అట్టివారెవరును లేరుకదా (రోమా 33 28). మనము పాపముతోనే పుట్టి (యోబు 14: 4,) అనుదినమును అనేక విధములుగా దేవుని యాజ్ఞలను అతిక్రమించువారమై యున్నాము (రోమా 3:10-2). మన క్రియలవల్ల మనము మోక్షమునకు కాదు శిక్షకే పాత్రులము (రోమా 3:119). ధర్మశాస్త్రములో వ్రాయబడిన దంతయు గైకొననివాడు శాపగ్రస్తుడు (గల 3:10) అని వ్రాయబడియున్నది. కనుక మనము శాపమునకు లోనయినవారమే. మన మిట్టివారమై నీతిని పోగొట్టుకొనినందున మనకొఱకు నీతిని సిద్ధింపజేయుటకై దేవుడు తన ప్రియ కుమారుని యీ లోకమునకు పంపించెను (8, 4). తమ్మును తాము రక్షించుకొనుట మనుష్యులకు సాధ్యమైనయెడల వారికొఱకు శ్రమపడి చనిపోవనై దేవుడు తన కుమారుని లోకమునకు పంపించక, కర్మమార్గమునకే రక్షణ మార్గముగా నేర్పఱచియుండును (గల 3:2). ధర్మశాస్త్రము పాపులమైన మనకు మన పాపములను చూపునుగాని, రక్షణ పొందగలుగు నుపాయ మేదియు దానిలో కనబడదు (రోమా 3: 20). మనకు మన పాపములను చూపుటచేత మనలను క్రీస్తు నొద్దకు నడిపించుటకును, ఆయనద్వారా మనకు నీతికలుగుటకును ధర్మశాస్త్రము మనకు బాలశిక్షకుడుగా నున్నది (గల 2: 24) కాని, మనలరక్షించుటకు దానిలో శక్తి లేనేలేదు.

మనము రక్షణ పొందుటకు విశ్వాసము ఏక సాధనముగా నున్నది గాని దానిని పుణ్యకార్యముగా నెంచరాదు. —విశ్వసింపక మునుపు మనము మంచి క్రియలను చేయవలెను (రోమా 4: 28; హెబ్రీ 11: 6). విశ్వసించడముతోనే మనము నీతిమంతులులముగా తీర్పుబడుదుము కావున, విశ్వాసమునకు పిమ్మట మనము చేయు కార్యములు విశ్వాసముద్వారా మనకు అనుగ్రహింపబడిన నీతికి కారణముగా నెంచలేము. కనుక విశ్వసింపక పూర్వమైనను తరువాతనైనను మనము చేసిన కార్యములను మనరక్షణకు కారణముగా నెంచరాదు.

నిజముగా విశ్వసించు ప్రతివాడును మంచి క్రియలు చేయును (రోమా 11: 6). అయితే అతడు వాటి ద్వారా రక్షణపొందుటకు కాదుగాని, తాను విశ్వసించి రక్షణ పొందినందుకై వాటిని చేయును. మనము నీతిమంతులము కావడమునకు క్రీస్తు పుణ్యమే కార్యసాధనమై యున్నదిగాని మఱియేదియు కాదు (గల 3: 22). మనము నీతిమంతులముగ తీర్పు నొందుటలో మన క్రియలకే యోగ్యము లేకపోవుట మనకు మేలుకరము. ఎందుకనగా మన క్రియ లెంత మంచివియైనను అవి లోపములతో కూడినవై యుండును గనుక మన నాశనమునకే గాని మన రక్షణకు కార్యసాధనములైయుండ నేరవు (రోమా 7: 18-28). అబ్రాహాము తన క్రియల

వలన నీతిమంతుడుగా తీర్చబడెనని యాకోబు వ్రాసినమాట వాస్తవమే (యాకోబు 2: 21). అయినను యాకోబుచే తన గ్రంథపు 2: 23 వచనములో 'అబ్రాహాము దేవుని నమ్మెను. అది అతనికి నీతిగా యెంచబడెను.' అను లేఖనము నెత్తి వ్రాయుట వలన అబ్రాహాము క్రియలు అతని విశ్వాసమునకు బహిరంగ సూచనలై యున్నవని యాకోబు యొక్క భావమై యున్నట్లు మనము తెలిసికొనవలెను.

విశ్వాసమునుగూర్చిన బోధ క్రొత్తనిబంధనలో మాత్రము గాక పాతనిబంధనలో కూడ నున్నది — క్రియలవలన గాక విశ్వాసము వలననే రక్షణ కలుగునను నియమము మొదటినుండి యున్నది (ఆది 15: 16). పూర్వ కాలపు భక్తులును మనవలెనే శక్తిహీనులై తమ్మును దామురక్షించుకొనలేక పోయిరి. వారికిని మనకును దేవుని దయవలనే గాని మరియొక రీతిగా రక్షణ దొరకదు; మనవలె వారికి కూడ విశ్వాసమే నీతియని యెంచబడెను (రోమా 4: 23: 24). హేబెలు, ఏనోకు నోవహు, అబ్రాహాము, మోషే, యాకోబు, మోషే, రాహాబు, ఇంకచాలమంది యితరులును (హెబ్రీ 11:4-40)- విశ్వాసులగుటవలననే దేవుని దయను పొందినవారైరి. వారికాలములో క్రీస్తు రాలేదనుమాట నిజమే అయినను వారు ఆయన రాకడను గూర్చిన వాగ్దానమును విశ్వసించి- దేవుని కరుణ యందే నమ్మిక ముంచుచు వచ్చిరి.

దేవుడిశ్రాయేలీయులకు ధర్మశాస్త్రము నిచ్చి వారు దానికి లోబడవలెనని యాజ్ఞాపించెను. అయితే వారు క్రియలవలన రక్షణ పొందగలమను యుద్దేశముతో కాదుగాని దేవుడు వారి. దేవుడగుటచే (నిర్గ 20: 2) వారాయనను ప్రేమించుట (ద్వితీ 6: 5) ద్వారా అయన ధర్మశాస్త్రమునకు లోబడి దాని నెఱవేర్చవలసి యుండిరి. పాతనిబంధనలో కూడ రక్షణకు విశ్వాసమే ఆధారమని తెలుపబడి యున్నది (2 దిన. 20: 20; యెష 7: 9). నీనెవే పట్టణస్థులు దేవుని నమ్మినందున దేవుడు వారిని లయపరచక రక్షించెను (యోనా 3: 5, 10). యీ భక్తిమార్గమును గూర్చి క్రొత్తనిబంధనలో మఱి తేటగా వివరింపబడియున్నదను మాట వాస్తవమే. అయినను అది పాతనిబంధనలో కూడ నున్నది. రక్షణమార్గము అన్నికాలములలో ఒకటేరీతిగా నున్నది. నీతిమంతుడు విశ్వాస మూలముగా జీవించును (హబ 2: 4: గల 3: 11). పూర్వమందును ప్రస్తుతమును నిరంతరమును పాపులైనవారు నీతి మంతులగుటకు విశ్వాస మనునది యొక్కటే ఆధారమైయున్నది.

---

18. క్రైస్తవుడు అవలంబింపవలసిన నూతన ప్రవర్తనను గూర్చిన బోధ.

అందరితో సమాధానమును పరిశుద్ధతయు కలిగియుండుటకు ప్రయత్నించుడి. పరిశుద్ధత లేకుండ ఎవడును ప్రభువును చూడడు. హెబ్రీ 12: 14.

భాగములు.

I నూతన ప్రవర్తన నూతన జన్మమునకుఫలమును అట్టిజన్మము యొక్క వెలుపలి సూచనయునై యున్నది.

II ఈ నూతన ప్రవర్తన ఈజీవితకాలములో లోపరహితమైనది కాదుగాని అది క్రమక్రమముగా వృద్ధినొందు చుండును.

III ఈ నూతన ప్రవర్తనలో వృద్ధి నొందుటకు మనము చేయ వలసిన వేవి?

అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| మనము విడువవలసినవి, అవలంభింపవలసినవి. | ఎఫె. 4-17-32 |
| మంచి ప్రవర్తనలేని విశ్వాసము మృతమైనది. | యాకో. 2:14-26. |
| క్రీస్తు నూతన ప్రవర్తన ఆవసరమని బోధించుట. | మత్త. 5:18-48 |
| క్రీస్తు ఆజ్ఞలను గైకొనుటవలన ఆయన స్నేహితుల మగుదుము. | యోహా. 15:1-14 |
| మనము వృద్ధి నొందవలెను. | 1. పేతు. 2:1-10 |
| మనలో నుండు పోరాటము. | గలతి. 5:13-26 |
| విశ్వాసికి కలుగు నూతన ప్రవర్తన, | రోమా 6. |

వేదవాక్యములు.

I. 1. తన్నెందరంగీకరించిరో యందరికి, అనగా తన నామమునందు విశ్వాస ముంచినవారికి, దేవుని పిల్లలగుటకు ఆయన అధికారమనుగ్రహించెను వారు దేవుని వలన పుట్టినవారే కాని రక్తమువలననైనను, శరీరేచ్ఛవలననైనను మనుష్యేచ్ఛవలన నైనను పుట్టినవారు కారు (యోహా 1:12,13).

2. ఎవడైనను క్రీస్తునందున్న యెడల (వాడు నూతన సృష్టి కలవాడాయెను; పాతవి గతించెను; ఇదిగో క్రొత్తవాయెను (2. కొరి. 5:17).

3. క్రీస్తుతోకూడ శిలువ వేయబడియున్నను. ఇకను జీవించువాడను నేను కాను క్రీస్తే నాయందు జీవించుచున్నాడు. నే నిప్పుడు శరీరమందు జీవించుచున్న జీవము నన్ను ప్రేమించి నాకొఱకు తన్ను తానప్పగించుకొనిన దేవుని కుమారుని యందలి విశ్వాసము వలన జీవించుచున్నాను. (గల. 2:20).

4. పాపము విషయమై చనిపోయిన మన మికమీదట నేలాగు దానిలో జీవించుదుము (రోమా 6:2)?

5. మీరు శరీరాను సారముగా ప్రవర్తించినయెడల చావవలసినవారై యుందురు గాని ఆత్మచేత శారీర క్రియలను చంపిన యెడల జీవించెదరు రోమా 8:13).

II. 6. శరీరము ఆత్మకును ఆత్మ శరీరమునకును, విరోధముగా అపేక్షించును. ఇవి ఒక దాని కొకటి వ్యతిరేకముగా నున్నవి గనుక మీరేవి చేయ నిశ్చయింతురో వాటిని చేయకుందురు (గల. 5:17).

7. సహోదరులారా! ఏ యోగ్యతయైనను మెప్పైనను ఉండినయెడల ఏవి సత్యమైనవో, ఏవి న్యాయమైనవో, ఏవి పవిత్రమైనవో, ఏవి రమ్యమైనవో, ఏవిఖ్యాతి గలవో, వాటియందు ధ్యానముంచుకొనుడి. (ఫిలిప్పీ 4:8).

III. 8. లేఖనములయందు మీకు నిత్యజీవము కలదని తలంచుచు వాటిని పరిశోధించుచున్నారు; అవే నన్ను గూర్చి సాక్ష్యమిచ్చుచున్నవి. (యోహా 5:39).

9. మీరు శోధనలోకి రాకుండ మెలకువగా నుండి ప్రార్థనచేయుడి (మత్త 26:4).

వివరము.

క్రైస్తవులమైన మనము మన స్వక్రియలవలన నీతిమంతులముగా తీర్చబడక పోయినను, మనము నిజక్రైస్తవుల మైనయెడల మంచి నడతను అవలంబించుటకు బద్ధులము; మఱియు దాని నవలంబింతుము, ఏలననగా:—

మనము నూతన జన్మము పొందినవారమై యున్నాము.—దేవుని యందు విశ్వసించువారమైన మనము నూతనజన్మము నొందినవారము (1) నూతన సృష్టికలవారము (2) నైతిమి. దేవుడు మనయందనుగ్రహముంచి కలుగజేసిన నూతన జన్మమువలన మన మనస్సు మాఱిపోయెను. అది యికను దేవునికి విరోధమైనదిగా

నుండక (రోమా 8: 7.) ఆయన కనుకూల మయినవాటిని ఆశించునట్లు రూపాంతరము నొందిన వారయెను (రోమా 12: 2). కావున దేవుడు కోరువాటిని మనమును కోరుదుము (రోమా 7: 22). నూతన జన్మము నొందిన పిమ్మట మనము నూతన యుపదేశములను కలిగి రోమా (8: 17), నూతన ప్రేరేపణవలన రేపబడి (2 కొరి. 5: 14), నూతన ఆశలు గల వారమై (రోమా 8:18, 28) జీవించుచున్నాము. మనము పాపము విషయములో మృతులమును, క్రీస్తువిషయము సజీవులమై యున్నాము (రోమా 6: 11). ఇకను మనము కాదు క్రీస్తు మనయందు జీవించుచున్నాడు (3).

I. **నూతన జన్మము** నూతన ప్రవర్తనకు ఫలమును బట్టి జన్మముయొక్క వెలుపలి సూచనయునై యున్నది.—'హృదయములోనుండి జీవధారలు బైలుదేరును' అని సామెత 4: 23 లో నున్న మాటకు 'మనస్సు ఎట్టిదో నడతకూడ అట్టిదిగా నుండు'నని అర్థము. మన మనస్సు మార్పుపొందినదైన యెడల మన నడతయును తప్పక మార్పు నొందును. మంచి ప్రవర్తన లోపలి మనస్సును బైలుపఱచు సూచనయైయున్నది. (రోమా 6: 22). నూతన క్రియలను చేయుటకు క్రీస్తుయేసునందు సృష్టింపబడిన వారమైతిమి (ఎఫె 2: 10). కావున మనము మునుపటి ప్రవర్తన విషయములోనైతే మోసకరమైన దురాశవలన చెడిపోయిన మన ప్రాచీన స్వభావమును విడిచిపెట్టి, నూతన పఱచబడి నీతియు యథార్థమైన భక్తియు గలవారమై దేవుని పోలికగా సృష్టింపబడిన నవీన స్వభావమును ధరించుకొందుము (ఎఫెసీ 4: 22-24).

మనము పరిశుద్ధ ప్రవర్తనలో జీవించుటకు అవశ్యముగా పూనుకొనవలెను.—మనము నిజమైన విశ్వాసులమైతే యికను పాపములో జీవించుట అసాధ్యము (4). విశ్వాసమున్నయెడల మన మవశ్యముగా దేవుని విధేయుల మగుదుము. మంచి నడతను అవలంబించనివాని విశ్వాసము మృతమైనదై యున్నది (యాకో. 2: 26.) అట్టివాని భక్తి మాయ భక్తియే. విశ్వాసము మృతమైనది కాక పోయిన యెడల, అది మంచిచెట్టువలె మంచి ఫలములను ఫలింపచేయును. నిజముగా విశ్వసించువారు తమ పాపముల విషయము పశ్చాత్తాపపడుదురు. పశ్చాత్తాపపడువారు తమ పాపములను విడిచి శుద్ధిని కోరని యెడల అట్టివారి పశ్చాత్తాపము మాయ పశ్చాత్తాపమై యున్నది.

నూతన ప్రవర్తన అవలంభింపవలెనని క్రీస్తుకూడ ఆజ్ఞ నిచ్చెను.—మనుష్యులు మన సత్క్రియలను చూచి ఆకాశమందున్న మన తండ్రిని మహిమ

పఱచుచు మన వెలుగును వారి యెదుట ప్రకాశింప నీయవలెను (మత్త. 5: 16). మన మాయనను ప్రేమించువార మైనయెడల ఆయన యాజ్ఞలను గైకొని ఆయన యడుగు జాడలను బట్టి నడచుకొనవలెను (1. పేతు 2: 21.) ప్రభువా, ప్రభువా, అని క్రీస్తును పిలుచువాడు కాదుగాని, దేవుని చిత్తప్రకారము చేయువాడే ఆకాశ రాజ్యములో ప్రవేశించును (మత్త. 7: 21; (5.)

II. ఈనూతన ప్రవర్తన ఈ జీవితకాలములో లోపరహితమైనది కాదుగాని, క్రమ క్రమముగా వృద్ధినొందుచుండును.—ఈనూతన ప్రవర్తన నవలంబించుటకు మన మెల్లప్పుడును పాపమునకు విరోధముగా పోరాడవలెను. (గల. 5: 16 17) ఎందుకనగా మనకు స్వాభావికముగా నుండు దుష్టబుద్ధి యెంతె అణగిపోయినను, అది మన జీవితకాలములో పూర్ణముగా నశింపదు; ఆత్మ సిద్ధమైనను శరీరము బలహీనముగా నున్నది. (మత్త. 26: 41.) మనలో మన స్వంత దుర్బుద్ధి, దేవుని యాత్మచే నూతన పఱచబడిన మంచి క్రొత్తబుద్ధి అను నీ రెండు నున్నవి. మనము దేవుని యాజ్ఞ విషయము మన యంతరంగమం దెంతగా యానందించినను, అ బుద్ధికి భిన్నముగ నున్న మఱియొక బుద్ధి మన మనస్సునందున్నది (రోమా 7: 21–24) కాబట్టి దేవుని యాజ్ఞలను నెఱవేర్చుట మనకు కష్టతరముగా నున్నది (6). పౌలువలెనే మనమును అనేక పర్యాయములు చేయవలెనని కోరిన మేలు చేయక చేయగోరని కీడును చేయుచున్నాము (రోమా 7: 19.) ఈ దుర్బుద్ధిని మనము అడ్డగించి జయింపవలెను (కొల 3: 5–10). మనము దాని జయింపక పోయిన యెడల, అదే మనలను జయించి మన విశ్వాసమును నిరర్థక పఱచును (1 కొరి. 9: 27).

ఈ జీవితకాలములో నెవరును పూర్ణశుద్ధి నొందజాలరు.—శరీరమునకును, ఆత్మకు నున్న విరుద్ధము మన జీవితాంతము వఱకు నుండును (రోమా 7: 24). బలహీనతచేత అనుదినమును పాపము చేయువారమై యున్నాము కావున అనుదినమును పశ్చాత్తాపపడి దేవుని క్షమాపణ నడుగవలెను. మా ఋణస్థులను మేము క్షమించిన ప్రకారము మా ఋణములను క్షమించుము (మత్త. 6: 12) అని ప్రభువు నేర్పిన ప్రార్థనలలోని మనవి ప్రకారము మన మనుదినమును ప్రార్థించుచుండవలయును. మనము పాపము లేనివారమని చెప్పుకొనిన యెడల మనలను మనమే మోసపుచ్చుకొందుము; మఱియు మనలో సత్యముండదు (1 యోహా. 1: 8).

ఈ జీవితకాలములో నెవరును పూర్ణశుద్ధి నొందకపోయినను క్రైస్తవుడు పూర్ణశుద్ధిని కోరి దాని పొంద ప్రయత్నించును.—అ గుణిని ఎంతగాతప్పి నను తన తండ్రి పరిపూర్ణుడై యున్నట్లు తానును పరిపూర్ణుడుగా నుండవలెనని (మత్త 5-48.) నిజభక్తుడపేక్షించును. దేవుని యాజ్ఞలను గైకొనుటకు మన మెంతగా యత్నించినను వాటిని పూర్ణముగా గైకొనలేము. అయినను నిరాశపడక వాటిని గైకొనుటకు మనము యత్నించుచుండవలెను. మనము పొందిన వృద్ధిలో నెన్ని లోపము లుండినను, మన యత్నములలో ఏ లోపము నుండకూడదు. (ఫిలి 3: 12-14) మనము నిత్యమును పరిశుద్ధమైన వాటిని, మంచి వాటిని నపేక్షించుచుండవలెను (7.) మనము వాటిని పొందక తప్పినయెడల. తప్పినందుకు యదార్థముగా విచారపడ వలయును.

ఈ నూతన ప్రవర్తనయందు వృద్ధి నొందవలెను.— మనము తిరిగి జన్మించి, క్రీస్తును విశ్వసించ మొదలు బెట్టినప్పుడు మనము ఆత్మీయ విషయములలో పసిపిల్లలమని చెప్పదగును (1 కొరి 3: 1) అయితే క్రీస్తుకు కలిగిన సంపూర్ణత మనకు కలుగు నంతవఱకు మనము ఎదుగవలసి యున్నాము (ఎఫె. 4: 13) ఆ సంపూర్ణత ఈ లోకములో గాక పరలోకములోనే మన కబ్బును (1 యోహా 3: 2) అయినను మన మీ లోకములో కూడ పూర్ణుల మండవలసిన గుణములను క్రమ క్రమముగా సంపాదించుకొనవలెను (ఎఫె 4: 14, 15) ఇది మన శక్తికి మించిన పనియైనను దేవుని సహాయమును పొంది దాని నెఱవేర్పగలము (యెష 40: 29, 31) ఆయన తన కృపచేత మనలను బలపఱచిన యెడల నంతే చాలును (2 కొరి 12: 9) మనలో మంచిక్రియను ఆరంభించినవాడు దానిని కొనసాగించును (ఫిలి 1: 6) ఆయన మనలను తన సత్యమువలన శుద్ధిచేయును. ఆయన వాక్యము సత్యమై యున్నది (యోహా 17: 17) మన రక్షకుడగు క్రీస్తు సమరూపము కలవారమగు నట్లుగా, మనము విశ్వసించుచున్న ఆయన సువార్త మనలో కార్యసాధక మగును (1 కొరి. 1: 18, 30).

III. ఈనూతనప్రవర్తనలో వృద్ధినొందునట్లు మనము చేయవలసిన వేవి? మనము దేవుని పని అడ్డగించక దానికి తోడ్పడవలెను. దేవుని వాక్యమును శ్రద్ధతో చదివి నేర్చుకొని (8), దాని గద్దింపులను (ప్రక. 2:7), ఆజ్ఞలను లోబడి (యాకో. 2: 7), దానివలన గలుగు ఆదరణలను పొందవలెను (కార్య 2: 37) మన మనస్సులోని పరిశుద్ధాత్మ ప్రేరేపణలకు లోబడి (రోమా 8: 14,) ఎన్నడును బుద్ధిపూర్వకముగా పాపముచేయ కుండవలెను. శోధనలో పడ

షుండునట్లు మెళుకువపడి ప్రార్థన చేయవలెను (9) మన స్వంత దురేచ్ఛలను, లోక భోగములను, సాతాను శోధనలను జయించుటకు మనలను బలపఱచవలెనని ఏడతెగక దేవుని వేడుకొనవలెను.

ఈ నూతన ప్రవర్తన నవలంబించుటకు మనలను ప్రేరేపించునది మోషే ధర్మశాస్త్రము కాదు: క్రీస్తును విశ్వసించువాడు ఆ ధర్మశాస్త్రమును నెఱవేర్చియున్నాడు (రోమా 8: 2, 3; గల. 3: 24-16). ధర్మశాస్త్రమును నెఱవేర్చక పోయిన యెడల శిక్షకు పాత్రుల మగుదుము అను వెలుపలి చట్టముకాదు, గాని దాని నెఱవేర్చవలె ననెడి లోని యాశయే మనలను ప్రేరేపింపవలెను. దాని నెరవేర్చుటకు క్రీస్తు ప్రేమ మనలకు బలవంతపఱచుచున్నది (1 కొరి 5: 14) దేవునికి భయపడుచున్నాము కావున, ఆయన ధర్మశాస్త్రమునకు లోబడవలెనని యికను చెప్పక, దేవుని ప్రేమించుచున్నాము (రోమా 8: 15). గనుక పరిశుద్ధముగా ప్రవర్తింపవలెనని మనము చెప్పగలము, మనవిశ్వాసము బలపఱచబడి ప్రేమ వృద్ధియగుచుండగా దేవుడు కోరువాటిని చేయుటయందు మన మంతకంతకు వృద్ధి నొందగలము

ఇట్లుండగా దేవుని ధర్మశాస్త్రము రద్దుపఱచబడెనని యనుకొనరాదు. ఆయన ధర్మశాస్త్రము ఏమాత్రమును రద్దుపఱచబడలేదు. (మత్త 5: 17; రోమా 3: 31) నిజముగా పశ్చాత్తాపపడి క్రీస్తును విశ్వసించుచువాడు మాత్రము దాని శిక్షకు లోనైన వాడుకాడు, కానితతిమ్మా వారందఱును దానిశిక్షలకులోనగుదురు. పాపమునకుజీతము మరణమనుమాట ప్రస్తుతకాలములో చెల్లును (రోమా 6: 23) ఐపాపి పశ్చాత్తాప పడడో వాడు నిత్యదండనకు లోనగును. అయితే క్రీస్తును విశ్వసించువాడు క్రీస్తు నా కొఱకు ధర్మశాస్త్రమును నెఱవేర్చెను కావున, నేను నిర్భయముగా పాపము చేయవచ్చునని యెంతమాత్రమును అనుకొనరాదు (1 పేతు 2: 16: గల 5: 13) మనము బుద్ధిపూర్వకముగా పాపము చేసినయెడల మనము నిజమైన పశ్చాత్తాపమును పొందలేము అట్టి పశ్చాత్తాపము-లేని యెడల విశ్వాసము నుండ నేరదు (రోమా 6: 15, 16) క్రీస్తు నా కొఱకు ధర్మశాస్త్రమును నెఱవేర్చెను గనుక నేను నిర్భయముగా పాపము చేయవచ్చు ననుకొనువారు ధర్మశాస్త్రమునకు దాని శాపమునకు లోనై యుందురు. పాపము చేయుటకు దేవుని ప్రేమను హేతువుగాచేసికొని దాని దుర్వినియోగపఱచువారెవరో వారు తాము విశ్వసించుచున్నామని యెంతగా చెప్పుకొనినను, తీర్పుదినమందు అవిశ్వాసులు పొందు శిక్షకు సమమైన శిక్షను పొంది నిత్యదండనకు పాత్రులగుదురు.

---

## 19. శోధకుడైన సాతానును గూర్చిన బోధ.

నిబ్బరమైన బుద్ధిగలవారై మెళుకువగా నుండుడి ; మీ విరోధియైన సాతాను గర్జించు సింహమువలె ఎవరిని మ్రింగుదునా యని వెదకుచు తిరుగుచున్నాడు. 1 పేతురు 5: 8.

### భాగములు.

I. సాతాను ఎవడు ?

II. సాతానుయొక్క ఉద్దేశములు.

III. సాతాను నెదిరింపవలసినది యెట్లు ?

### అనుదిన వేద పాఠములు.

| | |
|---|---|
| సాతాను యొక్క మొదటి శోధన. | ఆది. 3. |
| సాతాను యోబును శోధించుట. | యోబు 1. |
| సాతాను యోబును శోధించుట. | యోబు 2. |
| సాతాను దావీదును శోధించుట. | 1. దిన. 21. |
| సాతాను క్రీస్తును శోధించుట. | మత్త. 4: 1-11 |
| సాతాను బిడ్డల గుణములు. | యోహా. 8: 31-44. |
| సాతాను నెదిరింపవలసిన దెట్లు ? | ఎఫె. 6: 10-20. |

### వేదవాక్యములు.

I. 1. ఆదినుండి వాడు నరహంతకుడైయుండి సత్యమందు నిలచినవాడు కాడు; వానియందు సత్యమే లేదు; వాడబద్ధమాడునపుడు తన స్వభావము ననుసరించియే మాటలాడును; వాడబద్ధమునకు జనకుడునయి యున్నాడు (యోహా. 8: 44.)

2. సాతాను మొదటినుండి పాపము చేయుచున్నాడు గనుక పాపము చేయువాడు సాతాను సంబంధి. సాతాను క్రియలను లయపరచుటకై గదా దేవుని కుమారుడు ప్రత్యక్షమాయెను ? (1 యోహా. 3: 8.)

II. 3. త్రోవ పక్కనుండువారు వినువారు, కాని నమ్మి రక్షణపొందకుండునట్లు సాతాను వచ్చి వారి హృదయములోనుండి వాక్యమెత్తుకొని పోవును (లూకా 8: 12.).

III. 4. దేవునికి లోబడియుండుడి. సాతాను నెదిరించుడి. అప్పుడు వాడు మీయొద్దనుండి పారిపోవును" (యాకో. 4: 7).

5. మీరు సాతాను తంత్రముల నెదిరించుటకు శక్తిమంతులగునట్లు దేవుడిచ్చు సర్వాంగ కవచము ధరించుకొనుడి. ఎందుకనగా మనము పోరాడునది రక్తమాంసములతో కాదు. ప్రధానులతోను అధికారులతోను ఇప్పటి అంధకార సంబంధులగు లోకనాధులతోను ఆకాశమండలమందున్న దురాత్మల సమూహములతోను పోరాడుచున్నాము. అందుచేతను మీరు ఆపద్దినమందు వారి నెదిరించుటకును, సమస్తము నెఱవేర్చినవారై నిలువబడుటకును శక్తిమంతులగునట్లు దేవుడిచ్చు సర్వాంగ కవచమును ధరించుకొనుడి. ఏలాగనగా మీ నడుమునకు సత్యమును దట్టి కట్టుకొని నీతియను మైమరువు తొడుగుకొని పాదములకు సమాధాన సువార్తవలననైన సిద్ధమనస్సను జోడు తొడుగుకొని నిలువబడుడి. ఇవన్నియుగాక విశ్వాసమనుడాలు పట్టుకొనుడి; దానితో మీరు దుష్టుని అగ్నిబాణములన్నియు ఆర్పుటకు శక్తిమంతులవుదురు. మరియు రక్షణయను శిరస్త్రాణమును దేవుని వాక్యమను ఖడ్గమును ధరించుకొనుడి (ఎఫెసి 6: 11-17.)

## వివరము.

I. సాతాను ఎవడు?—మనము మనలోనున్న దుష్టబుద్ధిని మాత్రముగాక, సాతాను శోధనలనుకూడ నెదిరింపవలెను. క్రీస్తులో అట్టి బుద్ధి లేశమైన లేకపోయినను ఆయన నలుబది దినములవఱకు సాతానుచే శోధింపబడెను (మార్కు 1: 13). కావున మనలోనుండు దుష్టబుద్ధియే సాతానుగాని వేఱే సాతాను లేడని యనుకొనరాదు. సాతాను మన దుష్టబుద్ధినుండి ప్రత్యేకముగా నున్న యొక దుష్టయాత్మయై యున్నాడు. దేవుడు సృష్టించినది యావత్తు మంచిదియై యుండెను (ఆది. 1: 30). కాబట్టి సాతాను దుష్టయాత్మగా సృష్టింపబడక మొట్టమొదట మంచి దూతయైయుండి, పాపముచేసి (2 పేతురు 2: 4), దుష్టుడయ్యెను. వాడుచేసిన పాపమునుగూర్చి బైబిలులో తేటగా వ్రాయబడక పోయినను, మత్త 4: 9 చూడగా దేవునికి చెందవలసిన ఘనము తానే పొందవలెనను ఆశగలవాడై వాడు దేవునికి విరోధముగా తిరుగబడి నట్లూహింపవచ్చును.

సాతానునుగూర్చి బైబిలులో చెప్పబడిన విషయము లెవ్వియనగా: వాడు ఆదినుండి అబద్ధికుడును నరహంతకుడునై యుండి పాపమునకు కారకు డయ్యెను (1);

వాడు తన యుక్తులవల్ల హవ్వను మోసపుచ్చిన సర్పమును (ఆది. 3: 4), సర్వ లోకమును మోసపుచ్చువాడునై (ప్రక. 12: 9), క్రైస్తవులను చెరుప యత్నించు చున్నాడు (2 కొరి. 11: 13); క్రీస్తు వాని క్రియలను లయపఱచుటకు వచ్చెను (2); ఆయన రానియెడల మనము నిత్యమును వాని దాసత్వములో నేయుండి (హెబ్రి2: 15) వానిచేత పీడింపబడువార మగుదుము (కార్య 10: 38); వాడు అవిధేయులగు వారిని ప్రేరేపించు శక్తియై యున్నాడు (ఎఫెసీ 2: 2) దుర్మార్గులు తనకు సేవచే యవలెనని వారిని భ్రమపఱచు ఈ యుగ సంబంధమైన దేవతగా నున్నాడు (2 కొరి. 4: 4); క్రైస్తవులు దేవుని శక్తి సహాయములను పొందకపోయిన యెడల నేమాత్ర మును జయింపజాలనంతటి బలశాలియై యున్నాడు (ఎఫెసీ 6: 11, 13).

సాతానుకుగల పేరులు, వాటి భావములు.— సాతాను అనగా విరోధి. వాడు దేవునికిని మనుష్యులకును విరోధి యగుటచే వానికి ఈబిరుదు కలిగెను (1 దిన. 21: 1 ) దేవుడు తనను శిక్షించినట్లుగా, మనుష్యులనుకూడ శిక్షింపవలెనని వారిమీద నేరము మోపువాడు కావున వాడు అపవాది యనబడును (ప్రకటన 12: 10). పనికిమాలినవాడని యర్థమిచ్చు బెలియాలు అను పేరుకూడ వానికి పెట్టబడెను (2 కొరి 6: 5). మారుమనస్సు నొందని వారి నేలుటచేత వాడు లోకాధికారి యనియు (యోహా. 14: 30) అట్టివారు తమ పాపములవల్ల వానినే సేవించుటచేత ఈ యుగసంబంధమైన దేవతయనియు ( 2 కొరి 4:4 ) చెప్పబడును. మనము వాని యుక్తులలోను, మరణకరమైన శక్తిలోను చిక్కుపడుదునట్లు జాగ్రతపడవలెనని మనలను హెచ్చరించి బుద్ధిచెప్పుటకై వానికి పురాతన సర్పమైన ఆ మహా ఘటసర్పము అని కూడ పేరు పెట్టబడెను (ప్రక. 12: 9).

సాతాను పాపముచేసిన దూతలలో ముఖ్యుడు. వాడొకడే యిట్లుతప్పిపోయెనని యనుకొనకూడదు. ఎందుకనగా దయ్యములు అనేకములైయున్నవి. గెర్గసేనను దేశములో దయ్యముపట్టిన వానియందు ఒక సేనయంతటి సంఖ్యగలదయ్యములుండెను (మార్కు 5: 9) సాతాను మొదట పాపములో పడినప్పుడు ఇంక ననేక దూతలను తన పక్షముచేసికొనెను కావున, వారును శిక్షకు పాత్రులైరి (2 పేతు. 2: 4.) నిజముగా దుష్టుల రాజ్యమొకటి యున్నది. దానిలో అయా విధములైన అధికారులు కలరు (ఎఫెసి 6: 12.) సాతాను వారందఱికి పై యధికారియై యున్నాడు (మత్త 12: 24) ఈ దయ్యములు దేవునిని, మనుష్యులను విరోధించినను, వాటిలో నొకటి నొకటి ఐక్యము గలవియై యున్నవి. ఏలననగా యిట్లుండనియెడల వాటి రాజ్యము నిలువనేరదు (మత్త. 12: 26).

పాపమువలన మనుష్యులెన్ని సౌఖ్యములను పోగొట్టుకొనినను దేవుడు మొదట వారికిచ్చిన అధికృతయంతయు తీసివేయబడలేదు. అటువలెనే సాతానును, వానిదూతలును పాపమువలన తమ పూర్వసౌఖ్యమును పోగొట్టుకొనినప్పటికి, తమ పూర్వశక్తినంతటిని పోగొట్టుకొనలేదు. అయితే అవి తమ స్వశక్తిని దుర్మార్గతలను చేయుటయందు మాత్రమే ఉపయోగించుచున్నవి. ఎట్లనగా అవి దేవుని మంచి దూతలను, భక్తులను ద్వేషించి విరోధించును. వాటిశక్తి మనుష్యులశక్తిని మించినను (ఎఫెసి 6: 38, 39) దేవుడు దానికి సరిహద్దు నేర్పఱచెను గనుక అవి దానినిదాట జాలవు. అవి దేవుని సన్నిధినుండితొలగింపబడి, నరకములో పడద్రోయబడి (2 పేతురు 2: 4) తమ దుష్టబుద్ధికి అప్పగింపబడినవై తమ పాపమువలన శిక్షల నిప్పుడును కొంత వఱకు పొందుచున్నవి. అయితే వాటికింకను గొప్పశిక్ష కలుగును (యూదా 6) న్యాయపుతీర్పు దినమందలి అగ్నిగుండములో పడద్రోయబడును. అచట వానికినిత్య బాధలు కలుగును (ప్రకటన 20: 10)

II. సాతానుయొక్క ఉద్దేశములు.—— సాతాను దేవుని నేమియు చేయలేడు కావున దేవుడు ప్రేమించు మనుష్యులకు హాని కలుగుటకై తాను చేయగలిగినన్ని ప్రయత్నములను చేయుచు కసితీర్చుకొన యత్నించును ((ప॥వా॥) వాడు మనుష్యుల శరీరాత్మలకును, వారి యాస్తులకును నష్టము కలుగజేయును. ఈ విధమున వాడు యోబుకు గొప్ప విపత్తులను కలిగించెను (యోబు 1: 2 అధ్యా) శరీరసంబంధమైన ఏదో యొక జబ్బుచేత పౌలును శ్రమపఱచుచుండెను (2 కొరి. 12: 7) క్రీస్తు కాలములో చాలమంది దేహములను వశపఱచుకొని వారిని బాధించెను (మత్త 4: 25) వీటి నన్నిటిని చేయుట మాత్రముగాక మనుష్యులను రక్షింపవలెనని దేవునికి గల దయా స్వభావమును నిరర్థకపఱచుటకు వాడు ముఖ్యముగా పని చేయును (మత్త 13: 19; 2 కొరి 4: 4)

మనుష్యులు క్రీస్తును విశ్వసింప కుండునట్లు సాతానుముఖ్యముగా పనిచేయును.——వారు తమ పాపములలో నిలిచియుండుటకును సువార్తకు లోబడకయుండునట్లును (గల 3: 1) ఈ లోక భాగ్యములద్వారాను, ధనాపేక్ష ద్వారాను (లూకా 8: 14,) తమ స్వంత దురేచ్ఛలద్వారాను, వారిని రేపును. దేవుని వాక్యము వినునప్పుడు వారు దానిని నమ్మి రక్షింపబడ కుండునట్లు వారి మనస్సులో నుండి దానిని తీసివేయును (3)

నమ్మనివారిని మాత్రముగాక నమ్మువారినికూడ చెఱుపయత్నించును.——మనము పాపముచేయుటకును, అవిశ్వాసుల మగుటకును సాతాను మనలను

శోధించుచుండును కావున వానిచే నశింప కుండునట్లు నిత్యము జాగ్రతపడుట మిక్కిలి అవసరమైయున్నది (1. పేతు. 5: 8). మనలను శోధించువాడు సాతానే. దేవుని మాట విషయము సందేహపడి ఆయన యాజ్ఞలను మీఱుటకై వీడు మొదట హవ్వను శోధించి (ఆది 3: 1, 6: 2 కొరి. 11: 3) అప్పటినుండి నేటివఱకు చేయ బడు ప్రతి పాపమునకు మూలకారకు డయ్యెను. క్రీస్తును ఎఱుగనని చెప్పుటకు పేతురును (లూకా 22: 31), క్రీస్తును అప్పగించుటకు యూదాను (యోహా. 13: 2), కొంత సొమ్మును దాచిపెట్టి పరిశుద్ధాత్మకు విరోధముగా నబద్ధమాడుటకు అననీ యను (కార్య 5: 3) శోధించినవాడు సాతానే. వాడు మనుష్యులందఱిని శోధించి పాపమార్గములో నడవచేయును.

సాతాను యుక్తితో మనలను శోధించును:—వాడు తనయుద్దేశము లను మనకు తెలుపక, చాలయుక్తితో వెలుగుదూత వేషమును ధరించుకొని (2. కొరి. 11: 14) మనలను శోధించును. అనగా మనకు స్నేహితుడుగాను మన మేలు కోరువాడుగాను నున్నట్లు కపటముతో మనకు కనబడును. వాడు గర్జించు సింహము వలె నున్నాడు (ప్ర॥ వా॥) అనుమాట వాని అసక్తిని సూచించునుగాని వాడు సింహమువలె భయంకర రూపముతో మనకు కనబడు ననుకొనరాదు. హవ్వయొక్క సౌఖ్యమును కోరినట్లుగా వాడామెకు నగపడెను (ఆది. 3: 4, 5). క్రీస్తు ఆకలిగొని యుండగా ఆయన విషయము జాలిపడి ఆయన యాకలిని తీర్చుకొనుటకై ఒక యుపాయము చెప్పువానివలె ఆయనకు కనబడెను (మత్త. 4: 3). పాపము చేయుటవల్ల మనకు సౌఖ్యము కలుగుననియు, పాపమువలన నష్టములు లేవనియు మనము నమ్మునట్లు వాడు మనలను శోధించును. ఎటులనైనను సరే అందఱును ఈ జీవితకాలభోగముల ననుభవించుచుండగా మన మెందుకు అనుభవింప కూడదు అను సందేహమును వాడు మన మనస్సులో పుట్టించును. విషయేచ్ఛల ద్వారాను, దుష్టుల ద్వారాను, ఒకపుడు మన మేలు కోరు మన స్నేహితులద్వారాను, వాడు మనలను శోధించును.

III సాతానును యెదిరింపవలసినది యెట్లు?—మనము సాతాను నెదిరింపవలెను (ఎఫెసీ 4: 27). వాని నెదిరించిన యెడల వాడు మనయొద్దనుండి పారిపోవును (యాకో. 4: 7). మనము వాని నెదిరింపక వాని శోధనలకు లోబడిన యెడల మనము క్రమ క్రమేణ వానికి పూర్ణముగా దాసుల మగుదుము. దాని శక్తి కొద్ది యనియు, మనుష్యులశక్తికి సాటి యనియు మన మనుకొనరాదు. వానిని జయించుటకు మన శక్తి యేమాత్రమును చాలదు. అయితే క్రీస్తునందు విశ్వసించు ప్రతివాడు దేవుని సహాయము ద్వారా (ర) వానిపై జయ మొందగలడు (రోమా 16:2

సాతానును జయించుటకు మనముపయోగింపవలసిన సాధనములు.—మన మెలకువ (ఎఫె. 6: 18), దేవుని వాక్యము (ఎఫె. 6: 15), విశ్వాసము (ఎఫె. 6: 16), ప్రార్థన (ఎఫె. 6: 18) అనునవి సాతానును జయించుటకు సాధనములై యున్నవి. వీటివల్ల క్రీస్తు సాతానును జయించెను (మత్త. 4: 1-11). వీటివలననే మనము కూడ జయము గలుగును. మనము ఓడిపోయినయెడల తప్పు మనదై యుండును. ఎందుకనగా మన మా సాధనములను సరిగా ఉపయోగింపకపోవుటచేతనే ఓడిపోదుము. సాతాను యెంతశక్తిగలవాడైనను, క్రీస్తును యథార్థముగా విశ్వసించువారికి వాడేమాత్రమును కీడు చేయలేడు. క్రీస్తు మనలను సాతాను అధికారములోనుండి విడిపించెను. సాతాను శోధనలను జయించుటకు ఆయన మనలను బలపరచును. మఱియు సాతాను మన మీద మోపు నేరములను చూచి, వీటి నన్నింటిని నేను నా మరణమువలన తీర్చితినని చెప్పి మనలను ప్రోచి కాపాడును.

---

## 20. క్రైస్తవ సంఘమును గూర్చిన బోధ.

సంఘము సత్యమునకు స్తంభమును ఆధారమునై యున్నది.

1. తిమొ. 3: 15.

### భాగములు.

I. సంఘముయొక్క స్వభావసిద్ధములైన విషయములు.

1. సంఘము పరిశుద్ధుల సహవాసమై యున్నది.
2. అది దృశ్యమైనది అదృశ్యమైనది అని రెండు విధములు.
3. అది పోరాడు సంఘము, జయమొందిన సంఘము అని రెండు విధములు.
4. అది పరిశుద్ధమైన యేక సంఘమై యున్నది.
5. అది క్రీస్తు శరీరమై యున్నది.

II. సంఘముయొక్కపని.

1. దానిని చేయుటకై వాక్య సంస్కారములు దేవుడేర్పరచిన సాధనములై యున్నవి.
2. దానిని చేయుటకు దేవుడు బోధకులను, పరిచారకులను నియమించెను.

## అనుదిన వేదపాఠములు.

| | | | |
|---|---|---|---|
| సంఘము ఏక సంఘమై యున్నది | 1 కొరి | 12: | 12-31. |
| ఈ సంఘమునకు క్రీస్తు కాపరియై యున్నాడు యోహా | | 10: | 1-18. |
| క్రీస్తు సంఘమునకు శిరస్సైయున్నాడు. | ఎఫె | 2: | 11-22. |
| క్రీస్తుసంఘమునకు శిరస్సైయున్నాడు | కొల | 1: | 9- 23. |
| బోధకుల విధులు | కార్య | 20: | 17-35. |
| బోధకుల విధులు | | | 1, 8. |
| బోధకులు దేవుని రాజ్యభారులు | 2 కొరి | 5: | 11-21. |

## వేదవాక్యములు.

I. 1. తండ్రి నన్నేలాగు నెఱుగునో నేను తండ్రి నేలాగు నెరుగుదునో అలాగే నేను నా గొఱ్ఱెల నెఱుగుదును. మరియు గొఱ్ఱెలకొఱకు నా ప్రాణము పెట్టుచున్నాను. (యోహా 10: 15).

2. నేను జయించి నాతండ్రితోకూడ ఆయన సింహాసనమునందు కూర్చుండియున్న ప్రకారము, జయించువానిని నాతోకూడ నాసింహాసనమునందు కూర్చుండ నిచ్చెదను (ప్రక. 3: 21, ).

3. ఈ దొడ్డివి కాని వేరే గొఱ్ఱెలును నాకు కలవు; వాటిని కూడ నేను తోడుకొని రావలెను, అవి నా శబ్దము వినును. అప్పుడు మంద యొకటియు గొఱ్ఱెల కాపరి యొకడు నగును (యోహాను 10: 16).

4. క్రీస్తు యేసే ముఖ్యమైన మూలరాయియై యుండగా అపొస్తలులును ప్రవక్తలును వేసిన పునాదిమీద మీరు కట్టబడి యున్నారు (ఎఫెసీ 2: 20):

5. సంఘమను శరీరమునకు ఆయనే శిరస్సు (కొల 1: 18).

II. 6 మీరు సర్వలోకమునకు వెళ్ళి సర్వ సృష్టికి సువార్తను ప్రకటించుడి (మార్కు 16: 15).

7. దేవుడు మాద్వారా వేడుకొనినట్లు క్రీస్తుకు రాయబారులమై— దేవునితో సమాధానపడుడని క్రీస్తు పక్షముగా మిమ్మును బతిమాలుకొనుచున్నాము (2 కొరి 5: 20).

## వివరము.

I సంఘమునకు స్వభావసిద్ధములైన విషయములు.— క్రీస్తు ఆకాశమును కెక్కి పది దినములైన పిమ్మట అపొస్తలులమీద పరిశుద్ధాత్మనుకుమ్మరించి

తన సంఘమును స్థాపించెను (కార్య 2: 1-4) పరిశుద్ధాత్మను పొందిన పిమ్మటనే అపొస్తలులు క్రీస్తుయొక్క మరణ పునరుద్ధానములను గూర్చిన సువార్తను మొదట ప్రకటించిరి. అప్పుడు ఇంచుమించు మూడువేలమంది ఆసువార్తను నమ్మి క్రైస్తవ బాప్తిస్మము నొంది సంఘములో చేర్చబడిరి (కార్య 2: 14-44). వీరే క్రైస్తవ సంఘములో చేరిన మొదటి శిష్యు లనదగును.

I. సంఘము పరిశుద్ధుల సహవాసమై యున్నది.—క్రీస్తును యదార్థముగ సేవించు భక్తుల స్నేహకూటమే క్రైస్తవ సంఘ మనబడును. దీని ద్వారానే పరిశుద్ధాత్మ వాక్య సంస్కారముల మూలముగా మనుష్యులు క్రీస్తు రక్షణను నమ్మి అనుభవించుకొనునట్లు చేయును. సంఘములోనే పరిశుద్ధాత్మ విశ్వాసులను సమకూర్చి నడిపించి పరిశుద్ధపఱచును. ఎక్కడ దేవుని వాక్యమును తప్పులేకుండ బోధించి, క్రీస్తు ఆజ్ఞల ననుసరించి సంస్కారముల నాచరింతురో అక్కడ నిజ విశ్వాసులు తప్పక నుందురు (యెష 55: 10, 11). కావున అచ్చటనే క్రైస్తవ సంఘ మున్నదని తెలిసికొనవలెను.

2. సంఘము దృశ్యమైనది, అదృశ్యమైనది యని రెండు విధములు:—సంఘము క్రీస్తును యదార్థముగ విశ్వసించినవారి కూటమై యున్నందున నిజముగాసంఘస్థులెవరో, కానివారెవరో యను సంగతి సమస్త హృదయరహస్యముల నెఱిగిన దేవునికేగాని మనుష్యులకు తెలియదు. కావున సంఘము అదృశ్యమైనది యనబడును. మనము విశ్వాసుల శరీరములను చూడగలము. వారి విశ్వాసమును వారి క్రియలవలన కూడ కొంతవఱకు తెలిసికొనగలము గాని, హృదయములను పరిశోధింపలేము. కావున మాయభక్తిగలవారెవరో యదార్థభక్తిగలవారెవరో రూఢిగా తెలిసికొనుట ఏ మనుష్యునికైనను తరముకాదు. ప్రభువు తనవారి నెఱుగును (2 తిమొ 2: 10). క్రీస్తు తన గొఱ్ఱెల నెఱుగును (1).

ఇట్లుండగా క్రైస్తవ విశ్వాసము నొప్పుకొని సంఘములో చేరినవారినందఱిని లెక్కించి, వారే క్రైస్తవ సంఘమని యొక విధముగా చెప్పవచ్చును. ఇదియే దృశ్యమైన సంఘమనబడును. ఇందులోకూడ ననేక శాఖలలోని యనేక సభలు చేరి యున్నవి. క్రీస్తునందు విశ్వాస ముంచుటయే రక్షణ పొందుటకు గల యొక్కటే మార్గమని ఏయే శాఖలవారు నమ్ముదురో, వారిలో ఇంక నితర విషయములందుకొద్ది గొప్ప తప్పు లుండినను వారందఱు ఈ దృశ్యమైన సంఘములోనివారని చెప్పవలయును. ఇట్లు లెక్కించుచుండగా యదార్థముగ విశ్వసింపని వారనేకులు కూడ ఈ లెక్కలో నుందురు. అయితే వారు పైచెప్పబడిన అదృశ్య సంఘములో

చేరినవారు కారు. గోధుమలలో గురుగులు (ఊదర) కూడ నుండును (మత్త.13:26). వెలుపటి రూపము ఒకటిగా నుండుటచే మనుష్యులు వారిని వేఱుపఱచజాలరు (మత్త. 13:29). తీర్పు దినమువరకు వారును ఈ దృశ్యమగు సంఘములో కలసి యుందురు. అప్పుడు దూతలు వారిని ప్రత్యేకపఱతురు (మత్త. 13:39-41).

3. సంఘము పోరాడు సంఘము జయమొందిన సంఘము అని రెండు విధములు:—దేవుని రాజ్యమైన సంఘము పరలోకమందును, భూలోకములోను నున్నది. విశ్వాసము గలవారై కాలము చేసినవారు పరలోకములోని సంఘములో చేరినవారై యున్నారు. (ప్రక. 7:9-14). అందులోని వారందరువిశ్వాసము ద్వారా శత్రువు లందఱిమీద జయ మొందినందున అట్టివారి సంఘము జయమొందిన సంఘ మనబడును. ఈభూలోకములోని సంఘమందున్నవారు విశ్వాస సంబంధమైన మంచిపోరాటమును ఇంకను పోరాడుచున్నారు. (1. తి మో. 6:12.), కావున నిది పోరాడు సంఘ మనబడును. జయ మొందిన సంఘములో చేరుటకు ముందుగా బోరాడు సంఘములో తప్పక చేరవలెను. విశ్వాసులు కాని వారికి రక్షణసిద్ధింపదు. పోరాడనివారు జయ మొంద నేరరు. ఈపోరాడు సంఘములో చేరి మరణపర్యంతము నమ్మకముగా నున్నవారు (ప్రక 2:10) తప్పక ఆ జయమొందిన సంఘములో చేరుదురు (2)

4. సంఘము పరిశుద్ధమైన ఏకసంఘమై యున్నది.—క్రైస్తవ సంఘములో ననేక సభలును, శాఖలునుండినను సంఘమంతయు ఒక్కటియై యున్నది. ఏశాఖలో నున్నను, ఏ సభలోనున్నను ఎవరునిజముగా క్రీస్తును విశ్వసింతురో వారి సమూహమే ఆ యేక సంఘము. గొఱ్ఱెలు వేరు వేరు దొడ్లలో నున్నను అన్నిటిని మొత్తముమీద గొఱ్ఱెల మంద యనవలెను. (3). విశ్వాసులకు దేశము, జాతి, వర్ణము మొదలగు భేదము లెన్నియుండినను విశ్వాసమొక్కటేగనుక వారు ఏక సంఘపు వారలై యున్నారు. సంఘము ఏకసంఘమైయుండుటచే అది కథోలిక్ (అనగా సార్వత్రిక) సంఘ మనబడును. రోమను కథోలిక్ సంఘము అనగా వేఱొక అర్థము కలదు.

సంఘమునకు మఱికొన్ని బిరుదులు కలవు. సంఘములోని వారిని పవిత్ర పఱచుటకు పరిశుద్ధాత్మ ఎడతెగక పనిచేయుటచేతను, సభవారు ఏమాత్రము లోపము లేనివారు కాకపోయినను పరిశుద్ధ సేవకు ప్రత్యేకింపబడి దేవుని సహాయమువలన శుద్ధప్రవర్తన నవలంబించుటచేతను సంఘము పరిశుద్ధ సంఘ మనబడును. ఇందులో చేరినవారు క్రీస్తును విశ్వసించుటచే ఇది క్రైస్తవ సంఘమనబడును. క్రీస్తుయొక్క

అవతార కాలములో ఆయననుచూచి, ఆయన చర్యల విషయమై సాక్షులుగ నున్న అపొస్తలుల బోధ ఈ సంఘమునకు ఆధారమగుటచే (4) యిది అపొస్తలుల సంబంధమైన సంఘమనికూడ చెప్పబడును.

5. సంఘము క్రీస్తు శరీరమై యున్నది. క్రీస్తువానికి శిరస్సై యున్నాడు.—క్రీస్తు సంఘమునకు ప్రభువై దానిని దయతో పరిపాలనచేయుచు పాతాళలోక ద్వారములుసహా దానిని జయింప కుండునట్లు (మత్త, 16:18). దాని శత్రువుల నందరిని జయించి దానిని కాపాడును. క్రీస్తునకు సంఘమునకును తీక్ష్ణసంబంధము కలదు. సంఘమును దేహమునకు ఆయన శిరస్సై యున్నాడు. సభవారా దేహములోని అవయవములై యున్నారు. క్రీస్తు ద్రాక్షావల్లియు, సభవారు దాని తీగలునై యున్నారు (యోహా. 15:5) క్రీస్తునందుండుటవలననే సభవారికి ఆత్మీయ జీవము కలదుగాని మరి యే విధముగనైనను ఆజీవము వారిలో నుండ నేరదు.(యోహా. 15:4) కాయలు కాయని తీగెలు నరికి పారవేయబడును (యోహా 15:2). ఫలింపని తీగెతో సమానమైనవాడు సంఘములో నుండినను అతడు నిజమైన సంఘస్థుడు కానేరడు.

సభవారు క్రీస్తుతో కూడ సంబంధించి యుండుటచే వారు ఒకరితో నొకరును సంబంధపడినవారై యున్నారు (1. కొరి. 12: 12) వారి యేక శరీరములోని అవయవములై యున్నారు. కావున వారు ఒకరినొకరు ప్రేమించుచు సమధాన మను బంధముచేత పరిశుద్ధాత్మ కలిగించు ఐక్యమును కాపాడుకొనవలెను. (ఎఫె 4:2, 3). ఈసభలో జేరిన ప్రతి వాడును చేయవలసిన పని యొకటి యున్నది. అది యెంత స్వల్పమైనదై యుండినను దానిని చేయుట మిక్కిలి అవసరమైయున్నది. (1. కొ) 12:22) కన్ను చేతిని చూచి, నీతో నాకు పని లేదని చెప్పజాలదు గదా? అలాగు ఒక సభికుడు తనసభలోని మరియొకనితో, నీవు చేయు పని యీ సభకు అక్కర లేదని చెప్ప లేడు. (1. కొరి. 12:21). క్రీస్తు సంఘము నెడల కోరునవి నెఱవేరునట్లు సభవారందరు ఐక్యపడి కలిసి పనిచేయవలెను.

II సంఘముయొక్క పని:—సంఘమునకు ఈలోకములో ఒక పనిని క్రీస్తు ఏర్పరచెను. సమస్తజనములను ఆయన శిష్యులనుగా చేయుట యనునదే అ పనియైయున్నది. (మత్త. 28:19). క్రీస్తువలన అట్టి యాజ్ఞను పొందిన అపొస్తలులు, సంఘమునకు ప్రతినిధులై యుండిరి. కావున వారి కియ్యబడిన యాజ్ఞ అందరికి నియ్యబడెను (6) మనుష్యులను రక్షించుటకు పరిశుద్ధాత్మ చేయుపని సంఘము ద్వారానే చేయునుగాని సంఘము లేకుండగా చేయడు.

1. పరిశుద్ధాత్మ సంఘముద్వారా యీ రక్షణను సఫలపరచుటకై దేవుని వాక్యమును, బాప్తిస్మము ప్రభువు రాత్రిభోజనము అను రెండు సంస్కారములును దేవు డేర్పఱచిన సాధనములై యున్నవి.—ఇవి ఆ దయగల పనికి (రక్షణకు) సాధనములై యుండుటచే కృపాసాధనములనబడును. వీటి ద్వారా మనుష్యులు క్రీస్తు రక్షణను పొందులాగున సంఘస్థులు దేవుని వాక్యమును ప్రకటింపజేసి, సంస్కారములను ఆచరింపజేయవలెను. పరిశుద్ధాత్మ వీటిద్వారా పనిచేయ ననుగ్రహించుటచే ఇవి కార్యసాధనములైన వగును. ఈ వాక్య సంస్కారములను జరుపువారికి గొప్ప శక్తిప్రభావము లుండుటనుబట్టి కాదు (1 కొరి. 2: 134) గాని పరిశుద్ధాత్మ వాటిద్వారా పనిచేయుటచే అవి దేవుని శక్తియై యున్నవి (రోమా 1: 16). మనుష్యులకు నూతన జన్మమును కలిగించి, మారుమనసు నొందించి, వారిని నూతనపఱచి పరిశుద్ధపఱచువాడు పరిశుద్ధాత్మయే గాని, ఆయన యీ దివ్య కార్యములను వాక్య సంస్కారముల ద్వారా నేచేయును.

2. వాక్యమును ప్రకటించుటకును, సంస్కారముల నాచరించుటకును, విశ్వాసులకు పాపక్షమను ప్రకటించుటకును. (యోహా 20: 23) దేవుడు క్రైస్తవ బోధకుల నేర్పఱచెను. సంఘస్థులు అట్టిబోధకులను క్రమముగా నేర్పఱచుకొని అపనికి ప్రత్యేకింపవలెను (కార్య. 14: 23; తీతు 1. 5.) అయితే వారు అపొస్తలులకు ప్రతిగా నుండువారు అని యనుకొనరాదు. అపొస్తలులు వాక్య బోధకులై యుండినను, వారు క్రీస్తుచేసినదానిని, ఆయన శ్రమలను చూచి ఆయన నోటిమాటలను విని వాటినిగూర్చి సాక్ష్యము చెప్పియుండుటచే వారు బోధకులకంటె నింక ఘనమైన యుద్యోగమును పొందినవారైరి. వారు చెప్పిన సాక్ష్యము సంఘమునకు పునాదియై యున్నది (ఎఫె. 2: 20).

బోధకులలో ఆయా తరగతు లున్నవా?—అట్టి తరగతులున్నట్టు క్రొత్త నిబంధనలో కనబడదు. 'అధ్యక్షులు' 'పెద్దలు' అను మాటలు ఒకటే యుద్యోగమునకు గల వేర్వేరు బిరుదులే గాని వేర్వేరు ఉద్యోగములను సూచింపవు. ఒకచోట పెద్దలని పిలువబడినవారు మఱియొకచోట అధ్యక్షులని పిలువబడుటచే ఈ రెండు బిరుదులును ఒకటే యుద్యోగమునకు చెందునని రూపింపగలము (కార్య. 20: 17, 28). అపొస్తలుల కాలమునకు తరువాత 'పెద్దలకంటె' 'అధ్యక్షులు' గొప్పవారై యున్నారను ఏర్పాటును మనుష్యులే చేసిరి గాని అపొస్తలుల కాలములో అది యట్లుండలేదు.

బోధకుల ధర్మములు.—బోధకులు దేవుని రాయబారులై యున్నారు. దేవునితో సమాధానపడుడని వారిద్వారా దేవుడు మనుష్యులను ప్రేరేపించును (7)

వారి మాట వినువారు క్రీస్తుమాటను వినినవారగుదురు; వారి మాటను నిరాకరించు వారు క్రీస్తుమాటను నిరాకరించినవారగుదురు. (లూకా 10: 16). వారు సమయ మందును. అసమయమందును మనుష్యులు వినినను, వినకపోయినను దేవుని వాక్యమును ప్రకటింపవలెను (2 తిమొ. 4: 2-5). దేవుడు తనకు నప్పగించిన సభవారిని వారు జాగ్రత్తగా చూచుకొనవలెను. (కార్య 20:28)' తమకు నప్పగింపబడిన వారి విషయము వారు లెక్క నప్పగింపవలెను కావున, సభవారు వారికి లోబడవలెను (హెబ్రీ 13: 17). వారు భక్తిగల నడతవిషయమైన మంచి మాదిరిని సభవారికి చూపవలెను (1 తిమొ 3: 2). బోధకులలోను ఒకానొకప్పుడు వేషధారులుంటున్నారని మనము దుఃఖముతో నొప్పుకొనవలసినదే గాని అట్టి వేషధారులైన బోధకులు జరుపు బాప్తిస్మ సంస్కారములు మొదలగునవి నిష్ఫలమగునని యనుకొనరాదు. ఎందుకనగా మనుష్యుల అపనమ్మకము దేవుని వాక్య వాగ్దానములను ఏమాత్రమును నిరర్థక పరచజాలవు (రోమా 3: 3; 2. తిమొ 2: 13).

---

## 21. దేవుని వాక్యమును గూర్చిన బోధ.

నీ వాక్యము నా పాదములకు దీపమును నా త్రోవకు వెలుగునై యున్నది. కీర్తన. 119: 105.

### భాగములు.

I. దేవుడు మనకు తన చిత్తమును బైలుపఱచుటఅత్యవసరము.
II. బైబిలులో ధర్మశాస్త్రము సువార్తను రెండు భాగము లున్నవి.
III. బైబిలు వ్రాసినవారు పరిశుద్ధాత్మచే నడిపింపబడి దానిని వ్రాసిరి.
IV. బైబిలు దేవుడు మన కిచ్చిన మార్గదర్శియై యున్నది.

### అనుదినవేద పాఠములు.

దేవుని ప్రత్యక్షతలు — కీర్తన 19.
దేవుని వాక్యము — కీర్తన 119: 105-120

| | |
|---|---|
| బైబిలు పరిశుద్ధాత్మ వేశమువల్ల కలిగెను. | 2 పేతురు 1. |
| బైబిలు పరిశుద్ధాత్మ వేశమువల్ల కలిగెను. | 2 తిమొ: 3: 14-4:8. |
| క్రీస్తు బైబిలుకు సారాంశమై యున్నాడు. | యోహా. 5: 30-47. |
| దేవుని వాక్యమును మనకు తెలిపినవారు. | హెబ్రీ 1. |
| దేవుని వాక్యమును మనము లక్షించవలెను. | హెబ్రీ 2. |

## వేదవాక్యములు.

I. 1. ఆకాశములు దేవుని మహిమను వివరించుచున్నవి. అంతరిక్షము ఆయన చేతి పనిని ప్రచురపరచుచున్నది (కీర్తన. 19: 1).

II. 2. పూర్వకాలమందు నానా సమయములలోను నానా విధములుగాను ప్రవక్తలద్వారా మన పితరులతో మాటలాడిన దేవుడు ఈదినముల అంతమందు కుమారుని ద్వారా మనతో మాటలాడెను (హెబ్రీ 1: 1, 2).

II. 3. ప్రవచన మెప్పుడును మనుష్యుని యిచ్ఛనుబట్టి కలగలేదు గాని మనుష్యులు పరిశుద్ధాత్మవలన ప్రేరేపింపబడినవారై దేవుని (సహాయము) చేత బోధించిరి (2 పేతురు 1: 21).

4. దైవజనుడు సన్నద్ధుడై ప్రతి సత్కార్యమునకు పూర్ణముగా సిద్ధపడి యుండునట్లు దేవావేశమువలన కలిగిన ప్రతిలేఖనము ఉపదేశించుటకును, ఖండించుటకును తప్పు దిద్దుటకును నీతియందు శిక్షచేయుటకును ప్రయోజనకరమై యున్నది (2 తి మొ. 3: 16-17)

5. ఆయన అనగా సత్యస్వరూపియైన ఆత్మవచ్చినప్పుడు మీరు సత్యమంతయు గ్రహించునట్లు ఆయన మిమ్మును నడిపించును; ఆయన తనంతట తానే ఏమియు బోధింపక వేటిని వినునో వాటిని బోధించి జరుగబోవు సంగతులను మీకు తెలియ జేయును (యోహాను 16: 13)

6. దేవుని వాక్యము సజీవమై బలముగలదై రెండంచులుగల యెటువంటి ఖడ్గముకంటెను వాడిగా నుండి ప్రాణాత్మలను కీళ్ళను మూలుగను విభజించునంతమట్టుకు దూరుచు, హృదయముయొక్క తలంపులను ఆలోచనలను శోధించుచున్నది (హెబ్రీ 4: 12)

IV. 7. లేఖనములయందు మీకు నిత్యజీవము కలదని తలంచుచు వాటిని శోధించుచున్నారు; అవే నన్నుగూర్చి సాక్ష్యమిచ్చుచున్నవి. (యోహా. 5: 39)

## వి వ ర ము.

సంఘపువారికి దేవుడు దప్పగించిన గొప్ప పనిని వారు చేయులాగున దేవుడు వారికి సనుగ్రహించిన ముఖ్యసాధనము దేవుని వాక్యమై యున్నది. అందులో దేవుడు తన సంగతులను మనుష్యులకు తెలియజేయును.

1. ఈవిధముగా దేవుడు తన చిత్తమును మనకు బైలుపఱచుట అత్యావసరము.—దేవుడున్నాడను సంగతిని భూమ్యాకాశములను చూడగా తెలిసి కొనగలము (1). అయితే వాటివలన మనము చేయవలసిన వేవియో, చేయ గూడని వేవియో ఏమాత్రమును తెలిసికొనలేము, మన స్వంత మనస్సాక్ష్యమువలన కొంత వఱకు మన ధర్మవిధులను తెలిసికొన గలమను మాట వాస్తవము (రోమా 2: 14-15). అయితే మనము పాపములో పడుటవలన మనలోని తప్పొప్పులను వివేచించు బుద్ధి కూడ చెడిపోయినందున (రోమా 1: 21-23) మనము వాటిని సరిగా గుర్తింపలేము ముఖ్యముగా క్రీస్తునందలి రక్షణమార్గమునుగూర్చి సృష్టిద్వారాను, మన మనస్సాక్ష్యము ద్వారాను కొంచెమైనను తెలిసికొనజాలము. ఇట్లుండగా మనము దేవుని చిత్తమును నెఱవేర్చుటకై దాని నెంతవఱకు తెలిసికొని యుండవలెనో నేర్చుకొనుటకు దేవుడు తన చిత్తమును మనకు బైలుపఱచుటకు అత్యావసరమై యున్నది. దేవుడు దానిని తెలియజేయకపోయిన యెడల మన మాయన ప్రేమనుగూర్చియు, కృపనుగూర్చియు కొంచమైనను తెలిసికొనలేము గనుక అట్టి ప్రకటన మనకు మిక్కిలి యవసరమైయున్నది. ఈ గొప్పసంగతులను దేవుడు బైబిలులో మనకు బైలుపఱచెను.

II. బైబిలులో ధర్మశాస్త్రము సువార్త యను రెండుభాగములు లున్నవి.—బైబిలు పాతనిబంధన, కొత్తనిబంధన యని రెండు భాగములుగ విభజింపబడెను. గ్రంథముల వరుసనుబట్టి కాక, బోధలరీతినిబట్టి విచారింపగా బైబిలును ధర్మశాస్త్రముగాను సువార్తగాను విభాగింపవలెను. మనము అనుసరింపవలసిన నీతి బోధలను తెలియజేయునది ధర్మశాస్త్రమనియు మనము రక్షణపొందుటకు మార్గమును చూపించునది సువార్తయనియు పిలువబడును. మనము సాధారణముగా పాతనిబంధనను ధర్మశాస్త్రమునుగాను, క్రొత్తనిబంధనను సువార్తనుగాను ఎంచుచున్నాము. అయితే శాస్త్రరీతిగా వీటిని పరిశీలన జేయగా రెంటియందును ధర్మశాస్త్రమునకు సంబంధించిన విషయములు, సువార్తకు సంబంధించిన విషయములు కలిసియున్నవి. అయినను పాతనిబంధనలో విశేషముగా ధర్మశాస్త్రమునకు సంబంధించిన విషయములును; కొత్తనిబంధనలో విశేషముగా సువార్తకు సంబంధించిన విషయములును కలవనుమాట నిజము పాతనిబంధనలోని సువార్తవిషయములు ప్రవచనములకు

సంబంధములైనవి. క్రొత్తనిబంధనలోని సువార్త విషయములు జరిగిన చరిత్రకు సంబంధములైనవి. పాతనిబంధన అసంపూర్ణమైనది; అయితే క్రొత్తనిబంధన దానిపూర్తి చేసెను. క్రొత్తనిబంధనలో దేవుడు తన్నుగూర్చిన సంగతులను పూర్ణముగా బయలు పఱచెను గనుక దానిని ఆయన వాక్యములో ముఖ్యభాగమునుగా నెంచవలెను. (హెబ్రీ. 2: 1—3).

III బైబిలు వ్రాసినవారు పరిశుద్ధాత్మచే నడిపింపబడి దానిని వ్రాసిరి.—(4) కావున బైబిలు దేవుని వాక్యమైయున్నది. అది దేవావేశము వలన కలిగెను. (4).

పాతనిబంధన దేవావేశమువలన కలిగినదని మన ప్రభువైన యేసు అనేక విధములుగా సాక్ష్యము చెప్పెను. ఆయన సాతాను శోధనల నెదిరించుచుండగా దేవుని వాక్యమును ఏమాత్రమును మీఱకూడదనియు, అది లోపరహితమైన సత్యమనియు నెంచి దానిని ఉపయోగించుకొనెను. (మత్త. 4:4, 7-10). ఆయనపాతనిబంధనను దైవగ్రంథమునుగా నెంచి బోధించునట్లు లూకా 10: 25, 26 లోను, మత్తయి 22:35-40 లోను దృష్టాంతరములు కనబడును. క్రొత్తనిబంధన గ్రంథకర్తలు పాతనిబంధన దైవ వాక్యమనియు, ఎదిరింపగూడని మూలసత్యమనియు నెంచిరి. ఇందుకు దృష్టాంతముగా 'ప్రవక్తలు మనుష్యుని యిచ్ఛనుబట్టి కాదుగాని పరిశుద్ధాత్మవల్ల ప్రేరేపింపబడిన వారై వ్రాసిరని' పేతురు వ్రాసెను. (3) మరియు ప్రతి లేఖనము దేవావేశమువలన కలిగినదని' పౌలు వ్రాసెను. (4).

క్రొత్తనిబంధనను చూడగా శిష్యులు సత్యమును గ్రహించునట్లు పరిశుద్ధాత్మ వారిని నడిపించునని క్రీస్తు చెప్పెను (5). ఈ వాగ్దానము పెండెకోస్తు దినమున శిష్యులమీద పరిశుద్ధాత్మ కుమ్మరింపబడినపుడు నెఱవేరెను (కార్య 2: 1-4). అపుడు మొదలు వారు మేము చెప్పునది ఆత్మావేశమువలననే చెప్పుచున్నాము కావున మా మాటలోనే తప్పు నుండదని తెలిసికొని పూర్ణ నిశ్చయతతో బోధించిరి (1. కొరి. 2: 13). తాము బోధించిన బోధకు భిన్నముగా ఆకాశ దూత బోధించినను ఆ దూత శపింపబడును గాక అనునంతటి ధైర్యము వారికుండెను (గల. 1: 18).

అపొస్తలు లొక విషయమునుగూర్చి ప్రకటించి మఱియొక విషయమును వ్రాయలేదు కావున వారు వ్రాసినవికూడ పరిశుద్ధాత్మావేశమువలననే కలిగినవని తెలిసికొనవలెను. 'మా నోటిమాట వలనైనను, మా పత్రికవలనైనను మీకు బోధింపబడిన విధులను చేపట్టుడి' (2. థెస్స. 2: 15) అని థెస్సలోనికే సంఘమునకు పౌలు వ్రాసినది చూడగా వారు తన ప్రసంగముల నెట్లు లక్షింపవలెనో అలాగుననే

తన పత్రికలను రక్షించి దానిని అందరికి వినిపింపవలెనని (1 థెస్స. 5: 27) వారికి నాజ్ఞాపించెను. తాను వ్రాయునది ప్రభువలన పొందిన యాజ్ఞ కాదని (1 కొరి 7: 10, 12) అతడొకచోట ఒప్పుకొనెను. మాట నిజమే. అయినను అదే అధ్యాయమందలి మఱియొక వచనములో తాను ఆత్మసహాయమువలన పలుకుచున్నట్లు వ్రాసెను (7:40.) ఇదియుగాక తాను వ్రాయునవి ప్రభువుయొక్క ఆజ్ఞలని మఱియొకచోట వ్రాసెను. (1. కొరి. 15: 37). మరియు థెస్సలోనికే సంఘస్థులు తన బోధలను 'మనుష్యుల వాక్యమని యెంచక అది నిజముగా నున్నట్లు దేవుని వాక్యమని దాని నంగీకరించిరి' (2. థెస్స. 2. 13) అని దేవునిని స్తుతించుచున్నాడు. ఇందునుబట్టి చూడగా పౌలు ఆత్మావేశము ద్వారా తన పత్రికలను వ్రాసెనని గ్రహింపగలము.

అపొస్తలులు పరిశుద్ధాత్మవలన నడిపింపబడి వ్రాసిరిగాని పరిశుద్ధాత్మవారు వ్రాయవలశిన ప్రతి మాటను ఉక్తలేఖనము రీతిగా వ్రాయించలేదు. పరిశుద్ధాత్మ బైబిలు గ్రంథకర్తల బుద్ధిని, భాషాశైలిని కొట్టివేయక తన సంగతులను మనుష్యులకు తెలుపుటకు వాటిని ఉపయోగించుకొనెను. వారు వేటిని వ్రాయవలెనో పరిశుద్ధాత్మవారికి తెలిపెను. మరియు దేవునిసంగతులను వ్రాయుటలో వారు తప్పులేవియు వ్రాయకుండునట్లు వారిని నడిపించెను. అయినను ఆ గ్రంథకర్తలలో ప్రతివాడును తన స్వంతశైలి ననుసరించి వ్రాసెను. యోహాను శైలియొకటి, పౌలు శైలి మఱియొకటి. ఒకానొకపుడు వీరు సాధారణ విషయములను కూడ వ్రాసిరి. దృష్టాంతముగా తనయంగీని తీసికొని రమ్మని పౌలు తిమొథెయుకు వ్రాసెను (2. తిమొ 4: 13). ఒకప్పుడు తిమొథెయునకు జబ్బువిషయము సలహాలు వ్రాసెను (1. తిమొ 5: 23). ఈగ్రంథకర్తల శైలి భేదముగ నున్నట్లు వారి వారి గ్రంథములలో కనబడినను పరిశుద్ధాత్మ వారితోకూడ నుండి వారిని నడిపించి పనిచేసెను కావున వారిగ్రంథములు ఆత్మావేశమువల్ల వ్రాయబడెనని తెలిసికొనవలెను. ఈ గ్రంథకర్తలు తమ గ్రంథములను వ్రాయుటలో తమ యావచ్ఛక్తిని ఉపయోగించుకొనిరని పౌలు వ్రాసిన లోతైన శాస్త్రసంబంధ విషయములను చూడగా స్పష్టమగును. అయితే యిది మాత్రము చాలదు. రక్షణమార్గమునుగూర్చి పరిశుద్ధాత్మ తెలుపగోరిన వాటినన్నిటిని లోపరహితముగా తెలుపులాగున వారు ఆయనచే నడిపింపబడి వ్రాసిరి.

సువార్త గ్రంథములను చూడగా ఆ గ్రంథకర్తల శైలిలో భేదములు కనబడును. మత్తయి, మార్కు లూకా యనువారు క్రీస్తుచర్యలను వివరించి వాటిద్వారా ఆయన దేవుడని చూపింతురు. అయితే యోహాను ఆయన దైవత్వమును మొదట వివరించి ఆయన చేసినవాటిలో దైవత్వమునకు తగిన కార్యములను చూపించును.

ఈ గ్రంథము లన్నిటిలోని చరిత్ర ఒకటేయైనను వాటిని వ్రాసినవారు తెలుపగోరిన వాటిని చూడగా వారియుద్దేశము వేఱు అని కనబడును. వారు నలుగురు వ్రాసిన వాటిని మొత్తముమీద చూడగా మనము దైవమానవుడైన క్రీస్తు సంగతులను పూర్ణముగా తెలిసికొనగలము.

వస్తుశాస్త్ర సంబంధమైన వాటిని కాదుగాని మత సంబంధమైన సత్యములను వ్రాయుటకై పరిశుద్ధాత్మ బైబిలు గ్రంథకర్తలను నడిపించెను.—బైబిలు గ్రంథకర్తలు మనకు మత విషయములను బోధించుటకు బైబిలును వ్రాసిరిగాని ఈ ప్రపంచములోని వస్తుశాస్త్రములను తెలుపుటకు కాదు. అట్టి శాస్త్రములను గూర్చి యితరులెంత మట్టున కెఱుగుదురో ఈ గ్రంథకర్తలును అంత మట్టునకే ఎఱుదురుగాని యింత యెక్కువ తెలిసినవారు కారు. ఇట్లుండినను ఆ శాస్త్రములకును బైబిలులో ఆశాస్త్రములను గూర్చి చెప్పబడి యున్నదానికిని వ్యతిరేకమేమియు లేదు. ఈ శాస్త్రములను పరిశీలించువారు తమ శాస్త్రజ్ఞానములో వృద్ధి నొందుకొలది బైబిలునకును వాటికిని గల యైక్యతను మఱి తేటగా గుర్తింతురు.

బైబిలు పరిశుద్ధాత్మావేశమువలన వ్రాయబడిన దనుటకు బైబిలే మంచి నిదర్శనమై యున్నది.—ఈ గ్రంథములో మనుష్యుల తెలివికి మించిన విషయములు వ్రాయబడియున్నవి. మనుష్యమాత్రులు తెలిసికొనలేని భవిష్యత్సంగతులు దానిలో ప్రకటింపబడియున్నవి. అన్యులలో నెంత గొప్ప పండితులైనను దీనిలో వ్రాయబడిన నీతులవంటి శ్రేష్ఠమైన నీతులను వ్రాయలేక పోయిరి. మనుష్యులందఱును పాపమువలన చెడియున్నారు. అన్యులలోని పండితులును ఆలాటివారే కావున వారు ఇంత దివ్యనీతులను వ్రాయలేరు. మఱియు మానవ కవిత్వములగు గ్రంథములకు లేని శక్తి బైబిలునకు గలదు. ఆశక్తి మొదటనుండి సంఘ చరిత్రలలో కనబడును. దీనిలోని వాక్యమును విన్నవారిలో నెంతో మంది నూతన ప్రవర్తన నవలంబించిరి. ఈ మార్పును పొందిన ప్రతివాని విషయమందొక యద్భుతము జరిగిన దనవలెను. అది దేవుని వాక్యముయొక్క శక్తివలననేగాని వేఱువలనను కలుగలేదు. ఈవాక్యము వినునప్పుడెల్ల అది బహు ఆశ్చర్యముగా మన మనస్సులకు పట్టును. అది మన హృదయములోని రహస్య పాపములను సహా గద్దించుచు వాటిని బైలుపఱచును (6).

IV. బైబిలు దేవుడు మన కిచ్చిన మార్గదర్శియై యున్నది—ఓర్పువలనను లేఖనములవలని ఆదరణవలనను మనకు నిరీక్షణ కలుగుటకై బైబిలు వ్రాయబడెను. (రోమా 15: 4). అది మన త్రోవకు వెలుగైయున్నది (ప్ర॥ వా॥) 8)

మనలను మోక్షమార్గమందు నడిపించుటకు చీకటిగల చోటున వెలుగిచ్చు దీపమైనట్టున్నది (2 పేతురు 1·19). మన మీలోకములో దేవునిగూర్చి తెలిసికొనవలసిన దంతయు అందులో నున్నది. మనము పశ్చాత్తాపడి విశ్వసించి మంచి నడతను అవలంబించుటకు తెలిసికొనవలసిన దంతయు దానిలో బయలుపరచబడెను. దాని సారాంశము క్రీస్తే (7). రక్షణకైన ఏక ఆధారము ఆయనే యని యది మనకు బోధించును. (కార్య 4: 12). సత్యమును తెలిసికొనుటకై బైబిలు లోపరహిత మైన మార్గదర్శియై యున్నది. మతబోధకులకు ఇది యొకటే లోపరహితమైన ఆధారమై యున్నది. మానవజ్ఞానము దానికి సాటికా నేరదు. దానికి వ్యతిరిక్తముగ బోధించువారు శాపగ్రస్తులు (గల 1: 9) అట్టివారి పేరులు జీవగ్రంథములోనుండి కొట్టివేయబడును (ప్రక 22: 18, 19), ఈ లోకమందు బైబిలును విననివారు మృతులలోనుండి ఒకడు లేచి వచ్చినను అతని మాటను కూడ వినరని క్రీస్తు చెప్పెను (లూకా 16: 31). ఇట్లుండగా మనమే అందులోని సంగతులను లక్షింపవలెను. లక్షింపనియెడల తప్పక నశింతురు.

---

## 22. బాప్తిస్మమునుగూర్చిన బోధ.

మీరు వెళ్ళి సమస్త జనులను శిష్యులనుగా జేయుడి. తండ్రి యొక్కయు కుమారుని యొక్కయు పరిశుద్ధాత్మ యొక్కయు నామములోకి సమస్త జనులకు బాప్తిస్మ మిచ్చుచు నేను మీకే యే సంగతుల నాజ్ఞాపించితినో వాటినన్నిటిని గైకొనవలెనని వారికి బోధించుడి. ఇదిగో నేను యుగసమాప్తి పర్యంతము సదాకాలము మీతో కూడనున్నాను. మత్త. 28: 19, 20.

### భాగములు.

I. బాప్తిస్మమనగా నేమి ?

II. బాప్తిస్మమువలని మేలు లెవ్వి ?

III. బాప్తిస్మముయొక్క వెలుపలి యాచార మెట్లుండెను ?

IV. అవిశ్వాసముచేత బాప్తిస్మమువలని మేలులను పోగొట్టుకొనగలము.

V. బాప్తిస్మమునకును నిర్ధారణకును గల సంబంధము.

## అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| బాప్తిస్మముయొక్క ఏర్పాటు | మత్తయి 28: 16-20. <br> మార్కు 16: 14-20. |
| 3,000 మంది బాప్తిస్మమునొందుట | కార్య 2: 37-47. |
| కుటుంబ సమేతముగా బాప్తిస్మము నొందినవారు | కార్య 16: 11-34. |
| బాప్తిస్మము నొందుటకు పిల్లలును తగినవారే | మత్త 18: 1-5. <br> మార్కు 10: 13-16. |
| బాప్తిస్మము అందరికిని అవసరమైయున్నది | యోహాను 3: 1-15. |
| బాప్తిస్మముయొక్క జ్ఞానార్థము | రోమా 6: 1-11. |
| మనము మన విశ్వాసము నొప్పుకొనవలెను | మత్త 10: 24-33 |

## వేదవాక్యములు.

I. మనము నీతి ననుసరించి క్రియల మూలముగా కాక, తన కనికరము చొప్పననే నూతనజన్మ సంబంధమైన స్నానము ద్వారాను, పరిశుద్ధాత్మ మనకు నూతన స్వభావము కలుగజేయుటద్వారాను మనలను రక్షించెను (తీతు 3: 5).

II. క్రీస్తు యేసులో నుండుటకు బాప్తిస్మము పొందిన మన మందర మాయన మరణములో పాలుపొందుటకు బాప్తిస్మముపొందితిమని మీ రెఱుగరా? (రోమా 6: 3).

III. వారందరు మోషేనుబట్టి మేఘములోను సముద్రములోను బాప్తిస్మము పొందిరి (1 కొరి 10: 2).

IV. యేసు అదిచూచి కోపపడి చిన్నపిల్లలను నాయొద్దకు రానియ్యుడి. వారి నభ్యంతరపెట్టవద్దు, దేవుని రాజ్యము ఈలాటి వారిదేయనెను (మార్కు 10: 14).

V. మనుష్యుల యెదుట నన్ను నొప్పుకొను వాడెవడో పరలోకమందున్న నా తండ్రియెదుట నేను వాని నొప్పుకొందును. మనుష్యుల యెదుట ఎవడునన్ను ఎఱుగ ననునో వానిని పరలోకమందున్న నా తండ్రియెదుట నే నెఱుగనందును (మత్త 10: 32, 33).

## వివరము.

యేసుక్రీస్తు పరలోకమున కెక్కిపోక పూర్వము మీరు సర్వలోకమునకు వెళ్ళి సమస్తజనులకు బాప్తిస్మమిచ్చి శిష్యులనుగా చేయుడి అని యాజ్ఞ నిచ్చి నమ్మి బాప్తిస్మ మొందినవాడు రక్షింపబడును. నమ్మనివానికి శిక్ష విధింపబడును (మార్కు 16: 16) అని చెప్పెను.

1 బాప్తిస్మ మనగానేమి?—క్రీస్తు ప్రభువుయొక్క ఆజ్ఞ ప్రకారము తండ్రియొక్కయు కుమారునియొక్కయు పరిశుద్ధాత్మయొక్కయు నామమున

ఒకనిమీద నీళ్ళను ప్రోక్షించుటగాని, చిలుకరించుటగాని, ఒకనిని నీళ్ళలో ముంచుట గాని బాప్తిస్మమై యున్నది. స్నానికుడైన యోహాను బాప్తిస్మమునకును, క్రీస్తు పరలోకమునకెక్కిన పిమ్మట ఆయన శిష్యులిచ్చిన బాప్తిస్మమునకును భేదము కలదు. యోహాను బాప్తిస్మము మారుమనస్సు విషయమైనది (కార్య 19: 4). మారుమనసు నొందినవారు పొందిన మార్పును అది వెలుపలి సూచనయై యున్నదేకాని అందులో విశేషమేమియు లేదు. క్రైస్తవ బాప్తిస్మములోని విశేష లక్షణ మేది యనగా క్రైస్తవ బాప్తిస్మము నొందువారు దానిద్వారా దేవుని శక్తి సహాయములను పొందెదరు. క్రైస్తవులకు విశేష దీవెనలు కలుగునట్లు పరిశుద్ధాత్మ యీ బాప్తిస్మము నొక సాధనముగా నుపయోగించును. ఈ సంస్కారమూలముగా పరిశుద్ధాత్మ చిన్నవారియందు ఆత్మీయమైన నూతన జన్మమును కలిగించును (1). మఱియు పెద్దవారు దేవుని వాక్యమువల్ల విశ్వాసులై అట్టి నూతనజన్మము నొందిన పిమ్మట వారీ సంస్కారము ద్వారా క్రమముగ క్రీస్తు రాజ్యములో చేర్చబడెదరు. (మత్త 28: 19).

II. బాప్తిస్మమువలని మేలు లెవ్వి?—బాప్తిస్మము నొందినవారు దేవుని వాక్య వాగ్దానములనుబట్టి దేవుని బిడ్డలై, క్రీస్తుయొక్క ప్రాయశ్చిత్తార్థమైన మరణమువలని మేలులలో పాలివారగుదురు. వారు బాప్తిస్మ మొందుటవలన క్రీస్తు మరణములో పాలిభాగస్థు లగుదురు (2). వారు నిజముగా విశ్వసించినయెడల క్రీస్తుయొక్క పుణ్యకార్యము లన్నిటిలో పాలిభాగస్థు లగుదురు (గల 3: 27). బాప్తిస్మమువలన వారి, పాపక్షమయు నిత్యజీవమును కలుగును (మార్కు 16: 16). అది పాపములను కడిగివేయును (కార్య 22: 16). అది పరిశుద్ధాత్మ మనకు నూతన స్వభావము కలుగజేయు నూతనజన్మ సంబంధమైన స్నానమై యున్నది (1) మనలను దత్తపుత్రులనుగా చేర్చుకొని, నిత్యజీవమునకు వారసులనుగా చేసికొనుటకు బాప్తిస్మము దేవుడనుగ్రహించిన మార్గమై యున్నది.

మనము బాప్తిస్మము పొందవలెనని క్రీస్తు ఆజ్ఞాపించినందువలనను, దానిని పొందిన వెంటనే ఆయన రక్షణకు సంబంధమైన దీవెనలన్నిటిని పొందగలమనువాగ్దానమిచ్చినందువలనను మనము బాప్తిస్మము నొందుట అవసరమై యున్నది. బాప్తిస్మమును నిర్లక్ష్యముచేసి దానిని పొందనొల్లనివారు క్రీస్తుకు అవిధేయులై ఈ సంస్కార మూలముగా ఆయన యనుగ్రహించు మేలులను పొందజాలరు. నయమాను తన కుష్ఠరోగమునుండి శుద్ధినొందుటకై యొర్దాను నదిలో స్నానముచేయవలసియుండునట్లు మనమును మన పాపమను కుష్ఠరోగమునుండి పవిత్రపరచబడుటకై బాప్తిస్మము నొందవలెను. యొర్దాను నీళ్ళు నయమానును బాగుచేయలేదను మాట వాస్తవమే. అయితే ఏడుమారులు అందులో స్నానము చేసిన యెడల నీవు స్వస్థత కలుగును అనుమాటను

దేవుడు తన ప్రవక్తలద్వారా పలికించెను. కావున స్నానము చేయనిది అతనికిస్వస్థత కలుగకపోవును (2 రాజులు 5: 8-14) అదేవిధముగా బాప్తిస్మములోని నీళ్ళు మన పాపమును కడిగివేయ జాలకపోయినను బాప్తిస్మ మొందినయెడల పాపక్షమయు రక్షణయును కలుగునని దేవుడు మాటయిచ్చియున్నాడు కావున బాప్తిస్మము లేనిది పాపవిముక్తి కలుగదు. బాప్తిస్మముతో చేర్చబడిన దేవుని వాగ్దానముల మూలముననే దానివలన మేలులు కలుగును. మఱియు మన విశ్వాసమువలన ఆ మేలులు మన స్వంతవి యగును.

III. బాప్తిస్మముయొక్క వెలుపలి యాచార మెట్లుండవలెను? —బాప్తిస్మమును నీళ్లు తలమీద చిలకరించుటచేత గాని,దేహము యావత్తును నీళ్లలో ముంచివేయుటచేతగాని ఆచరింపవచ్చును. ఈ రెండు విధములైన యాచారములును తగినవియేయైనను, చిలకరించుట యే అన్ని దేశములలోను, అన్ని కాలములలోను ఆచరించుటకు వీలుగా నుండునుగాని ముంచుట చిలుకరింపువలె వీలుగా నుండదు. దృష్టాంతముగా చలికాలములోను చలిప్రదేశములోను బాప్తిస్మమొంద గోరువారిని నీళ్ళలో ముంచుటకు వీలుగా నుండదు. మఱియు బాప్తిస్మ మొందగోరిన రోగులను రే విధముగ ముంచుటకు బొత్తుగా వీలుపడదు. క్రీస్తు సమస్త జనులకు బాప్తిస్మ మియ్యవలెనని యాజ్ఞాపించి యున్నాడు. కావున అందఱికి; రోగులకుకూడ సరిపడు ఆచారము ననుసరించి దాని యాచరింపకూడదా? చిలుకరించుట అన్ని సమయములకు సరిపడు ఆచారమగుటచే క్రైస్తవులలో నెక్కువమంది అ విధముగనే దాని నాచరింతురు. బాప్తిస్మ సంస్కారము నాచరించుటకు ఇన్ని నీళ్లుండవలెను లేనియెడల అది బాప్తిస్మముకాదు అను మాట యిక్కడ చెల్లదు. నీళ్లు కొంచమైనను, ఎక్కువైనను తండ్రి కుమార పరిశుద్ధాత్మల నామమున వాటిని ప్రోక్షించుట సరియైన బాప్తిస్మమగును.

కొందఱు బాప్తిస్మ మనుమాటకు అసలుభాషలో ముంచుటయనిగాక వేఱొక యర్థము లేదని వాదింతురు. బాప్తిస్మము అను మాట గ్రీకు మాటయై యున్నది. దానికి ముంచుటయని మాత్రముగాక కడుగుట యని కూడ అర్థము కలదు. మార్కు 7: 4. లో నున్నట్లు వాడబడిన మూలభాషాపదము కడుగుట యను అర్థముతో వాడబడెను. ఇశ్రాయేలీయులు ఎఱ్ఱసముద్రముగుండా వెళ్లుచుండగా వారేమాత్రము ముంచబడకపోయినను, వారిపైనున్నడిన మబ్బునుగూర్చి పౌలు వ్రాయునపుడు 'బాప్తిస్మము' అను మాటను ఉపయోగించుకొనెను (8)

అపొస్తలులు బాప్తిస్మ మిచ్చినరీతి తెలియకపోయినను, వారు పెంతెకొస్తు దినమున 3,000 మందిని (కార్య 2: 41) ఫిలిప్పీలోని చెఱసాల నాయకునిని

(కొర్య 16: 33), అతని కుటుంబమును నీళ్ళలో ముంచినారని నమ్ముటకష్టతరముగా నున్నది. ఎందుకనగా ముంచడముద్వారా బాప్తిస్మము నిచ్చుటకు చాలినంత నీరు ఆ రాత్రిలో చెఱసాలయందు దుండునని నమ్ముటకు సందేహింపవలెను. మఱియు యెరూషలేములో నీళ్లప్రవాహములు లేనేలేవు. యొర్దాను అను నొక నది తప్ప వేఱొకనది యెరూషలేము సమీపమున లేదు. అదియును యెరూషలేమునకు 18 మైళ్ళ దూరములో నున్నది. అపొస్తలులు బాప్తిస్మ మిచ్చిన రీతి తెలియక పోయినను, అది ప్రోక్షించుటవలన లేక, చిలుకరించుటవలన కలిగెను గాని ముంచుటవలన కాదని నమ్మవలసినట్లుగా నున్నది.

యేసు బాప్తిస్మము పొందిన విధమునుగూర్చి కూడ స్పష్టముగా చెప్పబడి యుండలేదు. అయన నీళ్ళలోనుండి వచ్చెను అను మాట మత్తయి 3: 16 లో నున్నదనుట నిజమే. అయినను అందునుబట్టి అయన ముంచబడెనని యనుకొనవలసిన యవసరము లేదు. ఏమనగా క్రీస్తు నీళ్ళలో నిలుచుచుండగా యోహాను అయన తల మీద నీళ్లు ప్రోక్షించెననుకొనుట కూడ తప్పు కానేరదు కదా! మన మీదృష్టాంతము లను చూడగా బాప్తిస్మము పొందవలసిన రీతి విషయమైన స్థిరమయిన యేర్పాటేదియు లేదుగాని, ప్రోక్షించుటవలన నైనను, చిలకరింపువలననైనను బాప్తిస్మము పొందదగు నని స్పష్టమగును.

IV. పిల్లలకు బాప్తిస్మమియ్యవలెనా? ఔను ఏసందేహము లేకుండ వారికి బాప్తిస్మమియ్యవలెనని క్రీస్తు అజ్ఞాపించెను. సహాస్త్ర జనులు అనుటలో అయన పిల్లలను మినహాయించినట్లు కనబడదు. దేవుని రాజ్యములో పిల్లలకు హక్కు కలదు (లూకా 18: 16, 17). అందరు జేసువారందరు పిల్లలస్వభావమువంటి స్వభావ మును కలిగియుండవలెను (మత్త 18: 13). పిల్లలు దేవుని రాజ్యమునకు తగినవారు కావున దానిలో చేరుటకు నియమింపబడిన బాప్తిస్మమును పొందుటకుకూడ వారు తగియున్నారు. "చిన్నపిల్లలను నాయొద్దకు రానియ్యుడి" యని క్రీస్తు అజ్ఞాపించెను (4) వారిని క్రీస్తు యొద్దకు రప్పించుటకై వారికి బాప్తిస్మ మిప్పించి, అయనను గూర్చి బోధించుటకంటె మంచి మార్గము లేనేలేదు. పాతనిబంధన కాలములో ఇశ్రాయేలీయులు తమ పిల్లలకు ఎనిమిదవ దినమున సున్నతి చేయించుటద్వారా దేవుని సంఘములో చెర్చిరి. ఇట్లుండగా క్రొత్తనిబంధన కాలములో పిల్లలు దేవుని సంఘములో చేరుటకు హక్కులేదనుట కేవలము అసందర్భముగా నున్నది. పేతురు ఆ వాగ్దానము మీకును మీపిల్లలకును దూరస్థు లందరికిని చెందునని చెప్పెను (కొర్య 2: 39) అపొస్తలులు విశ్వసించిన కొందరికి కుటుంబసమేతముగ బాప్తిస్మము.

నిచ్చినట్లు కనబడును (కార్య 10; 16: 15, 34). అపొస్తలులచే బాప్తిస్మమొందిన యీ రెండు లేక మూడు కుటుంబములలో పిల్లలు బొత్తిగా లేరని చెప్పగలమా?

పిల్లలుగూడ పాపులై యుండుటనుబట్టి వారికి బాప్తిస్మము అవసరమై యున్నది. పిల్లలు క్రియలవల్ల పాపముచేయక పోయినను, స్వాభావికముగా పాపులై యున్నారు (యోబు 14: 4; యోహా 3: 6). వారు పెరుగుచుండగా వారిలోని దుష్టబుద్ధి కూడ వికసించి వృద్ధి నొందును. అనేకమందిపిల్లలు చనిపోవుదురు. దీనిని బట్టి చూచినను వారు పాపులని చెప్పగలము. ఎందుకనగా మరణము పాపము యొక్క బలమైయున్నది (రోమా 5: 12). పిల్లలును పాపులై యున్నారు కావున వారికికూడ నూతనజన్మము అవసరమై యున్నది. అది లేనిది వారు దేవుని రాజ్యములో ప్రవేశింపలేరు (యోహా 3: 3). వెలుపలి యాచారము లేకుండ పరిశుద్ధాత్మ నూతన జన్మము కలిగింపగలడని నమ్మవచ్చును. అయితే నూతనజన్మమును కలిగించుటకు ఆయన బాప్తిస్మమును సాధనముగా చేసికొని దానిద్వారానే సాధారణముగా నూతనజన్మమును కలిగించుచున్నాడు. కావున మనము పిల్లల విషయములో ఈ సంస్కారము నేమాత్రమును నిషేధింపరాదు (యోహా. 3: 5, తీతు 3:5

బాప్తిస్మమువలని మేలు లనుభవించుకొనుటకు విశ్వాసము అత్యవసరము.—బాప్తిస్మము పొందినవాడు కాదుగాని నమ్మి బాప్తిస్మము పొందినవాడు రక్షింపబడును; నమ్మని వానికి శిక్ష విధింపబడును (మార్కు 16: 16) అని క్రీస్తు చెప్పెను. మనము బాప్తిస్మమువలన దేవుని దత్తపుత్రులముగా నంగీకరింపబడి ఆయన బిడ్డలమగుదుము. అయితే పిల్లలు ఏలాగు అవిధేయతవల్లను, తిరుగుబాటు చేయుటవల్లను తమ హక్కులను పోగొట్టుకొందురో అలాగు బాప్తిస్మము పొందినవారు కూడ తమ దుర్మార్గతవలనను, అవిశ్వాసమువలనను తమ కుమారస్థితిని పోగొట్టుకొందురు. ఈ విధముగ వారు దేవుడు తన భక్తులకు నిచ్చు మహిమగల స్వాస్థ్యము పోగొట్టుకొందురు (1. పేతురు 1: 4)

ఇట్లుండినను అవిశ్వాసులు మఱల గుణపడిన యెడల వారికి మరల బాప్తిస్మమియ్యవలసిన పని లేదు. బాప్తిస్మముద్వారా దేవుడు మనతో నిత్యమైన ఒడంబడికను స్థిరపరచును. మన మా యొడంబడికను మీరినను దేవుడు దాని నెన్నడును మీరడు. ఆయనవాగ్దానములన్నియు నిశ్చయములై యున్నవి (2 కొరి 1: 20). మనము అవిశ్వాసులమగుటచే ఆయన విశ్వసింప దగనివాడని ఏమాత్రము ననుకొనరాదు (రోమా 3: 3). బాప్తిస్మము నొందినవారు నశించినయెడల అది వారిలోని అపనమ్మకమువలననే కలుగునుగాని, దేవుడు వారియెడల దయ చూపకపోయినందున కాదు. ఎందుకనగా దేవుడు ఆడిన మాట తప్పనివాడు. బాప్తిస్మముయొక్క

షరతులు గైకొనువారందఱును దానివలని మేలులను పొందుదురు; వాటినిమీరు వారా మేలులను పోగొట్టుకొందురు. అయినను వాటిని మీరువారు పశ్చాత్తాపపడి మఱచి దేవుని తట్టు తిరిగినయెడల వారా మేలులను మఱల ననుభవింతురు. వీని స్థితి తప్పి పోయిన కుమారుని స్థితివంటిదై యున్నది. అతడు మఱల తండ్రియొద్దకు తిరిగి వచ్చినప్పుడు క్రొత్తగా దత్తపుత్రత్వమును పొందవలెనని యనుకొనరాదు. ఎందుకనిన తండ్రి యతని క్షమించి చేర్చికొనినయెడల అతని మొదటి కుమార స్థితి అతని యెడల నింకను చెల్లునుగదా (లూకా 15: 11-24) ఆ విధముననే బాప్తిస్మముపొందితప్పి పోయిన వారు తిరిగి గుణపడినయెడల వారిని సంఘములో చేర్చికొనుటకు మఱల బాప్తిస్మ మియ్యవలసిన యవసరము లేదు.

V. బాప్తిస్మమునకును నిర్ధారణకునుగల సంబంధమేమి?—నిర్ధారణకును పిల్లల బాప్తిస్మమునకును చాల సంబంధమున్నది. చిన్నతనమందు బాప్తిస్మ మొందినవారు తమకు యుక్తవయస్సు వచ్చినపుడు బోధకులవల్ల మతాంశము లను నేర్చుకొనినపిమ్మట తమ పసితనమందు తమ పక్షముగా యితరులు ఒప్పుకొనిన వాటిని వారు స్వయముగా నొప్పుకొందురు. ఇదియే వారి నిర్ధారణ కాలము. అపుడు వారు విశ్వాసప్రమాణములోని అంశములను మాత్రముగాక, దేవునిని ఆయన వాక్యమును స్వయముగా నమ్మి హృదయపూర్వకముగా ఆయనను సేవించెదమని యొప్పుకొందురు. ఇట్లు ఒప్పుదల చేసినవారిపై వారి పాస్టరు (గురువు) హస్త నిక్షేపణ ము చేయును. మఱియు వారు నిజమైన భక్తులై అంతకంతకు శుద్ధులగునట్లు దేవుడు వారికి తన పరిశుద్ధాత్మ ననుగ్రహింపవలెనని పాస్టరును, సభవారును వారికొఱకు ప్రత్యేక ప్రార్థనను చేయుదురు. ఈ విధముగ నిర్ధారణ పొందినవారు ప్రభురాత్రి భోజనసంస్కారములో పాలిభాగస్థులగుటకు హక్కుదారులగుదురు. బాప్తిస్మకాల మందే వారు సంఘములో చేరినవారైరి గాని నిర్ధారణ నొందుటచే ఆ సంఘములో పూర్ణ హక్కులు గలవా రగుదురు.

ఈ విధముగ నిర్ధారణ నియ్యవలెనను ఆజ్ఞ బైబిలులో లేకపోయినను, అది బైబిలు బోధకు భిన్నముగా నుండక దానికి ననుగుణ్యముగా నున్నది. బాప్తిస్మము నొందువారికి తాను ఆజ్ఞాపించినవాటి నన్నిటిని బోధింపవలెనని క్రీస్తు తన శిష్యుల కాజ్ఞాపించెను (మత్త 28: 20). మఱియు రక్షణ పొందగోరువారు తనను మనుష్యు లయెదుట ఒప్పుకొనవలెనని సెలవిచ్చెను (V) నిర్ధారణ నొందువారికి ముందుగా క్రీస్తు సంగతులను బోధింతురు. తరువాత వారు క్రీస్తునందు విశ్వసించుచున్నామని స్వయముగా నొప్పుకొందురు. కావున నిర్ధారణ నొందువారు పై చెప్పినట్లు క్రీస్తు యిచ్చిన ఆజ్ఞలోని వాటినిగైకొందురు.

## 23. ప్రభురాత్రిభోజనమును గూర్చినబోధ.

మనము దీవించు ఆశీర్వచన పాత్రలోనిది త్రాగుట క్రీస్తు రక్తములో పాలు పుచ్చుకొనుటయే. మనము విరుచు రొట్టె (తినుట) క్రీస్తు శరీరములో పాలు పుచ్చుకొనుటయే. 1 కొరి. 10: 16.

### భాగములు.

I. ప్రభురాత్రిభోజనముయొక్క యేర్పాటు.

II. ప్రభురాత్రిభోజనమనగా నేమి?

III. ప్రభురాత్రిభోజనమువలని మేలు లెవ్వి?

IV. ప్రభురాత్రిభోజనమును పుచ్చుకొనవలసినదెట్లు?

V. ప్రభు రాత్రిభోజనమునకు సంబంధించిన యితర విషయములు.

1. దాని బిరుదులు, వాటి భావములు.
2. దాని నాచరింపకమునుపు పాపము నొప్పుకొనుటయును పాపక్షమను పొందుటయును చేయబడు ప్రత్యేకారాధనము.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| ప్రభురాత్రిభోజనముయొక్క యేర్పాటు | మత్త. 26: 17-30. |
| ప్రభురాత్రిభోజనముయొక్క యేర్పాటు | మార్కు 14: 12-26. |
| ప్రభురాత్రిభోజనముయొక్క యేర్పాటు | లూకా 22: 14-34. |
| ప్రభురాత్రిభోజనముయొక్క యేర్పాటు | 1 కొరి. 11: 23-34. |
| క్రీస్తు శరీర రక్తములలో పాలివారగుట | 1 కొరి. 10:14-22. |
| మనము మన పాపముల నొప్పుకొనవలెను. | 1 యోహా. 1. |
| పాపక్షమను ప్రకటించుటకు క్రీస్తు అధికారమిచ్చుట. | యోహా. 20: 19-23. |

### వేదవాక్యములు.

(వివరణమందలి 1 భాగములో వ్రాయబడిన వేదవాక్యములు చూడుడి)

I ప్రభురాత్రిభోజనముయొక్క యేర్పాటు.— మన ప్రభువైన యేసుక్రీస్తు ఈ సంస్కారమును ఏర్పఱచిన విధము 1 కొరి. 11: 23-35; మత్త. 26: 26-28; మార్కు 14 : 22-24; లూకా 22 : 19, 20 వచనములలో వ్రాయబడి యున్నది. ఎట్లనగా:

"మన ప్రభువైన యేసుక్రీస్తు తాను అప్పగింపబడిన రాత్రిరొట్టెతీసికొని స్తోత్రముచేసి, దానిని విరిచి తన శిష్యులకిచ్చి, మీరు పుచ్చుకొని తినుడి. ఇది మీకొఱకు ఇయ్యబడుచున్న నాశరీరమైయున్నది. నన్ను జ్ఞాపకము చేసికొనుటకు దీనిని చేయుడని చెప్పెను. ఆప్రకారమే భోజనమైనతరువాత ఆయన పాత్రను తీసికొని స్తోత్రముచేసి, దానినివారికిచ్చి,దీనిలోనిది మీరందఱు త్రాగుడి. ఈపాత్ర పాపముల క్షమ నిమిత్తము మీకొఱకును అనేకుల కొఱకును చిందింపబడుచున్న నారక్తమువలననైన క్రొత్త నిబంధనయై యున్నది. మీరు దీనిని త్రాగునపుడెల్ల నన్నుజ్ఞాపకము చేసికొనుటకు దీని చేయుడ"ని చెప్పెను.

II. ప్రభురాత్రిభోజన మనగా నేమి? — "పుచ్చుకొని తినుడి. ఇది మీకొఱకియ్యబడిన నాశరీరము మీరందఱు త్రాగుడి; ఇది పాపముల క్షమ నిమిత్తము మీకొఱకును అనేకుల కొఱకును చిందింపబడుచున్న నారక్తమువలననైన క్రొత్తనిబంధన," అని క్రీస్తు చెప్పిన మాటలను చూడగా ఈ సంస్కారమును పుచ్చుకొనువారికి రొట్టెతోడను ద్రాక్షారసముతోడను క్రీస్తు తన శరీర రక్తముల నిచ్చునని తేటగా తెలిసికొనగలము.

ఈ సంస్కారములో వాడబడు భూసంబంధమైన పదార్థములు:—క్రీస్తు ఈ సంస్కారము నేర్పఱచినపుడు రొట్టెను ద్రాక్షారసమును వాడినందున మనము ఈసంస్కారమాచరించునపుడు వాటినే కాని మఱి వేటినైనను ఉపయోగింప కూడదు. చాలమంది పులియని రొట్టెను వాడెదరు. దీనిని లూథరన్ సంఘములో సాధారణముగా నుపయోగింతురు. యూదులు పులియని రొట్టెలను వాడిన పస్కాపండుగ సమయములో క్రీస్తు ఈ సంస్కారము నేర్పఱచెను గనుక ఆయన పులియని రొట్టెనె వాడెననుటకేసందేహము లేదు.

రొట్టెతోడను ద్రాక్షారసముతోడను నియ్యబడునవేవి?— ఈ సంస్కారములో మనము వట్టి రొట్టెను ద్రాక్షారసమును మాత్రము పుచ్చుకొందుమనుకొనరాదు. మఱియు రొట్టెయు ద్రాక్షారసమును ఆత్మీయవరములనుసూచించునట్టి సూచనలే యని యెంచరాదు. వాటిమూలముగా మనము క్రీస్తు శ్రమమరణాదులను జ్ఞప్తిచేయవలసినదనుట వాస్తవమే (1 కొరి. 11:26). అయితే యివి ఆయనను జ్ఞప్తి

యుటకు సాధనములేగాని ఇందులోను మరేదియు లేదని తలంపరాదు. రొట్టె క్రీస్తు శరీరమును ద్రాక్షారసము ఆయన రక్తమును సూచించును. ఇంతియకాదు, మన కిది యెంత యగోచరముగనున్నను, క్రీస్తుయొక్క నిజరక్తమును పుచ్చుకొనుట కివి సాధనములై యున్నవి.

రొట్టెయు ద్రాక్షారసమును ప్రతిష్ఠింపబడిన పిమ్మట నవి యిక రొట్టెగను ద్రాక్షారసముగను నుండక, క్రీస్తు శరీర రక్తములుగ మార్చబడెనని రోమను కథోలిక్ వారందురు. మన మట్లనుకొనరాదు. ఆ సంస్కారాచరణ యావత్తులో రొట్టె రొట్టెగాను, ద్రాక్షారసము ద్రాక్షారసముగా నుండును (1. కొరి. 11: 28). అయితే ఆరొట్టెను ద్రాక్షారసమును పుచ్చుకొనుటలో మనము క్రీస్తు శరీర రక్తములను పుచ్చు కొనుచున్నాము. అవియెట్లు క్రీస్తుశరీర రక్తము లాయెనని విచారించుట మన పని కాదుగాని, ఇది నా శరీరము, నా రక్తము, అని క్రీస్తు చెప్పెను కావున అవి యాయన శరీర రక్తము లౌనని నమ్ముటయే మన పనియైయున్నది. దీనిగూర్చి గ్రహించుట మనపని కానుగాని నమ్ముటయే ప్రధానము. క్రీస్తు శరీర రక్తములు ఆ రొట్టెతోను ద్రాక్షారసముతోను కలపబడు ననుట లూథరను వారియభిప్రాయమని లూథరను సంఘస్థులు కాని వారిలో ననేకులు అనుకొందురు. కాని అది పొరబాటు. క్రీస్తు ఈ సంస్కారములో నుండు విధము తెలియదు. అది మర్మముగా నున్నది. అయి నను ఆయనను దానిలో నున్నాడనియు, మన పాపములను పరిహరించుటకు ఆయన యనుగ్రహించిన తన శరీర రక్తముల నీ రొట్టెను ద్రాక్షారసమును మనము పుచ్చుకొను ట ద్వారానే మనము ననుగ్రహించునవియు (1. కొరి. 11: 28, 29) లూథరను వారభిప్రాయపడుచున్నారు. దేవుడు తన కృపను మన కిచ్చుట కేర్పరచిన సాధన మై యున్నది గనుక ఈ సంస్కారము కృపాసాధనమై యున్నది.

ఈ సంస్కారమును ఒక మర్మముగా నెంచవలెను.—బైబిలు లోనున్న యనేక మర్మములలో నిది యొకటియైయున్నది. అయితే నికొదేమువలె (యోహా. 3: 9) నిట్టి మర్మములను గ్రహించుకొనలేక పోయినను క్రీస్తును ఆయన వాక్యమును నమ్ముటయే విశ్వాసుల లక్షణమై యున్నది. క్రీస్తు శిష్యులలో కొంద రు ఆయన బోధలను గ్రహించుకొనలేక వెనుకపడిరి (యోహా. 6: 66). మనము వారివలె నుండక మన బుద్ధి స్వల్పమైనదని తెలిసికొని, క్రీస్తు వాటిని తెలియజేసిన రీతిగా వాటిని నమ్మవలయును.

III. ప్రభురాత్రిభోజనమువలని మేలు లెవ్వి.— మన పాపములు రూఢిగా క్షమింపబడునను నిశ్చయత మనకు కలుగునట్లును, ఈ విధముగా పాప

పీడితులమైన మనము తరింపబడునట్లును, మనవిశ్వాసము బలపడునట్లును, ఈ సంస్కారము ఏర్పడియున్నది. ఇందులో మనము క్రీస్తు శరీరమును, పాపక్షమ కలుగుటకు చిందింపబడిన క్రీస్తురక్తమును అనుగ్రహింపబడుదుము. క్రీస్తు తన శ్రమ మరణాదులవలన సంపాదించిన ప్రతి మేలు ఈ సంస్కారములో విశ్వాసులకు లభించును. ప్రతి వాడును ఈ సంస్కారమును వేఱుగా పుచ్చుకొనుటచే తనకొఱకు క్రీస్తుయొక్క శరీరరక్తము లప్పగింపబడెనని అతడు నిశ్చయత నొందును. కావున యిది మఱి యాదరణకరముగా నున్నది. ఈ సంస్కారములో క్రీస్తు ప్రతి వానిని సమూహమునుండి ప్రత్యేకించి తన యాదరణల నతనికి ప్రత్యేకముగా నిర్ధారణ చేయును.

IV. ప్రభురాత్రిభోజనమును పుచ్చుకొనవలసిన దెట్లు:—సంస్కారమును పుచ్చుకొనువారు దానిని యోగ్యముగా పుచ్చుకొనులాగున ముందుగా తమ్మును తాముపరీక్షించి సిద్ధపడవలెను (1. కొరి. 11: 28). దానిని పుచ్చుకొను అవిశ్వాసులు కూడ క్రీస్తు శరీర రక్తములను పుచ్చుకొందురుగాని అది ప్రభువు శరీరమని వివేచింపక తిని త్రాగెదరు కావున అది వారి శిక్షా విధికి కారణమై శాపాస్పదమగును (1. కొరి. 11:29). దేవుని వాక్యము విని దాని నమ్మనివారికి అది యేలాగు మఱి గొప్పశిక్షకు కారణమగునో, అలాగు అవిశ్వాసులై సంస్కారము పుచ్చుకొను వారికి దానివలన మఱి గొప్ప శిక్ష కలుగును. ఎవరు పశ్చాత్తాపపడి తమ పాపముల విషయము విచారపడి, క్షమాపణను కోరి, క్రీస్తు పేరట తమ్మును క్షమించెనని నమ్మెదరో వారికి యీ సంస్కారమువలని మేలులు కలుగును గాని యితరులకు కలుగ నేరవు.

V. ప్రభురాత్రిభోజనమునకు సంబంధించిన యితర విషయములు.—(1) దాని బిరుదులు, వాటి భావములు, ప్రభువు తన శిష్యులతో రాత్రి యందు చేసిన భోజనసమయములో దాని నేర్పఱచెను కావున అది ప్రభు రాత్రి భోజన మనబడును.—ఈ సంస్కారములో క్రీస్తు మనకు ఆత్మీయ విందును పెట్టుచున్నారు కావున అది ప్రభుని బల్ల (1. కొరి. 10: 21) యనబడును. దీనిలో రొట్టెకును ద్రాక్షారసమునకును క్రీస్తు శరీర రక్తములకును సంబంధముండుట చేతను, విశ్వాసులు క్రీస్తుతోను, ఒకరితో నొకరును సహవాసము కలిగియుండుట చేతను, పరిశుద్ధ సమభాక్త్వ మనబడును. (1. కొరి. 10: 16, 17) సంస్కారము నాచరింపుచుండగా చేయబడు విశేష కృతజ్ఞతాస్తుతులనుబట్టి దీనికి కృతజ్ఞత యని అర్థమిచ్చు యూకరిస్టు అను గ్రీకు పదము కూడ వాడెదరు.

(2) సంస్కారమును ఆచరింపక మునుపు పాపములను ఒప్పుకొనుటకును పాప క్షమాపణ నొందుటకును చేయబడు ప్రత్యేకారాధన.—ఇట్టి యారాధనను జరుపుట మన సంఘములలో వాడుక యున్నది. సంస్కారమును యోగ్యముగా పుచ్చుకొనుటకు సిద్ధపడుటయే యిట్టి ఆరాధనయొక్క ఉద్దేశము. ఈ యారాధనలో మనము మన పాపముల నొప్పుకొని, క్రీస్తునందు విశ్వాసముంచుచున్నామను మాట నిచ్చి, ఇకమీదట నూతన ప్రవర్తన నవలంబింతుమని వాగ్దత్తము చేయుచున్నాము. మఱియు గురువు ఎవరి పాపములు పరిహరించునో అని వారికి పరిహరింపబడును; ఎవరి పాపములు నిలిచియుండనిచ్చునో అవి వారికి నిలిచియుండును. (1 యోహా॰ 20: 23) అని క్రీస్తువలన తాను పొందిన యధికారమునుబట్టి పశ్చాత్తాపపడి విశ్వసించిన వారి పాపములు పరిహరింపబడి యున్నవనియు, గుణపడి విశ్వసింపని వారి పాపములు నిలిచి యుండుననియు తండ్రి కుమారపరిశుద్ధాత్మయను త్రైక దేవుని నామమున ప్రకటన చేయును.

---

## 24. శరీరమరణమును పునరుత్థానమును గూర్చిన బోధ.

ఆదామునందు అందరు ఏలాగు మృతిపొందుచున్నారో ఆలాగుననే క్రీస్తునందు అందఱును బ్రతికింప బడుదురు. 1 కొరి 15: 22.

### భాగములు.

**I.** మరణమును గూర్చిన బోధ.

1. మరణము పాపమువలన కలిగినది.
2. దాని కాలము మనకు తెలియక పోయినను, దానివలననె మన జీవిత కాలాంతము నియమింపబడును.
3. క్రీస్తు మరణభీతిని కొట్టివేసెను.
4. మోక్షములో చేరుటకు తగిన శరీరము కలుగునట్లు మరణము అవసరమైయున్నది.

**II.** పునరుత్థానమును గూర్చిన బోధ.

1. పునరుత్థానము అంత్యదినమున జరుగును.
2. మన స్వంత శరీరముతోనే లేతుము గాని అది మహిమపఱచబడినదై యుండును.

## అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| మరణము పాపమువలన కలిగెను | ఆది 3. |
| క్రీస్తు మరణభీతిని కొట్టివేసెను | హెబ్రీ 2: 8-18. |
| క్రీస్తు పునరుత్థానము | లూకా 24: 1-35. |
| క్రీస్తు పునరుత్థానము | లూకా 24: 36-53. |
| మనుష్యుల పునరుత్థానము | 1 థెస్స 4: 13-18. |
| మనుష్యుల పునరుత్థానము | 1 కొరి 15: 1-34. |
| మనుష్యుల పునరుత్థానము | 1 కొరి 15: 35-58. |

## వేదవాక్యములు.

I. 1. ఒక మనుష్యునిద్వారా పాపమును, పాపముద్వారా మరణమును లోకములో నేలాగు ప్రవేశించెనో, మనుష్యులందరు పాపముచేసినందున అలాగుననే మరణము అందరికిని సంప్రాప్తమాయెను (రోమా 5: 12)

2. మాకు జ్ఞానహృదయము కలుగచేయుము, మా దినములు లెక్క పెట్టుటకు మాకు నేర్పుము (కీర్త 90: 12)

3. ఓ మరణమా నీ విజయ మెక్కడ? ఓ మరణమా నీ ముల్లెక్కడ? మరణపు ముల్లు పాపమే. పాపమునకు నున్న బలము ధర్మశాస్త్రమే. అయినను మన ప్రభువైన యేసుక్రీస్తుమూలముగా మనకు జయము ననుగ్రహించుచున్న దేవునికి స్తోత్రము కలుగునుగాక. (1 కొరి. 15: 55-57).

4. సహోదరులారా, నేను చెప్పునదేమనగా రక్తమాంసములు దేవుని రాజ్యమును స్వతంత్రించుకొన నేరవు. క్షయత అక్షయతను స్వతంత్రించుకొనదు. (1 కొరి 15: 50).

II. 5. దీనికి ఆశ్చర్యపడకుడి ఒకసమయము వచ్చుచున్నది. ఆసమయమున సమాధులలో నున్నవారందరాయన శబ్దము విని మేలుచేసినవారు జీవ పునరుత్థానమునకును కీడుచేసినవారు తీర్పు పునరుత్థానమునకును బైటికి వచ్చెదరు (యోహా 15: 28, 29)

6. మన పౌరస్థితి పరలోకమందున్నది; అక్కడనుండి ప్రభువైన యేసుక్రీస్తను రక్షకునిరాక నిమిత్తము కనిపెట్టుకొని యున్నాము. సమస్తము తనకు లోపరచుకొన జాలినశక్తిని బట్టి ఆయన మన దీన శరీరమును తన మహిమగల శరీరమునకు సమరూపము కలదానినిగా మార్చును (ఫిలి 3: 20, 21).

## వి వ ర ము.

1. మరణమును గూర్చిన బోధ.—క్రీస్తు తిరిగి వచ్చినప్పటికి సజీవులుగా నుండువారు తప్ప (1 కొరి. 15: 51) తక్కిన వారందఱును చనిపోయి యుందురు (కీర్తన. 90: 10). దేహము ఏమట్టిలోనుండి చేయబడెనో (ఆది. 3: 19) ఆ మట్టి పాలగును (ప్రస. 12: 7). అయితే అంత్యదినమున దేహము మరల బ్రతికింపబడి ఆత్మకు నిత్య నివాసస్థాన మగును.

1. మరణము పాపమువల్ల కలిగెను.—పాపము లేకపోయినయెడల శరీరమును ఆత్మవలెనే అమరత్వము కలది యగును కావున మరణమే యుండక పోవును. అయితే పాప మీ లోకములోనికి రాగా దాని వెంట మరణమును వచ్చెను. మరణము పాపమునకు ఫలితమై యున్నది (ఆది 2: 17; రోమా 6:23). అందఱును పాపు లగుటచే మరణము అందఱికి కలుగును (1) పాపముండుటవలననే మనుష్యు డొక్కసారే మృతి బొందవలెనని నియమింపబడెను (హెబ్రీ 9: 27).

2. దాని కాలము మనకు తెలియకపోయినను, దాని వలననే మన జీవిత కాలాంతము నియమింపబడును.—వాన రాకడ ప్రాణము పోకడ ఎవరికి తెలియదు (యాకో. 4: 13-15). చిన్నవారును పెద్దవారును చావున లోనగుదురు. మన యంతము ఆకస్మాత్తుగా రావచ్చును; దీర్ఘ వ్యాధికి పిమ్మట రావచ్చును; అయితే మన మవశ్యము చనిపోనుమను విషయమునుగూర్చి మాత్రమే సందేహములు లేవు (ప్రస. 9: 12). కావున మరణము వచ్చునప్పుడు మనము దేవుని యెదుట నిలువబడుటకు సిద్ధముగా నుండులాగున మనము అనుదినమును పశ్చాత్తాపపడి విశ్వసించుటయే తగిన బుద్ధియై యున్నది.

మన మరణకాలము మనకు తెలియకపోయినను దేవుడు మన జీవిత కాలాంతమును నియమించెనని తెలిసికొనవలెను (2). ఆయన జీవితకాలమున కొక హద్దును నియమించెను; మనము దానిని దాటలేము. మనుష్యు లెంతగా ప్రయాసపడినను, ఎంత జాగ్రతగా నుండినను ఆ నియమితకాలముకంటె నెక్కువ కాలము జీవింపజాలరు (ప్రస. 8: 8). ఆ కాలముకంటె నెక్కువ కాలము జీవించుట యసాధ్యమను మాట నిజమే గాని, దానికంటె తక్కువ కాలము జీవించుట సాధ్య మగును. ఎందుకనగా మనుష్యులలోననేకులు తమ శరీరారోగ్యమునుగూర్చి నిర్లక్ష్యముగా నుండుటచేతను, పోకిరితనముచేతను, దుర్మార్గతచేతను, త్రాగుబోతుతనముచేతను దేవుడు నియమించిన కాలమువఱకు జీవించక అంతకు మునుపే చనిపోదురు (కీర్తన 55: 23).

3. క్రీస్తు మరణ భీతిని కొట్టివేసెను.—మనుష్యులకు మరణ భీతి యుండుట సహజము. అవిశ్వాసులకు అదిసహజముగా భయంకరమైనదై యున్నది. వారు ఈ లోకసంబంధమైన వాటిని మాత్రమే యాశించి జీవింతురు. కావున మరణముతో కూడ వారి సుఖ సంతోషము లన్నియు గతించిపోవును. వారు దేవుని యొద్దకు వెళ్లుటకై సిద్ధపడినవారు గాక, నిత్య దండనకు పాత్రులు కావున దానికి నిజముగా భయపడవలసినదే

అయితే యీలాగున భయపడుటకు విశ్వాసికి కారణము లుండవు. విశ్వసించు మనమును మన బలహీనతవలన సంకను దానికి భయపడుచున్నామను మాట వాస్తవమే. మరణము విపరీతముగ వచ్చినదేకాని అది మనుష్యునికి స్వాభావికమైనది కాదు. అది దేవుని అసలు ఏర్పాటులలో నొకటి కానుగాని పాపమునకు శిక్షగా వచ్చెను. అయితే విశ్వాసికి మరణభయమున్నను, అది అవిశ్వాసికిగల మరణ భయమువంటిదికాదు. క్రీస్తు మరణమును సమాధిని జయించెను (3) ఆయన జీవమును అమరత్వమును వెల్లురున పెట్టెను (2 తిమో 1: 10). పాపముతోనుకష్టముతోను నిండియున్న లోకమును విడిచిపెట్టి మోక్షములో చేరుటకు మరణము ప్రవేశ ద్వారమై యున్నది. కావున అది అవిశ్వాసికి మేలేగాని కీడుకాదు' (1 పేతు. 1:4) ఈ హేతువుచేత బైబిలులో మరణము అను మాటకు భయమును సూచించు పేరులు వాడబడలేదుగాని మనలను అదరిందు విధములుగా భక్తులు పితరులయొద్దకు చేర్చబడెదరనియు (ఆది. 25: 8 ) కీడు చూడబడకుండ నీతిమంతులు కొనిపోబడు చున్నారనియు అ(యెష 57:1) క్రీస్తునందు నిద్రించుచున్నారనియు వ్రాయబడియున్నది.

4. మోక్షములో చేరుటకు తగిన శరీరము కలుగునట్లు మరణము అవసరమై యున్నది.—క్రీస్తు తన భక్తులను శరీరమరణమునుండి కాదుగాని ఆత్మీయ మరణమునుండియు, నిత్య మరణమునుండియు తప్పించెను. అవిశ్వాసుల దేహములవలె విశ్వాసుల దేహములుకూడ చావుకు లోనగును. అయితే విశ్వాసులకు రావలసిన శిక్షనంతటిని క్రీస్తు స్వయముగా భరించెను. కావున వారి మరణ మికను పాపమునకు శిక్షగా నుండక, వారికి మోక్షమునకై తగిన శరీరమును కలిగించునట్టి యొక దీవెనగా నున్నది. ఈ లోకములో మన మందు శరీరము భూసంబంధమైనదియు, పాపములతో కూడినదియునై యున్నది కావున అది మోక్షమునకు తగినది కాదు. అది ఆత్మీయ శరీరముగునట్లు మార్చబడవలెను. (4) ఈ దేహము లేపబడి, రూపాంతరము నొంది, మహిమపరచబడునట్లు అది ముందుగా చనిపోయి కుళ్లుట అవసరమై యున్నది (1 కొరి 15: 35-38) మన యాత్మలు నూతనపరచ

బడుటవలన నవి యేలాగు మోక్షమునకు తగిన వగునో, ఆలాగు మన దేహములు కూడ నూతనపఱచబడుటవల్ల మోక్షమునకు తగిన వగును. శరీర మరణము పొందిన వెంటనే విశ్వాసుల యాత్మ మోక్షములో చేరును (లూకా 23: 43) ఎందుకనగా ఆత్మయంతకు మునుపే, నూతన పఱచబడెను. అయితే విత్తనము భూమిలో పాతి పెట్టుటవలన క్రొత్తగింజ యేలాగు పుట్టునో, అలాగు అంత్యదినమున అక్షయమైనదియు పాపము లేనిదియు, లోపరహితమైనదియు, మహిమతో గూడినదియునైన దేహము పుట్టులాగున నీ దేహము భూమిలో పాతిపెట్టబడి కుళ్ళిపోవలెను (1. కొరి 15: 42-44). మోక్షమునకు తగిన యట్టి దేహము కలుగులాగున క్రీస్తు రెండవ రాకడ దినమున సజీవులైయుండు వారి దేహములుకూడ మార్చబడవలసినదే! వారు చనిపోకుండ నుండినను ఇతరులలో మరణమువల్లను, పునరుత్థానమూలముగను కలుగు మార్పు ఆ యంత్యదినమున వారిలో క్షణమందే కలుగును (1 కొరి 15:51-53)

## II పునరుత్థానము గూర్చిన బోధ.

1. శరీర పునరుత్థానము అంత్య దినమున జరుగును.—మరణ కాలములో ఆత్మయు శరీరమును వేఱుపడును. అయితే యిట్లువేఱగుట కొంతకాలము వఱకేగాని నిత్యముగ నుండునది కాదు. అంత్యదినమున యీ రెండును మఱల కలియును. శరీరము లేపబడి ఆత్మకు నివాసస్థాన మగును. నీతిమంతులకును అనీతిమంతులకును పునరుత్థానము కలుగును (కార్య 24:15) నీతిమంతులు మోక్షమును పొందుటకును అనీతిమంతులు శిక్ష నొందుటకును లేపబడెదరు. వీరు లేపబడుటకు గల యుద్దేశములు వేర్వేఱుగ నున్నను మినహాయింపు లేవియు లేక అందఱును లేపబడెదరను సంగతి నిశ్చయము (5) అయితే క్రీస్తు భక్తులు ముందుగా లేపబడెదరు. (1 థెస్స 4:16)

2 లేపబడునది మన స్వంత శరీరమైనను, అది మహిమ పఱచబడినదై యుండును.—సమాధులలో పెట్టబడిన శరీరములును, సమాధి చేయబడక పోయినను చనిపోయినపుడు ఆయావారలకుగల శరీరములే లేపబడునుగాని క్రొత్త శరీరములు సృష్టింపబడవు. ఈ జీవితకాలములో మన కుండిన శరీరములే మఱల మన కియ్యబడును. అయితే ఆ శరీరములో గొప్ప మార్పు కలుగును. అవిశ్వాసుల దేహములలో సహా అట్టిమార్పు కలుగును గాని ముఖ్యముగా విశ్వాసుల దేహములలో మరెక్కువ మార్పు కలుగును. ఇహమందు మనకు గల దేహములు క్షయమగు నవియు, చావునకు లోనైనవియునైయున్నవి. పరమందు మనకు కలుగబోవు దేహ

ములు అక్షయమైనవియు, చావు లేనివియునై యుండును (1 కొరి 15: 42) అవిశ్వాసుల దేహములు సహా అట్టివగును. వారి శరీరాత్మలు నిత్యదండనను లోనగు చున్నవి (1 కొరి 15:42) కావున వారి దేహములు కూడ చావు లేనివై యుండును. అయితే విశ్వాసుల దేహములలో కలుగు మార్పు మఱిగొప్పది. వారి దేహములు అక్షయమైనవియు చావులేనివియునై యుండుటమాత్రము గాక, వాటికి నూతనమైనట్టియు దివ్యమైనట్టియు ఇతర లక్షణములుకూడ కలుగును. ఇహ సంబంధపు దేహములను నుండు బలహీనతలు, లోపములు వాటికి నుండవు. పునరుత్థానమునను పిమ్మట క్రీస్తు ప్రభువున కెట్టి మహిమదేహ ముండెనో, అట్టి దేహములు విశ్వాసులకు కలుగును. వారి శరీరములు అత్మీయమైనవిగా నుండును. క్రీస్తు మన శరీరములను తన శరీరమునకు సమరూపము కలవానిగా మార్చును (6) ఇచట మనము మంటినుండి పుట్టినవాని పోలికను ధరించినట్లుగా అచట పరలోక సంబంధి పోలికను అనగా క్రీస్తు పోలికను ధరింతుము (1 కొరి 15:49) ఆ విధముగ విశ్వాసుల దేహములు నిత్యముగ జీవించు ఆత్మకు నిత్య నివాసస్థాన మగుటకు తగియుండును.

---

## 25. తీర్పుచేయుటకు క్రీస్తు మఱల వచ్చుటనుగూర్చిన బోధ.

తాను జరిగించిన క్రియలచొప్పున, అవి మంచివైనను సరే, చెడ్డవైనన్ను సరే, దేహముతో చేసినవాటి ఫలమును ప్రతివాడును పొందు నిమిత్తము, మన మందరమును క్రీస్తు న్యాయపీఠము నెదుట ప్రత్యక్షము కావలయును. 2 కొరి. 5:10.

### భాగములు.

I. క్రీస్తు రెండవరాకడనుగూర్చిన బోధ.
II. న్యాయపు తీర్పునుగూర్చిన బోధ.
III. లోకాంతమును గూర్చిన బోధ.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| క్రీస్తు రెండవ రాకడ | మత్త. 24. |
| క్రీస్తు రెండవ రాకడ | 1. థెస్స. 5:1-11 |

| | |
|---|---|
| క్రీస్తు విరోధి | 2 థెస్స. 2: 1-12 |
| తీర్పు చట్టము | రోమా 2: 1-16 |
| మంచివారిని చెడ్డవారిని వేఱుపఱచుట | మత్త. 25: 31-46. |
| లోకాంతము | 2 పేతురు 3: 1-13 |
| క్రొత్త ఆకాశము క్రొత్త భూమి | ప్రకటన 21. |

## వేద వాక్యములు.

I. 1. గలిలైయ మనుష్యులారా, మీరెందుకు నిలిచి ఆకాశమువైపు చూచుచున్నారు? మీయొద్దనుండి పరలోకమునకు చేర్చుకొనబడిన యీ యేసే యేరీతిగా పరలోకమునకు వెళ్లుట మీరు చూచితిరో, ఆ రీతిగానే ఆయన తిరిగి వచ్చునని వారితో చెప్పిరి (కార్య 1: 11).

2. ఆ దినము భూమియందంతట నివసించువారందఱిమీదికి అకస్మాత్తుగా వచ్చును (లూకా 21: 35).

3. కాబట్టి మీరు జరుగబోవు వీటి నెల్లను తప్పించుకొని మనుష్య కుమారుని యెదుట నిలువబడుటకు పాత్రులని యెంచబడునట్లు ఎల్లప్పుడును ప్రార్థించుచు మెలకువగా నుండుడని చెప్పెను (లూకా 21: 36).

4. తన మహిమతో మనుష్యకుమారుడును ఆయన వెంట సమస్త దూతలును వచ్చునప్పుడు, ఆయన మహిమగల సింహాసనముమీద కూర్చుండును (మత్త 26: 31).

II. 5. కాబట్టి సమయము రాకమునుపు, అనగా ప్రభువు వచ్చు పర్యంతము దేనిగూర్చియు తీర్పు తీర్చకుడి. ఆయన అంధకారమందలి రహస్యములను వెలుగులోనికి తెచ్చి హృదయములలోని ఆలోచనలను బయలు పఱచునప్పుడు, ప్రతి వానికిని తగిన మెప్పు దేవునివలన కలుగును (1 కొరి. 1: 5).

III. 6. అయితే ప్రభువు దినము దొంగ వచ్చినట్లు వచ్చును; అందులో ఆకాశములు మహా ధ్వనితో గతించిపోవును. భూతములు మిక్కుటమైన వేండ్రముతో లయమైపోవును. భూమియు, దానిమీద నున్న కార్యములును కాలిపోవును (2 పేతురు 3: 10).

## వివరము.

1. క్రీస్తు రెండవ రాకడను గూర్చిన బోధ.—ఆకాశమున కెక్కిన ప్రభువు ఆ రీతిగానే మఱల వచ్చును (1) జీవించు వారికిని చనిపోయిన వారికిని తీర్పు

చేయుటకు ఆయన గొప్ప మహిమా ప్రభావములతో వచ్చును (మత్త. 24: 30). అప్పు డాయన భక్తులను తన వెంట జేర్చుకొని దుర్మార్గులను తన సన్నిధిలోనుండి త్రోసివేయును.

క్రీస్తు రాకడ ఎప్పుడు?—ఆయన రాకడ మిక్కిలి సమీపమైన సంగతే యైనను (లూకా 21: 33) ఆ కాలమునుగూర్చి దేవునికి గాక, మరి యేమనుష్యునికైనను, ఏ దూతకైనను తెలియదు. ఈ లోకములో నుండుండగా క్రీస్తు తన్ను తాను తగ్గించుకొని దాని గూర్చిన తెలివిని ఉపయోగించు కొనక విడిచిపెట్టెను (మార్కు 13: 32). ఆయన రాకడ దొంగవచ్చు రీతిగను (మత్తయి 42: 44; 1. థెస్స. 5: 2) నోవహు కాలములో జలప్రళయము వచ్చిన రీతిగను (మత్త. 24: 37) అకస్మాత్తుగా వచ్చును (2). మనుష్యులు క్రీస్తు రాకడ విషయమును, తీర్పు దినము విషయమును చింతలేనివారై సంభ్రమపడు చుండగను, సంతోషముతో శుభకార్యములను జరుపుకొనుచుండగను ఆయన వచ్చును (మత్త. 24: 18-39). ఇంత కాలము వరకు క్రీస్తు తిరిగి రాలేదు. కావున కొందఱు అపహాసకులు, ఆయన రాకడ విషయమైన వాగ్దానము లేమయ్యె ననియు, అంతయు నెప్పటివలె జరుగుననియు (2 పేతురు 3: 4) పలికెదరుగాని వారు మోసపోదురు. మనుష్యులు మారుమనస్సు పొందుటకై వారికి సమయముననుగ్రహించుటకే ఆయన ఇట్లు ఆలస్యము చేయును (2 పేతు. 3:9) మన కిది దీర్ఘకాలముగా కనబడినను, దేవుని దృష్టికి అది యట్లుండదు. ఆయనకు వెయ్యి సంవత్సరములు ఒకదినమువలె నుండును (2 పేతు. 3: 8). తగిన కాలమున క్రీస్తు తప్పక వచ్చును.

ఆయన రాకడ కాలమునుగూర్చి లెక్కించుటకు మన బైబిలులో నుండు ఆధారములు చాలవు. ఒకానొకప్పు డాకాలమును పరిష్కరించుటకు కొందఱు పత్రికలను వ్రాయుదురు గాని అవి మనలను మోసపఱచును గనుక అట్టి వాటిని చదువరాదు. ఆ కాలము మనము తెలిసికొనక యుండవలెనని దేవు డుద్దేశించి ఈ యేర్పాటు చేసెను (మత్త. 21). మనుష్యులు కనిపెట్టని కాలములో ఆయన వచ్చును గాని వారు దానికై లెక్కించి తెలిసికొంటిమని చెప్పుకొను కాలములో గాదు.

క్రీస్తు రాకడను గూర్చిన సూచనలు.—క్రీస్తు రాకడ ఫలాని కాలమున కలుగును అని చెప్పబడక పోయినను. దానికి ముందు జరుగు కొన్ని సూచనలు స్పష్టముగ వివరింపబడెను. అవి యేవియనగా:- మొదట సువార్త సర్వలోకములో ప్రకటింపబడును (మత్త. 24: 14); యూదులు విశ్వాసు లగుదురు (రోమా. 11: 25. 6). సూర్య చంద్ర నక్షత్రములలో గురుతులు కలుగును (లూకా 21: 25); అబద్ధ

వక్తలును, అక్రమము చేయువారును విస్తరింతురు. (మత్త 24: 11: 12.; యుద్ధములు విశేషముగా జరుగును (మత్త. 24: 7.) భక్తులకు గొప్ప శ్రమలు కలుగును. (మత్త. 24: 9); అక్రమ మూర్తియు నాశన పాత్రుడునగు సాతానను క్రీస్తువిరోధి అప్పుడు కనబడును. (2 థెస్స 2: 3, 4; 1 యోహా. 2: 18) ఈ పైనూచనల వలన ఆయన రాకడయొక్క సరియైన దినము తెలియబడకపోయినను, ఆ దినము సమీపముగ నున్నదని వాటివలన తెలిసికొని యెల్లప్పుడు సిద్ధముగ నుండులాగున అవి మనకు ప్రేరేపణకరముగ నున్నవి. (3)

క్రీస్తు మరల వచ్చు రీతి.—క్రీస్తు మొదటిసారి వచ్చినప్పుడు మన పాపములకొరకు శ్రమ నొందుటకుచాల దీనుడుగా వచ్చెను. అయితే ఆయన మఱల వచ్చునప్పుడు తీర్పుచేయుటకు వచ్చును. కావున మేఘారూఢుడై దూతల పరివారముతో కూడ, గొప్పశక్తి ప్రభావములతో వచ్చును. (4) దుర్మార్గులది చూచి భయకంపితులగుదురు. తమ జీవిత కాలములో దేవుని తిరస్కరించి ఆయన ప్రేమను నిర్లక్ష్యము చేసినవారు ఆ దినమున ఆయన ప్రభావమునకు తాళలేక పర్వతములను చూచి-సింహాసనాసీనుడై యున్నవాని యొక్కయు గొఱ్ఱెపిల్ల యొక్కయు ఉగ్రత మహా దినమువచ్చెను; దానికి తాళజాలినవాడెవడు ? మీరు మా మీద పడి ఆయన సన్నిధినుండియు, గొఱ్ఱెపిల్ల ఉగ్రతయొక్క కోకనుండియు మమ్మును మఱుగు చేయుడి—అని పలికెదరు (ప్రక. 6: 15-17) విశ్వాసులైతే లోకతాపత్రయము లన్నిటిలోనుండి తాము విడుదల పొందు కాలమును, మోక్షములో ప్రవేశించుకాలమును వచ్చెనని చూచి సంతోష భరితులగుదురు. వారిని క్రీస్తు అధిక ప్రేమతో నిత్యము తనయొద్ద నుండుటకై చేర్చుకొనును. (1 థెస్స 4: 17).

II. న్యాయపు తీర్పును గూర్చినబోధ.—క్రీస్తు వచ్చు దినమున మనుష్యులందఱును న్యాయపుతీర్పు పొందుటకై ఆయన సింహాసనమునెదుట నిలువబడవలెను (మత్త 25: 32). ప్రతివాడును తన క్రియల చొప్పున తీర్పునొందును. (ప్ర॥ వా॥). చనిపోయిన వారందరును, పాతిపెట్టబడిన వారైనను, సముద్రములోపడి చచ్చినవారైనను, ఘనులేమి, అల్పులేమి, భక్తులేమి, భక్తిహీనులేమి, తెల్లవారేమి, నల్లవారేమి, అన్నిజాతులవారును, అన్ని దేశములవారు ఈ భూమిమీద తాము చేసిన వాటి విషయము ఆ దినమున లెక్క నప్పగింపవలెను.

ఆ విమర్శ చాల తీక్ష్ణమైనది ప్రతి రహస్యమును అప్పుడు బైలుపరచబడును. (1 కొరి. 3: 13. 15.) (5). మనము చేసిన క్రియలన్నిటి విషయము, పలికిన ప్రతివ్యర్థమైన మాటనుగూర్చి సహా మనము లెక్క చెప్పవలసి యుండును. (మత్త. 12: 36 ).

ప్రతి వాడు చేసిన క్రియల చొప్పున తీర్పు కలుగును. (ప్ర॥ వా।) అయన ప్రతివా
నికి వాని వాని క్రియల చొప్పున ప్రతి ఫలము నిచ్చును. సత్క్రియను ఓపికగా
చేయుచు మహిమను, ఘనతను, అక్షయతను వెదకువారికి నిత్యజీవము నిచ్చునుగాని,
భేదములను పుట్టించి, సత్యమునకు లోబడక దుర్నీతికి లోబడువారి మీదికి అయన
యుగ్రతయు, రౌద్రమును, దుష్కార్యము చేయు ప్రతిమనుష్యుని యాత్మకు శ్రమయు
వేదనయు కలుగును. (రోమా. 2: 6-9.) క్రీస్తు ఎవని క్రియల చొప్పున వానికి ప్రతి
ఫల మిచ్చును (మత్త. 16: 27.)

విశ్వాసులైనను అవిశ్వాసులైనను తమ పాపములవలన నిత్యమరణమునకు పాత్రు
లని ఆ తీర్పులో స్పష్టమగును (కీర్తన. 143: 2.) అయితే విశ్వాసులు క్రీస్తును
విశ్వసించినందుకు నీతిమంతులని తీర్పునొందెదరు. క్రీస్తు నీతి వారి పాపము లన్నిటిని
కప్పివేయును. మఱియు ఆ నీతి వారిదై యున్నట్లు ఎంచబడును. (1 కొరి. 1: 30, 31)
కావున వారు తమ పాపములవలని శిక్షను తప్పించుకొందురు. అవిశ్వాసులు
అట్టి రక్షకుని నాశ్రయించుకొనలేదు. కావున, తమ పాపము వలని శిక్షనొంది, నిత్య
దండనకు లోనగుదురు (మత్త. 22: 11—13.)

న్యాయపు తీర్పుదినమందు క్రీస్తు విశ్వాసులను అవిశ్వాసులను వేరుపఱచును:
విశ్వాసులు ఈ జీవితకాలమందు తమవిశ్వాసమును క్రియలచేత నగపఱచి యుండి
నందున అయన వారిని తన కుడి ప్రక్కను నిలువబెట్టుకొని వారినిచూచి—నాతం
డ్రిచేత ఆశీర్వదింపబడిన వారలారా! రండి; లోకము పుట్టినది మొదలుకొని
మీ కొఱకు సిద్ధపరచబడిన రాజ్యమును స్వతంత్రించుకొనుడి యని చెప్పును (మత్త.
25: 34). అవిశ్వాసులు తమ క్రియలద్వారా అవిశ్వాసమును, అవిధేయతను కనబఱ
చినందున అయన వారిని తనయెడమ ప్రక్కను నిలువబెట్టి వారితో — శపింపబడిన
వారలారా! నన్ను విడిచి సాతానుకును వాని దూతలకును సిద్ధపఱచిన నిత్యాగ్ని
లోనికి పొండి అని చెప్పును. (మత్త. 25: 41). వీరు నిత్య శిక్షపొందను నీతి
మంతులు నిత్యజీవము పొందను పోవుదురు. (25: 46)

III. లోకాంతమును గూర్చినబోధ.—(మత్త. 24: 3.) క్రీస్తురాక
డతో ఈ యుగము సమాప్తమగును (1 కొరి. 7: 31). ఈ భూమి అగ్నివలన
దహింపబడును (6). ఇందువలన క్రీస్తు రాకడ దినము అంత్యదిన మనబడును.
(యోహా. 6: 39). మనుష్యుల పాపమువలన భూమి సహా చెడి, పాపశాపమునకు
లోనయ్యెను.(ఆది. 3: 17.) రోగములకును మరణమునకును ఉనికి పట్టయ్యెను. కావున
ఈ భూమి అంత్యదినమున పూర్తిగా దహింపబడును లేక పూర్ణముగ పవిత్రపఱచ

బడు నంతగా కాలిపోవును. (2 పేతు 3:7) సృష్టి యావత్తును పాప దాసత్వము లోనుండి విడిపింపబడి మహిమగల విడుదల నొందును. (రోమా 8: 21: -23). క్రొత్త ఆకాశమును క్రొత్త భూమియు కలుగును. అందులో నీతి నివసించును. (2. పేతు 3:13)

---

## 26. విశ్వాసులయొక్కయు, అవిశ్వాసులయొక్కయు గతులను గూర్చిన బోధ.

చూడుము; నేడు నేను జీవమును మేలును మరణమును కీడును నీ యెదుట నుంచియున్నాను. ద్వితీ: 30: 15.

### భాగములు.

I. ప్రతివాడును తన స్వంత గతిని ఏర్పఱచుకొనును.
II. అవిశ్వాసుల గతి.
III. విశ్వాసుల గతి.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| ప్రతివాడును తన స్వంత గతిని ఏర్పఱచుకొనును. | ద్వితీ. 3: 11-20 |
| ప్రతివాడును తన స్వంత గతిని ఏర్పఱచుకొనును. | ఇర్మి. 21: 3-4 |
| ప్రతివాడును తన స్వంత గతిని ఏర్పఱచుకొనును. | మత్త. 25: 1-30 |
| ప్రతివాడును తన స్వంతగతిని ఏర్పఱచుకొనును. | మత్త. 22: 31-46 |
| నరక బాధలు. | మార్కు 9: 33-50 |
| మోక్ష సౌఖ్యములు | ప్రకటన 21. |
| మోక్ష సౌఖ్యములు | ప్రకటన 22. |

### వేదవాక్యములు.

I. మోసపోకుడి, దేవుడు వెక్కిరింపబడడు; మనుష్యు డేమి విత్తునో ఆ పంటనే కోయును. ఏలనన గా తన శరీరేచ్ఛలనుబట్టి విత్తువాడు తన శరీరము

నుండి క్షయమను పంటకోయును. ఆత్మనుబట్టి విత్తువాడు ఆత్మనుండి నిత్యజీవ మను పంటకోయును. (గల 6:7-8)

II. 2. నీ కన్ను నిన్నభ్యంతర పఱచిన యెడల దానిని తీసి పారవేయుము; రెండు కన్నులు కలిగి నరకములో పడవేయబడుటకంటె ఒంటి కన్ను గలవాడవై దేవుని రాజ్యములో ప్రవేశించుట నీకు మేలు. అక్కడ వారి పురుగు చావదు; అగ్ని ఆరదు (మార్కు 9: 46-48).

III. 3. దేవుడు తన్ను ప్రేమించువారి కొఱకేవి సిద్ధపఱచెనో, అవికంటికి కనబడలేదు, చెవికి వినబడలేదు, మనుష్య హృదయమునకు గోచరము కాలేదు (1 కొరి. 2: 9).

4. ఆయన వారి కన్నుల ప్రతిబాష్ప బిందువును తుడిచివేయును, మరణము ఇక నుండదు, దుఃఖమైనను, ఏడ్పైనను, వేదనయైనను ఇక నుండదు. మొదటి సంగతులు గతించి పోయెనని సింహాసనములోనుండి వచ్చిన గొప్ప స్వరము చెప్పుట వింటిని ప్రకటన. 21: 4.

## వివరము.

I. ప్రతి వాడును తన స్వంత గతిని ఏర్పఱచుకొనును.— పరలోకమందలి నిత్యజీవము, నరక మందలి నిత్య మరణము అను నీ రెండు గతులను దేవు డీలోకములో నుండు ప్రతివానియెదుట నుంచెను (యోహా. 5: 39). మనము దేవుని దయను అంగీకరించుటను బట్టి లేక దానిని నిరాకరించుటను బట్టి పై రెండు గతులలో నేదో యొకటి మనలో ప్రతివానికి ప్రాప్తమగును. విశ్వాసులు రక్షింపబడెదరు; అవిశ్వాసులకు శిక్ష విధింపబడును (మార్కు 16: 16). అందఱును పాపములో మునిగి ఆత్మీయ విషయములలో చచ్చినవారై యుండి (ఎఫె. 2: 1). తమ్మును తాము రక్షించుకొనలేని వారై యున్నారను మాటవాస్తవమే. అయినను దేవుడు ఒక రక్షణ మార్గమును ఏర్పఱచి (1 యోహా. 4: 14). దానిలో నడుచుకొనుటకై తన వాక్యము ద్వారా అందఱికి కావలసిన యావత్తు శక్తి సహాయము ననుగ్రహించుచున్నాడు. ఇట్లుండగా ప్రతివాడును తన స్వంత గతిని ఏర్పరచుకొనును ననుమాట నిజమే. ఒకడు ఏవిత్తనమును విత్తునో ఆ పంటనే కోయును (1) దినమున జీవార్థమైన విశ్వాసమునకు తగిన క్రియలు చేసి యున్నాడా? అను ప్రశ్నకు వచ్చు జవాబును బట్టియే ప్రతివాడును నిత్య సౌఖ్య స్థితినిగాని, నిరంతరము బాధకరమైన స్థితినిగాని క్రీస్తువల్ల పొందును (మత్త. 25: 34-45).

II. అవిశ్వాసుల గతి:—పశ్చాత్తాపపడి విశ్వసింపని వారు తమ శరీరాత్మలతో నిత్యమును నరకములో బాధల నొందెదరు. నరక మొకటి యున్నదను బోధ బైబిలులో స్పష్టముగ వివరింపబడి యున్నది. దుష్టులయిన దూతలును (2 పేతు. 2: 4), పశ్చాత్తాపపడి విశ్వసింపని వారును (మత్త. 25: 41), అందులో పడద్రోయబడుదురు. విశ్వాసమునకు తగిన క్రియలను చేయక, దేవునిని తన పొరుగింటి వానిని ప్రేమింపనివాడైన యొక ధనవంతుడు నరకములో పడద్రోయబడగా, వాడా నరకాగ్ని తాపము నోపలేక తన నాలుకను చల్లార్చుటకు ఒక్క నీటిబొట్టు నడిగినను ఆ నీటి బొట్టయినను దొరకనంతటి కష్టస్థితిలో వాడుండెనని ధనవంతుడు లాజరు అను వారిని గూర్చిన యుపమానమువల్ల తెలియును (లూకా 16: 24).

నరక బాధలు:—అవిశ్వాసులకు గలుగబోవు ఘోర బాధలను గూర్చి బైబిలులో అనేకవిధములుగ వివరింపబడి యున్నది. వారు అగ్ని గుండములో పడవేయ బడుదురనియు (మత్త. 13: 50), చావని పురుగులచేతను, ఆరని అగ్ని చేతను బాధింప బడెదరనియు (మత్త. 8: 12; 22: 13) వ్రాయబడి యున్నది. వారు బుద్ధిలేక దుర్మార్గులై దేవుడు తన దయవలన వారికి అందించిన రక్షణను నిరాకరించినందున వారి మనస్సాక్ష్యములు వారిని నిత్యము గద్దించి నొప్పించును. ఇట్టి మనో బాధయు, నిరాశయు, నిష్ఫలమైన కోపమును వారికి ఎల్లప్పుడు నుండును. దురాశలను మంట వారిలో నిరంతరము మండుచుండును గాని, తమయావత్తు ప్రయత్నములచేతను వారు దాని నార్పలేకపోదురు. దేవుని సన్నిధిలోనుండి తొలగింపబడి, కటిక చీకటిపాలై, మంచి వాటి కన్నిటికి దూరపరచబడి, నిత్యముగా దుర్మార్గులతోను దయ్యములతోను సహవాసులై అంతములేని శ్రమల నొందెదరు.

నరకములో పడినవారందఱికి కలుగు శిక్షలు ఏకరీతిగా నుండక, ప్రతివారు చేసిన దుర్మార్గతల హెచ్చున వేర్వేరుగా నుండును (లూకా 12: 47, 48; మత్త. 11: 24). వారి వారి పాపముల కొలదిని, రక్షణ పొందుటకు వారికి కలిగినట్టియు వారు తిరస్కరించినట్టియు సమయముల కొలదిని మనోవేదనయు శ్రమలును మరియెక్కువగా కలుగును. అయితే వారిలో తక్కువ శ్రమల నొందువారు సహా ఈ లోక శ్రమలన్నిటికంటె గొప్పవియు, చెప్ప శక్యముకానివియునైన భయంకర శ్రమలను పొందెదరు. వారు దేవుని సన్నిధానమునుండి తొలగింపబడి ఏ సౌఖ్యము నొందకుండ నుందురు (మత్త. 25: 11, 12), ఈ లోకములో నుండగా వారాశించిన పాపముల ఫలితములైన కష్టములకు వారక్కడ అప్పగింపబడుదురు.

ఆ శిక్ష అంతములేనిది.—(మత్తై. 25: 46). వారి బాధను సంబంధ మైనపొగ యుగయుగములు లేచును (ప్రక. 14: 11). నరకములో కొంతకాల మున్నపిమ్మట విడుదల కలుగు ననుకొనరాదు. దేవుడు తన దయవల్ల మన్నలో జరుప నుద్దేశించిన పనిని మనము జరుప నియ్యక, ఈ లోకములో నుంటుండగా మోక్ష మునకు సిద్ధపడక పోయిన యెడల మనము మన వైరికోర్కెల ఫలములను ఆ లోక ములో తప్పక నొందవలెను. ఆ శిక్షను తప్పించుకొనవలెనని కోరువారు ఇప్పుడీ జీవితకాలములోనే తప్పించుకొనవలెను. నరకములో పడిన పిమ్మట తప్పించుకొను టకు సమయ ముండదు. నరకమునకును మోక్షమునకును మధ్య ఎవరును దాట జాలని మహా యగాధ ముంచబడి యున్నది. (లూకా 16: 26).

III విశ్వాసుల గతి.—విశ్వాసులు నిత్య జీవము నొందినవారై (యోహా. 3: 16). మోక్షములో సదాకాలము తమ ప్రభువునొద్ద నుందురు (1 థెస్స. 4: 17). లోకము పుట్టినది మొదలుకొని వారికొఱకు సిద్ధపఱచబడిన రాజ్యమును వారు స్వతంత్రించుకొందురు (మత్తై. 25: 34). క్రీస్తు వెళ్ళి వారి కొఱకు మోక్ష ములో సిద్ధపఱచిన నివాసమును వారికి ననుగ్రహింపబడును (యోహా. 14: 2, 3). వారికి గలుగు స్వాస్థ్యము అక్షయమైనదియు, నిర్మలమైనదియు, వాడబారనిదియునై యుండును (1 పేతు. 1: 4).

ఈ స్వాస్థ్యము విశ్వాసు లందఱికి దొరికినను, వారందరు నేకరీతిగా మహిమ పొందెద రనుకొన గూడదు. వారు క్రీస్తునందుంచిన విశ్వాసములోను, ఆయనకొఱకు పొందిన శ్రమలలోను, ఆయనను సేవించుటలోను భేదము లుండునట్లుగా వారు పొందబోవు మహిమలోను భేదము లుండును. నక్షత్రములలో భేదమున్నట్లును, వాటి కాంతికంటె సూర్యచంద్రుల కాంతి యెక్కువయై యున్నట్లును విశ్వాసులు పొంద బోవు తేజస్సులోకూడ భేదముండును (1 కొరి 15: 41, 42). అయా విశ్వాసులు క్రీస్తు సేవలో చూపించిన నమ్మకమునుబట్టి యీ భేదములు కలుగును (లూకా 19: 17-19). అయితే సూతెలలో భేదము లుండినను దేవుని సన్నిధానమందు వారు పూర్ణ సంతోషము గలవారై యున్నట్లు, ప్రతి విశ్వాసికిని, తక్కువ విశ్వాసముగల వానికిని పూర్ణ సంతోషము కలుగును.

మోక్షములోని సౌఖ్యములు.—అవి వర్ణింప శక్యము కానంతదివ్యము లైనవై యున్నవి (3). పౌలు ఆ మహిమను కొంతవఱకు దర్శన రీతిగా చూచెను గాని, దానిని వివరింప లేకపోయెను (2 కొరి. 12: 2-4). అవి యెట్టివో మనము వాటిని అనుభవించుకొన్న పిమ్మటనే తెలిసికొనగలము గాని, అంతకు పూర్వము

తెలిసికొనలేము. అయితే ఆ సౌఖ్యముల నిచట తెలిసికొనలేకపోయినను ఆ స్థితికి సంబంధములైన కొన్నిటిని తెలిసికొనగలము. వాటిలో అక్కడ పాపమైనను, దుఃఖమైనను లేశమాత్రము నుండదు; మఱియు అక్కడ దేవుని సన్నిధియందు భక్తులు నిత్యము నివసింతురను నీ రెండును ముఖ్యములైనవని తెలిసికొనవలెను.

మోక్షములో పాపమైనను దుఃఖమైనను లేశమాత్రము నుండదు.—ఆ స్థితిలో కష్టదుఃఖము లుండవు; భక్తులకు నచట ఆకలిదప్పులు కలుగవు (ప్రక. 7:16); శీతోష్ణముల బాధ లచట కలుగవు; భక్తులకు శరీరాత్మల సంబంధమైన ఏకష్టమును కలుగక, వారు పూర్ణసంతోషము కలవారగుదురు (హెబ్రీ 4: 9). ఈ జీవితకాలములో మనము ఎడతెగకుండ పాపమునకు విరోధముగా చేయవలసిన పోరాటము అక్కడ నుండదు. వారు జయమొందినవారై ఆ జయమునకు తగిన ఫలము నొందెదరు (ప్రక. 3: 21). పాపమైనను పాప ఫలమైనను వారికి నచట ఏమాత్రము నుండదు (4).

మోక్షములో భక్తులు నిత్యముగా దేవుని సన్నిధానమందు నివసించెదరు.—వారు దేవుని దివ్య సన్నిధానమందుండి ఆయన ప్రేమయందు సంతోషించుచు, ఆయనను సేవించుటయందు నిత్యము పూర్ణానందము నొందెదరు. పాపమేమియు లేక, శరీరమందు ఆత్మయందు పరిపూర్ణులును (ఫిలిప్పీ 3: 21). క్రీస్తు మహిమలో పాలిభాగస్థులునై ఆయనతో నిరంతరము నేలుదురు. (యోహా 17: 24 కొల 3:4). ఈ జీవితకాలములో వారికి ఏది గూఢార్థముగాను, గ్రహింప వీలు కానిదిగా నుండెనో దానిని వారచట తేటగా తెలిసికొందురు (1. కొరి. 13: 9, 10-12). ఈ లోకములో దేవుడు విశ్వాసులపైకి పంపించు కష్టములకు గల కారణములను తెలిసికొనలేక దేవుడు తమ్మును ప్రేమించుటలేదని వారనుకొనవచ్చునుగాని, వారు మోక్షమునకు పాత్రులగునట్లు దేవుడు తన యమితప్రేమవలన ఆట్టి కష్టములను తమ కిప్పుడిక పంపించెనని వారప్పుడు తెలిసికొందురు. తాము పొందు సౌఖ్యము నెదుట యిహకష్టములు ఎన్నతగినవి కావని వారప్పుడు తెలిసికొందురు. (రోమా 8: 18 వారంతకంతకు దేవుని యపరిమిత ప్రేమను గ్రహింప నేర్చుకొందురు మఱియు వారు పరిశుద్ధదూతలతోను మహిమపరచబడిన భక్తులతోను కలిసి, నిత్యము దేవుని సేవించుచు (ప్రకటన 7. 15.) ఆయన మహాత్మ్యములను బట్టి ఆయనను నిత్యము నుతించుచుందురు (ప్రక. 15:3).

మోక్షస్థానము.—ప్రకటన గ్రంథములోని 21, 22. అధ్యాయములలో మోక్షస్థానమందలి మహిమను యోహాను వివరించుచున్నాడు. అది యచట నూతన

యెరూషలేమనబడెను. దాని ప్రహరిగోడలు వజ్రములతో నలంకరింపబడెననియు, దాని ద్వారములు ముత్యములతో కట్టబడియున్నవనియు, దాని వీధులు బంగారుమయములైయున్నవనియు, వర్ణింపబడియున్నది. (ప్రక. 21:18–21). "ఆపట్టణములో ప్రకాశించుటకై సూర్యుడైనను చంద్రుడైనను దానికక్కరలేదు. దేవుని మహిమయే దానిలో ప్రకాశించుచున్నది; గొఱ్ఱెపిల్లయే దానికి దీపము" (ప్రక. 21:23). "అక్కడ రాత్రి యుండదు." (21:25). అదినిత్యము పగలుగనుండును. "దేవునియొక్కయు, గొఱ్ఱె పిల్లయొక్కయు సింహాసనము దానిలో నుండును. ఆయన దాసులు ఆయనను సేవించుచు ఆయన ముఖావలోకనము చేయుచుందురు." (ప్రక. 22:3, 4.)

---

## 27. క్రైస్తవుల ధర్మశాస్త్రమును గూర్చిన బోధ.

ప్రభువు నామము నొప్పుకొను ప్రతివాడును దుర్నీతినుండి తొలగిపోవలెను. 2. తిమొ. 2:19.

### భాగము ౧.

I. దేవుడు కోరువాటిని చేయుట ప్రతి క్రైస్తవునికి విధియై యున్నది.

1. దేవుడు కోరునవి బైబిలులో నీతిచట్టములలో కనబడును.

2 దేవుడు కోరుచున్న వాటిని చేయవలెనను ఆశ పరిశుద్ధాత్మ మనలో పుట్టించును.

3. నీతితో కూడిన నడతను అవలంబింపనివాడు నిజమైన క్రైస్తవుడు కానేరడు.

II. క్రైస్తవులు అన్ని విషయములలో దేవునికి విధేయులై యుండవలెను:

1. పాపమును విసర్జించుటయందును.

2. నీతిని అనుసరించుటయందును.

III. దేవునికి విధేయులైనవారికి ప్రతిఫలము కలుగును.

## అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| ౧ ...యాజ్ఞలు | నిర్గ. 20: 1-17. |
| ౨ వివరించిన ధర్మశాస్త్రము. | మత్త 5. |
| ౩ వివరించిన ధర్మశాస్త్రము | మత్త 6. |
| ౪ వివరించిన ధర్మశాస్త్రము | మత్త 7 |
| ...హానను చేసిన నీతి బోధలు | లూకా 3: 1-14. |
| ...యొక్క ధర్మవిధులు | ఎఫెసీ 5: 1-14. |
| ...స్తవుడు పాపము విషయము చనిపోయి యున్నాడు | రోమా 6: 1-11. |

## వేదవాక్యములు.

1. క్రీస్తు శరీర విషయములో శ్రమపడెను. గనుక మీరును అట్టి మనస్సు ...ముగా ధరించుకొనుడి. శరీర విషయములో శ్రమపడినవాడు శరీరమందు ...గిలిన కాల మికమీదట మనుజాశల ననుసరించి నడుచుకొనక, దేవుని యి...ముగా నడుచుకొనునట్లు పాపముతో జోలి యిక నేమియు లేక యుండును ...: 1, 2)

2 పాపము విషయములో చనిపోయిన మన మికమీదట నేలాగు జీవించుదుము? (రోమా 6: 2)

3. ప్రభువా ప్రభువా అని నన్ను పిలుచు ప్రతివాడు పరలోక ...లో ప్రవేశింపడుగాని పరలోకమందున్న నా తండ్రి చిత్తప్రకారము చేయు...ప్రవేశించును (మత్త 7: 21)

4. ఆయన అందరితో నిట్లనెను —నన్ను వెంబడింపగోరువాడు ...ను ఉపేక్షించుకొని ప్రతిదినము తన సిలువ నెత్తుకొని నన్ను వెంబడింపవలె ...కా 9: 23)

5. మరియు శిష్యుడని యెవడీ చిన్నవారిలో నొకనికి గిన్నెడు ...మాత్రము త్రాగనిచ్చునో వాడు తన ఫలముపోగొట్టుకొనడని నిశ్చయముగా చెప్పుచున్నాను (మత్త 10:42)

## వివరము.

...ఇంతవఱకు మనము చదివిన బోధలలోని అంశములు దేవుని గూర్చినవియు, ...గూర్చినవియునై యున్నవి. ఇప్పటినుండి మనము నుండవలసిన నీతులను ...ను, మన మవలంబింపవలసిన నడతను గూర్చియు బైబిలేమిబోధించునో వాటిని ...ము.

I. దేవుడు కోరువాటిని చేయుట క్రైస్తవుని విధియై యున్నది.—దేవుని చిత్తమును నెరవేర్చుటయను నొక్కటే యాశ మన కుండవలెను (కొల. 1: 9-12). మన సొంత యిచ్ఛలను కాదు గాని దేవుడు మన యెడల కోరువాటిని అనుసరించుటకు మనము బద్ధులమై యున్నాము (1). మనము నిజ క్రైస్తవులమైన యెడల అన్ని విషయములలో దేవుని చిత్తమును నెరవేర్చవలెనని కోరుదుము (ఎఫె. 6: 6; 1. యోహా. 3: 3). ఒకడు పశ్చాత్తాపపడి విశ్వసింపక పోయిన యెడల క్రైస్తవుడు కానేరడు. అయితే నిజముగా పశ్చాత్తాపపడివిశ్వసించిన క్రైస్తవుడు తానదివరకు చేసిన పాపముల విషయమై క్షమాపణ నొందినవాడై, ఇకను వాటిని చేయనని నిశ్చయించుకొని పాపమందసహ్యపడి, నీతి ననుసరింపకోరును

I. దేవుడు కోరునవి బైబిలులోని నీతిచట్టములలో కనబడును.—పాతనిబంధనలోని పదియాజ్ఞలలోను, క్రొత్తనిబంధనయందలి క్రీస్తు బోధలలోను, మాదిరిలోను క్రైస్తవులమగు మనము దేవుని చిత్తమును గైకొనుటకు చేయవలసిన వాటిని చేయగూడని వాటిని నేర్చుకొనగలము. దేవునిని, మానవులను ప్రేమించుట యనునదే ఆ యాజ్ఞలసారమై యున్నది. మనము మన పూర్ణహృదయముతోను, పూర్ణఆత్మతోను, పూర్ణమనస్సుతోను మన దేవుడైన యెహోవాను ప్రేమింపవలెను. మనవలె మన పొరుగువానిని ప్రేమింపవలెను (మత్త 22: 37-39) అను నీ రెండు ఆజ్ఞలలో ఆజ్ఞలన్నియు నిమిడి యున్నవి (22: 49) ఇది ప్రేమతో గూడిన ధర్మశాస్త్రము. తలంపులయందును, మాటలయందును క్రియలయందును మన మీ ధర్మశాస్త్రమునకు లోబడుటకు బద్ధులమై యున్నాము. క్రీస్తు ఏలాగు దేవునిని మానవులను పూర్ణముగా ప్రేమించి ఆ ప్రేమనుబట్టి తన కార్యము లన్నిటిని చేసెనో, అలాగున మనముకూడ చేయుటకు బద్ధులమైయున్నాము.

2. దేవుడు కోరువాటిని చేయవలెనను ఆశ పరిశుద్ధాత్మ మనలో పుట్టించును.—విశ్వాసులకును అవిశ్వాసులకును ఒకటే ధర్మశాస్త్ర మియ్యబడెను. అయితే అవిశ్వాసుల పక్షమందు దానిని చూడగా, అది అవిధేయులకు శిక్షకలుగునని బెదరించు వెలుపలి చట్టమై యున్నదిగాని, విశ్వాసుల పక్షమందు దానిని చూడగా దేవుడు తన దయవలన వారిలో పుట్టించిన నూతన మనస్సునుపొందుట వల్ల వారి అంతర్య ఆశలు దాని చట్టములతో నేకీభవించుచున్నవి. పరిశుద్ధాత్మ మనలో విశ్వాసమును పుట్టించుటతోకూడ దేవుని ప్రేమింపవలె ననునట్టియు ఆయనను సేవింపవలె ననునట్టియు ఆశను పుట్టించును (ఫిలిప్పీ 2: 13) విశ్వాసులకు స్వా

తంత్ర్య మున్నదను మాట వాస్తవమే గాని, పాపము చేయుటకు వారి కేమాత్రము స్వతంత్రత లేదు (గల. 5: 1; 1 పేతు. 2: 16) దేవుని చిత్తము ననుసరించుటకు ఆయన ప్రేమ చేత బలవంతపఱచబడి (2 కొరి. 5: 14), చేయవలసి యున్నవాటిని చేయగోరుటచే వారికి స్వాతంత్ర్యము కలుగును. మనము క్రీస్తునందుంచు విశ్వాసము కొలది దేవుని యాజ్ఞలను నెఱవేర్చవలెనను ఆశ మనలో నంతకంతకు వృద్ధియగు చున్నది (ఎఫెసీ 3: 16–19; గల. 2: 20).

నీతితోగూడిన నడతను అవలంబింపనివాడు నిజమైన క్రైస్తవుడు కానేరడు.—నీతి, భక్తి అనునవి వేర్వేరు విషయములని యే మాత్రము ననుకొనరాదు. ఈ రెండు విషయములు ఎల్లప్పుడును ఒక దానితో నొకటి కలిసి యుండును. క్రీస్తును నమ్మినవారు పవిత్రమైన నడతను అవలంబింపక పోయిన యెడల వారి విశ్వాసము మృతమైనదే (యాకో. 2: 17). అట్టివారి భక్తి మాయభక్తియే (యాకో. 1: 22, 23). మఱియు వారు వెలుపలి విషయములలో నెంత చక్కగా ప్రవర్తించినను, వారికి విశ్వాసము లేకపోయిన యెడల వారి ప్రవర్తన దేవుని యాజ్ఞానుసారమైన ప్రవర్తనయని యనుకొనరాదు. వారు దేవుని ప్రేమించుటలేను కావున వారు చేయునది దేవునికి అనుకూలముగా నుండనేరదు. మంచి ప్రవర్తన నిజమైన విశ్వాసమను పునాదిమీద కట్టబడినదై యుండవలెను (1 కొరి. 3: 11). అట్టి పునాది లేని నీతి పునాది లేని యింటివలె నుండును (మత్త. 7: 26, 27).

II క్రైస్తవులు అన్ని విషయములలో దేవునికి విధేయులై యుండవలెను.—దేవునికి విధేయులమై యుండవలెనని కోరు బుద్ధి మనకు మొట్టమొదటి యవసరమై యున్నది. అట్టి బుద్ధి మనకు నుండినయెడల దానిలోనుండి సరియైన నడత పుట్టగలదు. మనము పశ్చాత్తాపపడి విశ్వసించి దేవుని బిడ్డలము కావలెనని కోరవలెను. ఆకోరిక మనలో నున్నయెడల మనము దేవునికి మనఃపూర్వకముగాను సంతోషముతోను లోబడగలము. దేవునియందు మనకుగల ప్రేమయే అట్టి విధేయత నవలంబించుటకు మనలను రేపునుగనుక అయన దానియందు దనుకూలించును. భయము వలన గలుగు విధేయత దాసత్వమైయున్నది; ప్రేమవలన గలుగు విధేయత దాసత్వము కాక సంతోషకరమైన స్వతంత్రతయై యున్నది.

I. పాపమును విసర్జించుచు మనము విధేయతను కనబఱచవలెను.—నిజక్రైస్తవుడెవడును మూర్ఖత్వముతో పాపము చేసి, బుద్ధిపూర్వకముగా దేవాజ్ఞలను మీఱడు (2) "వ్యభిచారియైనను, అపవిత్రుడైనను, విగ్రహారా

యున్న లోభియైనను క్రీస్తుయొక్కయు దేవునియొక్కయు రాజ్యమునకు హక్కుదారుడు కాడన్న సంగతి మీరు నిశ్చయముగా తెలియును" (ఎఫె. 5: 5). ఈవాక్యములో వర్ణింపబడి యున్న వారివలె మూర్ఖత్వముతో పాపము చేయువారు పశ్చాత్తాప మొందినవారు కారు. కావున వారు నిజక్రైస్తవులు కానేరరు. పశ్చాత్తాప పడువారు పాపమును ద్వేషించి దానిని విడిచిపెట్టుదురు. జక్కయ్య పశ్చాత్తాప పడినపుడు తానిదివఱకు నితరులయొద్ద అన్యాయముగా తీసికొనినదానికి నాలుగంతలు మఱల చెల్లించి (లూకా 19: 8) అది మొదలు అన్యాయము చేయుట మానుకొనెను. తనయొద్దకు వచ్చిన వారితో స్నానికుడైన యోహాను మీరు మాఱుమనస్సు నొందినవారై మీ పూర్వ పాపములను విడచిపెట్టుడి యని బోధించెను (లూకా 3: 9-14). క్రైస్తవుడు పాపముతో గూడిన నడతను అవలంబించినయెడల దేవుడు తనదయవలన వానిలో నారంభించిన పనిని నిరర్థకపఱచినవాడై శిక్షావిధికి లోనగును. కావున అట్టి పాపపు నడతను ఆవశ్యముగా విసర్జింపవలెను; లేనియెడల వాడు క్రైస్తవుడు కానేరడు.

2. నీతిని అనుసరించుచు మనము విధేయతను కనపఱచవలెను. మనము చేయగూడని వాటిని జేయకపోవుట మాత్రము చాలదు. అవలంబింపవలసిన వాటిని అవలంబించుటకూడ మన విధియై యున్నది. దొంగతనము, వ్యభిచారము మొదలగు చెడ్డక్రియలను చేయకయుంటే మనము మంచివారమని చెప్పకొనజాలము. ఎందుకనగా మంచివార మగుటకై, చెడ్డవాటిని చేయకపోవుట మాత్రముగాక, మంచి క్రియలను కూడ చేయవలెను. మనకు తెలిసియున్నంతవఱకు దేవుని యెడలను మనుష్యులయెడలను చేయవలసినది యంతయు చేయుటకు బద్ధులమైయున్నాము. అన్నిటి కంటె దేవుని నెక్కువగా ప్రేమించుచు, ఆయనకిష్టమైన వాటిని ఆశించుచు మనము మన పను లన్నిటిని చేయవలయును. కుటుంబములోనైనను, సంఘములోనైనను స్వదేశములోనైనను మనము మంచి వాటి ననుసరించి అందఱి యెడల ప్రేమను కనబఱచవలెను. ఆ విధముగ స్వదేశస్థుల యెడల మాత్రము గాక అందఱియెడలను ప్రవర్తింపవలెను. ప్రభువా, ప్రభువా అని చెప్పుట చాలదు గాని, పరలోకమందున్న తండ్రి చిత్తమును నెఱవేర్పవలెను (3).

III. దేవునికి విధేయులైన వారికి ప్రతిఫలము కలుగును—

దేవునికి విధేయుల మగునట్లు మనము మనలోని దుష్టత్వమును, విసర్జించి, మన దురేచ్ఛలు, లోకము, సాతాను అను వాటితో పోరాడి జయింపవలయును. మన స్వంత ఆశలను మనము త్యజించుచు, క్రీస్తుసిలువను ఎత్తుకొని ఆయనను వెంబడింపవలెను.

(4) విసుకక మేలు చేయవలెను. అలాగు చేసిన యెడల తగిన కాలమందు మనము ప్రతిఫలమును పొందెదము (గల. 6: 9). భక్తులకు వారి క్రియల చొప్పున ప్రతిఫల మియ్యబడును. అయితే ఆ ఫలమును దేవుడు తన యుచిత దయచేతనే యిచ్చును గాని భక్తులకు అచ్చియున్నట్లుగా కాదు. క్రీస్తు పేరట ప్రయాసపడి శ్రమల నొందువారు వారి శ్రమలకై ప్రతిఫల మొందెదరు (మత్త 5: 11, 12). శత్రువులను ప్రేమించువారికిని, ఏమియు జీతము పుచ్చుకొనక మేలు చేయువారికిని బహుమానము గలుగును (లూకా 6: 35). క్రీస్తు శిష్యుడని ఒకనికి గిన్నెడు చన్నీళ్ళిచ్చువాడు సహా తన క్రియకు ప్రతిఫల మొందును. (3. మనము చూపుచున్న ప్రేమవలన మనము క్రీస్తు శిష్యులమని కనబఱచెదము (యోహా. 3: 15). కావున క్రీస్తును ప్రేమించు ప్రేమను బట్టి చేసిన వాటికొరకది అయనన్యాయపుతీర్పు దినమందు మనకు ప్రతిఫల మిచ్చును.

---

## 28. దేవుని ప్రేమించుటనుగూర్చిన బోధ.

నీ పూర్ణ హృదయముతోను, నీ పూర్ణాత్మతోను, నీపూర్ణ మనస్సుతోను నీదేవుడైనయెహోవాను ప్రేమింపవలెను. మత్త. 22:37.

### భాగములు.

1. మనము అన్నిటికంటె దేవునిని ఎక్కువగా ప్రేమించుటకు బద్ధులమై యున్నాము.

II. దేవుడు తన్ను ప్రేమించువారికి చేసిన వాగ్దానములు.

III. మనము మన విధేయతవలన దేవునియందు మనకు గల ప్రేమను కనబఱచవలెను.

IV. మనము దేవుని ప్రేమింపవలసిన విధమును అపొస్తలులు దృష్టాంత పఱచిరి. మఱి ముఖ్యముగా క్రీస్తు దృష్టాంతపఱచెను.

## అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| దేవుని ప్రేమింపవలెను | ద్వితీ. 6. |
| ముఖ్యమైన యాజ్ఞ | లూకా 10: 25-37. |
| దేవుని ప్రేమమనలో ప్రేమను పుట్టించును | 1 యోహా. 4. |
| దేవుడు! మనలను ప్రేమించును | రోమా 5: 1-11. |
| ప్రేమించువారు విధేయులగుదురు | యోహా. 14: 15-24. |
| పౌలుయొక్క ప్రేమయు విధేయతయును | 2 కొరి 11: 16-28. |
| క్రీస్తుయొక్క ప్రేమ, విధేయత | ఫిలిప్పీ 2: 1-11. |

## వేదవాక్యములు.

I. 1. ఆయనే మొదట మనలను ప్రేమించెను గనుక మనము ప్రేమించుచున్నాము (1 యోహా. 4: 19).

2. కాలము పరిపూర్ణమైనప్పుడు దేవుడు తన కుమారుని పంపెను; ఆయన స్త్రీయందు పుట్టి మనము స్వీకృత పుత్రులము కావలెనని ధర్మశాస్త్రమునకు లోబడియున్నవారిని విమోచించుటకై, ధర్మశాస్త్రమునకు లోబడినవాడాయెను. మరియు మీరు కుమారులైనందున నాయనా, తండ్రీ అని మొఱ్ఱపెట్టు తన కుమారుని యాత్మను మన హృదయములోనికి పంపెను. (గల 4: 4-6).

II. 3. దేవుడు తన్ను ప్రేమించువారికొఱకేవి సిద్ధపఱచెనో, అవి కంటికి కనబడలేదు, చెవికి వినబడలేదు, మనుష్య హృదయమునకు గోచరము కాలేదు (1 కొరి 2: 9).

III. 4. మన మాయన ఆజ్ఞలను గైకొనుటే దేవుని ప్రేమించుట: ఆయన ఆజ్ఞలు భారమైనవి కావు (1 యోహా. 5: 3).

5. తన సిలువ నెత్తుకొని నన్ను వెంబడింపనివాడు నాకు పాత్రుడు కాడు (మత్త 10: 38).

6. ఎవడైనను—నేను దేవుని ప్రేమించుచున్నానని చెప్పి తన సహోదరుని ద్వేషించిన యెడల అతడు అబద్ధికుడగును; తాను చూచిన తన సహోదరుని ప్రేమించనివాడు తాను చూడని దేవునిని ప్రేమించలేడు. దేవుని ప్రేమించువాడు తన సహోదరునికూడ ప్రేమించవలెనను ఆజ్ఞను మన మాయన వలన పొందియున్నాము (1 యోహా. 4: 20, 21).

7. నన్ను ప్రేమింపనివాడు నా మాటలు గైకొనడు; మీరు వినుచున్న మాట నా మాట కాదు, నన్ను పంపిన తండ్రిదే (యోహా. 14: 24).

# వివరము.

మనము పూర్ణ హృదయముతోను, పూర్ణాత్మతోను, పూర్ణమనస్సుతోను దేవుని ప్రేమించుటకు బద్ధులమై యున్నాము (ప్ర॥ వా॥), దేవుని మాత్రము ప్రేమించిన చాలును, మఱి యెవరినైనను ప్రేమింప నవసరము లేదని దీని యుద్దేశము కాదు. ఎందుకనగా మనవలె మన పొరుగింటి వారిని ప్రేమింపవలెనని తెలియజేయు స్పష్టమైన యాజ్ఞ యింకొకటి యున్నది. అయితే యితరుల యెడల మనకు నుండవలసిన ప్రేమ దేవుని యెడల మనము చూపవలసిన దానికి సాటియైనది కాక దానికి తక్కువదై యుండవలెను. దేవుని యిష్టాయిష్టములను కనిపెట్టి ఆయన వేటిని ప్రేమించునో వాటిని మనము ప్రేమించి, వేటిని అసహ్యించుకొనునో వాటియందు అసహ్యపడవలెను. దేవుడు పాపము నసహ్యించుకొనినను (హబ. 1: 13; జఖ. 8: 17). పాపిని ప్రేమించును (యోహా. 3: 16). కావున మనముకూడ అలాగుననే చేయవలెను. క్రీస్తు ప్రభువు అట్టి ప్రేమను చూపెను. ఆయన యీ విషయములోను అన్ని విషయములలోను మనకు మాదిరిగా నున్నాడు.

I. మనము అన్నిటికంటె దేవుని నెక్కువగా ప్రేమించుటకు బద్ధులమై యున్నాము.—ఈ ప్రపంచములో దేవుడొకడే పరిపూర్ణుడై (యెష. 46: 9) మన పూర్ణప్రేమను పొందుటకు తగినవాడై యున్నాడు. ఆయనకు ప్రతిగా మనము మఱి దేనినైనను, ఎవరినైనను ఆయనకంటె నెక్కువగా ప్రేమించిన యెడల దేవునికి చూపించవలసిన ఘనతను దానికి లేక వారికి చూపించిన వారమై ఒక విధముగ విగ్రహారాధికుల మగుదుము. చాలమంది మూఢ విగ్రహములను పెట్టుకొని వాటిని పూజింపకపోయినను, తమ్మును తాముగాని, ఇతరులను గాని, ఈ లోకమును గాని దేవునికంటె నెక్కువగా ప్రేమించిన యెడల వారు దానివలన విగ్రహారాధికులగుదురు.

దేవుడు మొదట మనలను ప్రేమించెను కనుక మన మాయనను ప్రేమించవలెను. (1). మన మనుదినమును పొందుఇహ సంబంధమైన మేలు అన్నియు(కీర్త 68: 19), క్రీస్తు ద్వారా మనకు కలుగు ఆత్మీయ దీవెన లన్నియు (ఎఫె. 1:3) మనము ప్రేమించు దేవుని దానములే. మనలను ప్రేమించువారిని మనము ప్రేమించుట సహజము. మనలను ప్రేమించు వారి యెడల మనకు సహజముగా పుట్టునట్టి ప్రేమను మనము తిరస్కరింపకపోయిన యెడల మనము వారిని ప్రేమింపక తప్పదు. ఈ విధముగ దేవుని ప్రేమ ఆయనను విశ్వసించువా రందరిలో (1 పేతు. 1: 8). ప్రేమను పుట్టించును. ఆయన మన యెడల చూపిన దయను చూచి విశ్వసించుకొలది ఆయనను ప్రేమింతుము.

క్రీస్తు యేసు ద్వారా మనము దేవుని బిడ్డలమైతిమి. ఆయన పరలోకమందుండు తన తండ్రియని ప్రభువు ప్రార్థనవల్ల నేర్చికొనుచున్నాము (మత్త. 6: 9). లోక సంబంధులగు మన తలిదండ్రులు మనలను పోషించి కాపాడుచున్నందున మనము వారిని ప్రేమించుచున్నట్లు దేవుని కూడ ప్రేమింపవలెను. దేవుడు మనలను ప్రేమించుచున్నట్లు మన తలిదండ్రులు మనలను ప్రేమింపజాలరు గనుకను, మన ప్రేమను పొందుటకు మన తలిదండ్రులకంటె ఆయన మన ప్రేమకు అర్హుడు గనుకను మనము దేవుని మతి యెక్కువగా ప్రేమింపవలెను. మనము సొంత తలిదండ్రులకంటె దేవునిని మతి యెక్కువగా ప్రేమించుట మన విధియై యున్నది (మత్త. 10: 37).

II. దేవుడు తనను ప్రేమించిన వారికి చేసిన వాగ్దానములు.—ఎవరు దేవుని విశ్వసింతురో వారు ఆయనను ప్రేమింతురనునది నిరూపింప నవసరము లేనంత స్పష్టమైన సత్యమని బైబిలు బోధించుచున్నది. ఇందుచేతనే పేతురుపొందిన పశ్చాత్తాపము యదార్థమైనదా కాదా అను సంగతి పేతురు తనను ప్రేమించు ప్రేమవలననే కనబడునని క్రీస్తు తెలిసికొని-నన్ను ప్రేమించుచున్నావా యని పేతురు నడిగెను (యోహా. 21: 15-17). విశ్వసించువారికి వాగ్దానము చేయబడిన దివ్య వాగ్దానములు ఆ హేతువు చేతనే దేవుని ప్రేమించు వారికి కలుగునని కొన్ని వేదవాక్యములలో వ్రాయబడి యున్నది. ఉదాహరణముగా 1 కొరి. 2: 9 లో "దేవుడు తన్ను ప్రేమించువారి కొఱకేవి సిద్ధపఱచెనో అవి కంటికి కనబడలేదు. చెవికి వినబడలేదు" అని వ్రాయబడియున్నది. ఇందువలన విశ్వసించువారికి కాదు గాని, ప్రేమించువారికి ఆ వాగ్దానము చేయబడెనని తెలిసికొనుచున్నాము. అయినను విశ్వాసమువలన రక్షణ కలుగునను బోధకును దీనికిని వ్యత్యాస మేమియు లేదు. ఏలననగా, క్రీస్తు ద్వారా దేవుని దయను నేర్చికొని ఆయనను విశ్వసించువారు ఆయనను ప్రేమింపక తీరదు. విశ్వాసము ప్రేమ అను నీ రెండు గుణములును ఒక దాని నొకటి ఎడబాసి యుండక ఎల్లప్పుడును ఒకదానితో నొకటి కలిసియుండును. ప్రేమ వలననే విశ్వాసము కార్యసాధకమగును. (గల. 5: 6). విశ్వాసాభివృద్ధి కొలది ప్రేమయును వృద్ధి నొందును.

III. మనము మన విధేయత వలన దేవునియందు మనకుగల ప్రేమను కనబఱచవలెను.—వారు ఫలములవలన వారిని తెలిసి కొందురని (మత్త. 7: 20). క్రీస్తుచెప్పెను. మనము దేవుని యదార్థముగా ప్రేమించువారమైన యెడల అది మన ప్రవర్తనలో కనబడును. ఆయన యాజ్ఞలకు లోబడుట వలనను (4), ఆయన పేరట శ్రమపడవలసి వచ్చినప్పుడు అట్టి శ్రమలను సహించుటవలనను

(5). మనము మన ప్రేమను వెల్లడిపరచవలెను. మఱియు దేవునికి సంబంధించియున్న ఆయన సంఘమును, ఆయన వాక్యమును, ఆయన యారాధనములను ప్రేమించుటవలన కూడ ఆయనయందు మనకుగల ప్రేమ వెల్లడి యగును: దేవుని వాక్యమును ప్రేమింపనివాడు దేవునిని కూడ ప్రేమింపడు (యోహా. 8:47). మఱియు మనతోటి మనుష్యులను ప్రేమించుటవల్ల దేవుని యెడల మనకు నుండు ప్రేమను కనబఱచవలెను. దేవుని ప్రేమించినయెడల మనము మన పొరుగువారినిగూడ ప్రేమింతుము. క్రీస్తు మనలను ప్రేమించినట్లు మన మొకరి నొకరము ప్రేమింపవలెను (యోహా.12: 34). ఇతరులను ప్రేమించుటచేత మనము దేవునిని కూడ ప్రేమించుచున్నామని కనబఱచవలెను (6).

ప్రేమతో భయముకూడ నుండవలెనుగాని దాసుడు తన యజమానునికి భయపడునట్లుగను, అవిశ్వాసి దేవుని యుగ్రతకు భయపడునట్లుగను మనము దేవునికి భయపడక, మనము విశ్వాసమువలన దేవుని బిడ్డలమైతిమి గనుక మంచి పిల్లలు మంచివారై తల్లిదండ్రులకు లోబడునట్లుగా ఆయనకు భయపడవలెను. అట్టి భయము ప్రేమ విశ్వాసములతో కూడినదై మనలో నుండు దాస్యపు భయమును పోగొట్టును (1 యోహా. 4: 18). దేవుని ప్రేమింపకయు, ఆయన చిత్తమును నెఱవేర్చుటకు ప్రయత్నము చేయకయు నుండు వారందరును ఆయన యుగ్రతకు భయపడవలసినదే (రోమా. 2: 4- 5). అయితే దేవుని యుగ్రతకు భయపడుటకు విశ్వాసుల కేకారణమును లేదు. ఎందుకనగా వారు క్రీస్తుద్వారా దేవునితో సమాధానపఱచబడి పాపక్షమనొంది, దేవుడు తమ్మును ప్రేమించునని రూఢిగా తెలిసికొనినవారై నిర్భయముగా నుండగలరు,

మనము దేవుని ప్రేమించినయెడల ఆయనకు విధేయులమగుటకు ఆ ప్రేమ మనలను రేపును.—(2 యోహా 6.) ప్రేమ స్వకీయ మేలుకోరక ప్రేమింపబడువాని మేలు కోరును. తన తలిదండ్రులను ప్రేమించు బిడ్డ వారికి లోబడును. మనము దేవుని ప్రేమించువారమైన యెడల అన్ని విషయములలో ఆయనను సంతోషపఱచుటకు యత్నించుచు, మన స్వంత యాశలను గాక ఆయనచిత్తమునే కోరువార మగుదుము. మనము దేవునికి విధేయులము కాకపోయినయెడల ఆయనను ప్రేమించువారము కాము (7). తన తల్లిదండ్రులకు లోబడని బిడ్డ—నేను నా తలిదండ్రులను ప్రేమించుచున్నానని ఎంతగా చెప్పినను దాని మాటలకు మనము నమ్మజాలముగదా? అదేవిధముగా మనము బుద్ధిపూర్వకముగా దేవునికి అయిష్టమైనవాటిని చేయుచు, మేము దేవుని ప్రేమించుచున్నామని యెంత చెప్పినను మన మాటలు వట్టిమాట లగునేకాని మనము ఆయనను ప్రేమించువారము కాజాలము

మనము దేవుని ప్రేమించినయెడల ఆయనకు లోబడుట తేలికగా నుండును.—మనము ప్రేమించువారి కొఱకెంతకష్టపడినను అది మనము కష్టమని యెంచము. దేవుని ప్రేమించువారికి ఆయన యాజ్ఞలు భారమైనవికావు (1 యోహా. 5:3). ఈ లోకమును ప్రేమించువారు దాని పాపములను ప్రేమింతురు, కావున క్రీస్తు ఆజ్ఞలకు లోబడుటకంటె కష్టతరమైనది మఱి యేదియు లేదనియు, క్రైస్తవ మతము ననుసరించువారికి యీ లోకములో దుఃఖమే గాని సంతోషము లేదనియు వారనుకొని పొరపాటుపడెదరు. అయితే దేవునిని ప్రేమించువారికి కష్ట మేమియు లేదు. వారు దేవునిని ప్రేమించుటచే ఆయనకు లోబడుట వారికి సంతోషకరమే గాని ఏమాత్రమును ప్రయాసము కాదు. ఆయనకు లోబడుటవలన కాదుగాని ఏవిషయములలో ఆయనకు లోబడ జాలమో వాటివలననే దుఃఖము కలుగును. మనము రక్షకుని ప్రేమించినయెడల ఆయన కాడి సుళువుగాను ఆయన భారము తేలికగాను నుండును (మత్త. 11: 28). దేవునికి లోబడుట మనకు అయిష్టముగ నున్నయెడల మన ప్రేమలో లోపమున్నదని తెలిసికొనవలెను. ఆయన యెడల మనకుగల ప్రేమ వృద్ధియగునట్లు మన మాయన దయా దాక్షిణ్యములను ఎక్కువగా తలంచుకొనవలెను. అప్పుడు ఆయన చిత్తమును నెఱవేర్చుట మనకు ఆయాసకరముగ నుండక పూర్ణ సంతోషకరముగ నుండును.

IV. మనము దేవుని ప్రేమింపవలసిన విధమును అపొస్తలులు దృష్టాంతపఱచిరి. మఱి ముఖ్యముగా క్రీస్తు దృష్టాంతపఱచెను.—అపొస్తలులు చరిత్రలను చూడగా వాటిలో దేవునిని ప్రేమించుట యనగా నెట్టిదో చక్కగా దృష్టాంతబరచబడెను. వారు సమస్తమును విడిచి క్రీస్తును వెంబడించిరి (లూకా 5: 11; మత్త. 19: 27) క్రీస్తు ఈ లోకములో నున్నంతవఱకు వారు క్రీస్తు నొద్దనుండుటచె తమ యాస్తిని సౌఖ్యమును పోగొట్టుకొని మిగుల ప్రయాసపడవలసి వచ్చెను. క్రీస్తు పరలోకమున కెక్కిన పిమ్మటకూడ వారు అనేకవిధములైన హింసలు పొందినను ఆయన నిమిత్తము సమస్తము నష్టముగా నెంచుకొని (ఫిలి. 3: 8). తమ జీవితకాలమంతయు ఆయన సేవలో గడుపుకొనిరి. ప్రేమచేత బలవంతపఱచబడిన వాడు ఎంతగా సహింపగలడో, ఎంతగా పనిచేయగలడో దానిని మనము పౌలు చరిత్రవలన తేటగా తెలిసికొనగలము (2 కొరి. 11: 23-28).

అయితే అపొస్తలులును మనుష్యులే గనుక వారుకూడ పూర్ణప్రేమగలవారు కాజాలరు. క్రీస్తు ఒక్కడు మాత్రము తండ్రిని పూర్ణముగాను నిష్కళంకముగాను ప్రేమించెను. ఆయన ప్రేమ మనకు మాదిరిగా నున్నది. పూర్ణ

పరిశుద్ధుడైన ఆయన దేవుని ప్రేమించుచు అన్నివిషయములలో ఆయనకు లోబడిన వాడాయెను. ఆయన దేవునిని అన్నిటికంటె నెక్కువగా ప్రేమించెను. ఆయన తన యిష్టప్రకారము కాదుగాని దేవుని చిత్తప్రకారము జరిగింపవలె నను ఒక్కటే కోరికె గలవాడై (యోహా. 4: 34), మరణ పర్యంతము అనగా సిలువ మరణ పర్యంతము విధేయు డయ్యెను (ఫిలిప్పీ 2: 8). ఆయనవలె మనము కూడా దేవునిని ప్రేమింపవలెను. మనము సౌఖ్యము నెంచక సమస్తమును, అవసరమైన యెడల ప్రాణమును సహా ఆయన నిమిత్తము విసర్జింపవలెను. ఆయితే దేవుడు మనకు నుండగా ఆయన నిమిత్తము మన మెంతవిసర్జించపవలసి యుండినను భాగ్యవంతులమే యని తెలిసికొనవలెను (కీర్త. 72: 25: 26).



## 29. వినయమును గూర్చిన బోధ.

మీరందఱు ఎదుటివాని యెడల దీనమనస్సను వస్త్రము ధరించుకొని మిమ్మును అలంకరించుకొనుడి; దేవుడు గర్విష్ఠులను నెదిరించి వినయముగల వారికి కృప ననుగ్రహించును. 1 పేతు. 5: 5.

### భాగములు.

I. క్రీస్తుయొక్క వినయము.

II. మనకు నుండవలసిన వినయము.

1. అది ఎటువంటిది ?

దాని నెట్లు కనబఱచవలెను ?

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| క్రీస్తు సాత్వికుడు | మత్త. 11. 20-30. |
| క్రీస్తు సాత్వికుడు | యోహా. 13: 1-11. |
| క్రీస్తు సాత్వికమునకు మాదిరియై యున్నాడు | ఫిలిప్పీ 2: 1-11. |
| శిష్యుల గర్వము | మార్కు 10: 35-45. |
| క్రీస్తు శిష్యులకు వినయమును గూర్చి బోధించుట | మత్త 18: 1-20. |
| గర్వమువలన కలహములు కలుగును | యాకో. 4: 1-10. |
| దీనమనస్సు అను వస్త్రమును ధరించుకొనుడి | 1 పేతు. 5: 1-11. |

## వేదవాక్యములు.

I. 1. క్రీస్తుయేసునకు కలిగిన యీ మనస్సు మీరును కలిగి యుండుడి ఆయన దేవుని స్వరూపము కలిగినవాడై యుండి దేవునితో సమానముగా నుండుట విడిచి, పెట్టకూడని భాగ్యమని యెంచుకొనలేదు. కాని మనుష్యుల పోలికగా పుట్టి దాసుని రూపమును ధరించుకొని తన్ను తానే రిక్తునిగా చేసికొనెను. మఱియు ఆయన ఆకారమందు మనుష్యుడుగా కనబడి మరణము పొందునంతగా అనగా సిలువ మరణము పొందునంతగా విధేయత చూపినవాడై తన్ను తాను తగ్గించుకొనెను. (ఫిలి. 2:5–8)

II. 2. ప్రభువు దృష్టికి మిమ్మును మీరు తగ్గించుకొనుడి. అప్పుడాయన మిమ్మును హెచ్చించును' (యాకో. 4: 10).

3. మహా ఘనుడును మహోన్నతుడును పరిశుద్ధుడును నిత్యవాసియునైనవాడు ఈలాగు సెలవిచ్చుచున్నాడు—నేను మహోన్నతమైన పరిశుద్ధ స్థలములో నివసించువాడను; అయినను వినయముగలవారి ప్రాణము నుజ్జీవింప చేయుటకును నలిగినవారి ప్రాణము నుజ్జీవింప చేయుటకును వినయముగల వారియొద్దను దీనమనసుగల వారియొద్దను నివసించుచున్నాను (యెష. 57: 15).

4. ఈబిడ్డవలె తన్నుతాను తగ్గించుకొను వాడెవడో వాడే పరలోక రాజ్యములో గొప్పవాడు (మత్త 18: 4).

## వి వ ర ము.

వినయ మను గుణము మనుష్యులకు సహజముగా నుండదు. స్వాభావికముగ మనము గర్వపడి దేవుని నెదిరించి (కీర్త. 10: 4) మనకీర్తినే కోరుచుందుము కాని వినయము గలవారము కాము క్రీస్తు ఈ గుణమును దృష్టాంతపరచి దానిని మనకు తేటపఱచెను. వినయము లేనిది మనము ఆయన శిష్యులము కానేరము.

I. క్రీస్తుయొక్క వినయము.—క్రీస్తు అన్ని విషయములలో మనకు మాదిరియై యున్నట్లు వినయగుణము విషయములోకూడ మాదిరియై యున్నాడు. ఆయన ఆదినుండి దేవుని కుమారుడైనను తనదైవ మహిమను విడిచి సాత్వికుడును, దీనమనస్సుగలవాడునై మనుష్యులలో తిరుగుచు (మత్త 11: 29). సిలువ మరణము నొందునంతవరకు వినయమును కనబఱచెను. (1). మనము మన పాపములను బలహీనతలను నెఱిగి సిగ్గుపడి వినయము చూపవలసియున్నాము. అయితే క్రీస్తులో అట్టి వేవియు నుండక పోయినను (యోహా. 8: 46) మనకు విమోచనము కలుగుటకును మనకు వినయమునుగూర్చి దృష్టాంతము చూపుటకును (1 పేతు. 2: 21) ఆయన స్వయముగా అంతటి దీనుడయ్యెను. క్రీస్తు దేవుని చిత్తమునకు పూర్ణముగా లోబడుటచే

దేవుని యెడల వినయము కలవాడయ్యెను. తానెంత ప్రయాసపడవలసి యుండినను మనుష్యులకు మేలు చేయుటచేతను, విరోధులు తన్నెంత నిందించిదూషించినప్పటికిని ఓర్చుకొనుటచేతను ఆయన మనుష్యుల యెడల తన వినయమును కనబఱచెను.

II. మనకు నుండవలసిన వినయము.—క్రీస్తు మనకు మేలు చేయుటకై దీనుడయ్యెను. మనమైతే మన కొద్దితనముచేతను మన అయోగ్యతను బట్టియును దీనమనస్సుగలవారమై యుండవలెను. దేవుడు సర్వశక్తిగలవాడును, పూర్ణ పరిశుద్ధుడునై యున్నాడు; మనము బలహీనులము, అయోగ్యులము, పాపులమునై యున్నాము. అందువలన మనము దేవుని యెదుట వినయమనస్సు కలవారమై యుండవలయును (2.)

1. వినయ మనగా నేమి?—మనకు వినయగుణ ముండిన యెడల మనము మన అయోగ్యతను తెలిసికొని, దేవుని దయవలననే మన మనుదినమును బ్రదుకుదుమని యెఱిగి, మనలో నుండు సుగుణములు మన యోగ్యతవలన గాక, ఆయన కృపవలననే కలిగినవని యొప్పుకొందుము (1. కొరి 15: 10) అదియుగాక మనమితరులను తృణీకరింపక వారు మనకంటె మంచివారని యనుకొందుము (ఫిలి. 2: 3)

వినయము చాలా ముఖ్య లక్షణమై యున్నది.—అది లేనిది దేవుని యెడల మన కుండవలసిన మనస్సుండనేరదు కావున నిజభక్తి యుండనేరదు. దేవుడు గర్విష్ఠుల నెదిరించి దీనులకు కృపనిచ్చును (యాకో 4: 6) మనకు విఱిగిన హృదయములేనిది దేవుడు మనయందనుకూలింపడు (కీర్త 51: 17) వినయముతో తనపాపము నొప్పుకొని, దేవుని కరుణను వేడుకొనిన సుంకరి దేవుని దీవెనను పొందెనుగాని, దేవుని యెదుట తన్ను తాను మెచ్చుకొని యితరులను తృణీకరించినపరిసయ్యుడు దేవునికి అయిష్టుడయ్యెను (లూకా 18: 9-13) తన్ను తాను హెచ్చించుకొనువాడు తగ్గింపబడును తన్ను తాను తగ్గించుకొనువాడు హెచ్చింపబడును (18: 14)

దేవుడు మనలోను, మన ద్వారాను తన యుద్దేశములను నెఱవేర్చునట్లు అట్టి వినయము మనకు నుండవలెను.—దేవుని సహాయము లేనిది ఆయనను సేవింపవలెనను కోరిక కూడ నుండజాలదు. ఒకవేళ అట్టికోరికె యుండినను ఆయన సహాయము లేనిది దానిని నెఱవేర్చజాలము. ఎవరు తమ శక్తిహీనతను తెలిసికొని దేవుని శక్తిని వేడెదరో అట్టివారికే ఆయన దానిననుగ్రహించును గాని యితరులకు నియ్యడు. ఇందుచేతనే మన మెప్పుడు బలహీనులమో అప్పుడె బలవంతులమని దేవుని వాక్యము చెప్పుచున్నది (2 కొరి 12: 10). మనకు

శక్తిలేదని యీయి తెలిసికొనినప్పుడే దేవునిమీద ఆనుకొనవలెను. అప్పుడు మన మాయన పనిచేయుటకు ఆయన మనలను బలపరచగలడు. దేవుడు దీనమనస్సు గల వారియొద్ద నివసించును (3) పౌలుయొక్క చరిత్ర ఈసత్యమును బహు చక్కగా దృష్టాంతపరచును. పౌలు బలహీనుడైనను (2 కొరి 12: 9) తనను బలపరచిన క్రీస్తును బట్టి సమస్తమును చేయగలిగి యుండెను (ఫిలి 4: 13) ఆతడెన్ని పనులు చేసినను తన విషయము అతిశయపడక, దేవుని కృపవలననే వాటిని చేయుటకు శక్తి కలదని యొప్పుకొని తనను పొగడుకొనక బహు వినయముగల వాడయ్యెను. (1 కొరి. 15: 10) మనమును పౌలువలె నుండవలెను అతిశయాస్పదములు మనలో లేనేలేవు మనకు ఆత్మీయజీవమిచ్చి దాని కాపాడువాడు దేవుడే కావున మనము మనలో మంచిదేదియు లేదని తెలిసికొని, స్వాతిశయము లన్నిటిని మనలోనుండి తీసి వేసి క్రీస్తుమీద ఆనుకొనిన యెడల ఆ జీవము బలపరచబడి వృద్ధినొందగలదు:

దేవుని యెడల మనకు వినయమనసు కలిగిన యెడల ఇతరుల యెడలమనము చేయు వాటిలో కూడ అట్టి వినయము కనబడును.—— ఇట్టి వినయ మనస్సు మనకు నుండిన యెడల గర్వము, స్వాతిశయము, స్వనీతి మొదలగు ఏ గుణములు మనలో నుండవు. దేవుడు మనకు విశేష సౌందర్యము, ధనము, ఘనము, శక్తి, తెలివి, భక్తి, మొదలగు వీటిలో నెద్దానినైన నిచ్చిన యెడల అది దేవుని దానమే కాని మన పుణ్యకార్యము కాదని యొప్పుకొని దానిని బట్టి మనము ఇతరులకంటె మంచి వారమని గర్వపడక (యిర్మి 9: 23, 24) దేవుడు మనకు నిచ్చిన యీ విశేష దానమును ఇతరుల కిచ్చియుండిన యెడల వారు మనకంటె మంచివారైయుందురని యొప్పుకొని వినయబుద్ధి కలవారమై యుండవలెను. దేవుడు మన కిచ్చిన విశేష వరముల విషయముపై చెప్పబడిన రీతిగ నెంచక ఎప్పుడు గర్వపడెదమో అప్పుడు సాతాను మనలో నివసించునే కాని వినయముకలవారి యొద్ద మాత్రము నివసించు దేవుడు మనలో నివసింపడు.

మనము పలుకు మాటలలో వినయము కనబరచవలయును.—— మనము మనలనుగూర్చి మాట్లాడుకొనునపుడు బడాయిగా మాట్లాడకయు, మనము చేసిన వాటి విషయము పొగడుకొనకయు నుండవలెను (సామె. 27: 2) మఱియు మన మితరులనుగూర్చి మాటలాడునపుడు వారినిగూర్చియైనను వారు చేసిన వాటినిగూర్చియైనను అపహాస్యముగాను దూషణగాను మాటలాడరాదు.

మనము చేయు క్రియలలోకూడ వినయము కనబరచవలెను. ——మన మితరుల యెడల గర్వబుద్ధితో నేమియు చేయరాదు. ముఖ్యముగా నెవరికి

విద్యావిషయములలోను స్థితిలోను దేవుడు మనకు ననుగ్రహించిన దీవెనలు లేవో అట్టి వారిని తృణీకరింపక వారికికూడా తగిన మర్యాదచూపవలెను (రోమా 12: 16) మన మితరుల పాపములను చూచి అవి పాపములేయని వారికి బుద్ధిచెప్పవలెను గాని, మేము వారికంటె మంచివార మనుకొనక వారివలె మేమును పాపులమని గ్రహించి, వినయముతోను ప్రేమతోను వారికి బుద్ధిచెప్పవలెను (ఎఫె. 4:2: గల. 6: 1). అట్టివారిని చూచి—మా దాపున రావద్దు, ఎడముగా నుండుడు. మీకంటె మేముపరిశుద్ధులము (యెష. 65. 5) అనిచెప్పక, వారే పాపములో పడిరో ఆపాపములోపడకుండ మనశక్తివలన కాదుగాని దేవుని కృపచేతనే కాపాడబడి యున్నామనియు (2. కొరి. 8: 5), వారుచేసిన తప్పులు మనము చేయకపోయినను వారికి లేనితప్పులు మనకు నున్నవనియు తెలిసికొని వారుచేసిన వాటి విషయమున దయగల భావముతో చూడవలెను. గర్వము ఎన్నివిధములుగ నున్నది! యీలోకములో నెంతమంది మనుష్యుల యెదుట గాని దేవుని యెదుట గాని తమ్మును తాము తగ్గించుకొనక గర్వపడుచున్నారు! శక్తి, బుద్ధి, ఘనము, ధనము మొదలగువాటి విషయ మెంతమందో అతిశయించుచున్నారు! కొందఱు క్రైస్తవులు సహా తమభక్తి విషయమున, భక్తితో గూడిన తమనడత విషయమున అతిశయింతురు భక్తిదేవుని దానమే కాని మన పుణ్యకార్యము కాదు కావున అట్టి అతిశయము బొత్తిగాతగదు. భక్తితో కూడిన కార్యముల వలన మనకు పుణ్యము కలుగు ననుకొనుట కేవలము విపరీతముగా నున్నది. అది పరిసయ్యుల తప్పుబోధ. అందువలనవారు తామే నీతిమంతుల మనుకొని యితరులను తృణీకరించిరి (లూకా 18: 9).

మన చూపు (లేక ఆకారము) వలన కూడగర్వము గనపఱచ వచ్చును. కొందఱు తమ వస్త్రముల విషయమునను మఱి కొందఱు తమ చక్కదనము విషయమునను గర్వపడెదరు. కొందఱు కీర్తియందు అతిశయించునట్లు దాని పొంద యత్నింతురు. తమ యభిప్రాయముల ననుకూలముగా కార్యములు జరుగవలెనను మంకుతనము చూపుట చేతను, తప్పులుచేసిన పిమ్మట వాటిని యొప్పుకొనక పోవుటచేతను, బహు స్వల్పవిషయములను గూర్చి అలుగుట చేతను, ఇతరులు తమకు నమస్కారములుచేసి తమ్మును ఘనపఱచ వలెనని కోరుటచేతను ఈమొదలైన యింక ననేక విధములుగాను కొందఱి గర్వము కనబడును.

2. వినయము నెట్లు కనబఱచవలెను.—ఇతరులు మనకంటె నెంత కొద్దివారైనను మనము వారికి సంతోషముతో మేలు చేయుచుండవలెను. అతి వినయ వంతులు దేవునిరాజ్యములో గొప్పవారుగ నెంచబడుదురు 4) గొప్పవారుకొద్ది

వానివలెను. అధికారి ఉపచారము చేయువానివలె నుండవలెను (లూకా. 22: 26). మనము క్రీస్తును మాదిరిగానెంచి సమయమును కనిపెట్టి అందఱికి వినయముతోను సంతోషముతోను మేలు చేయుటకు ప్రయత్నముచేయవలెను. క్రీస్తు ఉపచారము చేయించుకొనుటకు కాదు గాని ఉపచారము చేయుటకు వచ్చెను (మత్త. 20: 28). తన శిష్యులకు వినయ బుద్ధిని నేర్పుటకై ఆయన ఒక నీచదాసుడు చేయునట్లు శిష్యుల పాదములను కడిగెను ఈవిధముగా మనము ఇతరుల మేలుకొఱకు అట్టి నీచమైన పనులను కూడ చేయవలెనని మనకు బోధించెను (యోహా. 13: 12-22). మనము స్వంత కీర్తిని కోరక మన పనులను, స్థితులును, ఎంతకొద్దివైనను వాటివలన యితరులకు మేలు కలుగులాగున చేయుట యనునదే మనకుగల ఒక్కటే కోరికయై యుండవలెను.

ఇట్టివినయము గలవారికి ధైర్యముండ నేరదని మనమేమాత్రము ననుకొనరాదు. అట్టివారికి కూడ ఇతరులను నడిపించుటకు తగిన గుణము లుండగలవు. మనకు వినయముండ వలెనని బైబిలు ఎంత బోధించినను, మనము ప్రభువు యొక్క శక్తిని బట్టి ఆయన శౌర్యమును మహా బలవంతులమై యుండవలెనని (ఎఫె. 6: 10) అది ప్రేరేపించును. మనము మన క్రియలను ధైర్యముతోను, చుఱుకుదనముతోను చేసి, సత్యమును దక్కించుకొనుటకు పోరాడి, మనకుగల యుద్యోగ ధర్మములను ధైర్యముతో కొనసాగింపవలెను. వినయముండిన యిట్టి ధైర్యము కూడ నుండునను సంగతి మనము మోషే, యెహోషువ, దావీదు, పౌలు, లూథరు మొదలగుభక్తులచరిత్రవలన తెలిసికొనగలము. వీరందఱు వినయముగలవారై దేవునిని పూర్ణముగ నమ్మియుండి తమ కప్పగింపబడిన పనిని వారు అందఱికంటె నెక్కువ తెగువతోను, చుఱుకు దనముతోను, ధైర్యముతోను నెరవేర్చిరి.

---

## 30. కృతజ్ఞతను గూర్చినబోధ.

ప్రతివిషయమునందు కృతజ్ఞతాస్తుతులను చెల్లింపుడి; ఈలాగు చేయుట యేసుక్రీస్తునందు మీ విషయములో దేవుని చిత్తము. 1 థెస్స. 5: 18.

### భాగములు.

1. దేవుడు మనకు చేయుచునుండు ఉపకారములు.
11. మనము దేవుని యెడల చూపవలసిన కృతజ్ఞత.

## అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| ప్రతి మేలును దేవునివల్ల కలుగును. | యాకో. 1: 5-18. |
| అపొస్తలుడైన పౌలుయొక్క కృతజ్ఞత. | ఎఫెసీ 1: 3-14 |
| అపొస్తలుడైన పౌలుయొక్క కృతజ్ఞత. | ఫిలి. 1: 3-11. |
| క్రీస్తుకృతజ్ఞత నగపరచుట | మత్త. 15:32-39;11: 25-30. |
| మనుష్యులు కృతజ్ఞులై యున్నారు | లూకా. 17:11-19. |
| స్తోత్రములను పాడవలయును | ఎఫెసీ 5:15-21. |
| స్తుతిపాట. | కీర్తన. 103. |

## వేదవాక్యములు-

I. 1. సంపూర్ణమైన ప్రతివరమును పర సంబంధమైనదై జ్యోతిర్మయుడగుతండ్రి యొద్దనుండి వచ్చును. ఆయనయందు ఏ చంచలత్వమైనను గమనాగమనములవలన కలుగు నేఛాయయైనను లేదు (యాకో. 1:17).

2. ఆయన ఆకాశమునుండి మీకు వర్షమును ఫలవంతములైన ఋతువులను దయచేయుచు ఆహారము ననుగ్రహించుచు నుల్లాసముతో మీ హృదయములనునింపుచు మేలు చేయుటచేతతన్నుగూర్చి సాక్ష్యము లేకుండ చేయలేదు (కార్య. 14:17.)

II 3. ప్రార్థనయందు నిలుకడగా నుండి కృతజ్ఞతగలవారయిదానియందు మెలకువగా నుండుడి (కొల. 4:2).

4. ఒకని నొకడు కీర్తనలతోను సంగీతములతోను ఆత్మసంబంధమైనపాటల తోను హెచ్చరించుచు, మీ హృదయములలో ప్రభువునుగూర్చి పాడుచు కీర్తించుచు మన ప్రభువైన యేసుక్రీస్తు పేరట సమస్తమునుగూర్చి తండ్రియైన దేవునికిఎల్లప్పుడును కృతజ్ఞతాస్తుతులను చెల్లించుచు క్రీస్తు నందలి భయముతో ఒకనికి నొకడు లోబడియుండుడి (ఎఫెసీ 5: 19-21)

## వివరము.

మనము పొందుచున్న ప్రతిమేలును దేవుని దానమై యున్నది (1) కావున మనమట్టి యుపకారముల నెఱిగి కృతజ్ఞులమై మాటవలనను క్రియలవలనను దేవునికి మన కృతజ్ఞత నగపఱచవలెను.

1. దేవుడు మనకు చేయుచునుండు ఉపకారములు.—దేవుడు మనలను సృజించెను (యోబు 33: 4) మన మాయనవలన బ్రతుకుచున్నాము

(కార్య. 17:28) ఆయన మనల ననేక యాపదలలోనుండి తప్పించుచు (2 తిమొ. 4:18), మనకు అన్నవస్త్రముల ననుగ్రహించుచున్నాడు (కీర్తన 145:16). మఱియు ఆయన మనకు మంచి ఋతువులను వర్షమును (3) సుఖక్షేమమును ఈ మొదలగు మేలు లన్నిటిని దయచేయుచున్నాడు. కావున మన మాయనకు కృతజ్ఞత నగపఱచుట మనకు విధియై యున్నది.

క్రీస్తుయేసు ద్వారా మనదేవుడు మనకు ననుగ్రహించు ఆత్మీయ వరములను చూడగా మనమాయనను మఱి యెక్కువగా స్తుతింపవలసిన వారమై యున్నాము (ఎఫె. 1.3-6). మనలను నిత్యనాశనమునుండి తప్పించుటకు ఆయన తనకుమారుని మరణమున కప్పగించెను (1. యోహా. 4:9) మన మాయన రక్షణ నంగీకరించులాగున ఆయన తన వాక్యమును మన కనుగ్రహించి మన హృదయములను రేపుచున్నాడు. మఱియు ఆయన మనలను తనరాజ్యములోనికి చేర్చుకొని (కొల: 1: 13, 14). మనలను రక్షణకు వారసులనుగా చేసెను. ఇదియు గాక ఆయన మనకు కుమారస్థితి ననుగ్రహించి (గల 4:6), వాడబారని స్వాస్థ్యమును మనకు దయచేయును (1. పేతు. 1:3, 4) మనము దేవుని నెంత నమ్మకముగా సేవించినను, ఆయన మనకు చేసిన యింతటి గొప్ప యుపకారములకు తగినంత కృతజ్ఞతను చూపుట మన తరము కాదు.

11. మనము దేవునియెడల చూపవలసిన కృతజ్ఞత.— ఈ విషయములో క్రీస్తుమనకు మంచి మాదిరిని చూపెను. ఎట్లనగా ఆయన అవతారమందున్నప్పుడు దేవునికి కృతజ్ఞత నగపఱచెను. ఆయన దేవుని కుమారుడైనను, నిజమైన మనుష్యుడుగ నుండుటచే దేవుడు తన్ను నుద్ధరించువాడని యెడతెగక నొప్పుకొనుచు, ఆయన యెడల కృతజ్ఞత గలవాడయ్యెను: నాలుగువేల మందికి ఆహారము పెట్టినప్పుడు (మత్త 15: 26), ఆ రొట్టెలను చేపలను దయచేసినందుకై దేవునికి కృతజ్ఞతను చెల్లించెను. ప్రభు రాత్రిభోజన సంస్కారము నేర్పఱచినపుడు అలాగుననే చేసెను (మత్త 26: 26) ఈ దృష్టాంతములవలన భోజన సమయమందు కృతజ్ఞతా ప్రార్థనను చేయుట ఆయనకు అలవాటై యుండెనని తెలిసికొనగలము. తన శిష్యుల సువార్తపని వృద్ధినొందుటను చూచి ఆయన దేవునికి కృతజ్ఞతను చెల్లించెను (మత్త 11:25) లాజరును లేపిన సమయమున దేవుడు తన ప్రార్థన నాలకించినందున ఆయనకు స్తోత్రములు చేసెను (యోహా 11: 41) దేవుని కుమారుడగు క్రీస్తు ఈ విధముగా తాను పొందిన మేలులను మఱవక దేవునికి స్తోత్రములు చేయగా పాపులమైన మనము అలాగు చేయుటకు మఱెక్కువగా బద్ధులమై యున్నాముగదా!

మన మితరులను మేలు చేసినపుడు వారు దానిని గుర్తించి మనయెడల కృతజ్ఞత చూపకపోయినట్లు అది మనకిష్టముగ నుండునా? కాదుగదా! ఉపకారము

చేసినవారి యెడల కృతజ్ఞత చూపుటయే ధర్మము. తమకు నితరులు చేసిన యుపకారముల నెఱుగనివారికంటె యధములు లేరని అందరు నొప్పుకొందురు. ఇట్లుండ దేవుని లెక్కలేని యుపకారములను మఱచిన వాడెట్టి నీచు డనవచ్చును? దేవుడు కృతజ్ఞతను కోరుచున్నాడు. క్రీస్తు పదిమంది కుష్ఠరోగులను బాగుచేసిన పిమ్మట కృతజ్ఞతను చూపుటకు వారిలో నొకడు తప్ప మఱి యెవడును రాక పోవుటను ఆయన చూచి విచారపడి ఆ తొమ్మండుగురు ఎక్కడ? అని దుఃఖముతో నడిగెను (లూకా 17: 17).

క్రైస్తవులు సమస్తమునుగూర్చి దేవునికి కృతజ్ఞత చెల్లింపవలెనను ప్రేరేపణ యున్నది. (ఎఫె. 5: 20). అపొస్తలుల పత్రికలను చదువగా వారు దాదాపు ప్రతిపత్రికను కృతజ్ఞతా స్తోత్రములను చెల్లించుటతో నారంభించి వ్రాసినట్లు తెలిసికొనవచ్చును. అట్టి కృతజ్ఞతబుద్ధిగల మనస్సు భక్తులకు నుండక తప్పదు. పాతనిబంధనలోని కీర్తనలు కృతజ్ఞతతో నిండియున్నవి. యెహోవా దయాళుడు; ఆయన కృప నిరంతరము నిలుచుచున్నది. ఆయనకు కృతజ్ఞతాస్తుతులను చెల్లించుడి (కీర్త 111: 1). అను నిట్టి వాక్యములు కీర్తనలలో ఎన్నోమాఱులు కనబడును. ఆకీర్తనల గ్రంథములో స్తుతికీర్తనలను ఒక ప్రత్యేకమైన భాగముగ నెంచదగును. మోక్షమునకు వెళ్ళిన భక్తులును దూతలును, దేవునికి ఎల్లప్పుడు స్తుతులను చెల్లింతురు. ఇట్లుండగా అట్టి మోక్షమును పొంద నాశించుచున్న మనము ఈ లోకములో అలాటి స్తుతులను చేయ నభ్యసించుటయే బుద్ధికాదా?

మనము మన సమస్తమునుగూర్చి ఎల్లప్పుడును దేవునికికృతజ్ఞతాస్తుతులను చెల్లింపవలెను (ఎఫెసి 5: 20). మనము కోరుకొను కొన్ని మేలులు మనకు దొరకక పోయినను, మనకు దొరికిన మేలులను మఱువక వాటినిబట్టి కృతజ్ఞత చూపవలెను. ఈ విధముగా దేవుని యుపకారములను మనము తలంచుకొనిన యెడల దేవుడు మనకు ననుగ్రహింపని మేలులను గూర్చియు, మనకు సంభవించు కష్టదుఃఖములనుగూర్చియు తలంచుకొనుటకై మనకు అవకాశ ముండదు. అపుడు కష్టదుఃఖములును సహా దేవుడు మన మేలునకుగా నెంచి పంపించుచున్నాడని గ్రహించినవారమై వాటినిబట్టి కూడ ఆయన యెడల కృతజ్ఞతను చూప నేర్చుకొందము (రోమా 5: 3). తన శ్రమలవలన సువార్తపని కొనసాగునని పౌలు తెలిసికొని వాటినిబట్టి దేవుని స్తుతించెను (కొల. 1, 24). క్రీస్తును విశ్వసించుటవల్ల మనము పొందిన మేలుల యెదుట ఈలోక చింత లన్నియు ఎన్నతగినవు కావు ఫిలిప్పి పట్టణములోని యూదులు పౌలు సీల యనువారిని కొరడాలతో కొట్టి ఖైదులో వేసి అచట వారినిబొండకొయ్యతో బిగించిరి అయితే యిట్టి స్థితిలోనున్న యాభక్త లిరువురును తమ శ్రమను లక్ష్యింపక, దేవుని

ద్వారా తాము పొందిన ఆత్మీయమైన మేలులను స్మరించుచు, ఆ యర్ధరాత్రివేళ తమ దేవునికి స్తుతించుపాటలను పాడుచుండిరి. (కార్య. 16: 24, 25).

మనుష్యులు దేవుని యుపకారములను తగినట్లు లక్షింపరు.—వారనుదినమును దేవునివలన నెన్నియో మేలులను పొందుచుండినను వాటి నేమాత్రము లక్షింపక, అవితమకు ఊరకయే దొరికినట్లుగ చూచుచు, ఆ యీవు లన్నిటిని దాత యగు దేవునికి వందనములను చెల్లింపకయే యుందురు. దేవుడు తన గొప్ప కృపచే చెడ్డవారి మీదను మంచి వారి మీదను తన సూర్యుని నుదయింపజేసి నీతిమంతులమీదను అనీతిమంతులమీదను వర్షమును గురిపించుచున్నాడు. (మత్త. 5: 45). అయితే మనుష్యులలో నెక్కువమంది యీ మేలులకై దేవునికి ఎంతమాత్రమును కృతజ్ఞత జూపుటలేదు. మఱియు దేవుడు తన ప్రియకుమారుని ఈలోకమునకు నడిపించుట ద్వారా కనబఱచిన గొప్ప ప్రేమకు కూడ కృతజ్ఞతను చూపనే చూపరు. వారా ప్రేమను నిరాకరించి ఆరక్షణను తిరస్కరింతురు. కాని అట్టి గొప్ప ప్రేమను తిరస్కరించుట అన్నిటిలో గొప్ప కృతఘ్నతయనియెంచవలయును. వారు తమ అవిశ్వాసము వలననే అట్టి కృతఘ్నతను కనబఱచు వారగుదురు.

విశ్వాసులు తప్ప మఱి యెవరును దేవునికి కృతజ్ఞతను కనపఱచలేరు.—దేవుని యెడల మనుష్యులకు నుండవలసిన సరియైన మనస్సు విశ్వాసులకే యున్నది గాని అవిశ్వాసులకు లేదు అన్ని మేలుల నిచ్చువాడు దేవుడే యని విశ్వాసులు ఒప్పుకొందురు. ఆయన సువార్తలో కనబఱచిన ప్రేమను వారు గుర్తెఱుగుదురు. అయినను వారు చూపు కృతజ్ఞత లోపరహితమైనది కాదు. దానిలో కూడ చాల లోపము లున్నవి. దేవుడు మన కుపకారములు చేయుట యరుదై యుండిన యెడల మనము వాటిని లక్షించి యుందుము గాని, అవి అనుదినమును నూతనముగా నుండుటచే (విలా 3: 23), వాటిని కొద్దిపఱచుచున్నాము. దేవుడు మనకు ప్రాణవాయువును, అన్నపానాదులను ఎడతెగక యిచ్చుచున్నాడు. అవి యంత సాధారణముగ నియ్యబడుటచే వాటిని దయచేయు దేవునికి కృతజ్ఞతను చూపక పోవుచున్నాము. అయితే కఱవుకాలములలో ఆహారములను మన కిచ్చువాడు దేవుడేయని యొప్పుకొంటున్నాము. రోగములు వచ్చినప్పుడు ఆరోగ్యము దేవుని దానమే యని యొప్పుకొందుము గాని, కష్టములు తీరిన తోడనే ఆ కష్టములను తొలగించి సౌఖ్యము నిచ్చినవాడు దేవుడను సంగతిని మఱచిపోదుము. దేవుని యెడతెగని దయనుబట్టి మన మాయన దయను కొద్దిపఱచుట యెంత దుఃఖకరమైనదైనను ఆయన దయ ఎడతెగక మన యెడల చూపబడుచున్నదనునది మాత్రము వాస్తవమై యున్నది.

మనము దేవునికి చూపు కృతజ్ఞత యెట్టిదై యుండవలెననగా?

1. అది హృదయపూర్వకమైనదై యుండవలెను.—మనము వట్టి మాటలతో దేవుని స్తుతింప కూడదు (యెష 29;13). మనలోని కృతజ్ఞత యథార్థమైనదగునట్లు మన మాయన యుపకారములను లెక్కించి, అనుదినమును వాటిని ధ్యానించుకొనవలెను. ఆయన యుపకారములను తలంచుకొనక పోవుటయే కృతఘ్నతయు, గొప్ప పాపమునయి యున్నది.

2. మన మాటలవల్ల మనము కృతజ్ఞతను కనబఱచవలెను.—మన ప్రార్థనలో స్తుతులను చెల్లించుట ఒక ముఖ్యభాగమైయున్నది (3) మన మాయన స్తోత్రములను పాడవలసి యున్నాము (4) ఆయన మనకు ననుగ్రహించు శారీర సంబంధమైన మేలులను మాత్రము కాదుగాని ఆత్మసంబంధమైన మేలులను మఱి ముఖ్యముగా స్మరింపవలెను. మనమెంత కష్టస్థితిలో నుండినను, ఆయన దయచేసిన ఆత్మీయమైన మేలులకుగాను మన మాయనకు నిరంతరమును కృతజ్ఞత నగపఱచవలెను.

3. మన నడతవలన మనము కృతజ్ఞత నగపఱచవలెను.—మనచే మేలుపొందినవారు దానిని లక్ష్యించినట్లు ప్రవర్తింపవలెనని కోరుదుముగదా! వారు మనకిష్టముకానివాటిని తమ బుద్ధి పూర్వకముగా చేయుట మనము చూచిన యెడల వారు నోటిమాటలతో మనల నెంతగా పొగడినను వారికృతజ్ఞత మాయ యని తెలిసికొందుము అదే విధముగా దేవుని యెడల మనము చూపు కృతజ్ఞత యథార్థమైనదా కాదా యను సంగతి మన ప్రవర్తనవలన కనబడును. అది యథార్థమైనదగు నెడల దేవుడు కోరు వాటిని చేయుటకు మనము నిండయిన యాశను కలిగి యుందుము.



## 31. దేవుని నాశ్రయించుకొనుటను గూర్చిన బోధ.

దేవుడు మనకు ఆశ్రయమును దుర్గమునై యున్నాడు; ఆపత్కాలములో ఆయన నమ్ముకొనతగిన సహాయకుడు కీర్తన 46: 1.

## భాగములు.

I. దేవుని నాశ్రయించుకొనుట యనగానేమి?

II. మనము దేవుని నాశ్రయించుకొనవలసినందుకు గల కారణము లెవ్వి?

III. దేవుని నిజముగా నాశ్రయించుకొనుటవలన మనకు గలుగు మేలులెవ్వి?

## అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| దేవుని నాశ్రయించుకొనుట | కీర్తన. 46. |
| దేవుని నాశ్రయించుకొనుట | కీర్తన 34. |
| యోబుచూపిన మాదిరి | యోబు 1. |
| కష్టకాలములోని ఆదరణలు | యోహా. 14. |
| తండ్రియైన దేవుడు మనకు అన్నవస్త్రముల నిచ్చును | మత్త. 6. 24-34. |
| దేవుడు తనవారిని కాపాడును. | మత్త 10: 24-42. |
| రాబోవు మహిమయెదుట నీ కష్టము లెన్నతగినవి కావు | రోమా 8: 18-39. |

## వేద వాక్యములు.

I. 1. నీ మార్గమును యెహోవాకు అప్పగింపుము; నీవు ఆయనను నమ్ముకొనుము. ఆయన నీ కార్యము నెఱవేర్చును (కీర్తన 37: 5)

2. ఏమి తిందుమో యేమి త్రాగుదుమో అని మీ ప్రాణమునుగూర్చియైనను, ఏమి ధరించుకొందుమో అని మీ దేహమును గూర్చియైనను చింతింపకుడి; ఆహారముకంటె ప్రాణమును, వస్త్రముకంటె దేహమును గొప్పవి కావా? (మత్త 6: 25)

II. 3. తన స్వకీయ కుమారుని అనుగ్రహించుటకు వెనుక తీయక మన యందఱికొఱకాయన నప్పగించినవాడు ఆయనతోపాటు సమస్తమును మన కెందు కనుగ్రహింపడు (రోమా 8: 32).

III. 4. మీరు ఆయన రాజ్యము నీతిని మొదట వెతకుడి; అప్పుడవి యన్నియు మీ కనుగ్రహింపబడును (మత్త 6. 33)?

5. విశ్వాసమునకు కర్తయు దాని కొనసాగించువాడునైన యేసువైపు చూచుచు, మన యెదుటనుంచబడిన పందెములో నోపికతో పరుగెత్తుదము. ఆయన

తన యెదుట నుంచబడిన ఆనందముకొరకై అవమానమును నిర్లక్ష్యపెట్టి సిలువను సహించి దేవుని సింహాసనముయొక్క కుడిపార్శ్వమున కూర్చుండి యున్నాడు (హెబ్రీ 12: 2)

వివరము:

I. దేవుని నాశ్రయించుకొనుట యనగా నేమి? —విశ్వాసము ద్వారా మనము దేవుని బిడ్డలమై యున్నాము అందువలన తండ్రి తన బిడ్డలను కాపాడునట్లు దేవుడును మనలను ప్రేమించి కాపాడునని యెఱిగి, ఆయనను నమ్మి (కీర్త 115: 11), ఆయననే ఆధారము చేసుకొని (సామె. 3: 5). ఆయనే మనలను కాపాడి మనకొఱత లన్నిటిని తీర్చి (కీర్తన 55: 22), మనకు సంభవించునది యావత్తు మేలు కలుగునట్లు సమకూర్చునని (రోమా 8 : 28) తెలిసికొనుటయే దేవుని నాశ్రయించుకొనుట యనబడును.

పిల్లలు తమ తండ్రిని నమ్ముకొనునట్లుగా మనము దేవుని నమ్ముకొనవలెను. బిడ్డ తన తలిదండ్రులను పూర్ణముగా నమ్మి అన్నవస్త్రముల విషయము చింతింపక తలిదండ్రులు తన కవసరమైనవాటి నిత్తురనియు, ఆపత్కాలములో వారే తన్ను రక్షించి కాపాడెదరనియు నమ్మి నిశ్చింతగా నుండును. బిడ్డ తన తలిదండ్రులనిట్లు నమ్ముటకు కారణము వారే తన్ను ప్రేమించుచున్నారని రూఢిగా తెలిసికొనుటయై యున్నది. తండ్రి తనకుమారుల యెడల జాలిపడునట్లు యెహోవా తనయందు భయభక్తులు గలవారి యెడల జాలిపడును, (కీర్తన 103: 13). కావున, బిడ్డలు తమ తలిదండ్రులను నమ్మునట్లు మనమాయనను నమ్మవలెను. మనలను మనమే ఆయన వశముచేసికొని ఆయన తన చిత్తప్రకారముగా మనలను నడిపించునట్లు. మన సమస్తమును ఆయనకు నప్పగింపవలెను (1). మనకు కలుగు ప్రతిది ఆయన సెలవుప్రకారముగా కలిగినదని తెలిసికొని (యోబు 1: 21), ఆయన శరణుజొచ్చి (కీర్తన 31: 1), ఆయన పంపించుకష్టము లన్నిటిని యోర్చి (రోమా 5: 3, 4 ). అవిశ్వాసమువల్ల కలుగు చింతలను మానుకొని (2). ఆయన మన విషయము చింతించుచున్నాడని తెలిశికొని మన చింత యావత్తును ఆయనమీద వేయవలెను. (1. పేతు. 5: 7).

II. మనము దేవుని నాశ్రయించుకొనవలసి నందుకుగల కారణము లెవ్వి? —దేవుని గుణలక్షణములనుబట్టి మన మాయనను పూర్ణముగా నమ్మవలసి యున్నాము. ఆ లక్షణము లేవి యనగా: 1. ఆయన ప్రేమగలవాడు. ఆయన మన కొఱకు తన జనితైక కుమారుని నిచ్చినంతటి యపరిమిత ప్రేమాస్వరూపియైయున్నాడు. మనలను రక్షించుటకు తన కుమారుని నిచ్చిన దేవుడు మన కవసరమైనట్టి

వాటి నియ్యకుండునా (3)? 2. ఆయన సర్వజ్ఞానియై యున్నాడు. కావున, మన యక్కఱలన్నియు ఆయనకు తెలియును. ఆయనను వేడుకొనక మునుపే అవి యాయనకు తెలియును (మత్త. 6: 32). మన కేది మేలో అది ఆయన యెఱుగును, ఆయన దానినే మన కనుగ్రహించును. 3. ఆయన సర్వశక్తుడు కావున, తన ప్రేమవలనను, సర్వజ్ఞానమువలనను ఏమి చేయ నుద్దేశించునో దానిని చేయగలడు. 4. ఆయన మాట తప్పనివాడు; నిన్నే మాత్రమును విడువను, నిన్నెన్నడును ఎడబాయను (హెబ్రీ 13: 5) అని ఆయన మాట నిచ్చెను. కావున, మనము: ప్రభువు నాకు సహాయుడు, నేను భయపడను, నరమాత్రుడు నా కేమి చేయగలడు? అని మంచి ధైర్యముతో చెప్పగలవారమై యున్నాము (హెబ్రీ 13: 6) ఆయన ప్రేమ విషయమును ఆయన విలువగల వాగ్దానముల విషయమును మన మెన్నడును ఏ మాత్రమును సందేహింపకూడదు. ఈవిధముగ మన మాయనను నమ్మిన యెడల, ఎన్ని కష్టములు ఇఱుకులు వచ్చినను మనకు నిరంతరము ఆత్మ నెమ్మది కలుగును (యోబు 14: 1.).

దేవుని సెలవు లేనిది మనకు ఏ హానియైనను కలుగనేరదు మన తల వెండ్రుక లన్నియు లెక్కింపబడియున్నవి (మత్త. 10: 30). పిచ్చుకలను సహా కనిపెట్టు దేవుడు (మత్త. 10: 29) మనలను మఱీ జాగ్రతగా కనిపెట్టును గదా (మత్త; 10: 30). అయితే మనము నిర్హేతుకముగా ఆపదలోనికిదిగవచ్చ ననుటకు దీనిని కారణముగా నెంచగూడదు గాని, మనము మన పనులను నమ్మకముగా చేయుటయందు ఆపదలలో దిగవలసివచ్చిన యెడల ఆయన మనకు తోడై మనలను కాపాడునని రూఢిగా తెలిసికొనగలము (కీర్తన. 33: 20) అట్టి సమయములో మన పని పూర్తియగువఱకు మనకు ప్రాణహాని కలుగనియ్యడు. యూదులు క్రీస్తును ఎంతగా చంప యత్నించినను, ఆయన పని పూర్తియగువఱకు వారాయనను ఏమియు చేయలేకపోయిరి. తరువాత వారాయనను చంపిరి గాని ఆయన మరణమువలన లోకమునకు రక్షణ కలుగులాగున దేవుడు ఆయనను వారిచే చంపబడనిచ్చెను. దేవుని చిత్త ప్రకారము మన మీ లోకములో చేయవలసినపని ముగిసినపిమ్మట దేవుడు మన మీదికి మరణమును రానిచ్చును. అయితే ఆయన మరణచ్ఛాయ లోయలోకూడ మనకు తోడైయుండును గనుక మనము భయపడ నక్కఱలేదు. (కీర్తన. 23. 4) అవసానకాలమందు క్రీస్తువలెనే మనము తండ్రికి మన ఆత్మను నెమ్మదిగా నప్పగింపగలము (లూకా 23: 46) మనము చేయవలసిన పని ముగిసిన పిమ్మట వచ్చు మరణమును మనము కీడుగా నెంచరాదు. ఏలనగా అది పాపవిముక్తిని, పరలోక సౌఖ్యమును పొందుటకు ప్రవేశద్వారమగును.

III. దేవుని నిజముగా నాశ్రయించుకొనుటవలన మనకు గల్గు
నులెవ్వి?—ఈమేలు లేవి యనగా:

1. నిర్భయత.—దేవుడు మనలను కాపాడువాడై యున్నాడు గనుక
నను మనలను మనము అప్పగించుకొనిన యెడల ఆపదలకు భయపడవలసిన పని
(కీర్తన. 42: 5). అన్నవస్త్రముల విషయముకూడ చింతపడవలసిన యవసర
ము (మత్త. 6: 25). అయితే మనము సోమరులమై ముందుగా నాలోచన
లేమన కష్టార్జితమును వృథాగా వ్యయపరచునట్టి నిశ్చింత మనకు నేమాత్రముండ
ను. మనకు విధాయకమైన పనులను నమ్మకముగా చేయవలెను. వాటిని
పిమ్మట దేవుడు మనలను పోషించునని ఏసందేహమును లేక నమ్మి నిశ్చింతగా
వలెను (6: 34). ఆయన మనకు కావలసిన వాటినన్నిటిని యిత్తునని మాట
(4) యున్నాడు గనుక దాని నాయన యెన్నడును తప్పడు. పక్షులకు ఆహార
గడ్డిని యలంకరించు దేవుడు మన కవసరమైన యన్నవస్త్రములను తప్పక
ు (6: 26-29). కాబట్టి మనము వాటి విషయము చింతింపక అను దినమును
యనుగ్రహించుమేలులను కృతజ్ఞతతో పుచ్చుకొని నిర్భయముగా నుండవలెను.

2. తృప్తి.—మనకు మేలుకలుగుటకై దేవుడు సమస్తమును సమకూ
మన మెరిగి మనకున్న సమస్తమును ఆయనకు అప్పగించినయెడల మనము మన
లను చూచి సణుగక వాటితో తృప్తిపడియుందుము ఒకవేళ యితరులు
ంటె మంచి స్థితిగలవారును, మనవలె కష్టములు లేనివారునై యుండవచ్చును.
దుర్మార్గులైనను మనకంటె భాగ్యదశలో నుండవచ్చును. అట్టివారిని చూచి
సూయపడుట సహజమే. అయితే మనకు సంభవించు అన్నిటిని దేవుడు
లు కోరి పంపించుచున్నాడని మనము నమ్మినయెడల అలాగు అసూయపడ
. మనస్థితి గతులు మంచివి యగునట్లుగా మనము ప్రయాసపడుట న్యాయ
యినను అలాగు ప్రయాసపడుచుండగా మన మాశించు వాటిని పొందక
వలన పలుమారు అతృప్తి చెందుచున్నాము; ఇది మంచిదికాదు. ఎల
దేవుడు మన యాత్మలను రక్షింపగోరి మనకు ఘనధనాదుల నియ్యకున్నా
మనము కొద్ది బుద్ధిగలవారమైనందున మన కేది మేలో ఏదికీడో తెలిసి
యున్నాము. అయితే దేవుడు సమస్తమును తెలిసిన వాడు కావున ఆయన
పంపినను మనము తృప్తిపడి మనకు గావలయు ముఖ్యమైన మేలు ఆత్మ
గాని లౌకికమైన మేలుకాదని తెలిసికొనవలెను.

3. ఓర్పు, సంతుష్టి.—దేవుడు మన మేలు కోరి ప్రతి దానిని పంపించునని తెలిసికొని, ఎంత కష్టము వచ్చినను ఓర్చుకొని సంతుష్టిగా నుండవలెను. ఈ లోకములో అందరికిని తొందరలు, నిరీక్షణభంగములు, దుఃఖములును కలుగును. మనలను పవిత్రపరచుట కివి అవసరములై యున్నవి. మనము క్రీస్తును మాదిరిగా నెంచి ఆయన తనకష్టమును ఓపికతోను సంతుష్టితోను భరించినట్లు మనముకూడ మన కష్టములను సహించి జీవింపవలెను (5).

4. ధైర్యము, నిరీక్షణ.—దేవుడు తన బిడ్డల మీదికి వారు సహింపలేనంతటి కష్టములను పంపించడు (1 కొరి. 10; 15). ఆయన మన మీదికి పంపించు కష్టములను భరించుటకు మనలను బలపరచును ఆయన కృప మనకు చాలును (2. కొరి. 12: 8, 9). పరిశ్రమవల్ల దేహబలము విస్తరించునట్లుగా యిట్టి కష్టములవలన మన విశ్వాసము బలపడును (రోమా 5: 3, 4). దేవుడు మనకు తోడుగ నుండి (మత్త. 28: 20). మనలను బలపరచునని తెలిసికొని కష్టకాలమందే మనము అధిక ధైర్యవంతులమును, మంచి నిరీక్షణ గలవారమునై యుండవలెను తాను పంపిన కష్టముల యుద్దేశము నెరవేరిన పిమ్మట ఆయన వాటిని నివారణ చేయును. మనము మన జీవిత కాల మంతటిలో కష్టములను సహింపవలసియుండినను అధైర్యపడక, ఈ జీవితకాలమైన పిమ్మట అవి నివారణ యగునని తెలిసికొని మంచి నిరీక్షణ గలవారమై యుండవలెను. ఈ లోకములో మన కష్టములు తీరక పోయినను, అవి పరలోకములో తప్పక తీరిపోవును కావున మనలను తన చెంత చేర్చుకొనబోవు రక్షకునికొరకు మనము కనిపెట్టి (తీతు 2:13.), ఓపికతోను, ధైర్యముతోను, నిరీక్షణతోను మన సిలువ నెత్తుకొని క్రీస్తును వెంబడింపవలెను. ఇట్లు దేవుని నాశ్రయించుకొనిన హతసాక్షులు ఆయన తన్ను ప్రేమించువారి కొరకు సిద్ధపరచిన మహిమను చూచి తమ దేహములు కాల్చబడినను ఓర్చుకొని సంతోషించుచుండిరి. (1. కొరి. 2:9).

---

## 32. ప్రార్థనను గూర్చిన బోధ.

మీరు చెడ్డవారై యుండియు మీ పిల్లలకు మంచి యీవుల నియ్యనెరిగి యుండగా పరలోక మందున్న మీ తండ్రి తన్నడుగు వారికి అంతకంటె ఎంతో నిశ్చయముగా మంచి యీవుల నిచ్చును. మత్త. 7: 11.

I. ప్రార్థన యనునది మనము అత్యవసరముగ చేయవలసిన కార్యమై యున్నది.
II. ప్రార్థనలో మనము అడుగవలసినవి.
III. ప్రార్థన చేయవలసిన విధము.
IV. మనము ప్రార్థన చేయదగు సమయములు.
V. మనము క్రీస్తు పేరట ప్రార్థన చేయవలెను.
VI. దేవుడు విశ్వాసుల ప్రార్థనల నాలకించును.

## అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| క్రీస్తు తనకొఱకు చేసిన ప్రార్థన | మత్త. 26: 36-46. |
| క్రీస్తు తన శిష్యులకొఱకు చేసిన ప్రార్థన | యోహా. 17. |
| క్రీస్తు మనకు నేర్పించిన ప్రార్థన | మత్త. 6: 1-15. |
| ప్రార్థించువారి కొరకైన వాగ్దానములు | లూకా 11: 1-13. |
| మనము పట్టుదలతో ప్రార్థన చేయవలెను | లూకా 18: 1-14. |
| ప్రార్థనయొక్క బలము | యాకో. 5: 13-20. |
| ప్రార్థించువారిని దేవుడు బలపఱచును | II కొరి. 12: 1-10. |

## వేదవాక్యములు.

I. మనము సంపూర్ణభక్తియు మాన్యతయు కలిగి నెమ్మదిగాను సుఖముగాను బ్రతుకు నిమిత్తము, అన్నిటికంటె ముఖ్యముగా మనుష్యు లందఱికొఱకును రాజులకొఱకును అధికారు లందఱికొఱకును విజ్ఞాపనములును ప్రార్థనలును యాచనలును కృతజ్ఞతాస్తుతులును చేయవలెనని మిమ్మును హెచ్చరించుచున్నాను (1. తిమొ 2: 1, 2).

II. కాబట్టి మీరీలాగు ప్రార్థనచేయవలెను. పరలోకమందున్న మాతండ్రీ, నీ నామము పరిశుద్ధపఱచబడును గాక; నీ రాజ్యము వచ్చును గాక; నీచిత్తము పరలోకమందు నెఱవేఱుచున్నట్లు భూమియందును నెఱవేఱును గాక. మా అనుదినాహారము నేడు మాకు దయచేయుము; మా ఋణస్థులను మేము క్షమించిన ప్రకారము మా ఋణములు క్షమించుము. శోధనలోనికి తేక దుష్టునినుండి మమ్ము తప్పించుము (మత్త. 6: 9-13).

III. మీరు ప్రార్థన చేయునప్పుడు అన్యజనులవలె వ్యర్థమైన మాటలు వచింపవద్దు; విస్తరించి మాటలాడుటవలన తమ మనవి వినబడునని వారు తలంచుచున్నారు (మత్త. 6: 7).

IV. కాబట్టి మీరు జరుగబోవు వీటినెల్లను తప్పించుకొని మనుష్య కుమారుని యెదుట నిలువబడుటకు పాత్రులని యెంచబడునట్లు ఎల్లప్పుడును ప్రార్థించుచు మెళుకువగా నుండుడని చెప్పెను (లూకా 21: 36).

V. ఆయననుబట్టి మనకు కలిగిన ధైర్యమేదనగా, ఆయన చిత్తాను సారముగా మన మేది యడిగినను ఆయన మన మనవి నాలకించుననునదే (1 యోహా. 5: 14).

VI. నీతిమంతుని విజ్ఞాపన మనఃపూర్వకమైనదై బహు బలము గలదై యుండును (యాకో. 5: 16).

## వి వ ర ము.

I. ప్రార్థన యనునది మనము అత్యావసరముగ చేయవలసిన కార్యమై యున్నది.—ఉచ్ఛ్వాస నిశ్వాసములు దేహమున కెంత యవసరములై యున్నవో ప్రార్థన మన యాత్మకు అంత అవసరమైనదై యున్నది. ప్రార్థన చేయని వాడు క్రైస్తవుడై యుండ నేరడు. మనము దేవుని ప్రేమించువారమైన యెడల ఆయనతోకూడ సహవాసము చేతుము. ఆసహవాసము ప్రార్థనచేయుట మూలముగానే జరుగును. ఆయన మనకు అతి ప్రియుడని నమ్మి మన ప్రార్థనద్వారా అనేకమైన వాటిని ఆయనతో చెప్పకోరుదుము. కావున దేవుడు మనకు అనుదినమును చేయు ఉపకారములనుబట్టి ఆయనకు కృతజ్ఞత చెల్లించి, మన మనుదినమును చేయు పాపములకై ఆయన క్షమాపణను వేడుకొని, ఆయనను ప్రేమించి సేవించుటకు మనలను బలపఱచవలెననియు, తన పరిశుద్ధాత్మను మనకిచ్చి మనము అవిశ్వాసులము కాకుండునట్లు మనలను కాపాడి మన విశ్వాసమును బలపఱచవలెననియు అనుదినమును ప్రార్థనచేయవలసినవారమై యున్నాము. మన యక్కఱలను బట్టియు, ఇతరుల యక్కఱలనుబట్టియు మనము ప్రార్థనచేయవలెను. దేవుని సహాయము లేనిది మనము ఏ మంచి పనినైనను పూనుకొని దాని కొనసాగింప జాలము కావున మన పనులన్నిటికిని ప్రార్థనయే ఆధారమై యుండవలెను. మనకొఱకు మాత్రము కాదు మనుష్యు లందరి కొఱకు (1) ను మన శత్రువులకొఱకు సహా (మత్త. 5: 44) మనము ప్రార్థన చేయవలసి యున్నాము.

ప్రార్థన విషయములో క్రీస్తు మనకు మాదిరియై యున్నాడు.—క్రీస్తు ఈలోకమందు తన జీవితకాలమంతయు ప్రార్థనచేయుచు తండ్రితో సహవాసము కలిగియుండెను. ఆయన ప్రార్థనతో తన పని నారంభించెను (లూకా 3: 21).

అత్యుదయమున తన పని నారంభింపక పూర్వమే ఆయన ఒంటరిగా వెళ్ళి ప్రార్థన చేసెను (మార్కు 1:35). ఒక దినపు పని పూర్తియైన పిమ్మటను ఆయనము అరణ్యములలో ప్రార్థించుచుండెను (లూకా 5:16). అప్పుడప్పు డాయన రాత్రియంతయు ప్రార్థనలో గడిపెను (లూకా 6:12). పనిలో నున్నప్పుడు గూడ ఆయన ప్రార్థనచేయుచు (యోహాను 11:42). ఆ పని వృద్ధియగుటనుచూచి ప్రార్థనమూలముగా దేవునికి కృతజ్ఞతాస్తుతులను చెల్లించుచుండెను (మత్త. 11:25). సిలువవేయబడక మునుపటి రాత్రి ఆయన తన శిష్యులనిమిత్తమై యొకగంభీరమైన ప్రార్థనను దేవునికి నర్పించెను. (యోహా. 17:1-26). గెత్సెమనెతోటలో సాధ్యమైనయెడల ఈగిన్నె నా యొద్ద నుండి తొలగింపుము అనుచు ముమ్మారు తండ్రిని వేడి తన మనోభారము నాయనకు తెలిపెను (మత్త. 26:36-39). సిలువమీద వ్రేలాడుచున్నప్పుడు సహా తన శత్రువుల కొఱకును (లూకా 23:34), తన బాధ నివారణకొఱకును (మత్త. 27:46) ప్రార్థన చేసి చివరకు ప్రార్థన మూలముగానే తన యాత్మను తండ్రికి అప్పగించెను. (లూకా 23:46).

II. ప్రార్థనలో మన మడుగవలసినవి.—ప్రభువు నేర్పిన ప్రార్థనయను దానిని క్రీస్తు మనకు ఒక మాదిరి ప్రార్థనగా నిచ్చెను (2). అది బహుస్వల్పమైనదిగ నున్నను దానిలో మనుష్యు లందఱును అడుగవలసిన వన్నియు సంక్షేపముగ వివరింపబడియున్నవి. బిడ్డలు తమ తండ్రిని వేడుకొనునట్లుగామనము దేవుని వేడుకొనవలెనని ఆ ప్రార్థనయొక్క పీఠికలో మనము నేర్చుకొనుచున్నాము. మనము మొదట దేవుని వాటిని అనగా ఆయన నామ ఘనతను ఆయన రాజ్యాభివృద్ధిని ఆయన చిత్తముయొక్క నెఱవేర్పును కోరవలెనని ఆ ప్రార్థనలోని మొదటి మూడు మనవులలో చూడగలము. వీటికి తరువాత మన శరీరములకును ఆత్మలకును కావలసిన వాటిని అనగా దినాహారమును దానితోకూడ ఈ జీవమునకు అవసరమైన వన్నియును, పాపక్షమను, శోధనలో పడకుండుటకు గావలయు కాపుదలను, కీడులన్నిటిలో నుండి విడుదలను అడుగుకొనవలయునని చివరి నాల్గు మనవులవలన తెలిసికొనగలము.

III. మనము ప్రార్థన చేయవలసిన విధము.—మనము వట్టిమాటలను మాత్రముచ్చరింపక హృదయపూర్వకముగా ప్రార్థింపవలెను. మనము భక్తిగలవారమనియు యితరులనుకొనునట్లుగా వేషమువేసికొనగూడదు (మత్త. 6:5). అట్టి వేషముతో గూడిన ప్రార్థనలు మాయ ప్రార్థనలే. మన ప్రార్థనలు సమయానుకూలతనుబట్టియు హృదయమందలి యాసక్తినిబట్టియు, కొద్దివైనను దీర్ఘములైనవై

నను కావచ్చునుగాని రామ రామ! హరి! హరీ! యని విష్ణువుయొక్క సహస్రనామములను స్మరించుటయె ప్రార్థనయని అన్యులనుకొనునట్లుగ వట్టిమాటలను విస్తరించి పలుకుట ప్రార్థన యనుకొనరాదు (3). ప్రభువు నేర్పిన ప్రార్థనను గాని వేరొక ప్రార్థనను గాని యిన్ని మాఱులు వల్లించుటవలన నింత పుణ్యము కలుగును లేక యిన్ని పాపములు పరిహరించబడును అని యనుకొనరాదు.

మన స్వరము వినబడునట్లుగా గాని వినబడకుండగాని మన సొంత మాటల నుపయోగించిగాని యితరుల మాటల నుపయోగించిగాని ప్రార్థన చేయవచ్చును. మన సొంత ప్రార్థనతో కూడ ప్రభువు నేర్పిన ప్రార్థన నేర్చుట మంచిది. ఎందుకనగా మన మనకు గావలసినవి యన్నియు అందులో సంక్షేపముగా నున్నవి. దావీదు కీర్తనల లోని ప్రార్థనలను కూడ మనము విశేషముగ వాడవగును. అదియుగాక ప్రార్థనల దీపికయను పుస్తకమును చదువుట కూడ మన కుపయోగకరమై యున్నది. ఎందుకనిన మనము జెప్పజాలని మన హృదయపు కోరికలు అట్టి ప్రార్థనలలో ననేక సారులు కనబడవచ్చును. భక్తులచేత రచియింపబడిన అట్టి దీపికలు ఒకప్పుడు మనము తలంచని వాటిని కూడ మనకు జ్ఞప్తిచేసి మనము వాటిని అడుగుకొనునట్లు మనకు సహాయకరములుగ నుండును. మన ఆరాధన దీపికలో నున్న ఆయా సమయములకొరకైన ప్రార్థలనుకూడ మనము ఉపయోగింపవలయును. మనము ఆయా సమయములకు దగినట్లు ప్రార్థనచేయుటకు మనకు అవి సహాయకరములు. మనము వాటినినిర్లక్ష్యము చేయక ఇట్టిదివ్యమైన ప్రార్థనలను కలిగియున్నందున కృతజ్ఞతగలవారమై వాటిని ఉపయోగింపవలెను.

ప్రార్థన చేయునపుడు నిలువబడవలెనా? మోకరింపవలెనా? మనము దేవునికి మర్యాద చూపుటకై సాధారణముగ ఈ రెంటిలో నేదో యొక క్రమము ననుసరింప వలెను. బాహ్యారాధనలలో నిలువబడి ప్రార్థనచేయుట లూథరన్ సంఘస్థుల ఆలవాటై యున్నది. ప్రభుప్రదినమునందు (ఆదివారమున) క్రీస్తు మృతినుండి లేచుట వలన అది సంతోషకరమైన దినమైయున్నది కావున లూథరన్ వారు అలాగు నిలువబడి ప్రార్థనచేయుట వాడుక యయ్యెను. మోకరించుట వినయమునకు గుఱుతైయున్నది. గనుక ప్రార్థనతో మనము దేవుని సమీపించునపుడు అట్టి వినయమును కనబఱచుట తగును' మన అభినయములనుబట్టి మన ప్రార్థనలు వినబడక పోయినను అవి మనలో నుండు మనస్సును కనబఱచును కావున, మన ప్రార్థనలు ఎట్టివో అది మనము ప్రార్థనకు సంబంధముగా చేయు అభినయముల (నిలుచుట, మోకరించుట ఇత్యాది) వలనకూడ కనబడును. మనలో వినయమైన భయభక్తులుండినయెడల మనము వాటిని కనబఱచక తప్పదు. శారీర బలహీనత యున్నప్పుడు కూర్చుండి ప్రార్థనచేయు

యెడల అది తప్పు కాదు గాని, గుడిలో అందఱును కలిసి ప్రార్థన చేయుచుండగా చాలమంది నిర్లక్ష్యముగ ఊరకయే కూర్చుండి దిక్కులు చూచుచుందురు. అలాగు చేయుట దేవునికి తగిన మర్యాద చూపుట కానేరదు గనుక మిగుల ఆక్షేపణీయమైనదై యున్నది.

IV. మనము ప్రార్థనచేయవలసిన సమయములు.—మన మెల్లప్పుడును ప్రార్థన చేయవలయును (4) మనము అన్నివేళలలో నోటిమాటలతో ప్రార్థన చేయలేముగాని ఎల్లప్పుడును దేవునిమీద ఆనుకొనియుండి, ఆయన తట్టు మన మనస్సులను త్రిప్పుకొనగలము. మనకు గల్గు ప్రతి యవసరములో నోటిమాటలతో ప్రార్థన చేయవలెను. మనకు శోధనలు (మత్త. 26: 41) ఆపదలు (8: 25) కల్గిన పుడును ఇబ్బందిలో నున్నపుడును (15: 22), పాపదోషమువలనను (లూకా 18: 13) కీర్త 51) దుఃఖమువలనను (కీర్త 25: 16, 17) కుంగిన పుడును, మనముగాని మన స్నేహితులుగాని జబ్బుపడినపుడును (యాకో. 5: 14, 15), ప్రతి ఆవసర సమయమందును, దేవుని విశేషదయను అనుభవించుకొనిన ప్రతి సమయములోను (ఫిలి. 4: 6) ఆయనను ప్రార్థింపవలెను. మఱియు మనము నియమితకాలముల లోకూడ ప్రార్థనచేయవలెను. ఉదయమున లేచునపుడును, సాయంకాలమున పరుండ బోవునపుడును, దేవుడిచ్చు ఆహారమును పుచ్చుకొను ప్రతిభోజనవేళయందును ప్రార్థన చేయవలయును. మనకెన్ని పనులుండినను నియమితకాలములయందు చేయవల సిన ప్రార్థనలను నిర్లక్ష్యము చేయకూడదు. కుటుంబపు పెద్దలుతమ కుటుంబ సమే తముగ ఉదయ సాయంతన ప్రార్థనకూటములను జరిగింపవలెను. ఇందువలన అట్టి కుటుంబములకు గొప్ప దీవెన కలుగును. మనము సంఘ సంబంధమయిన ప్రార్థ నారా ధనములలోకూడ పాలి భాగస్థులమై యుండవలెను. సంఘారాధనయందు బోధకుడు చేయు ప్రతి ప్రార్థనను తన కొఱకును చేరియున్న సంఘస్థు లందఱికొఱకును చేయు నని యెఱిగి ఆ ప్రార్థనలను మన స్వంత ప్రార్థనలనుగా ఎంచవలెను.

V. మనము క్రీస్తు పేరట ప్రార్థన చేయవలెను.—అలాగున మనము చేయకపోయిన యెడల మన ప్రార్థనలు వినబడవు. మీరు నా పేరట తండ్రి నేమి అడుగుదురో అది ఆయన మీ కనుగ్రహించును (యోహా 15: 16) అని క్రీస్తు వాగ్దానము చేసియున్నందున ఆయన పేరట మనము చేయు ప్రార్థనలు వినబడునని తెలిసికొనగలము.

క్రీస్తు పేరట ప్రార్థన చేయుట యనగా మన యోగ్యతనుబట్టి కాదుగాని క్రీస్తు మనకొఱకు చేసిన ప్రాయశ్చిత్తమునుబట్టియే దేవుడు మన ప్రార్థనలను

వినవలెనని మన మొప్పుకొనుటయై యున్నది. మన యోగ్యతను విచారింపగా మనం తట మనము ప్రస్తుతమందు ఇహలోక శిక్షను తరువాత నిత్యదండనమును పాత్రులమై యున్నాము గాని, క్రీస్తు ద్వారా మనము దేవుని యొద్ద చేరి (ఎఫె 2: 18,) ఆయన దయను పొందుటవలన (రోమా 5: 2), ఆయన మన ప్రార్థనల నాలకించునని (యోహా. 16: 24) రూఢిగా తెలిసికొనగలము.

క్రీస్తు పేరట ప్రార్థన చేసినయెడల క్రీస్తు ప్రార్థన చేసిన విధముననే మనమును ప్రార్థన చేతుము.—క్రీస్తువలెనే మనమును ఎల్లప్పుడును సర్వజ్ఞానము గలిగినట్టియు, ప్రేమపరిపూర్ణ డగునట్టియు దేవుని చిత్తమునకు లోబడి మన ప్రార్థనలను చేయవలెను (5) మనము నిజమైన మేలును ఎఱుగని స్వల్పబుద్ధికలవారము కావున మన మేదో యొక మేలును ఎంతగా కోరినను క్రీస్తువలెనే నా యిష్టము కాదు నీ చిత్త ప్రకారమే కానిమ్మని ప్రార్థనచేయవలెను (మత్త 26; 39: 6: 10).

VI. దేవుడు విశ్వాసుల ప్రార్థనల నాలకించును.—నీతిమంతుని విజ్ఞాపన మనఃపూర్వకమైనదై బహు బలముగలదై యుండును (6) మనము సందేహింపక విశ్వాసముతో అడుగవలెను (యాకో 1: 6, 7) ఎందుకనగా సందేహించువాని ప్రార్థనను గాదుగాని విశ్వాసి ప్రార్థననే దేవుడు ఆలకించును.

దేవుడు అనేకమాఱులు మన ప్రార్థనలను వెంటనే ఆలకింపక పోవచ్చును. అందువలన మనము విసుకక ఇంకను ప్రార్థన చేయవలెను (లూకా 11: 5-10; 18: 1-18). ఒకానొకప్పుడు మనము కోరిన రీతిగా దేవుడు ప్రత్యుత్తర మీయక పోవచ్చును. అయితే ఆయన ప్రత్యుత్తర మిచ్చిన రీతి మనము కోరినదానికంటె మంచిదై యుండును. దృష్టాంతముగా ఒక దుఃఖమునుగాని భారమునుగాని తీసివేయవలెనని మనము ప్రార్థన చేయగా దేవుడు దానిని తీసివేయక దానిని సహించుచుకొనుటకు గావలయు బలమును మనకు నిచ్చుటచే మన ప్రార్థన నాలకింపవచ్చును (2. కొరి. 12:9). ఇందువలన మనకు ఆత్మీయ బలముకూడ కలుగును. ఆయన కృప మనకు చాలును. ఈలాగున మనము అడగినదానికంటె గొప్ప మేలును పొందుదుము. దేహబలము గొప్ప దీవెనగా నున్నదిగదా. అట్లయిన ఆత్మబలము మఱి గొప్పది. మనము విశ్వాసమందు బలపడినవారమై యుండవలెనని దేవుడు కోరును కావున మన విశ్వాసమును పెంచుటకై ఆయన మన కష్టములను తీసివేయక వాటిని సహించుకొనుటకై మనలను బలపఱచును.

## 33. శోధనల నెదిరించుటనుగూర్చిన బోధ.

నేను జయించి నా తండ్రితో కూడ ఆయన సింహాసనమునందు కూర్చుండి యున్న ప్రకారము జయించువానిని నాతో కూడ నా సింహాసనమునందు కూర్చుండ నిచ్చెదను. ప్రక. 3: 21.

### భాగములు.

I. క్రీస్తువుని జీవితమును ఒక గంభీరమైన పోరాటమునుగా నెంచవలెను.

II. ఈ పోరాటములోని శత్రువులు మనకు గల్గు శోధనలే.

III. ఈ శోధనలు వేటివలన కలుగు ననగా,

1. మన దురేచ్ఛలవలన
2. లోకమువలన
3. సాతానువలన కలుగును.

IV. మనకు కీడు కలుగుటకై సాతాను మనలను శోధించినను శోధనల నెదిరించిన యెడల వాటివలన మనకు మేలు కలుగును.

V. శోధనలను జయించుటకు దేవుడు మనకు సహాయము చేయును.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| మంచి పోరాటమును పోరాడుడి | 1. తిమో. 6: 11-16.<br>2. తిమో. 4: 1-8. |
| ఆత్మను పోగొట్టుకొన్న యెడల అంతటిని పోగొట్టుకొనిన వారమగుదుము. | మార్కు 8: 34-38. |
| క్రీస్తు శోధింపబడెను. | మత్త. 4: 1-11 |
| దురేచ్ఛలు | గల 5: 16-21. |
| లోకము | 1 యోహా. 2: 12-17. |
| సాతాను. | 1. పేతు. 5: 1-11. |
| శోధనలనుండి తప్పించుకొను మార్గము | 1 కొరి. 10: 1-13. |

## వేదవాక్యములు.

I. 1. విశ్వాస సంబంధమైన మంచి పోరాటము పోరాడుము. నిత్యజీవమును చేపట్టుము. దాని పొందుటకు నీవు పిలువబడి యనేక సాక్షులయెదుట మంచి యొప్పుకోలు నొప్పుకొంటివి (1 తిమొ. 6: 12).

2. ఒకడు సర్వలోకము సంపాదించి తన ప్రాణము పోగొట్టుకొన్నయెడల వాని కేమి ప్రయోజనము! మనుష్యుడు తన ప్రాణమునకు ప్రతిగా నేమి యియ్యగలడు? (మార్కు 8: 36, 37)!

II. 3. నిబ్బరమైన బుద్ధిగలవారై మెలకువగా నుండుడి; మీ విరోధియైన సాతాను గర్జించు సింహమువలె యెవరిని మ్రింగుదునాయని వెదకుచు తిరుగుచున్నాడు (1 పేతు. 5: 8).

III. 4. ప్రతివాడును తన స్వకీయమైన దురాశచేత ఈడ్వబడి మరులుకొల్పబడినవాడై శోధింపబడును (యాకో. 1: 14).

5. ఈ లోకమునైనను లోకములోనున్న వాటినైనను ప్రేమింపకుడి. ఎవడైనను లోకమును ప్రేమించినయెడల తండ్రి ప్రేమ వానిలో నుండదు లోకములో నున్నదంతయు, అనగా శరీరాశయు, కంటియాశయు, జీవపు డంబమును, తండ్రి వలన పుట్టినవి కావు; అవి లోకసంబంధమైనవే (1యోహా. 2: 15, 16).

IV 6. శోధనను సహించువాడు ధన్యుడు; అతడు శోధనకు నిలిచినవాడై ప్రభువు తన్ను ప్రేమించువారికి వాగ్దానము చేసిన జీవకిరీటము పొందును (యాకో. 1: 12).

V. 7. తాను శోధింపబడి శ్రమ పొందెను గనుక శోధింపబడు వారికిసహాయము చేయగలవాడై యున్నాడు (హెబ్రీ. 2: 18)

## వివరము.

1. క్రైస్తవుని జీవితమును ఒక గంభీరమైన పోరాటమునుగా నెంచవలెను.—క్రైస్తవుడు తన ఆత్మకు విరోధముగ నున్నవాటితో పోరాడి తే నేతప్ప లేనియెడల వాడువిశ్వాసమువలన తనకు గలిగిన రక్షణను నిరర్థకపఱచును. ఇందుచేతనే భయముతోను వణకుతోను మీ స్వరక్షణను కొనసాగించు కొనవలెననియు (ఫిలి. 2: 12). విశ్వాస సంబంధమై మంచి పోరాటము పోరాడవలెననియు

(1), నీ కిరీటము ఎవడును అపహరించ కుండునట్లు నీకు కలిగిన దానిని గట్టిగా పట్టు కొనవలెననియు (ప్రక. 3: 11) బైబిలు హెచ్చరించుచున్నది. క్రైస్తవ మతములో చేరుట మాత్రము చాలదు. అందులో చేరిన పిమ్మట స్థిరముగానుండవలెను. అంతము వఱకు సహించినవాడెవడో వాడే రక్షింపబడును (మత్త 24: 13). నిత్యజీవమును చేపట్టుటకు విశ్వాస సంబంధమైన మంచి పోరాటమును పోరాడవలెను (1), మన యాత్మలను నశింపజేయు యత్నించు దురేచ్ఛలు, లోకము, సాతాను అనునవి పాపము చేయుటకై ఎడతెగక మనలను శోధించుచుండును గనుక మనము వాటిని నిత్యమును ఎదిరింపవలెను లేని యెడల నశించిపోదుము.

ఈపోరాటము మిగుల గంభీరమైనది.——మన యాత్మ రక్షణ దీనిమీద నే ఆని యుండును. మనము దానిని పోగొట్టుకొనిన యెడల సమస్తమునుపోగొట్టు కొనినట్లుగ నున్నది (2), మన ఆత్మను రక్షించుటకై క్రీస్తు మనకుగాను చనిపోయెను. మన ఆత్మ ఆయన దృష్టికి అంత విలువగలదైన యెడల మనము దానిని కొద్ది పఱచవచ్చునా? మనము దానిని దక్కించుకొనుటకై ఎంతగా కష్టపడవలసి యుండినను వెనుకదీయక ఓపికతో ప్రయాసపడవలెను.

II. ఈపోరాటములోని శత్రువులు మనకు గలుగు శోధనలే.—— కావున, మనము వాటి చెడ్డ ప్రేరేపణలకు లోబడక వాటిని జయింపవలెను. శోధనలను చూచిన వెంటనే మనము వాటిని యెదిరింపక, వాటితో సంధిచేసికొనిన యెడల తప్పక ఓడిపోదుము.

మనుష్యు లందఱికి లోపలనుండియు వెలుపలనుండియు శోధనలు కలుగును. తమ తమ నైజ గుణములను బట్టియు, స్థితిగతులను బట్టియు శోధనలు కొందఱికి ఎక్కువగాను మఱి కొందఱికి తక్కువగాను కలిగినను క్రీస్తు సహాయము లేనిది జయింపజాల నంతటి గొప్ప శోధనలు అందఱికిని కలుగును. క్రీస్తు తానే శోధింపబడెను (మత్త. 4: 1; హెబ్రీ 4: 15). గనుక శోధన యుండినంత మాత్రమున నే అది పాపము కాదు; అయితే నిత్యమును జాగ్రతగా నుండవలెను లేని యెడల ఆశోధనలు మనము పాపము చేయుటకు కారణము లగును (2). శోధనలు మనము తలంచని సమయములోను, తలంచని రీతిగాను వచ్చును కావున, మనము వాటికి లోబడకుండునట్లు ఎల్లప్పుడును మెలకువపడి ప్రార్థన చేయవలెను (మత్త. 26: 41). ఆ విధముగా మనము చేయని యెడల జాగరూకత లేని సైనికులపై శత్రువు లేలాగున హఠాత్తుగా పడి వారిని జయింతురో అలాగు శోధనలను శత్రువులు మన యాత్మ పైబడి దానిని జయించును.

ఈ శోధనలను జయించుటకు ప్రయాసపడుట అవసరము.—ప్రయాస లేనిది యేచటనైనను జయము కలుగదు. కష్టముకొలది ఫలము అను లోకోక్తి ఆత్మీయ విషయములలోను చెల్లును. ఈ లోకధనమును సంపాదించుకొనుటకు మనుష్యులు ఎంతో ప్రయాస పడెదరు. ఇట్లుండగా జీవకిరీటమును పొందులాగున మరెక్కువగా ప్రయాసపడ కూడదా (1, కొరి 9: 25)? ఎంతగా కష్టపడినను ఇట్టి కష్టమునకు తప్పక ప్రతిఫలము కలుగును. జయించువాడు క్రీస్తు మహిమలో పాలిభాగస్థుడగును (ప్ర॥ వా॥).

III. ఈ శోధనలు వేటివలన కలుగు ననగా,

1. మన దురేచ్ఛలవలన కలుగును.—మన దుష్ట గుణములే మన ముఖ్య శత్రువులై యున్నవి (4) ఈ దుష్టగుణములకు బైబిలులో 'మాంసము' అని పేరు. మన తెనుగు బైబిలులో దీనిని సాధారణముగా శరీరమని తర్జుమా చేసియున్నారు. ఈ శరీరమనునది మనలో స్వాభావికముగ నుండు దుష్టబుద్ధియే. అది మన స్వను సంబంధమైనది కాదనుకొనరాదు. చెడిపోయిన మన మనస్సు తన యాశలను తీర్చుకొనుటకు దేహమును సాధనముగా చేసికొనుటచే అది అలంకార రీతిగా మాంసము అనబడునని తెలిసికొనవలెను. మన మీ లోకములో జీవించునంతవఱకు మన ఆత్మకు విరోధముగా పోరాడు దురాశలు మనలో కలుగుచుండును కావున, మనము వాటిని విసర్జింపవలెను. మనము మన యాత్మను దక్కించుకొన గోరినయెడల మన అవయవములను దుర్నీతి సాధనములుగా పాపమున కప్పగింపక, నీతి సాధనములుగా దేవుని కప్పగింపవలెను (రోమా 6: 13). భూమి మీదనున్న మన అవయవములను (అనగా దురాశలను) చంపివేసి (కొల 3: 5). శరీరమును (మాంసము) దాని యిచ్ఛలతోను, దురాశలతోను సిలువ వేయవలెను (గల. 5: 24). శరీరమునకు (మాంసమునకు) సంబంధములైన పాపము లేవి యనగా: కామ క్రోధ లోభ మోహ మద మత్సరములు, సోమరితనము, తిండిపోతుతనము, త్రాగుబోతుతనము, మోసము, అన్యాయము మొదలగునవి. మనుష్యులందఱును ఈ పాపము లన్నిటిచేత శోధింపబడకపోయినను, కొందఱు కొన్నిటిచేతను, మఱికొందరు మఱికొన్నిటిచేతను తప్పక శోధింపబడుచు కొద్దిగానైనను గొప్పగానైనను మొత్తముమీద ఈ పాపములన్నింటికి దాసులైయున్నారు. ఈ దుర్గుణములు నైజముగ మనలో నుండుటవలన లోకము సాతాను అనునవి మనలను శోధించుట అంత సులభముగ నున్నది.

2. లోకము.—ఇది మనకు శత్రువులుగ నుండువాటిలో రెండవదియై యున్నది. మన చుట్టునున్నవారును వారి వ్యవహారములును కలసి లోకము అగును.

దేవునికి విరోధమైనదై తనకుగాక దేవునకే విరోధింపవలెనని మనలను రేపుచుం
ు. మనము దేవునిని కాదుగాని యీ లోక సంబంధమైన చెడ్డవాటిని ఆశించి
ైని ఆయనకంటె నెక్కువగా ప్రేమింపవలెనని దానివలన మనకు గొప్ప శోధన
ుగును. ఈశోధనకు లోబడుట గొప్ప పాపమై యున్నది. (5). మన మీలోక
ో నివసించుచు మన వ్యవహారములను జరుపవలసియుండినను, ఈ లోక సంబం
ుము కాకూడదు (యోహా. 17: 15-16). ఈ లోక వ్యవహారములను విడిచి, అడ
 దాగుకొని సన్యాసులము కాక, మనకు విధింపబడిన పనులను నమ్మకముగా చే
ుచు, ఈ లోకమందు మనకు కలుగు శోధనలను దేవుని సహాయముచేత జయింప
ను (1. యోహా. 5:4). నిష్ఫలమైన అంధకార క్రియలలో పాలివారమై యుం
వాటిని ఖండింపవలెను (ఎఫెసి 5:11). మనము ఇహసంబంధమైన దురాశ
విసర్జించి స్వస్థబుద్ధితోను, న్యాయముతోను, భక్తితోను బ్రతుకుచుండవలెను
తీతు 2:12,13). లోక ఘనము, ధనము, భోగము అను వానిచే దేవుని సేవ
డి తొలగిపోకుండుటకు జాగ్రతపడవలెను. ఈ లోకములోని వైరము, అసూ
అన్యాయము మొదలగు వాటిచే మనము ప్రేమను వదలి కోపము, ఓర్వలేనితన
మొదలగు పాపములలో పడ కూడదు. ఇతరులు ఎంతగా పాపములోపడినను,
రెంత గొప్పవారై పాపము చేయుచున్నను మనముకూడ వారివలె పాపముచేయ
్పనని యే మాత్రము నను కొనరాదు (నిర్గ. 23:2). నాశనమునకు పోవు ద్వారము
ల్పును ఆ దారి విశాలమునై యున్నది. దాని ద్వారా ప్రవేశించువార నేకులు.
ుునకు పోవు ద్వారము ఇరుకును ఆదారి సంకుచితమునై యున్నది. దానిని కను
ువారు కొందరే (మత్త. 7:13-14).

3. సాతాను.—మన దురేచ్ఛలను లోకము నుపయోగించుచు వాటిద్వా
మనలను చెఱప నుద్దేశించి సాతాను కలడు. వాడు దేవునికి ముఖ్య విరోధియై
ుండి మనలను శోధించుటకు ఎల్లప్పుడు సమయమును వెదకును (8). అన్ని విధ
ైన శోధనలచే వాడు మనలను శోధించును. అయితే ముఖ్యముగా వాడు మన
ానతను చూచి, ఏయే పాపములు చేయుటకై మనకు నైజబుద్ధి యున్నదో కని
, అది యెట్టిదైనను సరే దానిద్వారా మనలను లోపఱచుకొనుటకు యత్నిప
. దేవుని వాక్యమును తిరస్కరించుటకును, అవిశ్వాసుల మగుటకును వాడు
లను పురికొల్పి మూర్ఖధైర్యము, స్వనీతి, మందుతనము, నిరాశ, దేవుడు లేడను
ు బుద్ధి మొదలగు పాపము లన్నిటికి మనము లొంగునట్లు మనలను శోధించును.
ున మనము వాటినుండి తప్పించుకొనుటకు అనుదినము మెలకువపడి ప్రార్థన
వానిని ఎదిరింపవలెను. ఇద్దరు యజమానులను సేవింప నేరము (మత్త. 6:24).

క్రీస్తుసేవ చేయవలెనని కోరినయెడల మనము సాతానుకు ఏమాత్రమును లోబడ కూడదు.

IV. మనకు కీడు చేయుటకై సాతాను మనలను శోధించినను శోధనలను ఎదిరించిన యెడల వాటివలన మనకు మేలు కలుగును.— మన విశ్వాసమును బలపఱచుటకు దేవుడు మన మీదికి శోధనలను రానిచ్చును (6). మనము పాపము చేయవలెనని దేవుడు మనల నే మాత్రమును శోధింపడు; అయితే సాతానుచే మనము శోధింపబడనిచ్చును. దేవుడు కీడు విషయము శోధింప నేరడు; ఆయన యెవనిని శోధింపలేడు (యాకో 1:13). దేవుడు అయా వారిని శోధించి నట్లు బైబిలులో వ్రాయబడి యున్నదిగాని అది పరీక్షించెనని యర్థమగును, ఈవిధముగ దేవుడు అబ్రాహాముయొక్క విశ్వాసము పరీక్షించెను. (ఆది. 28: 1). మఱియు సాతాను శోధనలుకూడ మన విశ్వాసమును పరీక్షలై యున్నవి. కావున సాతాను మనలను శోధించుటకు దేవుడు ఒప్పుకొనుచున్నాడు. మన విశ్వాసము యథార్థమైనదో కాదో దేవుని ప్రేమించుటవలన మనము పాపము చేయ కుందుమా ఉండలేమా అను నిట్టివాటిని శోధనలు బైలుపఱచగలవు.

'శోధనలోనికి మమ్మును తేకుము,' అని ప్రభువు నేర్పిన ప్రార్థనను చేయుచుండగా ఆ మనవిలో దేవుడు మనలను శోధనలోనికి తెచ్చుచున్నాడను భావమున్నట్లు కనబడును గాని దానిలో ఆ భావము లేదు. మమ్మును శోధనలోనికి తేకుము అనగా లోకము దురేచ్ఛలు సాతాను అనునవి మమ్మును శోధనలోనికి తేకుండునట్లు వాటిని అడ్డగింపవలెననియు శోధింపబడినను వాటిని జయించుటకు శక్తి నియ్యవలెననియు దాని భావమై యున్నది. మనము పాపము గాక నీతిని చేయవలెనని దేవుడు కోరును కాబట్టి పాపము చేయుటకు మనలను శోధింపలేడు. పాపమును చేయుటకు ఏమాత్రమును శోధింప నేరడు.

V. శోధనలను జయించుటకు దేవుడు మనకు సహాయము చేయును:—క్రీస్తుకూడ మనవలె శోధింపబడి శోధనబలము నెఱుగును గనుక మన శోధనలలో ఆయన మనకు సహాయము చేయును (7). శోధనలను జయించుటకు మన సొంత శక్తి చాలదుగాని ఆయనశక్తి చాలును. ఆయన మనకు తోడుగా నుండిన యెడల మనము జయింపగలము. మనము సహింప గలిగినదానికంటె నెక్కువగా ఆయన మనలను శోధింపనియ్యడు. శోధనకాలములో తప్పించుకొనుటకు కావలసినంత బలమును ఆయన మన కనుగ్రహించును (1. కొరి. 10.13). ఆయన సహాయము వలన జయించి జీవకిరీటము నొందగలము (ప్రక. 2:10). ఆ సహాయమును మనమెల్లప్పుడును వేడుకొందుము గాక!

## 34. క్రైస్తవుడు తన్నుతాను ఉపేక్షించుకొనవలెనను బోధ.

నన్ను వెంబడింప గోరువాడు తన్నుతాను ఉపేక్షించుకొని ప్రతిదినము తన సిలువ నెత్తుకొని నన్ను వెంబడింపవలెను. లూకా 9:23.

### భాగములు.

I. మనలను మనము ఉపేక్షించుట యనగా నేమి?

II. మనలను మనము ఉపేక్షించుకొనవలసిన యవసరమేమి?

III. మనలను మనము ఉపేక్షించుకొనుటవలన మనకు గల్గు సంతోషము.

IV. క్రీస్తు తన్నుతాను ఉపేక్షించుకొని మనకు చూపినమాదిరి.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| అబ్రహాము తన్నుతానుపేక్షించుకొనుట | ఆది 13. |
| మోషే తన్నుతానుపేక్షించుకొనుట | నిర్గ 32: 15-35. |
| పౌలు తన్నుతానుపేక్షించుకొనుట | 1 కొరి 9. |
| క్రీస్తు తన్నుతానుపేక్షించుకొనుట, దాని ఫలము | ఫిలి 2: 1-11. |
| మనలను మనముపేక్షించుకొనవలెను | లూకా 9: 18-27. |
| మనము మనముపేక్షించుకొనవలెను | హెబ్రీ 12: 1-13. |
| తన్నుతా నుపేక్షించుకొనుటవలన గల్గు ఫలము | 2 తిమొ 4: 1-18. |

### వేదవాక్యములు.

I. 1 క్రీస్తుతో కూడ సిలువవేయబడి యున్నాను, ఇకను జీవించువాడను నేనుకాను క్రీస్తే నా యందు జీవించుచున్నాడు నే నిప్పుడు శరీరమందు జీవించుచున్న జీవనము నన్ను ప్రేమించి నా కొఱకు తన్నుతానప్పగించుకొనిన, దేవుని కుమారుని యందలి విశ్వాసమువలన జీవించుచున్నాను (గల 2: 20)

II. 2 ఎవడును తన మేలు విచారించుకొనక ప్రతివాడును ఎదుటివానిమేలు విచారింపవలయును (1 కొరి 10: 24).

3. తన పొరుగువానికి క్షేమాభివృద్ధి కలుగునట్లు మనలో ప్రతివాడు మేలయిన దానియందు అతని సంతోషపరచవలెను (రోమా 15: 2).

III. 4. మీరును ఈలాగు ప్రయాసపడి బలహీనులను సంరక్షింపవలెననియు - పుచ్చుకొనుటకంటె ఇచ్చుట ధన్యత అని ప్రభువైన యేసు చెప్పినమాటలు జ్ఞాపకము చేసికొనవలెననియు అన్ని విషయములలో మీరు కూడిరి చూపితినని చెప్పెను. (కార్య. 20: 35).

XIV 5. విశ్వాసమునకు కర్తయు దాని కొనసాగించువాడునైన యేసు వైపు చూచుచు, మనయెదుట నుంచబడిన పందెములో నోపికతో పరుగెత్తుదము. ఆయన తన యెదుట నుంచబడిన ఆనందముకొఱకై అవమానము నిర్లక్ష్యపెట్టి సిలువను సహించి దేవుని సింహాసనముయొక్క కుడిపార్శ్వమున కూర్చుండి యున్నాడు (హెబ్రీ 2: 12).

## వివరము.

క్రీస్తును వెంబడింప గోరువాడెవడైనను తన్ను తాను ఉపేక్షించుకొని ప్రతి దినమును తన సిలువ నెత్తుకొని ఆయనను వెంబడింపవలెను (ప్ర॥ వా॥). తన్నుతాను ఉపేక్షించుకొననివాడు క్రైస్తవుడు కానేరడు.

1. మనలను మనము ఉపేక్షించుకొనుట యనగా నేమి.—మనము మన స్వంతవారము కాదుగాని విశ్వాసముద్వారా క్రీస్తువారమై యున్నాము కావున మన కోర్కె ప్రకారము గాక క్రీస్తు కోరునట్లుగా ప్రవర్తింపవలెను (1. కొరి 6: 20). మన కోర్కె ప్రకారముగాను క్రీస్తు కోరునట్లుగాను ఒకటే సమయమందు చేయజాలము (మత్త. 6: 24). వానిలోనొక దాని చేసి, రెండవదానినుపేక్షింపవలెని యుండును. అయితే మనము మన కోర్కెను పేక్షించి, క్రీస్తు కోర్కెను నెఱవేర్చవలసియున్నాము.

మనము మన శరీరమును (మాంసమును) సిలువవేయవలసినవారమై యున్నాము.—మనము మన మరేచ్ఛలను జయించి, దుర్మార్గతలను, లోక భోగములను త్యజించుట మాత్రము గాక, వాటి యంతటను నవితప్పలు కాని కార్యములైనను క్రీస్తును సేవించుటలో అవి మనకు అభ్యంతరములుగ నున్నయెడల అట్టివాటినికూడవిసర్జించుట మన విధియైయున్నది. మనము శరీరమును (మాంసమును) దాని యిచ్ఛలతోను దురాశలతోను సిలువవేసి (గల. 5: 24), అన్ని విషయముల క్రీస్తుకు లోబడవలెను. క్రీస్తు ప్రేమవలన బలవంతపఱచబడి (2. కొరి. 5: 14), తలంపదగిన వాటినే తలంచి మాటలాడ దగినవాటినే మాట్లాడి, చేయదగినవాటినే

చేయవలెను. ఇకను జీవించువాడను నేను కాదు. క్రీస్తే నాయందు జీవించుచున్నాడు (1) అని పౌలు చెప్పెను. అలాగు ఇక మనము కాదు. క్రీస్తే మనయందు జీవించవలెను. మనలను మనము కాదు క్రీస్తునే ఘనపఱచుటకు మనము జీవించు చుండవలెను. ఇట్లుండగా ఒకానొకపుడు ఏదోయొక కోర్కెను త్యజించి, ఈ మతాభివృద్ధికొఱకై ఖర్చుపడుట తన్నుతా నుపేక్షించుకొనుట కాదుగాని మనము కోరు వాటిని ఎంచక అన్ని విషయములలో దేవుడు కోరువాటికి లోబడుటయై యున్నది. ఈ విధముగ మన యాశలను త్యజించి, ప్రతి దానిలో క్రీస్తుకు లోబడుట యనునది మన మీ లోకములో నున్నంతవఱకు ఎంత యత్నించినను పూర్ణముగ జరుగనేరదు (ఫిలి. 3: 12). అంత్యదినముననే మనము క్రీస్తును పోలియుందుము (1. యోహా. 3: 2) గాని అంతకు మునుపు కాదు: అయితే అప్పుడా గుణము మనలో పూర్తిగా నుండవలెనని మనము కోరినయెడల మన మిప్పుడిహమందు జీవముతో నున్నపుడే దాని నభ్యసించ మొదలు పెట్టవలెను.

మనలను మనము పేక్షించుకొనవలెనంటే—1. పాపము చేయుటవలన మన కెంత లాభము వచ్చినను, ఎంత సుఖము కలిగినను దానిని బొత్తుగా త్యజింపవలెను (తీతు 2: 12). 2. తప్పు కాని వాటివలన మనకు శోధన కలిగిన యెడలను, మన రక్షణకును, మన విధాయకములను జరిగించుటకును అవి అభ్యంతరముగా నుండిన యెడల మనము అట్టి వాటిని కూడ త్యజింపవలెను. 3. మనము మన సొంత రక్షణనుగూర్చి మాత్రము గాక, ఇతరుల రక్షణగూర్చికూడ చింతింపవలసినవారమై యున్నాము కావున ఇతరులకు మేలు చేయుటకును, వారికి అభ్యంతరములు కలుగ జేయకుండుటకును, వారి నిమిత్తము అవసరమైనపుడెల్ల మన సొంత సౌఖ్యమును త్యజింపవలెను.

11. మనలను మనముపేక్షించుకొనవలసిన యవసరమేమి?—క్రైస్తవుడు తన జీవితకాలమంతటిలో చెడ్డ వాటిని జయించుటకు పోరాడవలసి యున్నాడు. ఈపోరాటములో మనకు అపజయము కలిగించునదియు, మనలను బలహీన పఱచునట్టిదియునైన ప్రతి దానిని విడిచిపెట్టుట తగు బుద్ధి కాదా? మన క్రైస్తవ జీవము పందెపురంగము అని యెంచబడినట్లు బైబిలులో వ్రాయబడి యున్నది (1. కొరి 9: 24-26). ఈపందెములో గెలుపు నొందకుండునట్లు చేయు ప్రతిదానిని సంతోషముతో త్యజించుట మిగుల మంచిదికాదా? ఈలోక సంబంధమైన పందెములో పరుగెత్తువారును పోరాడువారును లోక భోగములను త్యజించి, చాల ప్రయాసపడి కష్టించిననే కాని లేని యెడల గెలువజాలరు. వారివ్విధముగా కష్టించి, తమ దేహములను మనస్సులను బలపడునట్లు చేయవలెను. ఇతరులను

జయింపక పూర్వమే వారు తమ సొంత దేహములను లోబఱచుకొనవలెను. మఱియు తాము తమ ఆశలను త్యజించి, కష్టించుటచే గెలువగలమని తెలిసికొని ప్రతి ఆశను త్యజించుటకును, ప్రతి కష్టమునకు లోబడుటకును సిద్ధముగా నుందురు. వారు క్షయమైన కిరీటమును పొందుటకు కష్టించుచుండగా మనము అక్షయమైన కిరీటమును పొందుటకు ఈలాగున ప్రయాసపడుచున్నాము. (1. కొరి. 9: 25). అలాగయిన యెడల నశించునట్టి యీ లోక సంబంధమైన బహుమానమును పొందుటకు వారు చేయుదానికంటే, నిత్యరక్షణను పొంద కోరుచున్న మనము మనలను మనము మఱెక్కువగా నుపేక్షించుకొన కూడదా? మనము స్వసౌఖ్యమును వెదకి, మన ఆశ లన్నింటిని తీర్చుకొన గోరువారమైనయెడల ఇహపర మేలుల నేమాత్రమును పొందజాలము.

మనము స్వసౌఖ్యములను త్యజింపక వాటిని వెదకుటయే సర్వసాధారణమైన పాపమై యున్నది. తమయొక్క మేలుకొఱకును, ఇతరుల మేలుకొఱకును తమ సౌఖ్యములను త్యజించువారు కొందఱే. క్రైస్తవులనబడు వారిలో తమ ఆత్మీయాభివృద్ధికొరకును, క్రీస్తు రాజ్యాభివృద్ధి నిమిత్తమును తమ శరీర సౌఖ్యములను పోగొట్టుకొనువారెందఱు కలరు? క్రీస్తు నిమిత్తము తమ శరీర సౌఖ్యములలోనే దానినైన పోగొట్టుకొనవలసివచ్చిన యెడల వారు సంతోషముతో ఆలాగున చేయక యీమతము తమకు అచ్చిరాలేదనియు, దీనివలన కష్టములు వచ్చునవనియు సణుగుచుందురు. క్రైస్తవులు తమ ఆత్మీయ విషయములకంటె క్రీస్తు రాజ్యాభివృద్ధికంటెను తమ సొంత సౌఖ్యములను ఎక్కువగాకోరి, వాటిని పొందుటకై ఎక్కువగా కష్టపడుట సర్వసాధారణమై యున్నది (ఫిలి. 2: 21). మనము మన సౌఖ్యములను తీర్చుకొనుటకు కాదుగాని, దేవుడు మనకు నిచ్చినశక్తికొలది మేలు చేయుటకు ఈ లోకములో నుంచబడి యున్నాము కావున మనము అలాగు చేయక స్వసౌఖ్యమును వెదకిన యెడల అది యెంతో గొప్పపాపమై యున్నది.

మనలను మనము ఉపేక్షించుకొనుటకు ఏవి చేయవలెను, ఏవి చేయకూడదు అని యడిగిన యెడల ఆయావారలు తమ స్థితిగతులనుబట్టి ఆయా విధములుగ చేయవలయును లేక చేయకూడదు అని తెలిసికొనవలెను. అందఱు ప్రతి కార్యమునుఏకరీతిగా చేయవలసినదని చట్టముల నేర్పఱచుటకు వీలుపడదు. అయినను తమ సొంత మేలును మాత్రము విచారింపక దేవుని చిత్తమునకు అనుకూలముగాను, ఇతరుల క్షేమము నిమిత్తమును పని చేయుట యనునది అందఱియొక్క ముఖ్యమైన ఆశయై యుండవలెను. దేవుని యెడలగాని మనుష్యుల యెడలగాని ప్రేమచూపుటకై ధనమును లాభమును, సుఖభోగములను అవసరమైనప్పుడెల్ల త్యజింపవలెను (2). మనలను మ

ముకాదుగాని క్రీస్తును సంతోషపరచవలెను (గల. 1: 10). మన కెన్ని కష్టనష్టములు కలిగినను మనము ఇతరులకు మేలుచేయవలెను (3). మన కోరికల నెంచక మనకు విధింపబడిన పనిని నెఱవేర్పవలయును (గల. 1: 16). మన విధాయకములను నెఱవేర్చుటలో మన ప్రాణమును పోగొట్టుకొనవలసి వచ్చినను వెనుకదీయక మంచియోధునివలె ఆలాగు చేయవలెను. క్రీస్తువల్ల తనకు నియమింపబడిన పని కష్టమని యెంచి, దానిని చేయక తన సౌఖ్యమును విచారించుకొని తన ప్రాణమును రక్షించుకొన గోరువాడెవడో వాడు దానినిపోగొట్టుకొనును. అయితే ఎవరు క్రీస్తు నిమిత్తము ప్రతి సౌఖ్యమును పోగొట్టుకొని, ప్రతి కష్టమును సంతోషముతో సహించునో వాడు తన ప్రాణమును రక్షించుకొనును (లూకా 9: 24). అట్టి వానికి నిత్యజీవము కలుగును.

III. మనలను మన ముపేక్షించుకొనుటవలన మనకు గల్గు సంతోషము.—క్రీస్తు రాజ్యాభివృద్ధికొఱకును, ఇతరుల మేలు నిమిత్తమును మనలను మనము పేక్షించుకొనుట యనునదికొత్తగా లమందెంతకష్టతరముగ నుండినను, నిజమైన సంతోషమునకు మూలాధారమై యున్నది. మనము మన స్వంత సౌఖ్యమును విచారింపక, దానికంటె ఇతరుల సౌఖ్యమును ఎక్కువగా కోరి వారికి సంతోషము కలిగించుటకు మన స్వంత కోర్కెలను త్యజించిన యెడల మనకు సంతోషము తప్పక కలుగును. ఆలాగున చేసినయెడల మనము చేయవలసిన దానిని క్రీస్తు మాదిరిని అనుసరించియున్నామని (రోమా 15: 3) తెలిసికొని ఆత్మీయమయిన నెమ్మదిగలవారమగుదుము. మన క్రియలవలన ఇతరుల కష్టములను నివారణచేసితిమేని కష్టమునకు ప్రతిగా వారు సంతోషము ననుభవించుచుండుటను జూచినపుడు మనకు ఆనందము కలుగక తప్పదు. 'పుచ్చుకొనుటకంటే ఇచ్చుట ధన్యత' (4) అని క్రీస్తు చెప్పెను. క్రీస్తు రాజ్యాభివృద్ధి నిమిత్తము ఎవరు తమ బలమును, కాలమును లాభమును పోగొట్టుకొందురో అట్టివారు క్రీస్తు చెప్పిన ధన్యతను అందఱికంటె మఱి పూర్ణముగా ననుభవించుకొందురు.

IV. క్రీస్తు తన్ను తాను ఉపేక్షించుకొని మనకు చూపినమాదిరి—మనలను మనము పేక్షించుకొనుటకై క్రీస్తు లోపరహితమగు మాదిరిని చూపియున్నాడు. దేవుని చిత్తమును నెఱవేర్చుటలోను, మనుష్యులకు మేలు చేయుటలోను క్రీస్తు తన్ను తాను బొత్తిగా మఱచెను. తన సౌఖ్యమును, ఘనతను ఏ మాత్రము నెంచక దేవుని మహిమను వెదకెను (యోహా. 8: 49, 50). మనకు నిత్య సౌఖ్యము లుగుటకై ఆయన సిలువమీద ఘోరమరణము నొందెను. మనుష్యులు పాపము

లోనుండియు, నిత్య నాశనములోనుండియు రక్షింపబడుటయే ఆయన చేసిన దానికి ప్రతిఫలమై యున్నది. ఈ ప్రతిఫలమును ముందుగా చూచినందువల్ల ఆయన ఆ శ్రమలన్నిటికి లోబడెను. తన యెదుట నుంచబడిన ఈ యానందము కొఱకై ఆయన అవమానమును నిర్లక్ష్యపెట్టి, సిలువను సహించెను (ర). అటువలెనే మన మును మన మంచిపనులకు గలుగు ప్రతిఫలమును తలంచి, మనలను మన ముపేక్షించు కొనుటకు రేపబడవలెను. ఈలాగు నమ్మకముగా జేయుటవలన నెన్నికష్టములు వచ్చినను, తన్ను నమ్మకముగా సేవించువారికి ఆయన యియ్యబోవు మహిమ యెదుట అవి యెన్నతగినవి కావు (రోమా 8: 18). తన్ను తాను అంతగొప్పగా నుపేక్షిం చుకొనుటకై పౌలుకు ధైర్యము పుట్టించినది మహిమయే. కాబట్టి కష్టమును ఎంతగా సహింపవలసియుండినను అతడు సంతోషించి—ఇక యెదట నా కొఱకు నీతి కిరీట ముంచబడియున్నది. ఆ దినమందు నీతిగల న్యాయాధిపతియైన ప్రభువు దానిని నాకును, నాకు మాత్రము కాకుండ తన ప్రత్యక్షత నపేక్షించు వారికందఱికిని అనుగ్ర హించును (2. తిమొ. 4: 8). అని చెప్పెను

---

35 ఇంద్రియ నిగ్రహమునుగూర్చిన బోధ.

ఒకవేళ ఇతరులకు ప్రకటించిన తరువాత నేనే భ్రష్టుడనయి పోవుదునేమో అని నాశరీరమును నలగగొట్టి దానిని లోబఱచుకొను చున్నాను. I కొరి 9: 27.

భాగములు.

I. ఇంద్రియ నిగ్రహము అనునది క్రైస్తవులందరికి నుండవలసిన గుణమై యున్నది.

II. మనము నిగ్రహింపవలసిన పాపము లెవ్వియనగా—

1. క్రోధము.
2. నాలుకకు సంబంధమైన పాపములు.
3. అమితానుభవము.
4. కామము.

## అనుదిన వేదపాఠములు.

మన నైజగుణమువలన కలుగు పాపములు మార్కు 7:1-23.
క్రోధమును విడిచి దయను అభ్యసింపవలెను కొల 3:5-17.
నాలుకను సంబంధమైన పాపములు యాకో 3:1-12.
వృథాగా మాటలాడు వారికి గలుగు శిక్ష. మత్తై 12:22-37.
తాగుబోతులు వ్యభిచారములు దేవుని రాజ్యమునకు వారసులు కారు 1. కొరి; 6.
ద్రాక్షారసమువలన కీడులు. సామెతె. 23:29-35
శరీరమును బిగబట్టుకొనవలెను. 1. కొరి. 9:24-27

## వేదవాక్యములు.

I. 1. ఆత్మఫలమేదనగా ప్రేమ, ఆనందము, శాంతి, దీర్ఘశాంతము, దయాళుత్వము, మంచితనము, విశ్వాసము, సాత్వీకము, ఆశానిగ్రహము ఇట్టివాటికి విరోధమైన శాస్త్రమేదియు లేదు. క్రీస్తు సంబంధులు శరీరమును దాని యిచ్ఛలతోను దురాశలతోను సిలువవేసి యున్నారు (గల. 5:22-24).

2. నీ హృదయములోనుండి జీవధారలు బైలుదేరును, కాబట్టి అన్నిటికంటె ముఖ్యముగా నీ హృదయమును భద్రముగా కాపాడుకొనుము (సామె. 4-23)

II. 3. సమస్తమైన ద్వేషము. కోపము, క్రోధము అల్లరి, దూషణ, సకలమైన యీర్ష్యను మీరు విసర్జించుడి (ఎఫె. 4:31)

4. నేను మీతో చెప్పునదేమనగా — మనుష్యుడు పలుకు వ్యర్థమైన ప్రతి మాటనుగూర్చియు విమర్శ దినమున లెక్క చెప్పవలసియుండును (మత్తై. 12:36).

5. మనము ఒకరికొకరము అవయవములమై యున్నాము గనుక ప్రతివాడును తన పొరుగువానితో సత్యమే మాటలాడవలెను (ఎఫె. 4:25).

6. అన్యాయస్థులు దేవుని రాజ్యమునకు వారసులు కానేరరనిమీకు తెలియదా? మోసపోకుడి, వేశ్యాంగులయినను విగ్రహారాధకులైనను వ్యభిచారులైనను ఆడంగితనము గలవారైనను పురుష సంయోగులైనను దొంగలైనను లోభులైనను తాగుబోతులైనను దూషకులైనను దోచుకొనువారైనను, దేవుని రాజ్యమునకు వారసులు కానేరరు (1 కొరి. 6:9, 10).

7. ద్రాక్షారసము వెక్కిరింతలు పాలు చేయును. మద్యము అల్లరి పుట్టించును దాని వశమైన వారందరు జ్ఞానము లేనివారు (సామె. 20:1):

8. ద్రాక్షారసము మిక్కిలి ఎఱ్ఱబడగను గిన్నెలో తళతళ లాడుచుండగను త్రాగుటకు రుచిగా నుండగను దానివైపు చూడకుము. పిమ్మట అది సర్పమువలె కరచును, కట్లపాము వలె కాటువేయును (సామె. 23:31,32)

## వివరము.

1. ఇంద్రియ నిగ్రహము క్రైస్తవులందరికి నుండవలసిన గుణమై యున్నది.—మనము సాపేక్షలన్నిటిని త్యజింపవలెను (తీతు. 2:12): అదియు గాక మనలోనుండు మంచి ఆశల విషయమందు మితానుభవముగలవారమై యుండవలెను (1. కొరి. 9:25). మన దేహము (ప్రా॥ వా॥), మనస్సును (1. పేతు. 4:7), బిగబట్టుకొని మనము స్వాభావికముగా నుండు ఆశలచే నడిపింపబడ కుండునట్లు వాటిని మంచి బుద్ధికి లోబఱచవలెను. మనము పాపములో పడకుండునట్లును, దేవుని సేవింపవలసిన విధముగా ఆయనను సేవించునట్లు (1. కొరి. 10:12; లూకా 21:34-36), ఇంద్రియ నిగ్రహము అత్యావసరమై యున్నది. మనము నైజముగనుండు దుర్బుద్ధిని జయించుటయే యింద్రియ నిగ్రహము. అజయము ఈలోకములో పూర్ణముగ కలుగకపోయినను, మన మింద్రియ నిగ్రహము చేయ యత్నింపవలెను. పట్టణమును పట్టుకొనువానికంటె తన మనస్సును స్వాధీనపఱచుకొనువాడు శ్రేష్ఠుడని (సామె. 16:32), వేదమందున్నది. కావున, అట్టి జయమును పొందుటకై ప్రయాసపడుట యుక్తమము.

క్రీస్తుకు కలిగిన మనస్సు మనలో నంతకంతకు కలుగవలెను (ఫిలి. 2:5), మనము మనలోని దుర్బుద్ధిని త్యజించి, మనక్రియలను సుబుద్ధికి లోబఱచవలెను, భక్తి, ప్రేమ, శాంతము,దయ, మితానుభవము, ధైర్యము, సంతోషము అను నిట్టిసుగుణములు మనలో నుండవలెను (1) (2. పేతు. 1:5-7). వీటికి భిన్నముగా నుండు బుద్ధి మనము కలిగినయెడల దానిని త్యజించి, క్రీస్తు ఆజ్ఞలను ఆయన మాదిరిని చూచి వాటిని అనుసరింపవలెను. కామ క్రోధాదులు మనలో పుట్టును (మత్త. 15:19), గాని వాటికి చోటియ్యక వెంటనే పీకివేయవలెను. అలాగు చేయకపోయినయెడల మనము బహు త్వరలో అట్టి దురాశల వశమగుదుము (2). ఎంతమంది తమ స్వతంత్రతను పోగొట్టుకొని సొంత దురాశలకు దాసులైరి.

II. మనము నిగ్రహింపవలసిన పాపము లెవ్వియనగా.—

1. క్రోధము. న్యాయమైన కోపముకూడ కలదు. యూదులు క్రయవిక్రయములు చేసి ఆలయము నపవిత్రపరచుటను చూచినపుడు క్రీస్తుకు అట్టి కోపము కలిగెను.(మత్త. 21: 12, 13). పాపమును సహింపలేక ఆ విధముగా మనమును కోపపడుట

న్యాయమే. కాని వేఱువిధములైన కోపములన్నియు పాపములైయున్నవి (3). ఈ జీవితకాలములో మన కోపమును లేపునట్టి తొందరలు అనేకములుకలుగును. అయితే యీ తొందరలు మన కెంతటి యుద్రేకమును కలిగించినను మనము మన కోపమును బిగపట్టుకొని దాని వశులమై పోకుండ నుండవలెను. ఇతరులు మనతో కోపముగా మాటలాడినయెడల మృదువైనమాట క్రోధమును చల్లార్చునను వేదవాక్యమును (సామె. 15: 1.) తలంచుకొని వారికి మృదువుగా ప్రత్యుత్తర మీయవలెను. ఎందుకనగా దేవుని దృష్టికి నరుని కోపము నీతిని నెఱవేర్చదు (యాకో. 1: 20). పగతీర్చుకొనుట దేవుని పని యనియు, ఆయనే ప్రతిఫలము నిచ్చువాడనియు తెలిసికొని మనము అన్యాయమునకు ప్రతియన్యాయము చేయక మన సంగతిని దేవునికి నప్పగింపవలెను (రోమా 12: 19). మఱియు క్రీస్తునందు దేవుడు మనలను క్షమించిన ప్రకారము మన మితరులను క్షమింపవలెను (ఎఫె. 4: 32).

కోపమువలన కలుగు కీడులు.—కోపస్వభావము దానంతటనదే పాపమై యుండుట మాత్రముగాక వేఱు పాపములకును మూలమై యున్నది. అది నరహత్యచేయుటకు హేతువు (ఆది. 4: 5–8). కోపపడు వారందఱును ఇంతటి ఘోర పాపములో పడకపోయినను మొత్తానికి అది వారిని పాపములలో ముంచివేయును. క్రోధ స్వభావముగలవాడు సాతానువశ మగును. మనము కోపపడుచుండగా పలుకరాని మాటలను పలుకుచున్నాము. అవి చల్లారిన పిమ్మట ఎంతగా విచారపడినను కోపముతో మన మాడిన మాటలను తుడిచివేయలేము. కోపముచే పలుకబడిన మాటలు సాధారణముగా అన్యాయమైనవియు, క్రూరములైనవియునై యున్నవి. కోపముతో మనము సత్యమును పలికినను అది ప్రేమతోగూడిన సత్యముకాదు (ఎఫె. 4: 15). కోపముతో పలుకబడిన మాటలవలన నితరులకు ఎంతో హాని కలుగునను మాట నిజమేగాని కోపపడిన వానికి దానివలన మఱీ యెక్కువ హాని కలుగును. అతని పరువు పోవును. అట్టివాడు కోపమువలన తన స్వంత బలమును పోగొట్టుకొని ఇతరులకు ఎంతగా బోధించినను వారతని మాటలను నిర్లక్ష్యము చేతురు. తన కోపము తన శత్రువనునది లోకోక్తియే గదా? కోపమువలన తనకును ఇతరులకును అనేక చింతలును తొందరలును కలుగును. మనము మన మాటలను ఏమాత్రము కోపముతోగాక శాంతముగా వచింపవలెను. లేనియెడల మనము కోరని వాటిని పలుకుచు మన పనులను అడ్డగించుకొనువార మగుదుము. కోపదారి తన కోపమును బిగపట్టుకొననియెడల తనకును తన చుట్టునుండు వారికిని నష్టము కలిగించును.

2. నాలుక సంబంధమైన పాపములు.—నాలుక బహు చిన్నదైనను అది గొప్ప కీడునుగాని మేలునుగాని చేయగలిగియున్నది (యాకో. 3: 5). దాని

లోబఱచుకొనక పోయినయెడల మనము మనమనుఇతరులమను చాల వేసికలిగించువార మగుదుము. సమయమును కనిపెట్టి మాటలాడవలెను లేని యెడల మౌనముగా నుండవలెను (ప్రస. 3: 7). దేవునిగూర్చి స్తుతులు ప్రార్థనలు చేయుటమును, మనుష్యులనుగూర్చి ప్రేమతో సత్యమును పలుకుటమును (ఎఫె. 4: 15), మనము మన నాలుక నుపయోగింపవలెను గాని, ఇతరమైన యే మాటల నాడుటకైన మన నాలుక నుపయోగింపరాదు.

ఒట్టుపెట్టుకొనుట, శపించుట, బూతులాడుట అనునవి మనము నాలుకతో చేయు గొప్ప పాపములై యున్నవి. కాబట్టి మనము వాటిని బొత్తుగా విడిచిపెట్టవలెను. ఇవి సాధారణమైనవై యుండుటచే మనుష్యులు వాటినిగూర్చి తలంచక, వాటియందలవాటుపడి అవి పాపములు కానట్లుగా నెంచుచున్నారుగాని అది గొప్ప పొరపాటైయున్నది. పది యాజ్ఞలలో రెండవది ఒట్టుపెట్టుకొనుటను శపించుటను నిషేధించెను. దేవుడు తన నామమును వ్యర్థముగా పలుకు వానిని నిర్దోషిగా నెంచడని (నిర్గ. 20: 7) ఆ యాజ్ఞలో నొక విశేషమైన నుందలింపు కలదు. మనము పలుకు వ్యర్థమైన ప్రతి మాటనుగూర్చి లెక్క నప్పగింపవలసియుండగా (4), దేవుని నామమును వృధాగా వాడువారి గతి యేమగును ?

అబద్ధములాడుట, చాడీలు చెప్పుట అనునవికూడ గొప్పపాపములై యున్నవి. కల్లలాడు నాలుక దేవునికి అసహ్యము (సామె. 6:16,17). కావున మనము అబద్ధములాడుట మాని సత్యము పలుకవలెను (5). చాడీలు చెప్పకుండ ముఖ్యముగా జాగ్రత్త పడవలెనని ఎనిమిదవ యాజ్ఞవలన నేర్చుకొనుచున్నాము (నిర్గ 20: 18). మనము ఇతరులనుగూర్చి విను దుష్కీర్తిని ప్రచురింపక వారినిగూర్చి దయగల భావము కలిగి యుండవలెను.(లూకా 6: 36, 37). పాపమును గద్దించవలసిన దను మాటవాస్తవమే. అయినను మనము అట్టివారి క్రియలను చూచి వారు దురుద్దేశము కలిగినవారై అలాగు చేసిరని త్వరగా అనుకొనరాదు. ఇతరులనుగూర్చి మంచివాటిని చెప్పలేకపోయిన యెడల మనము మౌనముగ నుండుటే మేలు. చాడీలవలన నీలోకములో ఎన్నియో తొందరలు కలుగును. ఏదో యొక మూలను అంటుకొనిన నిప్పు రవ్వ మెల్లగా కొంప నంతటిని తగులబెట్టునట్లు, చాడీలును క్రమక్రమముగా పెరిగి అంతటను వ్యాపించి తుదకు అర్పశక్యముగానివగును (యాకో. 3: 6). అట్టి నాలుక మరణకరమైన విషముతో నిండినట్టుగ నున్నది (3: 8). మనము దానిని బిగబట్టుకొనని యెడల మన భక్తి వ్యర్థమే (1: 26). ఒక్క నాలుకతో దేవుని స్తుతించుచు మనుష్యులను శపించుచుండుట యెట్టు సరియగును (3: 10). మనుష్యులను శపించువారుదేవునికి చేయు స్తోత్రములు వట్టి మాయయేగదా ? రక్షణను పొగొట్టుకొనకుండవలెనని కోరిన

యెడల మనము నాలుకను బిగబట్టుకొనవలసియున్నాము. మనము దేవుని సహాయమువల్లనే అలాగు చేయగలము. అలాగున మనము చేయనియెడల ఇతరులకు హాని చేయువారము మాత్రముగాక మన రక్షణను పోగొట్టుకొను వారమగుదుము.

3. అమితానుభవము.—చెడ్డయాశలను మనము పూర్ణముగా త్యజించి, ఏయే ఆశలను తీర్చుట న్యాయమో అట్టి వాటిని తీర్చుటలో మితముగా నుండవలసియున్నాము. భోజనపానాదులలోను, వస్త్రధారణలోను, సంతోషములలోను, స్థితిని ధనమును కోరుటలోను అన్ని విషయములయందును మనము మితముగా నుండవలెను. ఎందుకనగా మన ధర్మ విఘ్నలను జరిగించుటలో అమితానుభవము హానకు అత్యంతరముగా నుండును.

తాగుబోతుతనము మిగుల సాధారణమైనదియు, గొప్ప పాపమునై యున్నది. తాగుబోతులు దేవుని రాజ్యమునకు వారసులు కానేరరు (2). వారు పశువులకంటె నీచులై దేవుడు తమకు నిచ్చిన బుద్ధిని పోగొట్టుకొని, తమ ద్రవ్యమును పాడుచేసికొని, తమ కుటుంబములకు ఇబ్బందుల పాల్జేసి, తమను తమవారికిని అవమానమును కలుగ చేసికొందురు: అదియుగాక వారు గుణపడకపోయినయెడల తమ యాత్మలనుకూడ పోగొట్టుకొందురు. ఈ దురభ్యాసములో పడినవారు దానిలోనుండి తప్పించుకొనుట బహు దుర్లభము. వారికి దానిమైగల ఆశ గొప్పదగుటచేతను వారి స్నేహితులును వారింటివారగుటచేతను, ఈ చెడ్డ యభ్యాసమునకు బలముగా బంధింపబడుట చేతను వారు దాని దాసు లగుదురు. దేవుని సహాయము లేనిది వారా దురభ్యాసములోనుండి రేమ మాత్రమును తప్పించుకొనజాలరు.

మనము ఈ పాపమువలని దాసత్వము నెఱిగి జాగ్రతపడి ఆ శోధనలో పడకుండునట్లు మనకు గల్గు మొదటి శోధననే ఎదిరించి మత్తు పదార్థములను. త్రాగుటకు ఏ మాత్రమును ఆరంభింపరాదు. మత్తుపదార్థములను త్రాగుటవలన గలుగు కీడులను బైబిలు మనకు వివరించి బుద్ధి చెప్పుచున్నది. (6,7). త్రాగుటవలన నింతటి గొప్ప కీడు లున్నవి గావున మనము జాగ్రతపడి వాటిని అమ్మే దుకాణములకు పోరాదు తాగుబోతులతో పొందు చేయకూడదు. మత్తు పదార్థములను ముట్ట కుండుట ఎక్కువమందికి అవసరమైయున్నది. ఎందుకనగా వారు దాని ముట్టినయెడల ఆ పాపములో పడుదురు. అట్టి భయము లేకపోయినను తాము దానిని పుచ్చుకొని నందువలన ఇతరులకు కీడు కలుగుననియైన తెలిసికొని వారి మేలుగోరి దానిని పుచ్చుకొనకుండ నుండవలెను (1. కొరి. 8: 13).

తాగుబోతుతనమువలె అమితముగా తినుటయును పాపమై యున్నది (ఫిలి. 3: 19). వెంటనే కనబడకపోయినను అందువలనకూడ దేహమునకు జబ్బులు

వచ్చును. అమితముగా తినుటవలన చాలమంది తమ యాయుష్యును తక్కువ చేసికొందురు. కావున ముఖ్యముగా స్థితిగలవారును మంచి యుద్యోగము నొందిన వారును దీని విషయము జాగ్రతపడవలెను.

4. కామము.—కామమునకు సంబంధమైన ప్రతియాశను మనము లోఁగ పట్టుకొనవలెను. అట్టి తలంపులు మనస్సులో నుండకుండ పీకివేయవలయును. కామమునకు సంబంధమైన ప్రతి మాటను, పాటను పలుకకుండను, పాడకుండను వినకుండను నుండవలెను. మఱియు వ్యభిచారమునకు సంబంధించిన క్రియలను బొత్తిగా విడిచిపెట్టవలెను. కామమునకు లోనైనవారు తమ దేహబలమును మనోబలమును పోగొట్టుకొని తమకు విధింపబడిన పనులను చేయలేక తమ మనస్సాక్ష్యమువలని బాధలకును దేవుని శాపమునకును లోనగుదురు. అట్టివారు దేవుని రాజ్యమునకు వారసులు కానేరరు (5). హృదయ శుద్ధిగలవారు తప్ప మఱి యెవరును దేవుని చూడలేరు (మత్త. 5: 8).

అమితానుభవ మెట్టిదైనను అది పాపమై యున్నది.—మనము దేనినైనను అమితముగా వాడకూడదు. (1. కొరి. 7: 31). మితముగా వాడిన యెడల దేవుడు సృష్టించిన ప్రతిది మంచిదైయున్నది. కృతజ్ఞతాస్తుతులను చెల్లించి పుచ్చుకొనిన యెడల నేదియు నిషేధింపదగినది కాదు (1. తిమొ. 4: 4) గాని దేనినైనను అమితముగా వాడిన యెడల మన యాశలను దేవునిమీద నుంచక వాటిమీదనే యుంచినట్లున్నది. అప్పుడది విగ్రహారాధనకు సంబంధమైన పాపమగును. మన కడుపు, ధనము, భోగములు, ఆశలు అనునవే ముఖ్యములైనవిగ నెంచి ఆ విధముగా వాటిని మనకు దేవతలనుగా చేసికొనరాదు. మన యాశలను తీర్చుకొనుటకు దేవుడు మనల నీ లోకములో నుంచలేదు. దేవుని సేవించుటకును మనుష్యులకు మేలు చేయుటకును మన మిచట నుంచబడియున్నాము (మత్త. 6: 33). మనము అమితానుభవులమైన యెడల మన విధాయకములను చేయలేము. కావున అమితానుభవమును విడిచిపెట్టవలెను.

---

## 36. కష్టదుఃఖములను గూర్చిన బోధ.

ప్రస్తుతమందు సమస్త శిక్షయు దుఃఖకరముగా కనబడునే కాని సంతోషకరముగా కనబడదు; అయినను దానియందు అభ్యాసము కలిగినవారికి అది నీతియను శాంతికరమైన ఫలము నిచ్చును. హెబ్రీ 12: 11.

## భాగములు.

I. కష్టదుఃఖములు అందరికి కలుగును.

II. విశ్వాసులకు కలుగు కష్టదుఃఖములు వారికి మేలుకరమగు క్రమశిక్షలై యున్నవి.

III. మనము కష్టదుఃఖములను ధైర్యముతోను సంతోషము తోను సహింపవలెను.

## అనుదిన వేదపాఠములు.

శిష్యులకు కలుగు హింసలు. మత్త. 10: 24-42.
అనేక శ్రమలద్వారా దేవుని రాజ్యములో చేరుట. కార్య. 14: 19-28.
క్రీస్తు తన శ్రమలలో జూపిన ఓర్పు మౌనము. లూకా 23: 27-49.
పౌలు తన శ్రమల విషయము అతిశయపడుట. 2. కొరి. 11: 16-33.
శ్రమ లొందువారు ఇతరులకంటె దుర్మార్గులుకారు. లూకా 13: 1-9.
మనము పొందబోవు మహిమ యెదుట ఇప్పటి శ్రమలు ఎన్న దగినవికావు. రోమా. 8: 12-25.
దేవుడు ఎవరిని ప్రేమించునో వారిని శిక్షించును. హెబ్రీ 12: 1-13.

## వేదవాక్యములు.

I. 1. నిప్పు రవ్వలు పైకి ఎగురునట్లు నరులు శ్రమానుభవమునకే పుట్టు చున్నారు (యోబు 5: 7).

II. 2. తండ్రి తనకు ఇష్టుడైన కుమారుని గద్దించు రీతిగా యెహోవా తాను ప్రేమించువారిని గద్దించును (సామె 3: 12).

III. 3. మనము పిల్లలమైతే వారసులము, క్రీస్తుతోకూడ మహిమ పొందుటకు ఆయనతో కూడ శ్రమపడినయెడల క్రీస్తుతోటి వారసులము (రోమా 8: 17).

4. ఆపత్కాలమున నీవు నన్ను గూర్చి మొఱ్ఱబెట్టుము, నేను నిన్ను విడిపించెదను. నీవు నన్ను మహిమపఱచెదవు. (కీర్త. 50: 15)

## వివరము.

ఈ లోకములో క్రైస్తవ భక్తులు అనేక శ్రమలను పొందెదరు. మనుష్యులందఱికి సాధారణముగా కల్గు శ్రమలు మాత్రముగాక వారు క్రైస్తవులగుటచే ఇంకను విశేష హింసలు పొందుట సర్వసాధారణమై యున్నది. వారి ప్రభువైనయేసుక్రీస్తును

లోకములో ఏలాగు హింసించెనో (యోహా. 15: 20) ఆలాగుననే వారినికూడ హింసించును. దేవుడు తన భక్తుల మేలు గోరి వారి మీదికి యీలాటి శ్రమలను రానిచ్చునని తెలిసికొని ధైర్యముతోను, సంతోషముతోను వాటిని సహింపవలెను. మన మిట్లు చేసినయెడల మన సిలువ నెత్తుకొని క్రీస్తును వెంబడించు వారమగుదుము. 'తన సిలువ నెత్తుకొని నన్ను వెంబడింపనివాడు నాకు పాత్రుడుకాడు' అని క్రీస్తు చెప్పెను కావున, ఈ కష్టపు సిలువను భరింపకపోయినయెడల మనము క్రీస్తు శిష్యులము కానేరము. ఆయన నిమిత్తము మనము ప్రతికష్టమును సహించి ఆవసరమైనయెడల చనిపోవుటకు సిద్ధముగా నుండవలెను.

I. కష్టదుఃఖములు అందరికి కలుగును.—ఆదాముహవ్వలు పాపములో పడినది మొదలు నేటివరకు ఈ లోకము కష్టములతో నిండి యున్నది. అందరును వాటికి లోనగుదురు (1). నరుని పాపమువలన గలిగిన మరణముతో కూడ (రోమా 5: 12). దానికి సంబంధించియున్న శ్రమలు బాధలన్నియు కలిగినవి. పాపము లేకపోయినయెడల శ్రమలుకూడ నుండవు. ఇట్టిదే మోక్ష సౌఖ్యము (ప్రక. 21: 4). గుణపడని దుర్మార్గులు దేవుని యుగ్రతకు లోనై తమ పాపములకైన శిక్షలుగా ఈ శ్రమలను పొందెదరు. అయితే విశ్వాసుల పాపములు క్షమింపబడినవి కావున వారికి గల్గు శ్రమలు వారికి మేలుకరమైన క్రమ శిక్షలై యున్నవి (1. కొరి. 11: 32).

పశ్చాత్తప్తులకు క్షమాపణ కలిగినను వారు తమ పాపములకైన ఫలమును ఈ లోకములో ననుభవింపవలసి వచ్చునను సంగతిని మనము మన మనసునందుంచుకొనవలెను. ఒకడు తాగుబోతుతనమువల్లను, పోకిరి చేష్టలవల్లను తన దేహబలమును చెఱుపుకొనిన పిమ్మట పశ్చాత్తాపపడినను వానికి మునుపుండిన దేహబలము రాదు. మన పాపము క్షమింపబడిన పిమ్మట మనకు కల్గు కష్టములు మనకు మేలు కలుగజేయు క్రమ శిక్షలయి యున్నవి. అయినను వాటిని మనము మన పాప ఫలములనుగ నెంచవలసి యున్నాము. కావున పాపము చేయుటకు మతిభయపడవలెను. తప్పిపోయిన కుమారుడు తండ్రివలన చేర్చుకొనబడినను అతడు అదివరకు పోగొట్టుకొనిన పిత్రార్జితమును, దేహబలమును అతనికి మరల నియ్యబడలేదు (లూకా 15: 13).

శ్రమలు పాప ఫలములైయున్నను ఎవరికి కష్టములు కలుగునో వారే ఎక్కువ దుర్మార్గులని అనుకొనరాదు (లూకా 18: 1-5). పుట్టు గుడ్డివానిని క్రీస్తు శిష్యులు చూచి—గురువా వీడు గుడ్డివాడై పుట్టుటకు ఎవడు పాపము చేసెను? వీడా? వీనికన్న వారా! అని అడుగగా క్రీస్తు వారి తప్పభిప్రాయమును దిద్ది దేవునికి మహిమ కలుగులాగున

యీ కష్ట మతనికి కలిగెనని చెప్పెను (యోహా. 9: 1-3). యోబుయొక్క పాపములచేతనే అతనికి ఆ యమిత శ్రమలు కలిగెనని అతని స్నేహితులు వాదించిరి. ఆలాగు కాదని యోబువాదించెను. దేవుడు యోబు వాదమే న్యాయమైనదని అతనిని ఏడంతలుగా దీవించుటచే నిరూపించెను.

II. విశ్వాసులకు గలుగుశ్రమలు వారికి మేలుకరములగు శ్రమశిక్షలై యున్నవి.—విశ్వాసులకు గలుగు శ్రమలు ఇతరులకు గల్గు శ్రమలకు సాటియైనవిగనున్నను, వాటిని మించినవిగనున్నను మనము మఱి యెక్కువగా పశ్చాత్తాపపడునట్లు మఱి పూర్ణముగా దేవుని నమ్ముకొనునట్లును, చేయుటకు ఈశ్రమలు దేవుని శ్రమశిక్షలై యున్నవి (2). ఈ విధముగ నెంచినయెడల శ్రమలు దేవునియుగ్రతకు గాక దేవుని దయకు సూచనలై యున్నవి. దేవుడు మనల నాలాగున శిక్షింపకపోయినయెడల మన మాయన బిడ్డలము కామని తెలిసికొనవలెను (హెబ్రీ 12:8)

శ్రమలద్వారా మనకు గలుగు శిక్షలు మనకు మిగుల అవసరములైనవై యున్నవి. అవి లేకపోయినయెడల మనము త్వరలో దేవుని మఱచి లోకమును దాని పాపములను ప్రేమించు వారమగుదుము. అయితే కష్టములు మనలను మఱల దేవుని వైపునకు త్రిప్పి, ఆయన తన దయను చూపి మనలను బలపఱచవలెనని వేడుకొనునట్లు మనలను బలవంతపఱచును. అనేకసారులు మనము గ్రహింపలేని కష్టములనుకూడ ఆయన మన మీదికి రానిచ్చును. ఆయన తలంపులు మన తలంపులు కావు (యెషయ 55:8). అయితే ఆయన మనలను ప్రేమించి సమస్తమును చేయుచున్నాడు. కావున మనకు మేలు కలిగించు వాటిని మాత్రమే మన మీదికి రానిచ్చును. అది మన కొద్ది బుద్ధికి ఆలాగున కనపడకపోయినను ఆయన మన మేలునే కాని కీడును కోరడు (యిర్మీ. 29: 11). మన మాయన పిల్లలమే; ఆయన మన మేలు కోరు ప్రేమగలతండ్రియై యున్నాడు. కావున మనకు మేలు కలుగుటకే సమస్తమును సమకూర్చునని తెలిసికొనవలెను.

శ్రమల వలన మేలులలోకొన్నిటిని మనము ఇహమందు సహాగుర్తింపగలము. అంతేయు క్షేమముగ నున్నయెడల మనము ఆ క్షేమము నిచ్చు దేవుని మఱచు వారమగునట్లు మనకు శోధన కలుగును. అయితే కష్టకాలములో మన దిక్కు దేవుడు గాక వేఱొకడు లేడని ఆయన తట్టు తిరిగెదము. ఇందుచేతనే... విందు జరుగుచున్న యింటికి పోవుటకంటె ప్రలాపించుచున్నవారి యింటికి పోవుట మేలు (ప్రస. 7:2). అని బైబిలు చెప్పుచున్నది. దేవుని విడిచి తమ ధనము నాశ్రయించుకొనునట్లు ధనము గలవారికి శోధన కలుగును. అయితే బీదలు తమ బీద స్థితినిబట్టి దేవుని

నాశ్రయించుకొనుటకు నేర్చికొందురు. క్షేమముగనుండువారు ఈ లోక చింతలలో మునిగి దేవుని మఱతురు. అయితే వ్యాధిగ్రస్థులు ఈ జీవము ఏపాటిదని యెంచి లోక చింతలను మాని నిత్యములైనవాటిని స్మరింతురు. మన ప్రియులందఱు మన యొద్ద నుంటుండుగా మనము చావవలసిన వారమను సంగతినే మఱతుము గాని, వారిలో నొకని దేవుడు తన యొద్దకు పిలువగా మన కందఱికి మరణము వచ్చునని జ్ఞప్తిచేసికొందుము. మన ప్రియులు మనకంటె ముందుగా పోవుట పరలోకమునుగూర్చి మన మెక్కువగా తలంచుటకును దాని నెక్కువగా నాశించుటకును సహాయముగా నుండును (కొల. 3: 2)

మనము భరింపలేనంతటి కష్టములని వేటి నెంచెదమో వాటివలన అనేకసారులు ఎక్కువదీవెనలు కలుగుటను చూడవచ్చును. అవి మనబుద్ధికి మనసులోబడకుండునట్లు మనలను అడ్డగించు ఆటంకములును, మనలోని యపవిత్రతను దహించు అగ్నియునై యుండి (యెష 48: 10), మనలను శుద్ధిచేసి, మనము నశింపకుండునట్లు మనలను కాపాడు సాధనములై యున్నవి. ఈ శ్రమలు మనలను మోక్షమునకు సిద్ధపఱచును. ఈ సంగతిని మనము తెలిసికొనినయెడల పౌలుతోకూడ మనమును... రాబోవు మహిమ యెదుట నిప్పటికాలపు శ్రమ ఎన్నతగినవి కావు అని యెంచువారమగుదుము.

దేవుడు చేయువాటన్నిటికిని గల హేతువులను మనము ఈ లోకములో నుండగా గ్రహించుకొనలేముగాని యీ జీవితకాలమైన పిమ్మట వాటిని గ్రహించుకొందుము. ఇప్పు డద్దములో చూచుచున్నట్లు సూచనగా చూచుచున్నాము; అప్పుడు పూర్తిగా నెఱుగుదుము (1 కొరి. 13: 12). అప్పుడు దేవుడు మన విషయములో చేసిన యావత్తు మేలేయని యొప్పుకొందుము.

III. కష్టదుఃఖములను మనము ధైర్యముతోను సంతోషముతోను సహింపవలెను.

I. ధైర్యముతో సహింపవలెను.—అనేక శ్రమల ననుభవించి మనము దేవుని రాజ్యములో ప్రవేశింపవలెను (అపొ. 14: 22). క్రీస్తుతోడి వారసులమై యుండవలెనని కోరినయెడల మన మాయనతో శ్రమపడవలెను (3). క్రీస్తు తన శ్రమలలో చూపిన ధైర్యమును మనమును చూపవలెను. దేవు డేర్పఱచిన మార్గము ఎంత కష్టమైనదైనను మన ప్రభువు దానికి వెనుక తీయలేదు. అది దేవుని చిత్తమని యెఱిగి ధైర్యముతో ఆ ఘోర శ్రమలన్నిటిని సహించెను. క్రూరులగు రోమను బంట్రౌతు లాయనను కొట్టినప్పుడును, ఆయన కాలుసేతులను మేకులతో సిలువకు నంట

గొట్టినపుడును, చనిపోవునిఅను సిలువమీద వ్రేలాడుచుండగను ఆయన తన యావ ద్బాధలను మౌనముగాను ధైర్యముతోను సహించెను గనుక మనకు శ్రమలు కలుగునపు డెల్ల ముఖ్యముగా ఆయన పేరట శ్రమపడవలసివచ్చినపుడెల్ల మనము ఆయన మా దిరిని చూచి ధైర్యము వహించి సహింపవలెను (హెబ్రీ 12: 1-3) అవసరమైన యె డల ప్రాణము పెట్టుటకు సహా తెగింపవలెను (కార్య 7:59, 60) ఆది క్రైస్తవుల కాలములోను దిద్దుబాటు కాలములోను చాలమంది యీ విధముగ తమ ప్రాణము లను పెట్టవలసివచ్చెను. క్రీస్తు శిష్యులము కామని చెప్పుటకంటే మరణమే మేలని యనుకొని వారు క్రూర బాధలకు సహా వెనుకదీయక ఆయన పేరట హతసాక్షులైరి.

2. సంతోషముతో సహింపవలెను.—అంతయు సౌఖ్యకరముగనున్న పుడు సంతోషించుట సులభమేకాని, మనోభారమును శరీరబాధయు కలుగగా సం తోషించుట బహు కష్టతరమై యున్నది. అయితే మన కష్టములెంత భారమైనవై నను మనము సణుగక వాటిని సంతోషముతో సహింపవలెను. మనము సణిగి దేవుని దూషించిన యెడల మన కష్టములు మఱి భారమైనవి యగును. మనశక్తికి మించిన కష్టములు దేవుడు మన మీదికి పంపడు (1 కొరి. 10, 13) ఆయన పంపినకష్టముల యుద్దేశము తెలివేతీన పిమ్మట ఆయనే వాటిని తీసివేయును. (4) మనము మన సిలువ నెత్తుకొని క్రీస్తును వెంబడింపవలెను. అలాగు ఆయనను వెంబడించుటలో మనము ఇష్టపూర్వకముగను, సంతోషముతోను మన శ్రమలను భరించుకొనవలెను. అలాగు చేసినయెడల శ్రమలు మనకు మేలుకరమైన క్రమశిక్షలై దేవుడు మన విషయ ములో నుద్దేశించిన వాటిని నెఱవేర్చును.

---

## 37 పనిచేయుటను గూర్చిన బోధ. X

ప్రధానవాక్యము 2 థెస్స 3.10.

ఎవడైనను పని చేయ నొల్లనియెడల వాడు భోజనము చేయకూడదు. X

భాగములు.

I. అందఱును అవశ్యముగా పనిచేయవలెను.

II. పనిచేయుట ఘనకార్యమై యున్నది.

III. మనము శ్రద్ధగలవారమును, నమ్మకము గలవారమునై యుండి పనిజేయవలెను.

IV. మన యాధీనమున పనిచేయువారిని దయతో చూడవలెను.

## అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| దేవుడు మనుష్యులకు పని నప్పగించుట | ఆది. 2:4-17. |
| పాపమువల్ల పని ఆయాసకరమైన దయ్యెను | ఆది 3:1-21. |
| ప్రతివాడు తన పనిని నమ్మకముగా చేయవలెను. | మత్త 25;14-30. |
| సోమరులు దరిద్రులగుదురు | సామె 6:6-11; 24:30-34. |
| పనిచేయనివాడు ఆహారమును తినకూడదు. | 2 థెస్స 3:11. |
| దాసులు, యజమానులు | ఎఫె 6:5,9; కొల 3:22-4:1 |
| అందరు సమానులైనను ప్రతివాడు తనపని చేయవలెను. | 1 కొరి 7:17-24, |

## వేదవాక్యములు.

I. 1. మాటచేతగాని, క్రియచేతగాని మీరేమి చేసినను ప్రభువైన యేసు ద్వారా తండ్రియైన దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచు, సమస్తమును ఆయన పేరట చేయుడి (కొల 3: 17)

II. 2. మీరు పానము చేసినను భోజనము చేసినను మీరేమి చేసినను సమస్తమును దేవుని మహిమకొరకు చేయుడి (1 కొరి. 10:31).

3. దాసుడవై యుండి పిలువబడితివా? చింతపడవద్దు. గాని స్వతంత్రుడ వగుటకు శక్తి కలిగిన యెడల, స్వతంత్రుడవగుట మరి మంచిది. ప్రభువునందు పిలువబడిన దాసుడు ప్రభువువలన స్వాతంత్ర్యము పొందినవాడు; ఆ ప్రకారమే స్వతంత్రుడై యుండి పిలువబడినవాడు క్రీస్తుదాసుడు (1. కొరి. 7:21,22).

4. మనుష్యులు మీ సత్క్రియలను చూచి పరలోకమందున్న మీ తండ్రిని మహిమ పరచునట్లు మీరును వారియెదుట మీ వెలుగు ప్రకాశింప నియ్యుడి (మత్త. 5:16.)

III. 5. సమయము పోనియ్యక సద్వినియోగము చేసికొనుచు (సంఘమునకు) వెలుపల వారి యెడల జ్ఞానము కలిగి నడుచుకొనుడి (కొల. 4:5)

6. మనుష్యులను సంతోషపెట్టువారు చేయునట్లు, కంటికి కనబడుటకే కాక క్రీస్తు దాసులమని యెంచుకొని దేవుని చిత్తమును మనఃపూర్వకముగా జరిగించుచు

మనుష్యులకు చేసినట్టు కాక ప్రభువునకు చేసినట్టే ఇష్టపూర్వకముగా సేవచేయుడి (ఎఫె. 6: 6, 7).

IV. 7. యజమానులారా, మీకును వారికిని యజమానుడైనవాడు పరలోకమందున్నాడనియు ఆయనకు పక్షపాతము లేదనియు ఎఱిగినవారై వారిని బెదరించుట మాని ఆ ప్రకారమే వారియెడల ప్రవర్తించుడి (ఎఫెసీ 6; 9)

## వివరము.

I. అందఱును అవశ్యముగా పనిచేయవలెను.—ప్రతి మనుష్యునికి ఏదో యొక పని నియమింపబడెను. మనకు అప్పగింపబడిన పనిని నమ్మకముగా చేయుట మన విధియై యున్నది. ప్రభువునకు చేసినట్టే (ఎఫెసీ 6: 7) ఆయన నామమున (1) మనము ప్రతి పనిని చేయవలెను. మనకు నప్పగింపబడిన పనిని నమ్మకముగా చేయుటయే దేవునికి అనుకూలమైన సేవయై యున్నది.

మనుష్యులు పనిచేయవలెనని దేవుడు ఆదినుండి యుద్దేశించెను.—'మీరు భూమిని...లోపఱచు కొనుడి' (ఆది 1: 28) అని దేవుడు మనుష్యుల కాజ్ఞాపించుట చూడగా వారు పనిచేయవలెననునది ఆయన యుద్దేశమని మనము తెలిసికొనగలము ఎందుకనగా పనిచేయకుండ భూమిని లోపఱచుకొనుటకు వీలు కాదు. ఆయన ఏదెనుతోటను ఏర్పరచిన తరువాత దానిని సేద్యపఱచుటకును, కాచుటకును వారిని దానిలోనుంచెను. (ఆది 2: 15) పాపములో పడక పూర్వము పనిచేయుట మనుష్యులకు పూర్ణసంతోషకరముగ నుండెను గాని, పాపములోపడిన పిమ్మట మనుష్యులు తమ ముఖముయొక్క చెమటను కార్చి ఆహారమును సంపాదించుకొనవలసివచ్చినందునను (ఆది 3: 19), మునుపటివలె భూమి తన సారము నియ్యక పోవుట (ఆది 4: 12) వలనను పని మనుష్యులకు ఒక తరహా సంకట మయ్యెను. అయినను పని మనుష్యుల కింక మేలుకరముగాను, సోమరులై యుండకుండుట కును మూలముగా నున్నది,

ఈ లోకవ్యవహారములు జరుగునట్లు పనిచేయుట అత్యవసరమై యున్నది.—దేవుడు భూసారము నిచ్చును గాని మనుష్యులు కష్టపడి తమ పొలములను దున్ని విత్తనములు విత్తి పంటలు కోయకుండినయెడల వారికి ఆహారము దొరకదు గదా! మనుష్యులకు సౌఖ్యము కలుగునట్లు కావలసిన పనిముట్లను, సామగ్రి వస్తువులను చేసికొనుటకై దేవుడు వారికి శక్తి నిచ్చెనుగాని మనుష్యులు ఆశక్తితో పనిచేసిననే తప్పలేని యెడల వారికి అవసరమైన ఆ వస్తువులు ఏ మాత్రము దొరకవు.

ప్రతివాడు తనకు అప్పగింపబడిన పనిని చేయవలెను లేని యెడల దేశమునకు క్షేమము కలుగ నేరదు. కాపులు కంసాలులు కమ్మరివాండ్లు వడ్రంగులు వర్తకులు బోధకులు అధికారులు సేవకులు కూలీలు మొదలగు వారిలో ప్రతివాడు తనకు నియమితమైన పనిని చెయుటద్వారా అందటి క్షేమమునకు అగత్యమయినవాటిని చేసినవాడగును. ఇట్లుండగా ప్రతివాడు తన పనిని నమ్మకముగాను, చక్కగాను చేయుట యెంతో అవసరమై యున్నది. (మత్త 25: 14 30).

II. పనిచేయుట ఘనకార్యమై యున్నది.—క్రీస్తును సేవించుటకు ఆయన పేరట మన మెంతటి హీనకార్యమును చేసినను దానిని నీచమైనదిగా నెంచకూడదు (యోహా 13: 12–17) మనము నాటినాటికి మనకు ఆయాసకరముగ నుండు పనులను చేయవలసిన వారమై యున్నాము. ఈవిధముగ తమ జీవిత కాలమంత కష్టపడుటయే అనేకుల పాలిటి గతియైయున్నది అయితే దేవుడు మనకు మన పనిని నియమించెనని తెలిసికొని, అది హీనమైనదో ఘనమైనదో యను సంగతిని విచారింపక మనము దానిని నమ్మకముగా చేయుచున్నామో లేదో యనుసంగతిని మాత్రము విచారించవలయును. దేవునియందు భయభక్తులు కలిగి యుండిన యెడల (2) పాకీపని చేయువారు సహా ఆయనకు అనుకూలమైనపనిని చేయగలరని తెలిసికొనవలెను. స్కాట్లాండు దేశములో నుండు చర్మకారుడు 'నేను దేవుని కృపనుబట్టి చర్మకారుడనై చెప్పులను కుట్టుచున్నాను' అనెను అతడు తన పనిని తానెంచవలసిన రీతిగా నెంచెను అనగా ఘనమైనదిగా నెంచెను (3) ఏ పని హీనమైనదిగా నెంచబడునో అది గొప్ప పనులని యెంచబడు వాటికంటె అనేక విషయములలో మిక్కిలి అవసరమైనదై యుండును.

మనము ఎట్టువంటి పనిని చేయవలెను?—తప్పుకాని ఏ పని చేసినను మంచిదే; అయినను మనము మన దేహబలమునుబట్టియు, మనోశక్తినిబట్టియు ఏ పనికి తగి యుందుమో ఆ పనిని ఏర్పరచుకొని దానిని చేసినయెడల మేలు. అలాగు చేసినయెడల దేవుడు మన కనుగ్రహించినశక్తి చక్కగా నుపయోగించుకొనిన వారమై మన పనివలన నితరులకు మరెక్కువ మేలును చేసిన వార మగుదుము. అయితే అట్టిపని మనకు దొరకక పోయినయెడల మనకు దొరుకు ఏ యితర పనులనైనను సంతోషముతోను చుఱుకుదనముతోను చక్కగాను చేయవలయును.

ఫలాని పని చేయుటవలన జీవనము జరుగునా? లేదా? యను సంగతిని మాత్రమే మనుష్యులు సాధారణముగా విచారింతురు. అలాగు విచారించుట ఎంత యవసరమైనదైనను అది ముఖ్యమైనదికాదు. అయినను క్రైస్తవుడనైన నేను ఆ పనిని

చేయుచుండగా నా క్రైస్తవ ధర్మ విధులను గైకొనగలనా ? గైకొనలేనా ? యని ముఖ్యముగా విచారింపవలెను. కావున క్రైస్తవులమైన మనము ఏ యుద్యోగములో నున్నను మనము క్రైస్తవ ధర్మ విధులను గైకొనుటకు ఆ యుద్యోగము మన కాటంకముగ నుండిన యెడల మనము దానిని విడిచిపెట్టి మఱి యొక పనిని పూను కొనవలెను.

మనము మన పనులను చేయుటయందే దేవుని సేవింపవలెను.—దేవుని సేవింపవలెనని కోరినయెడల ఈ లోక వ్యవహారములను విడిచి సన్యాసుల ము కావలెనను తప్పు అభిప్రాయ మొకటి ఈ యిండియాజనులలో ప్రబలియున్నది. పూర్వము యూరోపు దేశస్థులలో కూడ అట్టి అభిప్రాయ ముండెను గాని అది తప్పు అని యిపు డచటివారు తెలిసికొనియున్నారు. పిల్లలు విధేయత కలిగియుండుట వల్లను (ఎఫె. 6: 1-3), విద్యార్థులు శ్రద్ధతో చదువుకొనుటవల్లను, సేవకులు నమ్మక ముతో పనిచేయుటవల్లను (ఎఫె. 6: 6), యజమానులు తమ సేవకులను దయతో చూచుటవల్లను (ఎఫె 6: 9), ప్రతివాడు తన యుద్యోగ ధర్మములను చక్కగాను, కపటము లేకయు చేయుటవలన మనము అన్నిటిలో దేవునికి అనుకూలమైన సేవ చేయ గలము (1. కొరి 7: 20). ఈ విధముగా బోధకులు మాత్రముగాక ప్రతి క్రైస్త వుడు కూడ తన పనిని చేయుటయందే దేవునిని సేవించుచున్నాడు. సభకు సంబం ధించిన పనులను తాను చేయగలిగినంతమట్టుకు చేయుటకై ప్రతి సభికుడును బద్ధుడై యున్నాడు గాని ఏలాగునైనను మనము మన యనుదినపు పనులలో నమ్మకము నగ పఱచుచు, క్రీస్తు మాదిరిని అనుసరించి, మన నడతవలన క్రీస్తును ఆయన సువార్త కును సాక్షులమై యుండవలయును (1. కొరి 7: 24). ఈ విధముగ ప్రతివాడు మనుష్యుల యెదుట వెలుగును ప్రకాశింపజేసి దేవుని మహిమపఱచవలెను (4).

III. మనము శ్రద్ధగలవారమును, నమ్మకముగల వారమునై యుండి పనిచేయవలెను.

(1) మనము శ్రద్ధగలవారమై యుండవలెను.—కాని, సోమరుల మైయుండకూడదు. ఈ లోకములో ప్రతివాడును ఏదోయొక పనిని చేయవలయు ను మఱియు ఆ పనిని సంతోషముతో చేయవలెను. ఈలాగు చేయుట మీద క్రైస్తవ విధాయకమై యున్నది. (రోమా 12: 11). సోమరితనము పాపమై యున్నది (2 థెస్స. 3: 11, 12). శ్రద్ధగలిగియుండుట మన విధియై యున్నది. అదియును గాక మనము మంచి స్థితిని పొందకోరినయెడల అది మనకు అత్యవసరమై యున్నది.

మన కష్టము కొలది ఫలము దొరకును (సామె. 24: 30-34). యథార్థముగా పని చేయుటవలన గాక, మఱి దేనివలనను మనము కోరిన మంచి స్థితిని పొందజాలము.

సోమరితనము గొప్ప కీడులకు మూలకారణమైన పాపమై యున్నది.—సోమరితనమువలన మనము మేలు చేయుటయం దుపయోగింపవలసిన కాలమును శక్తులను వృథాగా పోగొట్టుకొందుము. స్థితిగలవారైనను పని చేయకుండ ఊరకయే యుండక, దేవుడు కోరువాటిని చేయుటయందు తమ ధనము నుపయోగించి పని చేయవలెను. ఏ పనియు ముట్టుకొనకయే తమకు సౌఖ్యము కలుగులాగున జీవించు ధనికులకు దేవుని శిక్ష కలుగును. ఎంతటి ధనికుడైనను పనిచేయకుండ నుండ కూడదు. ఒకవేళ అట్టి ధనికుడు తన పోషణ నిమిత్తము పనిచేయ నవసరము లేక యుండినయెడల అతడు కష్టించి పనిచేసి యితరుల భారములను భరించుచు వారికి సహాయపడవలెను.

సోమరులు చీమలయొద్దకు వెళ్ళి శ్రద్ధను నేర్చుకొనవలెనని బైబిలు హెచ్చరిక చేయుచున్నది (సామె 6: 6-11). మనము మన దినాహారమును సంపాదించుకొనవల సిన వారమై యున్నాము. సోమరి దానిని సంపాదించుకొనక ఇతరులు సంపాదిం చిన దాని ననుభవించును. అది ధర్మము కాదు. పనిచేయనొల్లనివారు ఆహార మును తినకూడదు (ప్ర॥ వా॥). పని చేయక సోమరులై యుండువారు తప్పక దరిద్రు లగుదురు (సామె. 20: 4). మఱియు వారు తమ సోమరితనమువలన సాతాను శోధనలకు ఎడమిత్తురు. ఎవరు తమ కాలమును మంచి పనులు చేయుటయందు గడుపుకొనరో అట్టివారికి సాతాను చెడ్డపనులను చూపి, వాటిని వారిచేత చేయించును సోమరితనము అనేక నేరములకు మూలకారణమై యున్నది.

మనము సోమరులము కాక, శ్రద్ధగలిగి యుండవలెను. మన కాలము నొక గొప్ప ధనమునుగా నెంచి దానిని వృథాగా పోగొట్టుకొనక చక్కగా నుపయోగింప వలెను (5). పనిచేయుచుండగా మన మనస్సు నిటునటు చెదరిపోనియ్యక మన యా వచ్ఛక్తితో ఆ పని చేయవలయును. ఎందుకనిన మనము పోగొట్టుకొనిన కాలము మఱల మనకు దొరకదు. కొద్దిపాటి యీ మన జీవితకాలములో మనకు విధింప బడిన పనిని చేయగోరినయెడల శ్రద్ధగలిగియుండుట అత్యవసరమై యున్నది. చేయు టకు నీ చేతికి వచ్చిన దే పనియైనను నీ శక్తి లోపము లేకుండ చేయుము (ప్రస. 9: 10). ఎవరును పనిచేయలేని రాత్రి రాక మునుపే మనము పనిచేయవలెను (యోహాను 9: 4).

మనము నమ్మకముగలవారమై మన పని చేయవలెను.—మనము చేయు సమస్తమును దేవుని మహిమకై చేయవలెను (1. కొరి. 10; 31). కావున మన శక్తికొలది దానిని బాగుగా చేయవలెను. తనపై యధికారులు తన పనిని చూడక పోయినను, వారు దానిని చూచునప్పుడు చేయునంత జాగ్రతతో నిజ క్రైస్తవుడు తన పనులను చేయును. పైవారు చూడకపోయినను దేవుడు చూచునని యెఱిగి అతడాలాగు చేయును. కంటికి కనబడుటకే కాక క్రీస్తు సేవకులమని యెఱిగి దేవుని చిత్తమును మనఃపూర్వకముగా చేయుచు ప్రతిది నమ్మకముగా చేయవలెను (5). దొంగపనిచేసి, దానికై జీతమును పుచ్చుకొనుట గొప్ప మోసమును అన్యాయమునై యున్నది. ఇవ్విధముగా మోసము చేయువారు తమ సరకులను కొనువారి సొమ్మును అన్యాయముగా నపహరించు దొంగ కోమటులవంటివారే.

కొన్ని కొన్ని పనులను చూడగా వాటిని అజాగ్రతగా చేయుటవలన గొప్ప ప్రాణాపాయములు కూడ కలుగును. రైలుబండ్లను నడిపించువారు మెళకువగా నుండవలసిన వేళలో నిద్రపోవుటవలన ఎంతోమందికి ప్రాణాపాయము కలుగుటకద్దు. ఇండ్లను కట్టువారు దొంగపని చేయుటవలన అవి కూలిపడి ఎంతోమంది ప్రాణములు నష్టమగుటయు కలదు. ఈ లోకములో కలుగు విపత్తులను చూడగా అనేక పర్యాయములు అవి ఆయా పనివారల మోసమువలనను అజాగ్రతవలనను కలిగినవని యొప్పుకొనవలసియున్నది.

మనము గొప్పపనులలో మాత్రము గాక స్వల్పమైన పనులలోను నమ్మకముగా నుండవలెను. కొద్దివాటిలో అపనమ్మకముగా నుండువాడు గొప్ప వాటిలో కూడ అపనమ్మకముగా నుండును (లూకా 16: 10). మనము మన మాట తప్పక మన పనులను తగినసమయములో నేచేసి (రోమా 12: 11), ఇతరులకు నిబ్బంది కలుగకుండునట్లు మన శక్తికొలది శ్రద్ధ వహించుకొనవలెను. ఏపనిని గూర్చియైనను ఇతరులకు మాట నియ్యకపూర్వము బాగుగా ఆలోచనచేసి మాట నియ్యవలెను. మనము నెఱవేర్పలేని పనిగూర్చి ఏమాత్రమును మాట నియ్యకూడదు. మఱియు ఒక పని నెఱవేర్చెదనని వాగ్దత్తము చేసినను, దాని గైకొను నుద్దేశము మనస్సులో లేకయుండుట బొత్తుగా విపరీతమై యున్నది.

IV. మనయాధీనమున పనిచేయువారిని దయతో చూడవలెను.—మన పనివారు మనవలెనే దేవుని బిడ్డలైన మన సహోదరులని మనము మఱవ కూడదు (7) మనము మనవలెనే వారినికూడ ప్రేమించవలెను (మత్త. 22: 39). వారిని మన ఆస్తిగానుండు పశువులనువలె నెంచక, మనమే పనివారమైన యెడల మన

యజమానులు మనలనెట్లు చూడవలెనని మనము కోరుదుమో, అలాగు దయతోను ప్రేమతోను వాటినికూడ జూడవలెను (మత్త. 7: 12). పనివారు దొంగపని చేయుట యెంత అధర్మమో యజమానులు తగిన జీత మియ్యక కూలివారిని బాధపఱచుటయు అంత యధర్మమయి యున్నది. యజమానులును, పనివారును ఎల్లప్పుడు ఒకరి యెడల నొకరు క్రైస్తవ ప్రేమను కనబఱచినయెడల ఈలోకములో నుండు గొప్ప అన్యాయమును తొందరయును చాలమట్టుకు తీరును.

---

## X 38. వివిధములగు సంతోషములను గూర్చిన బోధ.

ఎల్లప్పుడును ప్రభువునందు ఆనందించుడి, మఱల చెప్పుదును, ఆనందించుడి, ఫిలిప్పీ 4: 4.

### భాగములు.

I. క్రైస్తవులు సంతోషించుట తగినదై యున్నది.

II. క్రైస్తవులకు తగని కొన్నివిధములైన వేడుకలు.

(1) జూదమాడుట, (2) భోగముఆటలు: (3) నాటకములు.

III. క్రైస్తవులకు తగిన కొన్నివిధములైన ఆనంద కరమగు విషయములు.

(1) సంగీతము, (2) చిత్తరువు పనులు, (3) దేవుని సృష్టికార్యములు, (4) సంభాషణలు, (5) పుస్తకములను చదువుట.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| క్రైస్తవులు సంతోషించుట న్యాయము. | 1. పేతు. 1. |
| లోకము ఇయ్యలేని సంతోషము. | యోహా. 16. |
| ప్రభువునందు సంతోషించుడి. | కీర్తన. 32. |
| దేహమును బిగబట్టుకొనవలెను. | 1. కొరి. 9: 24-27. |
| సంగీతము మోక్ష సుఖములలో నొకటియై యున్నది. | ప్రక. 14: 1-5. |
| సృష్టి సౌందర్యముగలది | కీర్తన. 19. |
| పవిత్ర సంతోషములు. | ఫిలి 4: 1-9. |

## వేదవాక్యములు.

I. 1. నీతిమంతులారా, యెహోవానుబట్టి సంతోషించి యుల్లసించుడి, యథార్థ హృదయులారా, మీరందఱు ఆనందగానము చేయుడి (కీర్తన 32: 11).

2. దేవుడు సృష్టించిన ప్రతివస్తువు మంచిది కృతజ్ఞతాస్తుతులను చెల్లించి పుచ్చుకొనిన యెడల నేదియు నిషేధింపతగినదికాదు (1. తిమొ 4: 4).

II. 3. ప్రతివిధమైన కీడునకు దూరముగా నుండుడి (1. థెస్స. 5: 22).

III 4. ఎవడైనను తన నోటికి కళ్లెము పెట్టుకొనక తన హృదయమును మోస పఱచుకొనుచుభక్తిగలవాడనని అనుకొనినపక్షమున వాని భక్తి వ్యర్థమే (యాకో. 1: 26).

5. నేను వచ్చు పర్యంతము చదివి వినిపించుటయందును హెచ్చరించుట యందును బోధించుటయందును జాగ్రతగానుండుము (1. తిమొ (4: 13.)

## వివరము.

I. క్రైస్తవులు సంతోషించుట తగినదై యున్నది,—సుఖ ముఖులముగ నుండనియెడల భక్తిగలవారము కానేఱ మనుకొనరాదు. భక్తిపరులమైన యెడల సంతోషభరితులమై యుండవలెను. అయితే మన సంతోషములు పవిత్ర ములైనవై యుండవలెను. మఱియు మనము వాటియందు మితము మీఱక నుండి, మన పనులను చేయుట ముఖ్యమైనదని తెలిసికొని, అట్టి సంతోష విషయముల నను భవించుట మన పనికి అభ్యంతరముగ నున్నయెడల వాటిని అనుసరింప కూడదు (మత్త. 6: 33). సుఖపడుట కానుగాని మనము దేవుని యెడలను మనుష్యుల యెడలను చేయవలసిన వాటిని చేయుటయే మన మీ లోకములో నుండుటయొక్క ముఖ్యో ద్దేశమై యున్నది.

క్రైస్తవమతము సంతోషకరమైనది.— అది సువార్త అనగా రక్షణనుగూర్చిన శుభవర్తమానమై యున్నది. క్రైస్తవ పండుగలలో క్రిస్మసు ఈస్టరు అను రెండు ముఖ్యమైన పండుగలు వారికి మిక్కిలి సంతోషకరములైన విద్యై యున్నవి. క్రిస్మసు పండుగదినమున మనకొఱకు క్రీస్తు పుట్టినందునను, ఈస్టరు పండుగదినమున ఆయన మరణమునుండి విజయుడై లేచినందువలనను మన మానందించుచున్నారము. క్రీస్తును విశ్వసించుటవలన మనకు సంతుష్టి కలుగక తప్ప దు (1. పేతు. 1: 8, 9). క్రీస్తు ద్వారా మనము దేవునితో నైక్యపఱచబడి,

ఈలోకములో మనము దేవుని దయయును, పరలోకములో నిత్య జీవమును కలుగునని రూఢిగా తెలిసికొనుచున్నాము ఈ మనసంతోషమును ఎవరును తీసివేయ జాలరు (యోహా. 16: 22). మనము మన విశ్వాసమువలన నీతిమంతులముగా తీర్చబడి సమాధాన మొందెదము (రోమా. 5: 1). దీనికంటె గొప్పసంతోషము మరి యొకటి కలదా! ఇందుచేతనే మనము ప్రభువునందు సంతోషింపవలసినవారమై యున్నాము (కీర్తన. 32: 1) మనము ఒప్పుకొనిన మతమునుబట్టి దుఃఖముఖులము కాక సంతోష భరితులమై మనచుట్టు నున్న వారినికూడ సంతోషింపజేయ వలయును.

ఈ లోక సంబంధమైన మేలులనుబట్టి కూడ మనము సంతోషింపవలెను.—మనము ఆత్మీయ మేలుల విషయమై ముఖ్యముగా సంతోషింప వలసి యుండినను, దేవుడు మనకు విస్తారముగా నిచ్చుచున్న ఈ లౌకిక దీవెనల విషయము కూడ సంతోషింప నగును. మనము వాటిని అనుభవింపవలసిన విధముగా అనుభవించుటవలన మనకు సంతోషము కలుగవలెనని దేవు డుద్దేశించి వాటిని సృజించెను. మన మీ లోకములోని పవిత్రభోగములలో దేవుని చిత్త ప్రకారము పాలుపుచ్చుకొని వాటిని అనుభవించుట మంచిది (2). సంతోషమునకు ఆస్పదము లయిన వాటిని సృష్టించుట మాత్రము గాక వాటియందు సంతోషించుటకు తగిన యింద్రియ బుద్ధులను కూడ దేవుడు మనకు ననుగ్రహించెను. మంచిరుచులుగల వాటిని భుజించుటవలనను, సువాసనగలవాటిని వాసనచూచుటవలనను, రమణీయ ములగు వాటిని దృష్టించుటవలనను, సునాద శబ్దములను వినుటవలనను, ఇంద్రియము లన్నిటివలనను మనకు సంతోషము కలుగును. అయితే మన కానందమును కలుగ జేయు వీటిని మనము దుర్వినియోగపఱచి పాపము చేయుచున్నామను ట వాస్తవమే; గనుక మన మా విధముగ వాటిని దుర్వినియోగపఱచి అమితముగా నుపయోగించక (1. కొరి 7: 3) మితముగా నుపయోగించుట తగినదైయున్నది. మనముసంతోష భరితులమై యుండవలెనని దేవుడు కోరుచున్నాడు. ఇట్టి పవిత్ర సంతోషముల ననుభవించుట ద్వారా మన కష్టములను భారములను తేలికపఱచుకొనవలయు ననునది దేవుని యుద్దేశమై యున్నది. అయితే యీ సంతోష విషయములందు మన మనుభ వింప తగనటువంటియు తగినటువంటియు వాటిలో సహా మనము ఎన్నడైన అమితముగా నుపయోగించకుండునట్లు జాగ్రతగా చూచుకొనవలెను (1. కొరి. 9: 27).

కొన్ని విధములగు సంతోష విషయములు మన దేహబలమునకును మనో బలమునకును అవసరమై యున్నవి. అట్టివి పెద్దలకంటె పిల్లలకు మరీ యవసరము. అయితే అవి మన ముఖ్యమైన పనులనుండి మనలకు విశ్రాంతి నిచ్చునవిగ నుండవలెనే.

కాని మన కాల మంత వాటిలోనే గడపుగొనరాదు. ఈలాగు తమ కాలమంత గడపుకొనువారి కవి విశ్రాంతి నిచ్చునవిగ నుండక, వారి దేహశక్తిని మనోశక్తిని చెఱుపునవియై యున్నవి. ఈలాగున చేయుట పాపమై యున్నది. ఇట్టి సంతోష విషయములను మాత్రమే యనుభవించుటకు మనము జీవించకూడదు అలాగు చేసిన యెడల అవి మనపాలిటి దేవతలుగ నుండును; అదియు గాక మనము మన పనులను చేయ లేము.

II. క్రైస్తవులకు తగని కొన్ని వేడుకలు:— మన పనులనుండి అలసట తీర్చుకొనుటకై ఆయా యాటలను ఆడుట తగును గాని మన మెల్లప్పుడును వాటిని ఆడుకొనుచు మనకాలమును వృథాగా పోగొట్టుకొనుట తప్పు (ఎఫె. 5:16).

1. జూదము.— ఇదియును దీనికి సంబంధమైన యాటలను సంతోషార్థమాడుట తప్పు కాదుగాని పందెము పెట్టి ఆడుట తప్పయి యున్నది. దీనికి మినహాయింపు లేవియు లేవు: జూదగాండ్రు ఆ యాటలో ఇతరుల సొమ్మునకు ప్రతిగా నేమియు నియ్యకయే దాని నపహరింతురు గనుక దొంగిలకూడదు అను ఏడవ యాజ్ఞ ఈ యాటను నిషేధించును. లాటరి యాట నాడుట ఏ విధముగనైనను తప్పయి యున్నది. కొన్ని చోట్ల క్రైస్తవులు సంఘపు కర్చులకొఱకై ఒక తరహా లాటరి యాటలు ఆడుటకద్దు. వాటిని రేమాత్రమును నాడకూడదు. సంఘము లోకమునకు నీతిమార్గమును చూపించవలెను (మత్త. 5: 13; పేతు.. 2: 12). గనుక ఇట్టి మోసములలో నెంత మాత్రము పాలు పొందకూడదు.

2. భోగము ఆటలు.— క్రైస్తవుల కిట్టి యాటలు బొత్తుగా నిషేధములై యుండవలెను. ఇవియును దీనికి సంబంధమైన యాటలును పవిత్రమునైనవి కావు. అట్టి యాటలకు సంబంధించినవారు దుర్వ్యాపారము చేయువారై యున్నారు గనుక ఆ యాటలాడు చోటులకు మన మేమాత్రమును వెళ్ళకూడదు.

3. భాగవతములు, నాటకములు.— నాటకములలో మంచివి కొన్ని యున్నను, వాటిలో ననేకములు కామమునకు సంబంధించినవై యున్నవి. ఏ నాటకములును పాపమును చేయుటకు మన ఆశలను రేపునో, అట్టివి చెడ్డవియై యున్నవి. వాటిని చూచుటకు మన మే మాత్రమును వెళ్ళకూడదు. అయితే మంచినాటకములను చూచుటకు వెళ్ళదగునా? అను దాని విషయము కూడ చాల సందేహము కలదు. ఎందుకనగా అట్టినాటకములలో లేక ఆటలలో నిది మంచిది

అది చెడ్డది యని చెప్పగలుగు బుద్ధి కొందఱికి నున్నను, అట్టి వివేచనాబుద్ధి యెక్కువ మందికి లేదు. మంచి చెడుగులు వివేచించు బుద్ధిగల మనము కొన్ని యాటలకు వెళ్లుటను చూచిన అవివేకులు మన మాదిరినిబట్టి అన్నివిధములగు నాటకములను చూడదగినవే యనుకొని చెడ్డవాటిని కూడ చూడ వెళ్లుదురు. కావున ఇతరుల మేలును విచారించి, క్రైస్తవులు నాటకములను బొత్తిగా త్యజించిన యెడల మేలు (3)

## III. క్రైస్తవులకు తగిన కొన్ని ఆనందకరమైన విషయములు.

1. సంగీతము — ఎవరికి సంగీతము మనోహరముగ నుండునో వారు దాని వలన నధిక సంతోషమును పొందగలరు. పరిశుద్ధ విషయములను గూర్చిన సంగీతము దుఃఖమును పోగొట్టి, మనస్సులో పవిత్రమైన తలంపులను రేపి మంచివాటి ననుసరించుటకు మనలను ప్రోత్సాహపరచగలదు. మనలోని దుష్టగుణములకు ప్రతిగా యోగ్యమైన తలంపులను పుట్టించుటకు మంచి సంగీతము సాధనముగా నుండగలదు. మనల నిట్లు మార్చుటకు దైవవాక్యము మొదటి సాధనమనియు, సంగీతము రెండవ సాధనమనియు, శోధనలను చెడ్డ కోరికలను జయించి వాటిని విడిచిపెట్టుటకు గొప్ప సాధనములును దైవ వరములునై యున్నవనియు, అందువలననే సంగీతమంటే సాతానుకు యిష్టములేదనియు లూధరు చెప్పెను. క్షేమకరముగ కాలక్షేపము చేయుటకిది అన్నిటిలో మంచి మార్గమై యున్నది: ఎవరు సంగీతమును నేర్చుకొనగలిగియుందురో వారు దానిని నేర్చుకొనుట మంచిది. ఆలాగు చేసినయెడల వారు తమకు మాత్రము గాక యితరులకును దానివలన సంతోషము కలుగచేయగలరు. అయితే యీ దేశములో వసేవలు పాడునట్లుగా కామమును రేపు పాటల నెన్నడును పాడకూడదు.

బహిరంగ యారాధనలలో దేవుని నారాధించుటయందు సంగీతము గొప్ప సహాయముగ నుండును. ఇవ్విధముగా అది భక్తికి సహాయకరమని యెంచ దగును. మనము మన భక్తితోకూడిన స్తుతులను కోరికెలను పాటల మూలముగా కనబఱచిన యెడల అట్టి ఆరాధనయందు అందఱికిని గొప్ప ఆనందము కలుగును. మోక్షసౌఖ్యములలో సహా సంగీతమువలన యానంద మొకటియై యున్నట్లు వ్రాయబడి యున్నది (ప్రక. 14: 2, 4).

చిత్రరుపులు.— చక్కని యాలయములను కట్టుటలోను, వాటిని అలంకరించుటలోను నివి సహాయకరములై యుండి మనలను సంతోషపఱచగలవు. అయినను అవి ఆలయములో ముఖ్యమైనవి కావని తెలిసికొనవలెను. అందులో ముఖ్యమయినది దేవుని వాక్యమును ప్రకటించుటయే. అయితే ఇట్టి చిత్రరుపులుకూ

మనకు పవిత్రమైన యానందమును కలుగజేయుటకు సాధనములై యున్నవి కావున వాటిని ఉపయోగించదగును.

**దేవుని సృష్టి కార్యములు.**—దయగల దేవుడు మన చుట్టునుంచిన లెక్కలేని సృష్టికార్యముల చక్కదనమును ధ్యానించుకొనుటవలన కలుగుసంతోషము కంటె యెక్కువ మనోహరమైనట్టియు పవిత్రమైనట్టియు సంతోషము లేనే లేదు. మన మా చక్కదనమును వివేచించ గలుగున తగిన మనోశక్తిని పెంచుకొని దానియందానందింప నభ్యాసపడవలెను. మన మానందించుటకే దేవు డీలోకమును అంత చక్కగా నలంకరించెను. నీలివర్ణపు ఆకాశము, దాని కప్పుకొని దట్టమైన బొచ్చు వలె నుండు మేఘములు, అస్తమించు సూర్యుని కాంతి, గోపురములవంటి పర్వత శిఖరములు, మెట్టపల్లములు, వనములు, పైరులు, నీటి ప్రవాహములు, తోటలు, వృక్షములు, పుష్పములు, పచ్చిక బయిళ్లు మొదలగునవి అన్నియు నెంత యందమైనవి! మనల నానందింపజేయుటకై కృపాసంపన్నుడగు దేవుడు వాటి నన్నిటిని ఆలాగున చక్కపరచెను.

**సంభాషణలు.**—స్నేహితులతో సంభాషించుట ఎంతసాధారణమైనదైనను సంతోషాస్పదములగు వాటిలో నిది యొక ముఖ్యమైనది యని యెంచవలెను. సంభాషణ మన యలసటను తీర్చి నూతనమైన యాసక్తితో మన పని చేయుటకై మనలను రేపగలదు. సంభాషణల ద్వారా మనము గడచిపోయిన విషయములను జ్ఞప్తి చేసికొని వాటిద్వారా కలుగు సంతోషమును మరల ననుభవింపగలము. మన సంతోషముల నితరులకు చెప్పుటవలన అవి హెచ్చగును. ఈ విధముగ మనము ఇతరుల అనుభవములలో పాలిభాగస్థులము కాగలము. సంభాషణచేయు శక్తినికూడ మనము పెంచుకొనవలెను. ఎట్లు మాటలాడవలెనో దానిని మాత్రము గాక ఎట్లు వినవలెనో దానినికూడ నేర్చికొనవలెను. తలంచకుండ మన మెన్నడును పలుకకూడదు (మత్త. 12: 36). మరియు మనము స్నేహితులయొద్ద నుంటుండగా నేమియు పలుకక మూతి ముడుచుకొని యుండకూడదు. చాడీలను, తగని సరసోక్తులను, బూతులను ఎన్నడును వాడకూడదు. తగిన సరసపు మాటలను పలుకవచ్చును గాని తగనివి పలుకకుండ చూచుకొనవలెను. మరియు మన సరసమువలన నితరులను నొప్పింపకుండ జాగ్రతపడవలెను.

**మంచి పుస్తకములను చదువుట.**—మంచి పుస్తకములను చదువుటవలనకూడ మంచి సంతోషము కలుగగలదు. అదియుగాక వాటివలన మేలుకలుగు నిమిత్తము మనము మంచి పుస్తకములను సంపాదించుకొని చదువవలెను (5).

అయితే ఎన్ని పుస్తకములు చదివినను మన జీవితకాలములోను మరణ సమయమందును బైబిలు తప్ప మన కాదరణ కలుగజేయునది వేఱొకటి లేదని తెలిసికొని దానినే ముఖ్యముగా చదువవలెను. మఱియు మన మితర గ్రంథముల నెన్నిటిని చదివినను బైబిలుకు అనుగుణ్యముగా నుండువాటిని సాధారణముగా చదువవలెను (2. పేతు. 1: 19). మతపరీక్ష చేయుటకుగాని మఱి యేమంచి యుద్దేశముతోనైనగాని యితర గ్రంథములను చదివినయెడల సమస్తమును పరీక్షించి యుక్తమైనదానిని మాత్రమే చేపట్టుకొనవలెను. మంచి నీతులను బోధించు కల్పనాకథలను చదువుటకూడ తగునుగాని అపవిత్రమైన గ్రంథములను, ధర్మముదప్పిన సంగతులను బోధించు గ్రంథములను చదువరాదు.

---

## 39. సుగుణములను పెంచుకొనుటను గూర్చినబోధ.

క్రీస్తుయేసుకు కలిగిన యీమనస్సు మీరును కలిగియుండుడి.

ఫిలిప్పీ 2: 5.

### భాగములు.

I. సుగుణములను పెంచుకొనుట మనకు అత్యావసరము.

II. సుగుణములను పెంచుకొనుట.

(1) క్రీస్తు గుణములు మనకు మాదిరియై యున్నవి.

(2) దేవుని యందలి భయభక్తులే దానికి మూలమైయున్నవి.

(3) మన శరీరేచ్ఛలను త్యజింపవలెను.

(4) మంచి అభ్యాసముల నభ్యసింప నేర్చుకొనవలెను.

(5) మన మంచి మనసాక్ష్యమునకు లోబడవలెను.

(6) సద్గుణములలో నెంతగా వృద్ధినొందినను ఇక మనము పూర్ణులమని యెన్నడు ననుకొనరాదు.

(7) దుర్మార్గుల సహవాసమును విడిచి యోగ్యులతో సహవాసము చేయవలెను.

(8) చెడు గ్రంథములను చదవక మంచివాటిని చదువవలెను.

## అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| యోగ్యమైన నడత. | కీర్తన. 15. |
| దేవుడు కోరు సుగుణములు | మీకా. 6: 8. |
| క్రీస్తు మనకు మాదిరియై యున్నాడు. | ఫిలి. 2: 1-11. |
| సద్గుణము తప్పమతి యేదియు నిలువనేరదు. | మత్త. 7: 15-27. |
| మన సుగుణములు వృద్ధినొందవలెను. | 2 పేతు. 2: 1-10. |
| పరిసయ్యుడు, సుంకరి. | లూకా 18: 9-14. |
| దుష్టులతో సహవాసము జేయకూడదు. | కీర్తన. 1. |

## వేదవాక్యములు.

I. 1. గొప్ప యైశ్వర్యముకంటె మంచి పేరును, వెండిబంగారములకంటె దయయు కోరతగినవి (సామె. 22: 1).

II. 2. నామాటలు విని వాటి చొప్పున చేయని ప్రతివాడు ఇసుకమీద తన యిల్లు కట్టుకొనిన బుద్ధిహీనుని పోలియుండును. వాన కురిసెను, వరదలు వచ్చెను, గాలివిసిరి ఆ ఇంటిమీద కొట్టెను అప్పుడది నేలబడెను; దాని పాటు గొప్పదని చెప్పెను (మత్త. 7: 26, 27).

3. దేవునికి లోబడియుండుడి, సాతానును ఎదిరించుడి, అప్పుడు వాడు మీ యొద్దనుండి పారిపోవును (యాకో. 4: 7).

4. అందుకు పేతురును అపొస్తలులును—మనుష్యులకు కాదు దేవునికే మేము లోబడవలెను గదా అని చెప్పిరి. (కార్య. 5: 29).

5. ఇదివరకే నేను గెలిచితినని యైనను, ఇదివరకే సంపూర్ణసిద్ధి పొందితి ననియైనను నేననుకొనుట లేదు గాని, నేను దేని నిమిత్తము క్రీస్తు యేసుచేత పట్టబడితినో దాని పట్టుకొనవలెనని పరుగెత్తుచున్నాను (ఫిలిప్పి 3: 12).

6. మోసపోకుడి దుష్ట సాంగత్యములు మంచి నడవడిని చెరుపును (1 కొరి. 15: 33).

## వివరము.

I. సుగుణములను పెంచుకొనుట మనకు అత్యావసరము:—మనలో నెట్టి గుణము లుండునో మనము నట్టి వారమై యుందుము. మన అభ్యాసములు, యోచనలు, ఉద్దేశములు, మన మనుసరింప నిశ్చయించుకొనిన నీతిచట్టములు, మన పుణ్య పాపములు, ఆయా విషయములనుగూర్చిన మన అభిప్రాయము, మనము

అట్టి పనులను చేయు విధమును జూడగా మన మెటువంటి వారమై యున్నామో తేటగా కనబడును. మనము తలంచు తలంపులవల్లను, చేయు క్రియలవల్లను మనము మంచి వారముగా గాని, చెడ్డవారముగా గాని యగుదుము. మనము స్థిరబుద్ధి గలిగిన యోగ్యులమగుట బంగారమును సంపాదించు కొనుటకంటె మేలు, చంచల బుద్ధి గల దుష్టుల మగుట మనకు నాశము.

ఇతరులు మన గుణములను చూచి మనము మంచివారమనిగాని చెడ్డవారమని గాని పేరు పెట్టుదురు, ఇది మనకు కీర్తిగాగాని అపకీర్తిగాగాని యుండును. "గొప్పయైశ్వర్యముకంటె మంచి పేరు కోరతగినది,, (1). మనకు మంచి పేరు కలిగిన యెడల మనల నెఱిగినవారు మనలను ఘనపఱచెదరు. చెడ్డ పేరు కలిగిన యెడల వారు మనలను తృణీకరింతురు. అందువలన మనకు గొప్ప వేదన కలుగును. మంచి పేరును దక్కించు కొనుటకు మనము జాగ్రత్త పడవలెను. అయితే మనము కపట వేషముతో నిట్టిపేరును సంపాదించుకొన ప్రయత్నింపక, దానికి తగినవార మగునట్లు యథార్థవంతులమై జీవింపవలెను.

II. సుగుణములను పెంచుకొనుటకు.

1 క్రీస్తుగుణములు మనకు మాదిరియై యున్నవి.—ఆయన సర్వ సద్గుణముల సంపూర్ణుడైయున్నాడు. మన భక్తిమూలముగ మనలో పుట్టవలసిన ప్రతి సద్గుణమును ఆయనలోనే లోపము లేకుండకనబడును. ఆయనలో ప్రేమ, వినయము, కృతజ్ఞత, విశ్వాసము, సంతోషము, ఓరిమి, విధేయత, సమాధానము, శాంతము, దయ, ధైర్యము మొదలగు శ్రేష్ఠగుణము లన్నియు పూర్ణముగా నున్నవి. ఆయనకు గలిగిన యీ మనస్సు మనమును కలిగి యుండవలెను (ప్రధాన వాక్యము).

2. దేవునియందు భయభక్తులు కలిగియుండుటయే సుగుణములను పెంచుకొనుటకు మూలము.—దేవునికి లోబడియుండుటకు మనము బద్ధులమని యెఱిగి యుండుటయే సత్ప్రవర్తనకు ఆధారమై యున్నది. దేవుడు తన్నాశ్రయించుకొనువారికి అనుగ్రహించు శక్తివలననే గాని స్వంత శక్తివలన నెవరును సద్గుణములను పెంచుకొనలేరు. దేవునియందు భయభక్తులు లేనివానియోగ్యత ఇసుకమీద కట్టబడిన యింటి యోగ్యత వంటిదే శోధనలను గాలివానలు ఆ యింటిమీద కొట్టినపుడది నిలువజాలక నేల గూలును (2).

3. సుగుణములను పెంచుకొనవలెనని కోరినయెడల మనము మన శరీరేచ్ఛలను త్యజింపవలెను.—మనము పాపేచ్ఛలలో పుట్టియున్నాము.

పాపము చేయుటకు మనలను రేపునట్టి అనేక విషయములు మనచుట్టునున్న వి. మఱియు నూతన జన్మమువలన మంచివాటిని చేయవలెనను ఆశలుకూడ మనలో పుట్టెను. అట్టి మంచి యాశలను నెఱవేర్చుటకు గావలయు శక్తియును ఆ జన్మమువలన మనకు ననుగ్రహింపబడును. కావున యికను మన స్వంత దుర్బుద్ధియు పరిశుద్ధాత్మ పుట్టించిన యీపై బుద్ధి అను నీ రెండును మనలో నుండుటచే మనలో నొక పోరాటము నిత్యముగా జరుగుచున్నట్లున్నది, ఈపోరాటము వలని ఫలమును బట్టియే మనము మంచివారము లేక చెడ్డవారమని తీర్చబడెదము. మన దుర్బుద్ధిని మన మేలనిచ్చినయెడల మనము దుష్టులమగుదుము. పరిశుద్ధాత్మ మనలో పుట్టించిన బుద్ధికి లోబడిన యెడల మనము సద్గుణములలో స్థిరపరచబడిన మంచివారమగుదుము (2; పేతు. 1: 8-7).

4. సుగుణములను పెంచుకొనవలె ననగా మంచి యభ్యాసములను నేర్చుకొనవలెను.—మనము చెడ్డ అభ్యాసములలో పడుట బహు సులభము. అవి మన నైజబుద్ధికి సరిపడును. అట్టి యభ్యాసములలో పడినయెడల వాటిని విడిచిపెట్టుట బహుదుర్లభము. ఎడతెగని శ్రద్ధవలననే గాని మఱి దేనివలనను మంచియభ్యాసములను సంపాదించుకొనలేము. వాటిని అభ్యసింప నేర్చుకొనవలె నంటే మొట్టమొదట మనము చెడు అభ్యాసములను విడిచిపెట్టి మంచివాటి ననుసరింపవలెనను స్థిరబుద్ధి మనకు నుండవలెను. మఱియు మన మెల్లప్పుడును, మెలుకువగానుండి, ఎప్పుడు తప్పుచేసియున్నామని గుర్తెరుగుదుమో అప్పుడే దాని దిద్దుకొనవలెను, శోధనల నెదిరించుట మొట్టమొదట యెంతకష్టమైనను వాటిని యెదిరించిన యెడల సరియైన యోచనలను యోచించుటయును, చేయవలసిన క్రియలను చేయుటయును మనకు క్రమక్రమేణ అభ్యాసమగును. ఇట్లు మంచి వాటిని చేయుటయందు అభ్యాసపడిన యెడల శోధనల బలము చాలమట్టుకు తగ్గిపోవును. (3) అనగననగ రాగ మతిశయిల్లుచునుండు నని వేమన్న చెప్పిన పద్యము నీతివిషయములలోగూడ చెల్లును. మంచివాటిని చేయుచున్న యెడల రాను రాను అవి సులభమగును. అయినను మనము శోధనలో పడకుండునట్లు మెలుకువపడి ప్రార్థన చేయుటకు ఎన్నడును నిర్లక్ష్యము చేయకూడదు. ఆత్మసిద్ధమైనను శరీరము (మాంసము) బలహీనమైయున్నది. (మత్త. 26: 41). తాను నిలుచున్నానని తలంచుకొనువాడు ? పడకుండునట్లు జాగ్రత్తగా చూచుకొనవలెను. (1. కొరి. 10:12).

5. సుగుణములను పెంచుకొనవలెనంటే తప్పొప్పులను వివేచించు మనస్సాక్ష్యమునకు లోబడవలెను.—క్రైస్తవులకు నుండవలసిన సుగుణ

ములను పెంచుకొనగోరువారు ధర్మవిధులకు అత్యవసరముగా లోబడవలెను. దేవుని చిత్తము అన్నిటికి పైగా నున్నదని తెలిసికొని మన స్వంత కోరికలు, భోగములు, కీర్తి, లాభము అను వీటిని ఆయనచిత్తముకంటె నెక్కువగా నెంచరాదు: ఫలానిది చేయుట మన విధియని మనకు తెలిసినయెడల మఱి దేనిని విచారింపక దానిని చేయవలయును. లోకమంతయు గలిసి ఎదిరించినను సత్యమును న్యాయమును విడిచి పెట్టరాదు. (4). ఫలాని పని చేయవలెనని మన మనస్సాక్ష్యమువలన తెలిసికొను నప్పుడు దానిని చేయవలెను. ఫలానిది సత్యమని యెఱిగినపుడు దాని ననుసరింప వలెను; ఫలానిది పాపమని గుర్తెఱిగినపుడు దానిని త్యజింపవలెను.

మనకు విధింపబడిన దానిని చేయవలెనని ఆజ్ఞాపించునదియు, దానిని చేయకపోయిన యెడల మనలను గద్దించి, మనకు అసంతుష్టిని కలుగజేయునదియు నైన లోనిబుద్ధి మనస్సాక్ష్య మనబడును (రోమా 2: 15). దానికి లోబడిన యెడల అది మనకు మఱి మంచి మార్గదర్శియగును; దానికి లోబడకపోయిన యెడల దాని శక్తి అధికారములు మనలో క్రమక్రమేణ తగ్గిపోవును. పాపము చేయుటకు మనుష్యులు చెప్పు సాకులవల్ల చాలమంది ఆ మనస్సాక్షిని బొత్తుగా నిరర్థకపఱచు చున్నారు, అట్టివారి మనస్సాక్ష్యము మృతమైనదై వారెన్ని సారులు పాపము చేసినను వారిని గద్దించి నొప్పి కలుగజేయక యుండును. మనము బుద్ధిపూర్వకము ముగా పాపము చేయుటవలన ఈ మనస్సాక్ష్యమును చెఱుపకుండ జాగ్రత్తపడవలెను. లేని యెడల మనము బొత్తుగా పాపములో మునిగి నిత్యముగా నశించిపోదుము.

మన మనస్సాక్ష్యమునకు ఎల్లప్పుడును లోబడ వలయును.—— ఎంత స్వల్ప విషయమైనను అది తప్పు అని మనస్సాక్ష్యమువలన తెలిసికొనినప్పుడు దాని చేయకూడదు. మనుష్యులు క్రమక్రమముగా చెడిపోయిరి. కొద్ది పాపములు చేయుట అపాయకరమైన సంగతి యని తలంచువారు కొందఱే. అయితే అవి గొప్ప పాపములకు ముందుగా నడుచును. ఎంత గొప్ప నేరస్థులైనను వారు మొదట కొద్ది నేరములను చేసి తుదకిట్టి ఘోర పాపములలో పడిరనుటకు అనేక దృష్టాంతములు కలవు. పాపము చేయుట ఒక కొండదిగినట్లుగా నున్నది కొండ దిగునపుడు ఆగుట కష్టము దిగుచు మఱల ఎక్కుట మఱికష్టము. అలాగుననే పాపముచేయుచు ఆపివేయుట కష్టము. ఆపివేసినయెడల తిరిగి యథాస్థితికి వచ్చుట మరీ కష్టము. చిన్న చిన్న పాపము లనబడువాటిని చేయకుండ మనము జాగ్రత్త పడవలెను ఎందుకనగా వాటినుండియే గొప్ప పాపములు పెరుగును. పగవలననే హత్యలు పుట్టును దబ్బాశనుండియే మోసములు పుట్టును: కామమునకు సంబంధమైన

తలంపులనుండి వ్యభిచారములు పుట్టును. ఏదో యొక ఘోరపాపమును చేయుమని ఒక పసుచువానితో చెప్పిన యెడల వాడు దాని యందసహ్యపడి దానికి ఏ మాత్రమును సమ్మతింపడు ; అయినను అతడు చిన్న పాపమును చేయుటకు జంకక అట్టివానిని చేయుచు రానురాను మఱి గొప్ప పాపములలో పడి తుదకు మొదట తానసహ్యించుకొనిన ఆ ఘోర పాపమునుకూడ చేయును. ఇట్లనుటకు చాల దృష్టాంతములు కలవు (2 రాజా. 8:12, 13). చిన్న వాటిలో తమ మనస్సాక్ష్యములకు లోబడకపోయిన వారిట్టి దుర్మార్గు లగుదురు. మన గుణములలోని చిన్నలోపములను మనము జాగ్రత్తగా చూచుకొనవలెను. ఎంత చిన్న పాపమును చేయుటకైనను సాకులు చెప్పకూడదు. ఎంత చిన్న దురాశనైనను మనలో నుండ నియ్యకూడదు. మన గుణములు గొలుసువంటి వనదగును. గొలుసులోని ఒక యుంగరము విరిగిన యెడల గొలుసు తెగి నేలబడును. కావున సద్గుణములను గట్టి యుంగరముల గొలుసు తప్ప మనలో మఱేదియు నుండరాదు.

మన మనస్సాక్ష్యము తప్పొప్పులను సరిగా వివేచించులాగున మనకు తగిన నేర్పు అవసరమై యున్నది.—— తప్పు ఒప్పు అని అనేకులు పొరబడి తప్పు చేయుచున్నారు. పౌలు మాఱుమనస్సు నొందక పూర్వము క్రైస్తవులను హింసించుచు అది దేవుని దృష్టికి కిష్టమని కొనెను (1. తిమొ 1: 13). అతనికి తగిన నేర్పుండక పోవుటవలన అతని మనసాక్ష్య మిట్లు పొరబడెను. అయితే యేసు నిజముగా దేవుని కుమారుడని పౌలు తెలిసికొనిన పిమ్మట క్రైస్తవులను హింసించుట మాని తానే ఆయనయం దాసక్తిపరుడై ఆయన సువార్తను బోధింప నారంభించెను (గల. 1:13-16).

మనకు ఎన్నివిధు లుండినను, ఒక కాలములో నొకటే పని మాత్రము చేయుటకు బద్ధులమై యున్నాము. అయితే యన్ని పనులలో మొదట చేయవలసిన ఆ యొకటి ఏదియో దాని వివేచించుట కష్టము ఎందుకనగా మనము ఆత్మీయ విషయములలో మందదృష్టి కలవారమై యున్నాము. మనము తెలియక పాపము చేయకుండునట్లు గుడికి వెళ్ళి దేవుని వాక్యమును నేర్చుకొనుచు, మన బైబిలును శ్రద్ధతో నేర్చుకొనుచు ఏది తప్పో ఏది యొప్పో జాగ్రతగా పరీక్షించుచు, ఏ విషయములో మనకు సందేహ మున్నదో దానిగూర్చి తగిన వారి సలహాలను అడుగు చుండవలెను.

6. సద్గుణములలో నెంత వృద్ధి నొందినను మన మిక పూర్ణులమని యెన్నడును అనుకొనరాదు.—క్రీస్తు సద్గుణముల సంపూర్ణుడైయున్నాడు. అయితే మన మీ జీవిత కాలములో ఆయన సద్గుణములను పూర్ణముగా సంపాదించు

కొనలేము. కావున మన మాయన పరిపూర్ణతను గుఱిగా నెంచి దానిని అందుకొన ప్రయత్నింపవలెను (5). అది దేవుని యెదుట పరిపూర్ణతగా నెంచబడకపోయినను, ఈజీవితకాలములో సద్గుణములను సంపాదించుకొనుటకు మనుష్యుల కెంతవఱకు సాధ్యమగునో, అంతవఱకు వాటిని సంపాదించుకొనువారు పరిపూర్ణులని బైబిలులో చెప్పబడియున్నది (కీర్తన 37:37). అట్టి పరిపూర్ణతను సంపాదించుకొనుట మన విధియై యున్నది (కొల 1:28). దేవుని యెదుట మనము లోపము లేనివార మను కొనిన యెడల మనము స్వనీతి కలిగిన వార మగుదుము. ఫరిసయ్యుడు తా నితరుల కంటె మంచివా డనుకొని, దేవుడు ఆజ్ఞాపించిన వాటిని మాత్రము గాక యింక నెక్కువ చేసియున్నాననుకొనెను (లూకా 18:11,12). అట్టి స్వనీతి క్రైస్తవులకు నుండవలసిన సుగుణములకు భిన్నమైనదియు, వాటిని చెరుపునదియునై యున్నది. మనము పాపులమనియు అయోగ్యులమనియు నెఱిగి, దేవుని దయవలననే గాని మన స్వశక్తివలన ఏ సద్గుణమును సంపాదించుకొనలేమని యొప్పుకొని వినయ బుద్ధి కలవారమై యుండవలెను; లేని యెడల ఏ సద్గుణమును మనలో నుండ నేరదు.

7. సుగుణములను పెంచుకొనుటకు దుర్మార్గుల సహవాసమును విడిచి యోగ్యులతో సహవాసము చేయవలెను.—మన మెవరితో సహవాసము చేతుమో వారే మన గుణములను చక్కపఱతురు లేదా చెరుపుదురు. మనము ఉద్దేశించకపోయినను అనేక విషయములలో మన స్నేహితులవంటి వార మగుదుము. వారు మంచివారైన యెడల మనలను మంచివాటియందు స్థిరపఱతురు వారు దుర్మార్గులైన యెడల వారివల్ల మన విశ్వాసము తగ్గిపోయి మన యోగ్యత తప్పక చెడును. దుష్ట సాంగత్యములు మంచి నడవడిని చెఱుపును (6). మూర్ఖుల సహవాసము చేయువాడు చెడిపోవును, (సామె 13:20) అట్టివాడు తప్పక మూర్ఖుడగును. ఒకడు దుర్మార్గుల క్రియలలో పాలివాడు కాకపోయినను వారితో సహవాసము చేయుటను చూచిన యితరులు వీడును వారి క్రియలలో పాలివాడను కొందురు. తాటి చెట్టు క్రింద పాలు త్రాగినను కల్లే యందురు కదా ! ఈలాగు మన పేరు మన సహవాసమువలననే చెడును. అందువలన మన యోగ్యతకూడ చెడును. కావున మనము దుష్టులతో సహవాసము చేయకూడదు (కీర్తన 1). మన సద్గుణములను చెరుపక వాటిని అభివృద్ధి నొందించు మంచివారిని మన స్నేహితులనుగాను, సహవాసులనుగాను చేసికొనవలెను. మఱియు మన మెంత కొద్దివారమైనను అందఱము మన నడతవలన మనతోడి వారికి మేలుగాని కీడుగాని తప్పక చేతుము కావున మనము మన స్నేహితులకు కీడుచేయక మేలును మాత్రము చేయునట్లు మన స్వంత నడతను ఎంతో జాగ్రతగా చూచుకొనవలెను.

8. సుగుణములను పెంచుకొన గోరినయెడల మనము చెడు గ్రంథములను చదువక మంచి వాటిని చదువవలెను.—మన సహవాసులను గూర్చి చెప్పినది మనము చదువు గ్రంథములను గూర్చియును చెప్పవలసినదే మనుష్యులవలె పుస్తకములును, పత్రికలును మంచి లేక చెడ్డ గుణములు కలవు. కావున వాటిని చదువుటవలన అవి మనలను మంచివారినిగా గాని చెడ్డవారినిగా గాని చేయగలవు. మనము చదువునది మన మనస్సులో చొచ్చి మనలో నొక భాగమగు ననవచ్చును. పాపమునందు అభిరుచిని కలుగజేయువాటిని క్రైస్తవ విశ్వాసమును నీతులను కొద్దిపఱచువాటిని, అపవిత్రమైనవాటిని చదివిన యెడల మన గుణములు తప్పక చెడును. ఇది మన మనస్సులకు విషమువంటిది. దానికి మన మనస్సులో చోటునిచ్చిన పిమ్మట మఱి యెన్నడును దానిని పూర్ణముగా తీసివేయలేము. రుచి చూచుటకు మనుష్యులు విషమును త్రాగరుగదా? అయితే కొందఱు అట్టి పుస్తకములను పత్రికలను చదువ దెగింతురు. అట్టివాటిని చదివినను హాని రాదనియు, ఈలోక వ్యవహారము లన్నిటిని తెలిసికొనవలెననియు సాకులు చెప్పి చదివెదరు. మనము పవిత్రమైన పుస్తకములను మాత్రమే చదివి వాటిని మన స్నేహితులనుగా నెంచవలెను.

ఈ యిండియా దేశములో చదువగలవారెక్కువమంది లేరు. అయితే యిచట దాసరులు, భాగవతులు, మొదలగు వారు పురాణములలో నుండు పోకిరి కథలను వారికి వినిపింతురు. అపవిత్రమైన కథలను వినుటయును అట్టి గ్రంథములను చదివినట్లుగా నున్నది. కావున అట్టివాటిని విననే వినకూడదు. వినినయెడల అవి మన గుణములను చెరుపును. మంచి నీతులతో గూడిన కథలు బైబిలులోను ఇతర గ్రంథములలోను చాల యున్నవి గనుక వాటిని వినిపించువారి మాటలను లక్షించి, శుభ్రమైనవాటితో మన మనస్సులను నింపి సద్గుణములను పెంచుకొనవలయును.

---

## 40. అందఱిని ప్రేమింపవలయునను బోధ.

ప్రేమ పొరుగువానికి కీడు చేయదు గనుక ప్రేమకలిగియుండుట ధర్మశాస్త్రమును నెరవేర్చుటయే. రోమా 13: 10.

## భాగములు.

I. మనుష్యులందరు సహోదరులై యున్నారు
మొకరి నొకరము ప్రేమింపవలెను.

II. ఈ ప్రేమను కనబఱచవలసిన దెట్లు?

(1) మనయెడల తప్పులు చేసినవారిని క్షమింపవలెను

(2) అందరియెడల మర్యాదగా నుండవలెను

(3) ఇతరులకు సహాయము చేయవలెను

(4) ఇబ్బందులలో నున్నవారియెడల కనికరము చూపవలెను

(5) ఇతరులకు మంచిమాదిరిని చూపవలెను.

(6) ఇతరులు మనయెడల నేమి చేయవలెనని మనము కో
మను వారియెడల అలాగున చేయవలెను.

## అనుదిన వేదపాఠములు.

అందఱమును ఏక రక్త సంబంధులము. కార్య
మనవలన అక్కఱగలవారే మన పొరుగువారు లూక
అందఱిని ప్రేమించుడి మ
ప్రేమయొక్క లక్షణములు
క్రైస్తవులమను నుండవలసిన ప్రేమ యోహా
ఇతరులను ప్రేమించుటలో మనము చేయవలసిన ధర్మవిధులు
క్షమించుబుద్ధి మ

## వేదవాక్యములు.

I. 1. యావద్భూమి మీద కాపుర ముండుట కాయన
జాతి మనుష్యులను సృష్టించెను (కార్య 17: 26)

2. మీలో ప్రతివాడును తన స్వకార్యములనే చూచు
కార్యములనుకూడ చూడవలెను (ఫిలిప్పీ 2: 4)

3. నేను మిమ్మును ప్రేమించిన ప్రకారము మీ రొకరి న
చుటయే నా యాజ్ఞ (యోహా 15: 12)

II, 4. నేను మీతో చెప్పునదేమనగా దుష్టుని నెదిరింపక నిన
మీద కొట్టువాని వైపునకు ఎడమచెంపకూడ త్రిప్పుము (మత్త 5: 39)

కీడువలన జయింపబడక మేలుచేత కీడును జయించుము (రోమా 12: 21.)
ఆతడొక దినము ఏడు మారులు నీకు తప్పితము చేసి ఏడు మారులు
గి—మారుమనస్సు పొందితి ననినయెడల అతని క్షమింపవలెను (లూకా

మనుష్యులు మీరేమేమి చేయవలెనని మీరు కోరుదురో అలాగుననే మీ
చేయుడి. ఇది ధర్మశాస్త్రమును ప్రవక్తల ఉపదేశమునై యున్నది
12).

వివరము.

ము మనవలెనే యితరులనకూడ ప్రేమింపవలెను (మత్త. 22: 39).
ని ప్రేమించుచున్నామను సంగతి దీనివలన కనబడును (1. యోహా.

మనుష్యులందఱు సహోదరులై యున్నారు గనుక మన
ొకరము ప్రేమింపవలెను.—— పూర్వీకులైనవారు ప్రతి జనమును
గా పుట్టెననుకొని ప్రతిజనము తమవారినే ప్రేమింపవలెనుగాని యితరు
ంపవ నక్కఱలేదని చెప్పిరి. ఈ దేశములోని నానా జాతిభేదములను
రి యభిప్రాయము నట్టిదై యున్నట్లు కనబడును. అయితే క్రైస్తవబోధ
ినయెడల మనుష్యులందరియొక్క ఆది తల్లితండ్రు లేకరై యున్నారు
దరును ఏకజాతిగల (1) సహోదరులై ఒకరినొకరు ప్రేమింప బద్ధులై
తెలిసికొనగలము. మనుష్యులందఱిని ప్రేమించు దేవుడొకడే (యోహా.
రి నందఱిని రక్షించుటకు సిలువమీద చనిపోయిన క్రీస్తుఒక్కడే (1యోహా
యెహోవాయూదులకు మాత్రము దేవుడైయున్నాడుగాని అన్యులకు దేవుడు
ంూనుకొనిరి. అయితే అలాగు కాక ఆయన అందఱికిని దేవుడై
(రోమా 3: 29). ఆయన అందఱిని తుదకు తనను విరోధించువారిని
ంచును (మత్త. 5: 45). మనము ఆయనవలె నుండవలెను (మత్త. 5:48).
నుకూడ అందఱిని ప్రేమింపవలెను.
ంనము మనవలె మన పొరుగింటివారిని ప్రేమింపవలెనని బైబిలు
మున్నది.——మన పొరుగింటివారనగా మన యింటి దగ్గఱను మన
ొను నుండువారు మాత్రమే గాని యితరులు కారని మన మనుకొనరాదు.
ందఱును మన పొరుగువారై యున్నారని తెలిసికొనవలెను. మంచిసమర
ి క్రీస్తు చెప్పిన ఆ చక్కని యుపమానమును చదువగా మనము అన్ని

జాతులవారిని, అన్ని మతములవారిని ప్రేమించి వారి యవసరములలో వారికి సహాయము చేయవలయునని నేర్చుకొనుచున్నారము (లూకా 10: 30-37). మన స్నేహితుల యెడలను బంధువులయెడలను దయ చూపుటయే మన యందలి నైజగుణమై యున్నది. క్రైస్తవుడైతే అందరియెడలను, స్నేహితులైనను కాకపోయినను వారియెడల దయగల భావమును కనబఱచవలెను (మత్త. 6: 45).

మనము మనుష్యులందరితో స్నేహము చేయలేమను మాట నిజము. మనకు ప్రియస్నేహితులైనవారు కొందరే. అట్టి స్నేహితులు మనకు చాలమంది యుండవలెనని కోరుట తగదు. అయినను మన అందరియెడలను క్రైస్తవప్రేమను దయగల భావమును కనబఱచవలెను. వారి శరీరాత్మల క్షేమమునే కోరవలయును గాని వారికి కీడు కలుగవలెనని యేమాత్రమును కోరరాదు. మనకే క్షేమము కలుగవలెనని మన మాశించి ప్రయాసపడునట్లుగా యితరుల క్షేమమును మనము కోరవలెను. మనుష్యులందఱు తమ్మును తాము ప్రేమించుకొందురు, కావున తమకు కీడు కలుగవలెనని కోరువారెవరైనను లేరు గదా (ఎఫె. 5: 28). ఈవిధముగా మనమితరులను కూడ ప్రేమింపవలెను. మన క్షేమమును, లాభమును మాత్రము గాక ఇతరులవాటిని కూడ విచారింపవలెను. ప్రేమించువాడు తనవాటిని మాత్రము గాక యితరుల వాటిని కూడ విచారించును (2).

విశ్వాసము నిరీక్షణ అను నీ రెంటితో ప్రేమ యనునది క్రైస్తవుల కుండవలసిన ముఖ్యలక్షణమై యున్నది.—(1 కొరి. 13: 13). మన మితరుల యెడల చేయవలసిన వాటిని విచారింపగా పై మూడింటిలో ప్రేమ మరి ముఖ్యమైనదై యున్నది. మన మితరులను ప్రేమించుట యనునదే యితరులనుగూర్చి మనము తలంచు ప్రతితలంపునకును, వారియెడల చేయు ప్రతి కార్యమునకు మూలకారణమై యుండవలెను. ఇట్టి ప్రేమ లేనియెడల మనము చేయు ధర్మకార్యములన్నియు వ్యర్థములై యున్నవి (1 కొరి. 13: 1). ప్రేమలోపల లేకుండ యితరుల యెడల దయగా నున్నయెడల అది యెంత మాత్రమును దయ కాక కపటవేషమై యున్నది (1 కొరి. 13: 3).

ఈ ప్రేమకు సూచన లెవ్వి—అని యడుగగా అది మనలో నుండిన యెడల మన మితరులనుగూర్చి తలంచునది, చెప్పునది, చేయునది యావత్తును దయతో గూడినదై యుండును మనము వారి లోపములను ఓరిమితో చూచి (1 కొరి. 13: 4). వారు మనకు విరోధముగ నేదైనను చేసి యున్నారని యనుకొనిన త్వరగా కోపపడక యుండును; వారు వర్ధిల్లుట జూచి అసూయపడక ఆనందించును (13: 5);

మనము గర్వపడి డంబముగా ప్రవర్తించుచు, స్వంత మేలును విచారించువారము మాత్రము గాక శాంతముతోను, మర్యాదగాను ఇతరుల మేలును విచారించువారముగా నుందుము (13: 5) మనకు నష్టము కలిగినను ఇతరులకు మేలుచేయ ప్రయత్నింతుము (13: 5) ఇతరులు పాపములో పడినను, వారికి నష్టము కలిగినను మనము సంతోషింపక దుఃఖించి వారు మరల గుణపడునట్లు వారికి సహాయము చేతుము (13: 6) ఇతరులు చెడ్డవారనియు, దురుద్దేశములు కలవారై యున్నారనియు చెప్పి వారి మీద త్వరపడి నేరములు మోపక, వారు మంచియుద్దేశములను కలిగియున్నారని సాధ్యమైనంతవరకు నమ్మెదము (13: 7) ఇతరులకు మేలు కలుగులాగున మనము సంతోషముతో కష్టపడుదుము.

**మనము మనతోడి క్రైస్తవులను ప్రేమింపవలెను:**—వారియెడల విశేష ప్రేమను కనబరచవలెను. మనము అందరియెడలను విశేషముగా విశ్వాస గృహమునకు చేరినవారియెడలను మేలు చేయవలెను (గల 6: 10) దేవుని ప్రేమించు వారమైనయెడల ఆయనను ప్రేమించువారియెడల మనము ఎక్కువ యభిమానము గలవారమగుదుము దేవుని సంబంధమగు అయావాటిని మనము ప్రేమింపవలసియున్నాము. ఇట్లుండగా దేవుని స్నేహించువారిని మనము విశేషముగా స్నేహింపవలసియున్నాము. మనమందరిని, శత్రువులను సహా ప్రేమింపవలెనను మాట వాస్తవమే, అయితే మనతోడి క్రైస్తవులను సహోదరభావముతో ప్రేమింపవలెను (రోమా 12: 10) క్రైస్తవులు కానివారికిని మనకును గల సంబంధముకంటె క్రైస్తవులకును మనకును మరెక్కువ సంబంధము కలదు. ఇతరులు శరీరప్రకారముగా మన సహోదరులై యున్నారు: అయితే క్రైస్తవులు అట్టివారు మాత్రము గాక ఆత్మీయ విషయములలో మనవలెనే దేవుని బిడ్డలగుటచే వారు విశేషరీతిగా మన సహోదరులై యున్నారు. మనము క్రైస్తవ సహోదరులను విశేషరీతిగా ప్రేమింపవలెనను ఆజ్ఞను మన ప్రభువే మనకు నిచ్చెను.

**మనము మన స్నేహితులను మాత్రము గాక అతి విరోధులైన మన శత్రువులను కూడ ప్రేమింపవలెను.**—కీడుకు ప్రతికీడు చేయుట మన నైజబుద్ధియై యున్నది. కంటికి కన్ను, పంటికి పల్లు. అనుశాస్త్రము యూదులకుండెను (మత్త 5: 39) వారు తమ స్నేహితులను ప్రేమించి శత్రువులను ద్వేషించుచుండిరి. (మత్త. 5: 43). ఈలాగు చేయుటే ధర్మమని వారనుకొనిరిగాని అలాగు చేయకూడదని క్రీస్తు బోధించెను. మనము మనస్సులో పగ నుంచుకొని, మనకు కీడుచేసిన వారిపై కసితీర్చుకొనగూడదు (రోమా 12: 19). మనము కీడుకు ప్రతిగా మేలును

విరోధమునకు ప్రతిగా స్నేహమును కనబఱచవలెను. (4, 5) 'మీ శత్రువులను ప్రేమించండి; మీరు పరలోకమందున్న మీ తండ్రికి కుమారులైయుండునట్లుమిమ్మును హింసించువారికొఱకు ప్రార్థించుడి' అని క్రీస్తు మనకు ఆజ్ఞనిచ్చెను (మత్త. 5: 45). తనను ప్రేమించువారినే దేవుడు ప్రేమించినయెడల మన గతి యేమగును? మన మందఱము పాపముచేసి ఆయనకు విరోధులమై యున్నాముగదా? కావున మనకు నిత్యనాశనము తప్ప మఱి యే గతియు నుండదు. అట్లుండగా శత్రువులమైనను ఆయన మనలను ప్రేమించి మనలను విమోచించెను. దేవుడు మనయెడల తన ప్రేమను వెల్లడిపఱిచెను; ఏలాగనిన మన మింక పాపులమైయుండగా క్రీస్తు మనకొఱకు చనిపోయెను (రోమా 5: 8).

II. ఈ ప్రేమను కనబఱచవలసిన దెట్లు?—

I. మన యెడల తప్పులు చేయువారిని క్షమింపవలెను— మనకు క్షమించు బుద్ధి యుండవలెను (మత్త. 18: 21, 22). ఒకడు దినదినము మనకు విరోధముగా మాటిమాటికి పాపము చేసినను క్షమాపణ నడిగినయెడల మనము వానిని క్షమింపవలెను (6). మనము చేసిన పాపముల యెదుట మనకు విరోధముగా చేయబడినవి ఎన్నదగినవి కావు. మనము చేసిన గొప్ప పాపములను దేవుడు క్షమింపగా మన సహోదరులు మనకు విరోధముగా చేసిన కొద్ది పాపములను మనముకూడ క్షమింపవలెను? అలాగున చేయనియెడల దేవుడు మన పాపములను క్షమింపడు (మత్త 18: 35) 8,00,00,000 రూపాయల ఋణము క్షమాపణ నొందిన దాసుడు తన తోడిదాసుని 100 రూపాయల ఋణమును క్షమింపక పోయినందున వాని యజమానుడు తన క్షమాపణను రద్దుపఱిచి వానిని శిక్షించెను అని ఋణస్థుడైన యొక దాసునిగూర్చి ప్రభు వొక చక్కని యుపమానమును చెప్పెను (మత్త 18:32-34)

ప్రభువు నేర్పిన ప్రార్థనలో—మా ఋణస్థులను మేము క్షమించి యున్నట్లు మా ఋణములను క్షమించుమని మనవి చేయుచున్నాము. ఇతరులను క్షమింపక ఈ ప్రార్థనను చేసినయెడల మేమితరులను క్షమించుట లేదు కావున మమ్ము క్షమింపవలదని ప్రార్థించినట్లుగ నున్నది. ప్రభువైన క్రీస్తు—మీరు మనుష్యుల అపరాధములను క్షమింపకపోయినయెడల మీతండ్రియు మీ అపరాధములను క్షమింపడని చెప్పెను.

2. మన మందఱియెడల మర్యాదగా నుండవలెను.—ఇతరుల యెడల మర్యాద చూపు విషయములో మనము అలవాటుగా కొన్నిటిని చేయవల

మును మఱి కొన్నిటిని చేయకూడదు. మామూలుప్రకారము మర్యాదచూపించుట ంచిదైనను, ఇతరులను ప్రేమించుట ద్వారా వారియెడల మర్యాద చూపించుట త్తమమైనది. ఈలాటిదే నిష్కపటమైన మర్యాదయై యున్నది. ప్రేమ యుం నచో మన మితరులను దయగా చూచి, ఇతరుల కేది అక్కఱగాను మనోహరము ను నుండునో వాటిని చేయ ప్రయత్నించును. ఇదే యథార్థమైన మర్యాదయై యున్నది మనము మర్యాదను నేర్చికొనవలెను. అందువలన నితరులును మనలను ర్యాద చేతురు కావున అది మనకు మేలుకరముగా నుండును. అయితే మన ర్యాద పైవేషముతో గూడినదై యుండక హృదయపూర్వకమైనదై యుండునట్లు చుకొనవలెను.

3. ఇతరులకు సహాయము చేయవలెను.—మనము ప్రేమకలవార నయెడల మనశక్తి కొలది యితరులకు సహాయకరములైన వాటిని చేయ ప్రయత్నిం ము. ఇతరుల కేమి కలిగిన నాకేమి, నాకు లాభకరములైన వాటినే నేను విచా చుకొందును అని అనేకు లనుకొనునట్లుగా మన మనుకొనక సాధ్యమైనంతవఱకు రిని ప్రోత్సాహపఱిచి వారికి సహాయము చేయుటకు మనస్సుండవలెను.

4. ఇబ్బందులలో నున్నవారియెడల కనికరము చూపవలెను.— నము ప్రేమగలవారమైనయెడల దిక్కులేనివారికి కష్టములోనుండువారికి దయచూపు ము (1 యోహా. 3: 17). క్రీస్తు అవతారమందీ లోకములోనుండుండగా అనుదిన ను శ్రమపడువారిని, దుఃఖించువారిని ఆదరించి వారికిసహాయమిచ్చి మనము చూప సిన కనికరమునకు కొఱతలేని దృష్టాంతము నగపఱచెను. మనమితరులయొక్క శరీర బంధమైనట్టియు, ఆత్మ సంబంధమైనట్టియు అక్కఱలను చూచినపుడు వాటి తీర్చుటకై మన శక్తికొలది పనిచేయగలయును.

5. ఇతరులకు మంచి మాదిరిని చూపవలెను.—మన దుష్ప్రవర్తన న మన మితరులకు చేయు కీడుకంటె మఱి గొప్పకీడు లేనేలేదు. ఇతరుల చెడు డతవలన ఎంతో మంది యీ లోకములో గొప్ప కీడును పొంది చివరకు నిత్యముగా ంచిపోవుచున్నారు కావున మన మితరులను ప్రేమించి వారి మేలును కోరువార నయెడల వారు అనుసరింపదగిన మంచి మాదిరిని మన మంచి నడత ద్వారా వారికి బఱచవలెను.

6. ఇతరులు మనయెడల నేమి చేయవలెనని మనము కోరు దుమో మనమును వారికి ఆలాగున చేయవలెను.—మనమితరులయెడల

చేయవలసిన ధర్మములన్నియు "సువర్ణధర్మ"మను ఈవాక్యములో నిమిడియున్నవి. (7) ఇతరుల పని మనదిగాను, మనపని వారిదిగా నుండినయెడల యితరులు మన యెడలనేమి చేయవలెనని మనము కోరుదుమో ఆలాగు మనమును వారియెడల చేయ వలెను.

---

## 41. కుటుంబ ధర్మములను గూర్చినబోధ.

పిల్లలారా, అన్ని విషయములలో మీతలితండ్రుల మాట వినుడి; ఇదిప్రభువులనుబట్టి మెచ్చుకొనతగినది. తండ్రులారా, మీపిల్లల మనస్సు కుంగకుండునట్లు వారికి కోపము పుట్టింపకుడి. కొల 3: 20, 21.

### భాగములు.

I. తలిదండ్రుల ధర్మములు.

1. కుటుంబమును పోషింపవలెను.
2. పిల్లలను భయభక్తులలో పెంచవలెను.
3. పిల్లల తప్పులకై వారిని శిక్షించి, క్రమపఱచవలెను.

II. పిల్లల ధర్మములు.

1. తలిదండ్రులను గౌరవపరచవలెను.
2. వారిని ప్రేమింపవలెను.
3. వారికి విధేయులైయుండవలెను.
4. వారికి ఉపచారముచేయవలెను.
5. పిల్లలు పెద్దవారైనపుడుకూడ తలిదండ్రుల యెడల నిట్టిధర్మములను జరుపవలెను.
6. ఈధర్మములను ముఖ్యముగా తమ స్వంత కుటుంబములలో కనబరచ వలెను.

### అనుదిన వేదపాఠములు.

తలిదండ్రులు పిల్లలకు బోధింపవలసినది. ద్వితీ. 6.

పిల్లలను శిక్షింపని యేలీగతి. 1.సమూ. 2:12-36.

పిల్లలను శిక్షింపని దావీదు గతి. 2. సమూ. 18.
పిల్లలను క్రమశిక్షయందు పెంచవలెను. సామెతె. 22.
పిల్లలను క్రీస్తునొద్దకు తేవలెను. మార్కు 10: 1-16.
తలిదండ్రుల ధర్మవిధులు. ఎఫె. 6: 1-4; కొల. 3: 20, 21.
పిల్లలు తలిదండ్రులను పోషింపవలెను: 1. తిమొథె. 5: 1-8.

## వేదవాక్యములు.

I. 1. ఎవడైనను స్వకీయులను విశేషముగా తన యింటి వారిని, సంరక్షింపక పోతే వాడు విశ్వాసత్యాగము చేసినవాడై అవిశ్వాసికంటె దుష్టుడుగా నుండును (1. తిమొ 5: 8).

2. బాలుడు నడువవలసిన త్రోవను వానికి నేర్పుము. వాడు వృద్ధుడైనప్పుడును దానినుండి తొలగిపోడు (సామె. 22: 6).

3. బాలుని హృదయములో మూఢత స్వాభావికముగా పుట్టును. శిక్షాదండము దానిని వానిలోనుండి తొలివేయును (సామె. 22: 15).

II. 4. నీ దేవుడైన యెహోవా నీ కనుగ్రహించు దేశములో నీవు దీర్ఘాయుష్మంతుడవగునట్లు నీ తండ్రిని నీ తల్లిని సన్మానింపుము (నిర్గ. 20: 12).

5. వృద్ధుని గద్దింపక తండ్రిగా భావించి యతని హెచ్చరించుము. అన్నదమ్ములని యౌవనస్థులను, తల్లులని వృద్ధస్త్రీలను, అక్కచెల్లెండ్రని పూర్ణపవిత్రతతో యౌవన స్త్రీలను హెచ్చరించుము (1. తిమొ 5: 1, 2).

## వివరము.

దేవుడు చేసినయేర్పాటులన్నిటిలో మొదటిది కుటుంబపు టేర్పాటైయున్నది. పూర్వికులు రాజ్యమును గూర్చిన యేర్పాటే ముఖ్యమైనదని దానిని గొప్ప దానినిగా నెంచిరిగాని, కుటుంబపు టేర్పాటును అంత ముఖ్యమైనదానినిగా నెంచలేదు. అయితే బైబిలు కుటుంబపు టేర్పాటు మొదటిదని దానిని గొప్పచేయుచున్నది. క్రీస్తు రక్షణ విషయమైన వాగ్దానములు పాతనిబంధనలలో నెన్ని యున్నవో వాటిలో ప్రతిదానికి సంబంధముగా క్రీస్తు ఏ కుటుంబములోనుండి పుట్టునో అదియును వ్రాయబడి యున్నది. కుటుంబములోనే పిల్లలు భయభక్తులు నేర్చికొని వాటిని అభ్యసింపవలెను. (ద్వితీ. 6: 5-7). ప్రజలు కుటుంబ ధర్మములను లక్షించినయెడల వారికి, వారి దేశమునకును క్షేమము కలుగును. ఆయా కుటుంబముల లక్షణములను బట్టి ప్రజలు మంచివారుగాగాని చెడ్డవారుగాగాని అగుదురు.

1. తలిదండ్రుల ధర్మములు.—తలిదండ్రులకును పిల్లలకును గల సంబంధముకంటె మరి గంభీరమైన సంబంధము మనుష్యులలో లేనేలేదు. దేవుడు మనకు తండ్రియైయున్నాడు కావున, ఆ సంబంధము దేవునికిని మానవులకును ముఖ్యముగా దేవునికిని భక్తులకును గల సంబంధము వంటిది. తండ్రియైన దేవుడు తన బిడ్డలైన మానవులకు చేయువాటిని తలిదండ్రులు చూచి అట్టివాటినే వారును తమ పిల్లలయెడల చేయ ప్రయత్నింపవలెను. వారు తమ పిల్లలను ప్రేమించి, వారి శరీరాత్మల యక్కఱలను తీర్చి, వారికి విధేయతను నేర్పించి, వారిని ప్రభువుయొక్క బోధలోను శిక్షలోను పెంచవలెను (ఎఫె 6: 4). తలిదండ్రులకు తమ పిల్లలమీద అధికారము కలదు. మఱియు వారి యధికారమునకు సాటిగా విధాయకములునుగలవు. ఎల్లప్పుడు జీవించు ఆత్మలు గల పిల్లలు వారికి అప్పగింపబడి యున్నారు అట్టివారు ఇహమందు భక్తిగాను పరమందు సౌఖ్యముగాను బ్రతుకునట్లుగున వారిని తగినట్లు పెంచుట ఎంతో గొప్ప విధియై యున్నది ఇట్టి భారము తలిదండ్రు లందరిమీద నున్నది.

1. తలిదండ్రులు తమ కుటుంబములను పోషింపవలెను.—తండ్రి తన వృత్తివలనను, తల్లి తన యింటి పనులను చేయుటవలనను తమ పిల్లలను పోషించుట తలిదండ్రుల విధియై యున్నది (1). పిల్లలకు యుక్తవయస్సు వచ్చువఱకు తలిదండ్రులు వారిని పోషింపవలెను. వారికి యుక్తవయస్సు వచ్చి తమను తాము పోషించుకొనునప్పుడు వీరి విషయము మరికనే విధియు లేదని యనుకొనక తమ జీవితకాలమందంతటను వారి క్షేమమునకై తగు యత్నములను చేయవలయును. తలిదండ్రులు తమ పిల్లలకు ఆహార వస్త్రముల నిచ్చి, విద్యను చెప్పించి. రోగారోగ్యముల యందు వారిని సంరక్షింతురు. తమ పిల్లలకు ఇట్టి సౌఖ్యములను కలుగజేయుటకు తామెంత కష్టపడవలసి యున్నను లక్షింపక వారికి అవసరమైన యీ విషయములను తలిదండ్రులు విచారింతురు. తలిదండ్రులు తమ పిల్లలకొఱకు పడు పాటులన్నియు పిల్లలు తెలిసికొన జాలరు. వాటి నిమిత్తము తమ తలిదండ్రులకు తగిన ప్రత్యుపకారమును చేయ జాలరు.

2. తలిదండ్రులు పిల్లలను భయభక్తులలో పెంచవలెను.—పిల్లలను దేవుని భయభక్తులలో పెంచుటకు తాము చేయవలసిన దంతయు చేయుటకు తలిదండ్రులకు బాధ్యత కలదు. పిల్లల హృదయములలో సుగుణములను నాటించి చేసి వాటిని పెంచుకొనునట్లు చేయుట తలిదండ్రుల పనియై యున్నది. తలిదండ్రులకు జ్ఞానమును శ్రద్ధయును లేకపోయినయెడల యీపని జరుగనేరదు. కావున, దేవుడు తమకు వాటిని అనుగ్రహింపవలెనని ఆయనను వేడుకొనవలెను (యాకో. 1: 5).

వారు తమ బిడ్డలను చిన్నతనములోనే బాప్తిస్మము మూలముగా దేవునికి సమర్పింపవలెను (మార్కు 10: 14). బిడ్డలకు తెలివి వచ్చినపుడువారికి బాప్తిస్మము విషయములను బోధించి, దేవుని వాక్యమును నేర్పి, దేవుని యాలయమునకును సబ్బాతుబడికిని వారిని రప్పించి, విద్యా నిమిత్తము బడికి పంపించి; క్రైస్తవ విశ్వాసములోను ప్రవర్తనలోను వారిని పెంచుటకు యత్నింపవలెను. పిల్లలు పాపములో పడకుండునట్లు తలిదండ్రులు వారి నిమిత్తము ఎడతెగక ప్రార్థన చేయవలయును. తమ బిడ్డలు తమ మాదిరిని చూచి దాని ననుసరించునట్లు తాము చక్కగా ప్రవర్తింపవలెను. దుర్వర్తనలో నున్న తలిదండ్రులు తమ పిల్లల కెంతి మంచి బోధలు చేసినను అవి యన్నియు నిరర్థకము లగును. మనము మొదట మన కుటుంబములో దైవభక్తి నగపఱచవలెను. కుటుంబ సమేతముగా బైబిలును చదివి ప్రార్థన చేయవలెను. తగిన బుద్ధిని పిల్లలలో నాటింపచేసి, వారికి మంచి అభ్యాసములను బోధింపవలెను. ఈలాగు మంచివాటిని వారు చిన్నతనములో తలిదండ్రులవలన నేర్చుకొనినయెడల అవి పిల్లలలో నిత్యమును నిలుచును. తలిదండ్రులవలన పిల్లలు చెడ్డవాటిని నేర్చుకొనినయెడల నవియును వారిలో నెల్లప్పుడు నుండి వారికి ఎంతో గొప్ప కీడు చేయును (2)

3. పిల్లల తప్పులకై వారిని శిక్షించి క్రమపఱచవలెను.— అవిధేయులైనయెడలను, ఇంక నితరమైన తప్పిదములు చేసినప్పుడును పిల్లలను శిక్షించుట తలిదండ్రుల విధియై యున్నది. అలాగున చేయకపోయినయెడల పిల్లలకు మాత్రముగాక తలిదండ్రులకుకూడ కీడుమూడును. "కొఱగాని కొడుకు పుట్టిన కొఱగామియె గాదు తండ్రి గుణములు జెఱచున్ । చెఱకు తుదవెన్ను పుట్టిన జెఱకున దీపెల్ల జెఱచు సిద్ధము సుమతీ" అని సుమతి శతకము చెప్పుచున్నది, దావీదు అబ్షాలోమును శిక్షింపకపోయినందున తుద కతని తిరుగుబాటుద్వారా అనేక నష్టములను భరింపవలసి వచ్చెను (2 సమూ 15: 10). ఏలీ తన కొడుకుల యక్రమము నిమిత్తము వారిని శిక్షింపకపోయినందున (1. సమూ 3: 13) కొడుకులు మాత్రముగాక తాను కూడ మరణశిక్ష నొందవలసి వచ్చెను (1 సమూ 3: 18: 4: 11) పిల్లలు చేసిన తప్పుల విషయమై వారిని శిక్షింపనివాడు తన పిల్లలను నిజముగా ప్రేమించినవాడు కాక వారికి గొప్పహాని చేసిన వాడగును. 'బెత్తము వాడనివాడుతనకుమారునికి విరోధి, కుమారుని ప్రేమించువాడు బాల్యమందే వానిని శిక్షించును' (సామె 13:24) తప్పుచేసిన తన బిడ్డను శిక్షించుట తలిదండ్రులకు ఎంత బాధకరముగ నున్నను, తనబిడ్డ యొక్క మేలును కోరి అతని శిక్షింపవలెను. అయితే వెఱ్ఱికోపము తెచ్చుకొని అన్యాయముగాను, క్రూరత్వముతోను పిల్లలను శిక్షింపక, తగుబుద్ధితో వారిని శిక్షిం

పవలెను. (ఎఫె. 6: 4). నా తలిదండ్రులు నా మేలుకోరి నన్ను ప్రేమించినందున యీలాగు నన్ను శిక్షించుచున్నారని పిల్లవాడు తనకు తానే తెలిసికొనులాగున అతనిని శిక్షింపవలెను.

II. పిల్లల ధర్మములు.—పిల్లలు దేవునిని అన్నిటికంటె మొదట ఘనపఱిచి ప్రేమింపవలెను. ఆయనకు తరువాత తమ తలిదండ్రులను అందఱికంటె నెక్కువగా ఘనపఱిచి ప్రేమించి సేవించి వారికి విధేయులై యుండవలెను. దేవుడు తలిదండ్రులకు తమ పిల్లలమీద అధికారము ననుగ్రహించి యున్నాడు కావున, దేవుని యాజ్ఞలకు భిన్నము కాని దేనిని వారాజ్ఞాపించినను దానిని శిరస్సావహించి చేయుట పిల్లలకు విధియై యున్నది. కుటుంబములో క్రమ ముండులాగున తలిదండ్రులు దేవుని వలన నట్టి యధికారము నొంది యున్నారు. పిల్లలు తమ తలిదండ్రులనుఘనపఱచవలె ననునది పదియాజ్ఞలలో నొకటియైయున్నది. (4) ఈ యాజ్ఞను గైకొనువారికి ఒక విశేషమైన దీవెన కల్గునను వాగ్దాన మున్నదిగాని, మఱి యేయాజ్ఞ విషయములోను అట్టి వాగ్దానము లేదు (ఎఫె. 6: 2) ఈ యాజ్ఞను గైకొనుట ఎంత ఘనకార్యమై యున్నదో, దానిని మీఱుట అంత గొప్ప పాపమై యున్నది. 'తండ్రి నపహసించి తల్లిమాట విన నొల్లని వాని కన్నులోయ కాకులు పీకును పక్షిరాజు పిల్లలు దానిని తినును (సామి. 80: 17) తన తండ్రినైనను తల్లినైనను నిర్లక్ష్యము చేయువాడు శాపగ్రస్తుడు' (ద్వితీ 27: 16)

1. పిల్లలు తమ తలిదండ్రులను గౌరవపరచవలెను.—తాము తమ తలిదండ్రులకంటె బుద్ధిమంతులమనుకొని వారిని వారిమాటలను నిర్లక్ష్యముచేయరాదు (సామి 1: 8) మనము మన తలిదండ్రులనుగూర్చి మర్యాదగా మాటలాడి, వారి అనుభవజ్ఞానమును లక్షించి, వారి బోధ విని, వారి మంచిమాదిరిని చూచి అనుసరింపవలెను. తలిదండ్రులయెడల అమర్యాదగా నుండుటయు, వారితో అహంకారముగా మాటలాడుటయు గొప్ప పాపములై యున్నవి. అలాగు చేసినయెడల దేవుడు మనలను తప్పక శిక్షించును. పాతనిబంధనను చూడగా తలిదండ్రులను కొట్టువానికి, శపించువానికి మరణశిక్ష విధింపబడెను (నిర్గ 21: 15, 17) ఇప్పుడట్టి శిక్ష లేకపోయినను ఆ పాపము ఎంత ఘోరమైనదో యది ఆ శిక్షవలన స్పష్టమగును.

2. పిల్లలు తమ తలిదండ్రులను ప్రేమింపవలెను.—మనము మన తలిదండ్రులను ప్రేమించి, వారికి ప్రత్యుపకారము చేయ ప్రయత్నింపవలెను (5) మన మెన్నడును వారికి దుఃఖమును చింతను కలుగజేయక, ఎన్నియో కష్టములను పడి వారు మనలను పోషించి, సంరక్షించిరని తలంచుకొని, మన చిన్నతనమునుండి నేటి

వఱకు వారు మనయెడల కనబఱచిన యధిక ప్రేమను మఱవక, మనము వారిని మఱి యెక్కువగా ప్రేమించు లాగున వారిదయను స్మరింపవలెను.

3. పిల్లలు తమ తలిదండ్రులకు విధేయులై యుండవలెను.—మనము మన తల్లిదండ్రులకు విధేయుల 'మగుట మన విధాయక' మని తెలిసికొని వారికి లోబడవలెను. అదియు గాక మనము వారిని ప్రేమించుట ద్వారా వారికి లోబడవలెను. వారియెడల ప్రేమకలిగిన వారమైనట్లయిన సంతోషముతో వారికిలోబడెదము. తనకు తలిదండ్రుడు లాజ్ఞాపించినది ఆయాసకర మనుకొనుచు ఏ పిల్లవాడు శిక్షకు భయపడి లోబడునో వాడు తన తల్లిదండ్రులను చక్కగా ప్రేమించిన వాడు కానేరడు. తలిదండ్రులను ప్రేమించువాడు చుఱుకుగాను, ఇష్టపూర్వకముగాను, సంతోషముతోను వారికి లోబడవలెను. లోబడుటకు అయిష్టబడి సణుగు చుండు వాడు విధేయుడయినను వాని విధేయత విధేయత కాదు. అట్టి విధేయతను చూచిన తల్లిదండ్రులు తమ పిల్లల విషయము సంతోషింపగలరా? ఒకానొకపుడు తలిదండ్రులు తమ బలహీనత చేత దేవుని యాజ్ఞలకు భిన్నముగా నున్నవాటిని కూడ ఆజ్ఞాపింప వచ్చును గనుక అవిషయములలో తప్ప తతిమ్మా విషయము లన్నిటిలో నెంత మాత్రము ఎదురాడక ప్రతి పిల్లవాడు తన తలిదండ్రులకు లోబడవలసినదే.

4. పిల్లలు తమ తలిదండ్రులకు ఉపచారము చేయవలెను.—తమ తలిదండ్రులు తమకు ఆజ్ఞాపించిన దానిని మాత్రము గాక, ఆ సమయమును కనిపెట్టి వారు తమకు ఆజ్ఞాపించని మంచివాటిని కూడ చేయుట ద్వారా పిల్లలు తమ తలిదండ్రులకు ఉపచారము చేయవలెను. వారిని సంతోషపఱచుటకును, వారికి సహాయము చేయుటకును ప్రయత్న పడవలెను. పిల్లలుచేయ గలుగునది కొద్ది గనుక మనమేల దీనిని చేయవలెనని వారనుకొనగూడదు. వారు చేసినది కొద్దియైనను తల్లిదండ్రులు వారి మంచి మనస్సును చూచి సంతోషింతురు. కావున కొద్ది యనక తమచేత నగు ప్రతి మంచిదానిని చేయుటకు ప్రయత్నింపవలెను. మఱియు తలిదండ్రుల భారములను తేలిక 'పఱచుటకు పిల్లలు అనేక విషయములలో వారికి గొప్ప సహాయముకూడ చేయగలరు.

5. పిల్లలు పెద్దవారైనపుడుకూడ ఇట్టి ధర్మములను జరుపవలెను.—మనము పెద్దవార మైనపుడు కూడ మన తలిదండ్రులను గౌరవ పఱచి వారిని ప్రేమింపవలెను. మనచిన్నతనములో వారికి మనమీదనున్నంత యధికార మిప్పుడు లేకపోయినను, మనము స్వాయముగా వారిని సంతోష పఱచ యత్నించి. వారి మంచి సలహాలకు లోబడవలెను. వారు ముసలివారై దిక్కులేకుండిన యెడల

మనము వారిని ఘనపరచి, ప్రేమించి వారిని ఓపికతో పరామర్శించి, ఏ కొఱతయు లేకుండునట్లు వారిని సంరక్షింపవలెను. మన చిన్నతనములో వారు మనలను సంరక్షించి యున్నారు, కావున వారి ముసలి తనమందు మనము వారిని సంరక్షింపవలెను.

తలిదండ్రులకు మర్యాద చూపవలయు ననగా మన తలిదండ్రులకు మాత్రము గాక వారి తలిదండ్రులయెడలను అలాగు మర్యాద చూపవలయును. వృద్ధు లందఱి యెడలను అట్టి మర్యాదను కనబఱచ వలయును. వృద్ధులని వారిని కొద్ది పఱచి హేళన చేయుట ఎంతో గొప్ప పాపమై యున్నది. మనముకూడ ఒకప్పుడు వృద్ధులమగుదుమని తలంచి, ఆ సమయమందు ఇతరులు మనయెడల నేమి చేయవలె నని మనము కోరుదుమో మనమును అట్టివారి యెడల నాలాగున చేయవలయును. తల నెరసినవాని యెదుట లేచి ముసలివాని ముఖము ఘనపరచి నీ దేవునికి భయపడ వలెను. (లేవీ. 19: 32)

6. ఈ ధర్మములను ముఖ్యముగా మన స్వంత కుటుంబములలో కనబఱచవలెను.—కొందఱు తమ స్నేహితులయెడలను, సెలవైన వారియెడలను బహు మర్యాదగా ప్రవర్తింతురు, గాని తమ స్వంత కుటుంబములో నుండు వారి యెడల అట్టి మర్యాదను కొంచమైనను గనబఱచరు. ఇది బొత్తిగా విపరీతమైన సంగతి. అందఱిలో మన స్వంత కుటుంబికులను మన మెక్కువగా ప్రేమించి, వారియెడల ప్రేమతో గూడిన క్రియలను చేయవలెను. కుటుంబములోని తల్లి, తండ్రి, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు వీరందఱు ఒకరినొకరు ప్రేమించి యేక మనస్సు కలవారైయుండవలయును. కలహము, స్వార్థప్రియత్వము, కోపము, నిష్ఠురపు మాటలు మొదలైనవి కుటుంబములో నేమాత్రము నుండరాదు. ప్రతివాడు తాను కోరువాటిని కాక, కుటుంబములో నుండు యితరులు కోరువాటిని విచారించి, వాటిలో తన కోపము రేపు విషయము లున్నయెడల, తనకోపమును బిగబట్టుకొని, కుటుంబములోని ఇతరులకు మర్యాదచూపి, అన్యాయమునైనను, వారికి అయిష్టమైన వాటినైనను చేయక, వారికోపముల నోర్చుకొని, వారి సుగుణములను మెచ్చి వారికి శరీరాత్మల క్షేమము కలుగులాగున పాటుపడ వలయును.



## 42 సంఘములోని ధర్మ విధులనుగూర్చిన బోధ.

ప్ర॥ వా॥ ఒక్క శరీరములో మనకు అనేకావయవము లుండినను, ఈ అవయవము లన్నిటికి నొకటే పనియేలాగు ఉండదో, ఆలాగే అనేకులమైన మనము క్రీస్తులో నొక్క శరీరముగా నుండి యొకరి కొకరము ప్రత్యేకముగా అవయవములమై యున్నాము. రోమా 12: 4, 5.

### భాగములు.

I. సంఘస్థు లందరియొక్క విధులు.

1. వారు నమ్మకమైన సభికులై యుండవలెను.
2. దేవుని వాక్య సంస్కారములను ప్రేమించి వాటిని వాడుకొనవలెను.
3. మంచి ప్రవర్తనగలవారై యుండవలెను.
4. తమతోడి సభికులను సహోదర ప్రేమతో ప్రేమింపవలెను.
5. తమ సంఘపు గురువునకు సహాయులై యుండవలెను.
6. సంఘమును వ్యాపింపజేయుటకు పనిచేయవలెను.

II. సంఘోద్యోగస్థులయొక్క విశేష ధర్మములు.

1. పరిచారకులు.
2. పరిచారకురాండ్రు.

III. లూథరన్ సంఘమునుగూర్చి తెలిసికొనవలసిన కొన్ని ముఖ్య విషయములు.

1. దాని యుత్పత్తి.
2. దాని విశ్వాస ప్రమాణములు.
3. ఇతర సంఘములకును, లూథరన్ సంఘమునకును గల సంబంధము.

### అనుదిన వేదపాఠములు.

క్రైస్తవులు తమ వెలుగును ప్రకాశింప నియ్యవలెను. మత్త. 5: 13-20.
దేవుని సంఘములో చేరుటకు భక్తులు పడిన కష్టములు. హెబ్రీ. 11: 8-27.

ప్రతి సభికుడును తన ధర్మములను నెఱవేర్చవలెను. రోమా 12.
సభికు లందఱు ఏక శరీరములోని అవయవములై యున్నారు. 1కొరి 12:12-31.
మనల నెదిరించువారిని మేలుచేయుటవలన జయింపవలెను. 1 పేతురు2:11-25.
పరిచారకుల ధర్మములు. 1. తిమో. 3: 8-13.
సత్యము పక్షముగా పోరాడవలెను. యూదా.

## వేదవాక్యములు.

1. అందుకు పేతురును అపొస్తలులును—మనుష్యులకు కాదు దేవునికే మేము లోబడవలెను గదా అని చెప్పిరి (కార్య. 5: 29).

2. సువార్తనుగూర్చి నేను సిగ్గుపడువాడను కాను. ఏమనగా నమ్ము ప్రతివానికి, మొదట యూదునికి హెల్లేనీయునికికూడ రక్షణ కలుగచేయుటకు అది దేవుని శక్తియై యున్నది (రోమా. 1: 16.)

3. మనుష్యులు మీసత్క్రియలను చూచి ఆకాశమందున్న మీతండ్రిని మహిమపరచునట్లు మీరును వారి యెదుట మీ వెలుగు ప్రకాశింప నియ్యుడి (మత్త.5:16)

4. సహోదర ప్రేమ విషయములో నొకరియం దొకరు అనురాగముగలవారై ఘనతవిషయములో నొకరి నొకరు గొప్పగా నెంచుకొనుడి (రోమా 12: 10).

5. దేవుడు మాద్వారా వేడుకొనునట్లు మేము క్రీస్తుకు రాయబారులమై—దేవునితో సమాధానపడుడని క్రీస్తుపక్షముగా మిమ్మును బతిమాలుకొనుచున్నాము (2. కొరి. 5: 20).

6. మీరు సర్వలోకమునకు వెళ్ళి సర్వ సృష్టికి సువార్తను ప్రకటించుడి (మార్కు 16: 15).

## వివరము.

క్రైస్తవ సంఘములో యథార్థముగా చేరియున్న వారికి గల హక్కులకంటె గొప్ప హక్కులు ఈ లోకములో మఱి యెవరికి కలుగనేరవు మన మా సంఘములో చేరినయెడల దేవుని కిష్టులమై ఆయన విశేష దయా దాక్షిణ్యములను పొందువారమగుదుము. అయితే యీ సంఘములో హక్కులు మాత్రము గాక విధులుకూడ నియమింపబడెను, కాబట్టి మన మా విధుల నిపుడు విచారింతము.

### I. సంఘస్థు లందఱియొక్క విధులు.

1. సంఘములో చేరినవారు నమ్మకమైన సభికులై యుండవలెను.—సంఘములో చేరుట యనగా దేవుని సేవను అవలంబించుటయై యున్నది.

ఇట్లుండగా సంఘసంబంధమైన విధులను నెఱవేర్చుటలో నెన్ని కష్టనష్టములు వచ్చినను మన మీ సంఘములోనుండి జారిపోరాదు. కుటుంబ ధర్మములు, రాజ్యమునకు సంబంధించిన ధర్మములు ఎంతగొప్పవైనను, సంఘసంబంధమైన ధర్మవిధులు వాటికంటె మఱి గొప్పవి. సంఘ సంబంధమైన ధర్మములను, క్రీస్తునెడల జరిగింపవలసిన ధర్మములును ఏకమై యున్నవి. మనము మన తలిదండ్రుల నెంతగా ప్రేమించినను క్రీస్తును మఱెక్కువగా ప్రేమింపవలెను (మత్త. 10: 37). అధికారులకు విధేయులమై యుండవలసినదే (రోమా 13: 1) గాని దేవునికి విధేయులమగుట మఱి యవసరము (1) (లూకా 20: 25). దీనివిషయమై భక్తులు మనకు మంచి మాదిరి జూపియున్నారు. దేవుని ప్రజలకు మూలకర్తయగుటకు అబ్రహాము తన తండ్రియింటివారిని విడిచి వెళ్లెను (ఆది 12: 1-4). ఫరో నగరములో పాప భోగముల ననుభవించుటకంటె, దేవుని జనులతో అవమానము నొందుట మేలని మోషేనమ్మి ఆ రాజు నగరమును విడిచెను (హెబ్రీ 11: 25). క్రీస్తుశిష్యులగుటకై అపొస్తలులు సమస్తమును విడిచి ఆయనను వెంబడించిరి (మార్కు 10: 28-30): పౌలు తన స్వజనుల నెంతగా ప్రేమించినను క్రీస్తు సంఘమును ఎక్కువగా ప్రేమించుట వలన తన స్వజనుల నెడబాసి అన్యులకు సువార్తను ప్రకటించుటకును సంఘమును వారిలో వ్యాపింపజేయుటకును తన జీవితకాల మంతటిలో కష్టపడెను.

2. సభికులు దేవునివాక్యసంస్కారములను ప్రేమించి, వాటిని వాడుకొనవలెను.—మనలో విశ్వాసమును పుట్టించుటకును, దాసియందు మనలను కాపాడుటకును దేవుని వాక్యము ముఖ్యసాధనమై యున్నది (2) గనుక మనము దానిని ప్రేమింపవలెను. దేవుని వాక్యమును విని నేర్చుకొనుటకై ఆలయమునకు వెళ్లుట క్రైస్తవుల ధర్మములలో నొక ముఖ్యధర్మమై యున్నది. దేవుని వాక్యమును తిరస్కరించువాడు క్రైస్తవుడు కానేరడు.

సంస్కారములనుగూర్చి విచారింపగా తలిదండ్రులు తమ పిల్లలకు చిన్నతనములోనే బాప్తిస్మమిప్పించవలెను. ఆ పిల్లలు తమకు యుక్తవయస్సు వచ్చినపుడు బాప్తిస్మముద్వారా తమకు గల్గిన మేలులను తలంచి తమ బాప్తిస్మకాలమున తలిదండ్రులు తమ పేరట చేసిన గంభీర వాగ్దానములను స్మరించుచు స్వయముగా వాటిని ఒప్పుకొని స్థిరపఱచి నిర్ధారణ నొందవలెను. అటు తరువాత దేవుని ఆదరణ సహాయములను పొందులాగున వీలు కలిగినపుడెల్ల ప్రభువురాత్రిభోజన మను సంస్కారములో పాలి భాగస్తు లగుచు నుండవలెను.

3. సభికులు మంచి ప్రవర్తన గలవారై యుండవలెను.—మనము వాక్యమును ఊరక వినువారము మాత్రము గాక, దాని ప్రకారము చేయు

వారమును (యాకో. 1: 22), క్రైస్తవరీతిగా నడుచుకొనువారమునై యుండవలెను. ఈలాగున ప్రవర్తింపకపోవుటచేత క్రైస్తవులు తమ రక్షణను పోగొట్టుకొనుటయే కాక, క్రైస్తవ సంఘమునకును అవమానపరచువారగుదురు. ఇతరులు మన మంచి క్రియలను చూచి పరలోకమందున్న మన తండ్రిని మహిమపరచునట్లు వారి యెదుట మన వెలుగును ప్రకాశింపనియ్యవలెను (3). క్రైస్తవులు యోగ్యముగా ప్రవర్తించినయెడల, ఈ మతము సత్యమైనదని అన్యుల ఒప్పుకొనక తప్పదు (1. పేతురు 2: 12, 15).

4. తమతోడి క్రైస్తవ సభికులను సహోదర ప్రేమతో ప్రేమింపవలెను.—(4) (హెబ్రీ 13: 1). క్రీస్తుశరీరముగా ఎంచబడిన యేక సంఘములోని సభికులందరు శరీరములోని అవయవములుగా నుండుటచేత (1. కొరిం. 12: 27), వారొకరితో నొకరు సమాధానముగా నుండి, క్రీస్తు రాజ్యాభివృద్ధి నిమిత్తము ఐక్యముగా పనిచేయవలయును. (1. కొరి. 12: 25). కలహపడుట ఎచటనైనను తగదు. సంఘస్థులలో కలహము లుండుట బహువిపరీతమైన సంగతియై యున్నది. క్రైస్తవులు ఒకరి నొకరు ప్రేమించినయెడల వారు క్రీస్తు శిష్యులై యున్నారని లోకులు తెలిసికొందురు. (యోహా. 13: 35). క్రైస్తవ సంఘములోని సభికులు ఒకరి శరీరాత్మల క్షేమము నొకరు విచారించి, ఒకరి భారముల నొకరు మోసికొనవలెను (గల. 6: 2).

5. క్రైస్తవులు తమ సంఘగురువులకు సహాయులై యుండవలెను.—గురువు క్రీస్తుయొక్క రాయభారియై, ఆయన సంగతులను ప్రకటించువాడై యున్నాడు (5) గనుక, అతని (గురువు) పనినిబట్టి మన మాతని ఘనపరచవలెను (1. థెస్స 5: 13). అతని మాటలను వినువారు క్రీస్తు మాటలను విందురు; వాటిని నిరాకరించువారు క్రీస్తు మాటలనుకూడ నిరాకరింతురు (లూకా 10: 16). గురువు క్రీస్తుసువార్తను బహిరంగముగా ప్రకటించునపుడును, ప్రత్యేకముగా సభికులకు దేవుని యాదరణలను బోధలను తెలియజేయునపుడును క్రీస్తు అతని మూలముగా పలుకుచున్నాడని తెలిసికొనవలయును:

సభికులు తమ గురువునకు అన్ని విధముల సహాయము చేసి, అతని ప్రోత్సాహపరచవలెను. అతని బోధలను మనుష్యుల బోధలనుగా గాక, దేవుని బోధలనుగా విని లక్షింపవలెను, (1. థెస్స. 2: 13). సంఘములో నేదైన నొక పనిని చేయుమని గురువు మనకు సెలవిచ్చినపుడైనను, ఫలాని పనిలో మన గురువునకు సహాయము చేయగలమని మనము స్వయముగా గుర్తించినపుడైనను, మనము అట్టి సహాయమును సంతోషముతో చేయుచుండవలెను.

6. సంఘమును వ్యాపింపజేయుటకు సభికులు పనిచేయవలయును.—మేము సువార్తమేలులను పొందియున్నాము. ఇక నితరుల విషయము మాకేయుత్తరవాదమును లేదని యనుకొనక, అందఱును సువార్తను నమ్మి, దాని మేలుల ననుభవించుకొనులాగున సభికులు పనిచేయవలెను. మనము సువార్తనుగూర్చి సిగ్గుపడక, ఇతరులకు దానిని తెలిచేయుటకు భయపడక నుండవలెను (రోమా 1: 15, 16). ఇతరులను మన దేవాలయమునకు రప్పించుటకై ప్రయత్నము చేయవలెను. మనము క్రమముగా ఆరాధనలకు వెళ్ళుచు, మన మంచి మాదిరివలన వారికి తగిన హెచ్చరికను చేయవలెను.

సువార్తను మనుష్యు లందఱికి ప్రకటింపవలెనను ఆజ్ఞను క్రీస్తు మనలో ప్రతివానికి నిచ్చెనని తెలిసికొని (6) సువార్తను ఎఱుగని వారికి బోధకులను పంపుటకై మనము పాటుపడవలెను.

II. సంఘోద్యోగస్థులయొక్క విశేష ధర్మములు.—సంఘములో కొన్ని విశేషమయిన పనులను చేయుటకు పంచాయితీదారులను లేక పరిచారకులను నియమింతురు (కార్య. 6: 1-6). సంఘ గురువు కోరునప్పుడెల్ల వారతనికి సహాయము చేయవలెను. మఱియు సభఖర్చు కొఱకైన సొమ్మును వసూలుచేసి, దానిని న్యాయముగా ఖర్చుచేయుట, ఆరాధన స్థలమును దానికి సంబంధించిన సామగ్రిని భద్రపరచుట సంఘములోని బీదలను రోగులను పరామర్శించి ఆదరించుట మొదలగు పనులన్నిటిని వారే విచారింపవలెను. వారు తమ గురువుతో గలిసి యొక పంచాయతిగా కూడి సభవ్యవహారము లన్నిటిని న్యాయముగా జరుపవలెను. మఱియు మంచి ప్రవర్తన గలవారై, అన్ని విషయములలోసభవారికి మంచి మాదిరిని కనపఱచవలెను.

ఆది క్రైస్తవులలో పరిచారకులు మాత్రము గాక, పరిచారికలుకూడ నుండిరి (రోమా 16: 1). ఈమధ్య క్రైస్తవు లీ యుద్యోగమును మఱల స్థాపించిరి స్త్రీలు ఈ పనిని చేయుటకు తగిన నేర్పు పొందులాగున గొప్ప గొప్ప ట్రెయినింగ్ పాఠశాలలను స్థాపించి యున్నారు. వారట్టి పాఠశాలలలో నేర్పుపొందిన పిమ్మట రోగులను పరామర్శించుటకును, దిక్కులేని వారిని ఆదరించుటకును, ఘోర పాపములలో పడినవారికి రక్షణమార్గమును చూపుటకును, పిల్లలకు బోధించుటకును తగిన ధర్మశాలలలోను, సంఘములలోను పనిచేయుచున్నారు. అట్టివారి పని చాల గొప్పగా నున్నది. ఈ దేశములో అట్టి యుద్యోగ మింక స్థాపింపబడక పోయినను, మన బోధకుల భార్యలు ముఖ్యముగా తమ సభికులలో నిట్టి పనులు చేయగలిగిన యెడల నెంతో మేలుగ నుండును!

## III. లూథరన్ సంఘమునుగూర్చి తెలిసికొనవలసిన కొన్ని ముఖ్య విషయములు.

I. దాని యుత్పత్తి.—షుమారు 400 సం॥ ల క్రిందట క్రైస్తవసంఘము నడత విషయమైనట్టియు, బోధల విషయమైనట్టియు అనేక తప్పులలో పడిపోగా సంఘములోని ఆ తప్పులను దిద్దుటకై దేవుడు లూథరు అను నొక గొప్ప భక్తుని అతని తోడిపనివారిని లేపెను. బైబిలులో నున్న ప్రకారము వారు బోధించిన ముఖ్యసిద్ధాంతములు రెండు. వాటిలో మొదటిది-క్రైస్తవమత సిద్ధాంతములకు ఆధారము బైబిలు కాక మరియొకటి లేదు; రెండవది-మన క్రియలవలన గాక విశ్వాసము వలననె మనకు రక్షణ కలుగును అనునవి. ఈ మూల సత్యములకు బదులుగా రోమన్ కాథోలిక్కు వారు కల్పనలను బోధించినందున లూథరును అతని సహాయకులును ఆ కల్పనాకథలను దేవుని వాక్యముతో ఖండించి పై రెండు మూల సత్యములను తేటగా బోధించిరి. ఈ బోధల నంగీకరించిన వారు తమ సంఘమునకు సువార్త ననుసరించు సంఘము అను నర్థమిచ్చు 'ఎవాంజెలికల్ సంఘము' (సువిశేష సంఘము) అను పేరు పెట్టుకొనిరి. అయితే వారిశత్రువులు దానికి 'లూథరన్, సంఘము' అని పేరు పెట్టిరి. చివరకు శత్రువులు పెట్టిన పేరే నిలిచెను. లూథరును ఆరాధించు వారు గనుక లూథరన్ సంఘ మను పేరు నుంచుకొన్నారనుకొనక లూథరు బోధించుబోధల ననుసరించి దేవుని సేవించుట కొప్పుకొని యున్నారుగనుక లూథరన్ సంఘము అను పేరును నిలుపుకొనియున్నారని తెలిసికొనవలెను. పైన ఉదహరింపబడిన రెండు పేరులను కలిపి, మన సంఘము 'ఎవాంజెలికల్' (సువిశేష) లూథరన్ సంఘము, అని పేరు పెట్టుకొనెను.

2. లూథరన్ సంఘస్థుల విశ్వాససూత్రములు.—లూథరన్ వారు కొన్ని విశ్వాససూత్రముల చేర్పరిచి వాటిలో తమ ముఖ్య బోధలను వివరించిరి. అపొస్తలుల విశ్వాసప్రమాణము, నిసీయ విశ్వాసప్రమాణము, అథనాశియ విశ్వాస ప్రమాణము అను మూడు ప్రమాణములు పూర్వ సంఘస్థు లందరిచేతను ఒప్పుకొనబడినవి. అలాగున లూథరన్ సంఘస్థులు వాటిని ఒప్పుకొందురు. వీటితో లూథరన్ వారందఱును ఔగ్సుబర్గు కన్ ఫెషన్ (ఒప్పుకోలు) అను ఒప్పుదలను ప్పుకొందురు మఱియు లూథరువ్రాసిన చిన్నప్రశ్నో త్తరములు అను ప్రథమ ోధనలో నున్న వాటిని తమ మత సూత్రములనుగా నంగీకరింతురు. ఇవియుగాక నాథరన్ వారు ఆయాసమయముల కవసరమైన ఇతర గ్రంథములనుగూడ రచియుంచిరి

లూథరన్ వారందరు వాటిని కూడ విశ్వాస సూత్రములనుగా నంగీకరింపవలెనని లూథరన్ వారిలో చాలమంది యనుకొందురు. ఆ గ్రంధము లేవియనగా—ఔగ్సుబర్గ్ కన్ ఫెషనును తేటగా వివరించుదాని అపాలొగియా (Apology), లూథరు పెద్ద ప్రశ్నోత్తరముల గ్రంథము, స్మాల్కాల్డువిశ్వాససూత్రములు, ఫోమ్యులకొంకొర్డియా (Fommula Concordiae) అనునవి.

విశ్వాససూత్రములుగా నంగీకరింపబడిన గ్రంధములలో దేవునివాక్య బోధలు వివరింపబడినవి. వాటిలోని ప్రతి యంశమును దేవుని వాక్యముమీదనే ఆనియున్నది. అవి లూథరు కాలములో కల్పింప బడిన క్రొత్తబోధలు కావుగాని, అపొస్తలుల కాలములో నున్న అది సంఘపువారు చేసిన బోధలై యున్నవి. రోమను వారు ఆ యసలు బోధలను విడిచి వాటికి ప్రతిగా మనుష్యుల పారంపర్య బోధలను బోధించు చుండిరి. వారి సంఘమును అసలు సంఘమునుగా నెంచక ఏ సంఘము అదిసంఘ బోధలను బోధించునో ఆదియే అసలు సంఘమని తెలిసికొనవలెను. ఈ విధముగా లూథరన్ సంఘము అసలు సంఘముగా నున్నది. ఈ సంఘముయొక్క విశ్వాస సూత్రములు దేవుని వాక్యమునకు అనుగుణ్యముగా నుండుటచేత గురువులును, బోధకులును వాటిని అనుసరించి బోధింపవలెను. మరియు వాటికి భిన్నముగా నెవరును మన సంఘములో బోధింపకుండునట్లు జాగ్రతగా చూచుకొనవలెను (గల 1:9; ప్రక. 22: 18, 19).

3. ఇతర సంఘములకును లూథరన్ సంఘమునకును గల సంబంధము.—సంఘము ఏకసంఘమై యున్నది (ఎఫె. 4: 4-6). క్రీస్తును యథార్థముగా నమ్మువారందరును అందులో చేరియున్నారు. అయితే క్రీస్తుసంఘములో ననేక శాఖలుండుట యనునది క్రీస్తు ఆజ్ఞకు విరుద్ధముగ (యోహా. 10: 16) నున్నను ప్రస్తుతము క్రీస్తుసంఘములో ననేక శాఖలు కలవు. సత్యమొక్కటే, అందరును దాని నొప్పుకొన వలసినదే, అయితే అందరును దానిని పూర్ణముగా నొప్పుకొనవలెను. కాథొలిక్కు సంఘము రోమాలోని పోపుకు లోబడు రోమను సంఘమనియు, పోపునకులోబడని గ్రేకు సంఘమనియు రెండు శాఖలయ్యెను. ప్రొటెస్టాంటు వారిలో లూథరన్ రిఫార్మ్డ్ అను రెండు గొప్ప భాగములు గలవు. వీటికి అనేక బోధలలో ఐక్యమున్నను, కొన్నిటిలో భేదము లున్నవి. రిఫార్మ్డ్‌వారిలో లెక్కలేని శాఖలు గలవు.

మనమీ శాఖలన్నిటిలోగల క్రైస్తవులను ప్రేమింపవలసియున్నను, ఆయా శాఖలలో చేరిన క్రైస్తవులు చేయు మంచిపనులను గూర్చి వారిని మెచ్చుకొనవలసి యుండి

నను మన స్వంత సంఘమగు లూథరణ్ సంఘమును మఱియెక్కువగా ప్రేమింపవలెను, ఇది ప్రొటెస్టాంటు సంఘములలో మొదటిదై యున్నది. దిద్దుపాటు పని చాలమట్టుకు ఈ సంఘము వలననే కలిగెను. మన మీ సంఘముయొక్క చరిత్రను బట్టియు ఆదేవుని వాక్యమును కల్పన లేకుండ బోధించుటను బట్టియు దాని యందెక్కువ అభిమానము కలిగి యుండవలెను. ఈ సంఘము బోధించు సత్యములను మనము విడువక వాటిని గట్టిగా పట్టుకొనవలెను. ఇది దేవుని వాక్యమును, ఆవాక్యముయొక్క సారమును తెలియజేయునట్టి దీని మతసూత్రములను విడిచిన యెడల మనము దీనిని విడువవచ్చునుగాని లేనియెడల ఎన్నడును విడువరాదు (గల 1:6-9) ఈ సంఘముయొక్క క్షేమము కొఱకును, వృద్ధికొఱకును మనము కష్టపడి పనిచేయవలెను (మత్త. 9. 37, 38). అయితే మనము ఈ సంఘము ఒప్పుకొను సత్యమును మనుష్యులు ఒప్పుకొనులాగున పాటుపడవలెనుగాని, సంఖ్యాభివృద్ధికొఱకు మాత్రము పాటు పడరాదు. మన మీ సంఘము యొక్క యేర్పాటులకు లోబడి, దీనికి మంచి పేరు వచ్చులాగున దాని దివ్యబోధల ననుసరింపవలెను

ఈ సంఘమును పోషించుటకును, ఆది యితర ప్రదేశములలో పూనుకొనిన పనిని ఉద్ధరించుటకును మనము మన శక్తికొలది ద్రవ్య సహాయమునుకూడ సంతోషముతో చేయవలెను. ఈ సంఘము నెడల మనకు తగిన అభిమాన మున్నయెడల అది సత్యమును వ్యాపింపజేయులాగున మనము మన స్వంత ఖర్చులను తగ్గించుకొని సహాయము చేయవలెను.

ఆయా శాఖలవారి బోధలలో సత్యములున్నవని మనము ఒప్పుకొనక తప్పదు. అయితే వారి బోధలలోనే యేవిషయములందు తప్పు బోధ లున్నవో వాటిని మనము గుర్తించి నపుడు అవి తప్పులు కానట్లుగా నెంచలేము. అట్టితప్పులు మన సంఘము యొక్క బోధకు మాత్రముగాక, దేవునివాక్యమునకుకూడ భిన్నమై యున్నందున అవి యంతగా గమనింప దగినవి కావనుకొనక వాటిని నిషేధింపవలెను, మనము దేవుని వాక్యములో నున్నదాని నంతటిని పూర్ణముగానమ్మి యొప్పుకొనవలెను (లూకా 21: 33; మత్త, 5:18). పరిశుద్ధుల కొక్కసారే అప్పగింపబడిన బోధనిమిత్తము పోరాడవలెను (యూదా 3), ఇతరసంఘస్థులు మంచి యుద్దేశములు గలవారై యుండుట జూచి వారిని గౌరవపఱచవలెను గాని, వారిబోధ మన బోధ అంతయు నొకటే యని చెప్పుకొనక, సత్యాసత్యములను విభేదింపవలెను, మనము నీతిమంతుల మగు విధము, బాప్తిస్మము, ప్రభురాత్రిభోజనము అను విషయములను గూర్చిన వాటిలో వారి బోధలు మన బోధకు భిన్నముగా నున్నవి: క్రీస్తు మాటచొప్పున ప్రభురాత్రిభోజన సంస్కారములో నిజముగా క్రీస్తు శరీర రక్తములను

పొందుచున్నామని మనము నమ్ముదుము. ఆలాగు నమ్మనివారిని యీ సంస్కారమునను చేర్చుకొనినయెడల ఈ బోధను స్వల్పముగా నెంచి, ఏదియైనను సరే నమ్మవచ్చు నన్నట్లుగా నుండును. కావున ఆ బోధను నమ్మువారిని మాత్రము దీనికి చేర్చుకొనవలెను.

క్రైస్తవ సంఘములో ఐక్యముండవలెను. అయితే అట్టి ఐక్యము కల్గుటకు మొదట బోధలలో నైక్యముండవలెను. బోధనలో నిట్టి యైక్యము లేని వెలుపటి ఐక్యత ఐక్యత కానేరదు. మనము దేవుని వాక్యము బోధించు బోధలను విడిచి యితరులతో నైక్యపడుట ధర్మము కాదు (యోహాను 8: 31) ప్రతి సంఘములో సరియైన బోధ లుండవలెను. అందఱును దేవునివాక్యమును కల్పనలేకుండ బోధింప నేర్చుకొని ఐక్యపడవలెను. అట్టి యైక్యత కలుగులాగున మనము శ్రద్ధకలిగి యుండవలెను.

---

## 43. విశ్రాంతి దినమును గూర్చిన బోధ.

"విశ్రాంతిదినము పరిశుద్ధ దినముగా నాచరించుటకు జ్ఞాపకముంచుకొనుము." నిర్గ 20: 8.

### భాగములు.

I. ఏ దినమును విశ్రాంతిదినముగా నాచరింపవలెను?

II. దానినెట్లు ఆచరింపవలెను?

1. ఆ దినమున పనిచేయక విశ్రమింపవలెను.
2. మేలు కార్యములను చేయవలెను.
3. దేవునిగూర్చిన విషయములను ధ్యానించవలెను.
4. ఆరాధనకు వెళ్ళవలెను.
5. సబ్బాతుబడికి వెళ్ళవలెను.

III. దాని నతిక్రమించుట యెట్లు?

IV. క్రైస్తవులాచరించు ఇతరమైన పరిశుద్ధ దినములు, కాలములు.

## అనుదిన వేదపాఠములు.

విశ్రాంతి దినముయొక్క యేర్పాటు ఆది 2: 1 3; నిర్గ 20.
8. 11; ద్వితీ 5: 12-15.
విశ్రాంతిదినమున పని చేయకూడదు నిర్గ 16: 22-30; సంఖ్యా 15:16-36
విశ్రాంతిదినమునుగూర్చి యెషయా వ్రాసిన సంగతులు యెష 56: 1-8;
58: 13-14.
నెహెమ్యా చేసిన దిద్దుపాటు. నెహె 13: 15-22.
క్రీస్తు ఆదివారమున మృతినుండి లేచి తన శిష్యులకు కనబడెను యోహా 20.
పరిశుద్ధాత్మ ఆదివారమున కుమ్మరింపబడెను. కార్య 2: 1-13.
విశ్రాంతిదినమున మేలు చేయవలెను. మత్త 12: 1-14; లూకా 13: 10-17;
14: 1-6.

## వేదవాక్యములు.

1. దేవుడు తాను చేసిన తన పని ఏడవ దినములోగా సంపూర్తిచేసి తాను చేసిన తన పని యంతటినుండి యేడవ దినమున విశ్రమించెను. కాబట్టి దేవుడు ఆ యేడవ దినమును ఆశీర్వదించి పరిశుద్ధపరచెను; ఏలననగా దానిలో దేవుడు తాను చేయ సృజించిన తన పని యంతటినుండి విశ్రమించెను (ఆది. 2: 2, 3),

2. అందుకాయన—మీలో ఏ మనుష్యునికైన నొక గొఱ్ఱెయుండి అది విశ్రాంతిదినమున గుంటలోపడినయెడల దాని పట్టి పైకి తియ్యడా? గొఱ్ఱెకంటె మనుష్యుడెంతో శ్రేష్ఠుడుగదా! కాబట్టి విశ్రాంతిదినమున మేలు చేయుట ధర్మమే అని చెప్పెను (మత్త. 12: 11, 12)

3. కొందరు మానుకొనుచున్నట్టుగా సమాజముగా కూడుట మానక ఒకని నొకడు హెచ్చరించుచు ఆ దినము సమీపించుట మీరు చూచినకొలది మరీ యెక్కువగా ఆలాగుచేయుదము, ప్రేమను చూపుటకును సత్కార్యములు చేయుటకును, ఒకని నొకడు పురికొల్పవలెనని ఆలోచింతము (హెబ్రీ 10: 24, 25).

4. నీవు నీ దేవుని మందిరమునకు పోవునప్పుడు నీ ప్రవర్తన జాగ్రతగా చూచుకొనుము; బుద్ధిహీనులు అర్పించునట్లుగా బలినర్పించుటకంటె సమీపించి ఆలకించుట శ్రేష్ఠము; వారు తెలియకయే దుర్మార్గపు పనులు చేయుదురు (ప్రస. 5: 1.)

## వివరము.

మనము దేహబలమును, మనోబలమును, ఆత్మీయబలమును కలుగునట్లు మనము తప్పక విశ్రాంతిదినము నాచరింపవలెను

I. ఏ దినమును విశ్రాంతిదినముగా నాచరింపవలెను?—ప్రాచీన నిబంధన కాలములో దేవుని యాజ్ఞనుబట్టి వారములోని యేడవ దినమును దేవుని ప్రజలు విశ్రాంతిదినముగా నాచరించినట్లు తెలియును. దేవుడు ఆరు దినములలో సమస్తమును సృజించి యేడవ దినమున విశ్రమించెను కావున, దానిని విశ్రాంతిదినముగా ప్రతిష్ఠించెను (1). ఈ దినమును పరిశుద్ధపరచవలెనని మూడవ యాజ్ఞలో మనకు ఆజ్ఞాపించెను (ప్ర। వా॥). ఆ దినమున ఇశ్రాయేలీయులు తమ పనులన్నిటిని మానుకొని దేవునిగూర్చిన విషయములను ధ్యానించుకొనవలెనను నియమము కలదు (ద్వితీ. 5: 14, 15) అన్యులకును ఇశ్రాయేలీయులకును గల భేదములలో ఇశ్రాయేలీయులు విశ్రాంతిదినము నాచరించుట ఒక ముఖ్య భేదమై యుండెను. అన్యులు దీని నాచరింపక యుండిరి.

ఆది క్రైస్తవులనుగూర్చి విచారింపగా వారిలో యూదా తెగకు సంబంధించిన వారు క్రైస్తవులయిన పిమ్మటకూడ ఏడవ దినమును విశ్రాంతిదినముగా నాచరించుచుండిరి. మఱియు, యూదుల యితర పండుగలనుకూడ నాచరించుచుండిరి. అయితే మొదట అన్యులుగనుండి క్రైస్తవులయిన వారిట్లు చేయవలెనను నియమము లేక యుండెను. అన్యులలోనుండి క్రైస్తవులైనవారుకూడ యూదుల యాచారములను తప్పక ఆచరించవలెనని కొందఱు బోధించిరికాని, కాని అపొస్తలుడైన పౌలు అట్టి బోధలను ఖండించెను. ఇటువంటి ఆచారములనుండి క్రీస్తు మనలను విడిపించెనని పౌలు బోధించెను (గల. 5 1). అట్టి గొప్ప విడుదల కలిగినందున క్రైస్తవులు వారములోని ఏడవ దినమునకు బదులుగా మొదటి దినమును ప్రభుసేవకొఱకు ప్రత్యేకించిరి (కార్య. 20: 7; 1 కొరి 16: 2). వారు మొదటి దినమును ఏర్పఱచుకొనుటకు కారణ మేదనగా మన విమోచన విషయమైన కార్యము లన్నిటిలో గొప్పవియైన రెండు కార్యములు అనగా (1) ఈస్టరు దినమున క్రీస్తు మృతులలోనుండి లేచుట (2). పెంతెకొస్తు దినమున పరిశుద్ధాత్మ కుమ్మరింపబడుట అను రెండు కార్యములును ఆదినముననే (ఆదివారమున) జరిగెను. ఆత్మావేశముచే నడిపింపబడిన అపొస్తలులు ఆ దినమును విశ్రాంతిదినముగా నాచరింపవలెనని సమ్మతించిరి కావున, అది దేవు డేర్పఱిచిన దినమని తెలిసికొనవలెను. దానికి వారు ప్రభువుదిన మను పేరు పెట్టిరి (ప్రక. 1: 10).

II. విశ్రాంతి దినము నెట్లు ఆచరింపవలెను.—విశ్రాంతిదినము వలన మనకు ఆత్మీయమయిన మేలు కలుగవలె ననునది దాని ముఖ్యోద్దేశమైనను మనకు

శారీర సంబంధమైన మేలు కలుగవలెనను ఉద్దేశముకూడ దానిలో నున్నది. పని చేయువారు వారములో నొక రోజున తమ పని విడిచి అలసట తీర్చుకొనవలెను. అలాగున విశ్రమింపక అనుదినమును పని చేయువారు తమ ఆయుస్సును తగ్గించుకొనువా రగుదురు.

ప్రభువుదినమున మిగుల అవసరమైన పనులను చేయవచ్చును (లూకా 14: 5), గాని ఇతరమైన పనులను చేయ గూడదు. ఆదివారమున విశ్రమించుటకు వీలగునట్లు, వారములోని మిగత ఆఱు దినములలో మనము తగిన రీతిగా శ్రద్ధతో పని చేయవలెను. అలాగు శ్రద్ధతో పని చేసినయెడల ఆదివారమున చేయవలసివచ్చునట్టి అవసరమైన పనులు చాల మట్టుకు తగ్గిపోవును.

2. ప్రభువుదినమున స్వలాభముకొఱకైన పనులను గాక, ప్రేమచే రేపబడినవారమై, ఇతరులకు మేలుకరముగ నుండు పనులను చేయవలెను.—ఈ దినమును పరిశుద్ధపఱచుటకును, ఆత్మీయమయిన మేలుల నందఱికి కలుగజేయుటకు ఆలయమునకు సంబంధించిన పనులు జరుగును గనుక వాటిలో పాలిభాగస్థులై వాటిని చేయుట తగును. ఆ దినమున బోధకులును, గుడి సేవకులును, ముఖ్యముగా గుడికి సంబంధించిన పనులను జరుపుదురు గనుక మనము వారికి తోడ్పడి, చేయగలసహాయమును చేయవలెను. మఱియు ప్రభువుదినమున మనము రోగులను దర్శించి వారిని పరామర్శించుట అక్కఱలో నుండువారి యక్కఱలను తీర్చుట, దుఃఖములలో నుండువారిని ఆదరించుట మొదలయిన కార్యములను చేయుట మిగుల తగియున్నది (2). క్రీస్తు తానే విశ్రాంతిదినమున రోగులను స్వస్థపరిచెను. (లూకా 14: 1-4).

3. ప్రభువుదినమున మనము దేవుని గూర్చిన విషయములను ధ్యానించుకొనవలెను.—విశ్రాంతిదినము ఒక పరిశుద్ధ దినమై, మనకు ఆత్మీయాభివృద్ధి కలుగజేయుటకు ముఖ్యముగా నియమింపబడి యున్నది. అది యొక తమాషా దినము కాక పరిశుద్ధదినమై యున్నది. ఆ దినమంతయు ఊరకయుండుటగాని ఆట్లాడుటగాని, నిద్రించుటగాని తగదు. మనము దానిని పరిశుద్ధపరచవలెను, అనగా దేవునిగూర్చినవాటిని ఆ దినమున చేయవలెను. ఆత్మీయ విషయములలో వృద్ధి కలుగులాగున దానిని గడుపుకొనవలెను. ఆట్టి ఆత్మీయాభివృద్ధిని ఆటంకపఱచునవి యన్నియు విశ్రాంతిదినమును అపవిత్రపఱచును.

4. ప్రభువు దినమున ఆరాధనకు వెళ్ళవలెను.—ఆదివారమున మనము ఆనందముతో దేవాలయమునకు వెళ్ళి ఆయనను స్తుతించి, ప్రార్థనలు చేసి,

బోధమును చెప్పు బుద్ధి మాటలను, ఆదరింపు మాటలను శ్రద్ధతో వినవలెను. దేవుని నివాసమందిరమును మనము ప్రేమించవలెను. (కీర్తన 26: 8) కీర్తనలు వ్రాసిన భక్తునివలెనే - యెహోవా! నీ నివాసములు ఎంత రమ్యములు. యెహోవా ఆవరణములను చూడవలెనని నా ప్రాణము ఎంతో ఆశపడుచున్నది. అది సొమ్మసిల్లుచున్నది అని మనమును చెప్పవలెను (కీర్త. 84: 1, 2) ఈ విశ్రాంతిదినము నిత్య విశ్రాంతిదినమును అనగా మోక్షమును సూచించును. (హెబ్రీ 4: 9). ఈ లోకములో మనము దేవుని ఆరాధనయందు అనుకూలపడక పోయిన యెడల ఆయనను నిత్యముగా ఆరాధించుటకొఱకు ఏలాగు సిద్ధపడగలము!

చాలమందికి వాడుక యున్నట్లు మనము ఆరాధనకు వెళ్ళకుండ నుండక (3), సాధ్యమైనంతవఱకు ప్రతి యాదివారమున తప్పక గుడికి వెళ్ళవలెను. అనేకులు పనికిమాలిన సాకులు పెట్టుకొని గుడికి రాక యుంటున్నారు. తమ స్వంత పనులైన యెడల వారేవిధముగనైనను ఉపాయములు చేసి వానిని నెఱవేర్చుకొనగలరు గాని, దేవుని పని చేయుటయందు వారికి అంతటి యాశ యుండదు. బహుస్వల్ప కారణములైనను గుడికి రాకపోవుటకు తగిన కారణములే యనుకొందురు. ఇది యెంతో యధర్మము. మనము అన్నిటికంటె నెక్కువగా దేవుని సేవించుట మన ధర్మమై యున్నది గదా!

మనము దేవాలయములో తగిన మర్యాద చూపవలెను.—ఆలయము దేవుని యిల్లని తెలిసికొని భయభక్తులతో దానియందు ప్రవేశింపవలెను. (4). మనము కూర్చుండు స్థానము చేరినపుడు ఆరాధనలో దేవుడు మనలను దీవించవలెనని ఆయనను మర్యాదతో వేడుకొనవలెను. మన దగ్గఱ కూర్చుండువారితో అనవసరముగ మాటలాడక మౌనముగా నుండవలెను. గుసగుస లాడుటయు నవ్వుటయు దేవాలయమునకు బొత్తుగా తగవు. అయావారి సొమ్ములను బట్టలను చూచుటవల్లను లౌకికసంగతులను మనస్సులో నుంచుకొనుటవల్లను మన మనస్సులను దైవధ్యానమునుండి తొలిగి పోనియ్యక దేవుని మీదనే మనస్సు నిలిపి యుంచవలెను. ఆరాధనకార్యమెట్టిదో తలంచుకొని, నిండుమనస్సుతో దాని చేయవలెను. ఆ యారాధనలో మనము మన పాపముల నొప్పుకొని, గురువు ప్రకటించు క్షమాపణ ప్రకటనను విశ్వాసముతో విని, హృదయపూర్వకముగా దేవుని స్తోత్రములను పాడి, ప్రార్థనలు చేసి, శ్రద్ధతో దేవుని వాక్యమును విని, అది యితరులకుగాక మనకెట్లు సరిపడునో యోచింపవలెను.

5. ప్రభువుదినమున సబ్బాతుబడికికూడ వెళ్ళవలెను.—సబ్బాతుబడియును దేవుని వాక్యమును నేర్చుకొనుటకు వీలు కలిగించు చోటని మనము

తెలిసికొని దానికి క్రమముగా వెళ్ళి గుడిలో చూపవలసిన శ్రద్ధాభక్తుల నిందులో కనబఱచవలెను. సబ్బాతుబడి విద్యార్థులముగ నుండినయెడల ముందుగా నింటియొద్ద పాఠమును చదువుకొని, సబ్బాతుబడి బోధకుల బోధలను శ్రద్ధతో విని వాటిని హృదయములో చేర్చుకొని యనుసరింపవలెను. సబ్బాతుబడి పాఠములు మిక్కిలి గొప్పవి. లౌకిక పాఠశాలలో నేర్చుకొను విద్యలు చాలమట్టుకు ఈ లోకసంబంధమైనవి. అవి యెంత గొప్పవైనను ఇహసంబంధమైనవై, ఈ జీవితకాలము మట్టుకే మనకు ఉపయోగములై యుండును. అయితే మనము సబ్బాతుబడిలో నేర్చుకొను పాఠములు అట్టివికాక, మన మిహమందు క్రైస్తవరీతిగా జీవించునట్లును ఉపయోగములై యున్నవి కావున అవి మఱీ గొప్పవై యున్నవి.

సబ్బాతుబడిని సంఘమునకు సహాయముగ నుండు నొక సాధనమునుగా నెంచవలెను. అయితే సబ్బాతుబడికి వెళ్ళినయెడల చాలును. సంఘారాధనకు వెళ్లనక్కఱలేదని యేమాత్రము ననుకొనరాదు. సబ్బాతుబడికి హాజరగుట యనునది మనకు సంఘారాధనయందభిరుచిని పుట్టించి, మనము దానికి వెళ్లునట్లు మనలో ఆశను కలుగజేయవలెను గాని, సబ్బాతుబడికి హాజరైనయెడల ఆరాధనకు వెళ్లనక్కఱలేదను తలంపును మనలో నెంతమాత్రమును పుట్టింపరాదు.

III. విశ్రాంతిదినము నతిక్రమించుట యెట్లు?—ఎవరు తమ సాధారణమయిన పనులను ఆదివారమునాడు స్వయముగా చేయుదురో వారే విశ్రాంతిదినము నతిక్రమించిన వారగుదురు. చాలమంది కంట్రాక్టరులును ఆసాములును తమ యధీనమందున్న కూలివారిని బలవంతపఱచి ఆదివారమున వారిచేత పని చేయింతురు. ఈలాగున చేయుటవలన తాము ఆ దినము నతిక్రమించుటయేకాక, కూలివారినికూడ గుడికి రానియ్యక వారికి గొప్ప ఆత్మీయ హానిని కలిగించు వారగుచున్నారు. ఇది గొప్ప పాపమని తెలిసికొనవలయును. వారు దీని విషయమై దేవునికి లెక్క నప్పగింపవలెను.

విశ్రాంతిదినమున దేవుని వాక్యమును విని ధ్యానించుకొనుటకు ఏది మనకు ఆటంకముగ నుండునో అది మనకు నిషేధమని తెలిసికొనవలెను. ఈ విధముగా గుడికి, సబ్బాతుబడికి వెళ్లకపోవుటయు, ఒకవేళ వెళ్ళినను ఆ వాక్యమును మనస్సులో నాటనియ్యక, వెనుక ముందు చూచుచు లౌకికవిషయములను విచారించుటయు ఈ మంచికాలమును లోక భోగములలో గడపుకొనుటయు నను నీ మొదలగునవి మనకు నిషేధములై యున్నవి.

ఆదివారమున లౌకిక గ్రంథములను, పత్రికలను చదివినయెడల మన మనస్సులు చెదిరి స్థిరబుద్ధితో దేవుని వాక్యమును ధ్యానించుకొనుటకు వీలుపడదు కావున, మన మటువంటి వాటిని చదువక మన మా దినమున మతసంబంధమైన గ్రంథములను పత్రికలను మరి ముఖ్యముగా బైబిలును చదువవలెను.

**IV. క్రైస్తవులు ఆచరించు ఇతరమైన పరిశుద్ధ దినములు.**—లౌకిక పంచాంగ మొకటి యున్నట్లు క్రైస్తవ పంచాగమును కలదు. దానిలోని విశేష కాలములు సూర్యచంద్రుల చలనమునకు సంబంధము కాదుగాని, మన ప్రభువైన యేసుక్రీస్తు చరిత్రకు సంబంధముగా నేర్పడియున్నవి. ప్రతి యాదివారమునకు ఒక పేరు పెట్టబడి యున్నది. దానిని తెనుగు లూథరన్ పంచాంగములో చూడవచ్చును. ఈ క్రైస్తవ పంచాంగమును చూడగా క్రిస్మసు దినమునకు మునుపటి నాలుగవ యాదివారము దానికి ఆరంభముగా నున్నది. ఈ నాల్గవ ఆదివారము నుండి క్రిస్మసువఱకు నుండు కాలము అడ్వెంటు (అనగా క్రీస్తు. రాకడ) కాలమనబడును. అడ్వెంటునుండి పరిశుద్ధ త్రిత్వమును గూర్చిన పండుగ వఱకు సుమారుగా ఆఱు మాసము లగును. ఈ యాఱు మాసములలో క్రైస్తవుల గొప్ప పండుగ దినము లన్నియు వచ్చును. త్రిత్వమును గూర్చిన పండుగకు తరువాతి మొదట యాదివారమునుండి సుమారు ఆఱు మాసముల వఱకు (అనగా మరల అడ్వెంటు కాలము ఆరంభి చుగువఱకు) క్రైస్తవు లందఱును ఆచరించునట్టి క్రైస్తవమయిన పండుగలు లేవుగాని ఈ మధ్య కాలములో అనగా అక్టోబరు 31వ తారీఖున లూథరన్ సంఘస్థులు దిద్దుపాటును గూర్చిన పండుగను ఆచరింతురు. క్రైస్తవ పంచాంగ ప్రకారము విశేష కాలముల వరుస యేదియనగా: అడ్వెంటులోని నాలుగు ఆదివారములు, క్రిస్మసు, నూతన సంవత్సరపు పండుగ దినము, ఎపిఫనియె (జన్యువరి 6); దాని పిమ్మట వచ్చు ఆదివారములు (ఇవి యీస్టరు కాలమునుబట్టి రెండు మొదలు ఆఱువఱకు నుండవచ్చును) సెప్తువజెసిమ, సెక్సజెసిమ, క్వింక్వజెసిమ అనబడు మూడు ఆదివారములు; లెంటులోని మొదటి దినము అనగా భస్మబుధవారము, లెంటులోని ఆరు యాదివారములు; వానిలో చివరిదియగు మట్టల ఆదివారము, క్రీస్తు శ్రమలను గూర్చిన పరిశుద్ధవారము,; ఈ వారములోని శుక్రవారములు మంచి శుక్రవార మన బడును; ఈస్టరు, దానికి తరువాతి యైదు ఆదివారములు, ఆరోహణదినము,

పెంతెకోస్తు (అనగా పరిశుద్ధాత్మ కుమ్మరింపబడుటను గూర్చిన పండుగ), పరిశుద్ధ త్రిత్వమును గూర్చిన యాదివారము; త్రిత్వమునుగూర్చిన పండుగకు తరువాతి యాదివారములు (ఈష్టరు కాలము ననుసరించి యివి 23 మొదలు 27 వఱకు నుండవచ్చును) ప్రతి యాదివారమునకు ప్రత్యేకముగా నొక పత్రిక పాఠమును, సువార్త పాఠమును, సంగ్రహప్రార్థనము (Collect), ప్రవేశ గీతము (Introit) ను ఏర్పడియున్నవి. ఇవి ఆరాధన దీపికలలోను, ఏర్పడిన పాఠములు లాధరణ పంచాంగములలోను అచ్చువేయబడును.

---

## 44. బైబిలు చదువుటను గూర్చిన బోధ.

ఈ ధర్మశాస్త్ర గ్రంథము నీవు బోధింపక తప్పిపోకూడదు. దానిలో వ్రాయబడిన వాటి నన్నిటి ప్రకారము చేయుటకు నీవు జాగ్రత పడునట్లు దివారాత్రము దాని ధ్యానించినయెడల నీ మార్గమును వర్ధిల్ల జేసికొని చక్కగా ప్రవర్తించెదవు యెహో. 1: 8

### భాగములు.

I. బైబిలు చదువుటయొక్క ప్రాముఖ్యత.

II. బైబిలు చదువవలసినది యెట్లు?

1. అనుదినమును చదువవలయును.
2. ఏదో యొక క్రమము ననుసరించి చదువవలయును.
3. భక్తిగల మనస్సుతో చదువవలయును.
4. నియమిత కాలములో చదువవలయును.
5. బైబిలు వాక్యములను కంఠపాఠముగా నేర్చికొనవలయును.
6. కుటుంబ సమేతముగా చదువవలయును.
7. గుడిలోను సబ్బాతుబడిలోను దానిని నేర్చుకొనవలయును.
8. బైబిలు చదువుకొనుటకై కొన్ని మార్గములు.
9. బైబిలు సంగతులను తేటపఱచునట్టి తగిన గ్రంథములను సంపాదించుకొని చదువవలయును.

## అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| దేవుని వాక్యమును శ్రద్ధతో నేర్చుకొనవలెను. | ద్వితీ 11: 18-25. |
| దేవుని వాక్యమును బహిరంగముగా చదువుట. | నెహెమ్యా. 8: 1-18. |
| క్రీస్తు దేవుని వాక్యముతో సాతానును జయించుట. | మత్త. 14: 1-11. |
| దేవుని వాక్య వర్ణన. | కీర్తన. 119: 1-44. |
| దేవుని వాక్య వర్ణన. | కీర్తన 119: 45-88. |
| దేవుని వాక్య వర్ణన. | కీర్తన. 119: 89-182. |
| దేవుని వాక్య వర్ణన. | కీర్తన. 119, 183-176. |

## వేదవాక్యములు.

I. 1. నీ మాటలు వెల్లడి యగుటతోడనే వెలుగు కలుగును. అవి తెలివి లేని వారికి తెలివి కలిగించును (కీర్తన. 119: 130).

2. లేఖనములయందు మీకు నిత్యజీవము కలదని తలంచుచు వాటిని పరిశోధించుచున్నారు; అవే నన్ను గూర్చి సాక్ష్యమిచ్చుచున్నవి (యోహాను 5: 39).

II. 3. యెహోవా ధర్మశాస్త్రమునందు ఆనందించుచు దివారాత్రము దానిని ధ్యానించువాడు ధన్యుడు (కీర్తన. 1: 2).

4. నీకు విరోధముగా నేను పాపము చేయక యుండునట్లు నా హృదయములో నీ వాక్యముంచుకొని యున్నాను. (కీర్తన. 119: 11).

5. మీరు ఈ మాటలను మీ హృదయములోను మీమనస్సులోను ఉంచుకొని వాటిని మీ చేతుల మీద సూచనలుగా కట్టుకొనవలెను. అవి మీ కన్నుల నడుమ బాసికములుగా నుండవలెను. (ద్వితీ. 11: 18).

6. నీవు నీ యింట కూర్చుండునప్పుడు త్రోవను నడుచునప్పుడు పండుకొనునప్పుడు లేచునప్పుడు వాటినిగూర్చి మాటలాడుచు వాటిని మీ పిల్లలకు నేర్పవలెను. (ద్వితీ. 11: 19).

## వివరము.

బైబిలును ఇతర గ్రంథములతో పోల్చి చూచినయెడల వజ్రమును గులకరాళ్ళతో సరిపోల్చినట్లుగ నుండును. పూర్ణ సత్యముయొక్క ప్రకాశత దానికి గలదు. అది రక్షణార్థమైన జ్ఞానమును (2. తిమొ. 3: 15) వెల్లడిపరచుచును కావున అన్ని కాలములకు అవసరమైన జ్ఞానమై యున్నది. అది యందరి యక్కరలను తీర్చగలదు. దాని బోధలోని సారమును అందరు గ్రహించుకొనగలరు. జ్ఞానుల గ్రహింపుకొని లోతైన సంగతులం దుండినను, విద్యలేని పామరులు సహా దాని

వలన రక్షణమార్గమును తెలిసికొనగలరు (1) దానిని తెలియని గొప్ప శాస్త్రుల కంటె, దానిని చదువుకొనిన విద్యాహీనులు జ్ఞానులై యున్నారు (కీర్తన. 119: 99, 100). చీకటిలో యాత్రికులకు వెలుగుచున్నట్లుగాను, రోగికి ఔషధ మున్నట్లుగాను (119: 50). అలసట జెందినవారికి నీరున్నట్లుగాను దేవుని వాక్యము మనకు నున్నది. అది గ్రంథము లన్నిటిలో ముఖ్యగ్రంథమై యున్నది. ఇహపరములయందు మనకు ఇది యొక్కటే మార్గదర్శియై యున్నది. ఈ విధముగ ఒక్క గ్రంథము మాత్రమే యున్నది అనగా, దీనికి సాటియైన మఱి యొక్కటిలేదని చిత్రవిచిత్రములగు గ్రంథములను రచించిన వాల్టర్ స్కాట్ అను పండితు డనెను.

దేవుని వాక్యము మన యాత్మలకు ఆహారమై యున్నది.—శరీర క్షేమమునకు దినాహారము అవసరమై యున్నట్లు అనుదినమును దేవుని వాక్య పోషణలేనియెడల మన యాత్మలకు క్షేమాభివృద్ధి కలుగ నేరదు. బైబిలును అనుదినము చదువుటవలననే మనము ఆత్మీయముగా ప్రభువు కృపయందును, జ్ఞానమందును అభివృద్ధి నొందగలము (2. పేతురు 3: 18). ఈలాగున యభివృద్ధి నొందుటకు మఱి యొక సాధనము లేనేలేదు. బైబిలును చదువని క్రైస్తవుడు ఆత్మయందు తప్పక బలహీనుడగును.

బైబిలు గ్రంథము పురాతనమైనదియు, మంచివిషయములను కలిగినదియునై యుండుటచేత అందఱును దానిని చదువవలయును. అయితే ముఖ్యముగా మనకు ఆత్మీయ క్షేమము కలుగవలెనని దాని చదువవలసినవారమై యున్నాము. దేవునితో నైక్యపడి ఇహమం దాయనను సేవించి పరమం దాయన సమీపమున నుండి సౌఖ్యము నొందుటకైన ఒక్కటే మార్గమిందులో చూపబడును. బైబిలువలననే మనము విశ్వాసులమై విశ్వాసము నందభివృద్ధి నొందగలము. ఇట్లుండగా దేవుని వాక్యమును వినుటకు గుడికి వెళ్లుట మాత్రము చాలదు. చదువగలవారందఱు దానిని అనుదినము శ్రద్ధతో చదువవలయును.

క్రీస్తు బైబిలును చదివి దానిని బాగుగా నేర్చికొనెను గనుక, ఆయన మనకు మంచి మాదిరియై యున్నాడు. పన్నెండేండ్లవయస్సుగలవాడైయున్నపు డాయన దేవాలయములో శాస్త్రుల మధ్యను కూర్చుండి దేవుని వాక్యమునుగూర్చి వారిని ప్రశ్న లడిగి, వారి ప్రశ్నలకు ప్రత్యుత్తరముల నిచ్చెను (లూకా 2:46). ఆయన సమాజమందిరములలోను, మఱి యితర చోట్లను చేసిన ప్రసంగములను చూడగా ఆయన పాతనిబంధనను బాగుగా నెఱిగిన వాడని స్పష్ట మగును. ఆయన పాత నిబంధనలోని అనేక వాక్యముల నెత్తిపలికెను. చివరకు సిలువ మీద పలికిన

వాక్యములు సహా బైబిలు వాక్యములై యున్నవి (మత్త. 27: 46=కీర్తన. 22: 1; యోహా. 19: 28=కీర్తన. 69: 21; లూకా 23: 46=కీర్తన. 31:5). మార్గము, సత్యము జీవమునై యుండిన క్రీస్తుప్రభువే బైబిలు నిట్లు చదివియుండగా, లెక్కలేని యక్కఱలు గల మనము ఎంత యవసరముగా దానిని చదువవలసియున్నదో ఆలోచింపుడి? మనము దేవుని వాక్యమును చదువవలెనని క్రీస్తు తానే మనకు ఆజ్ఞ నిచ్చెను (2).

II. బైబిలు చదువవలసినది యెట్లు?—అని యడిగిన యెడల మన ముదానిని 1. అనుదినమును చదువవలయును (3) అని చెప్పవలెను. ఒక శాస్త్రమును చదువగా చదువగా దానియందభిరుచి కలుగును. ఒకానొక వేళ ఏదో యొక గ్రంథము తీసికొని కొద్ది కొద్దిగా చదివి యావల పారవేయువానికి ఆ గ్రంథమును చదువుట మనోహారముగ నుండునా? బైబిలు చదువుటవలన మనకు సంతుష్టి కలుగవలెనని కోరినయెడల దానిని అనుదినమును చదువవలయును.

2. ఏదో యొక క్రమము ననుసరించి చదువవలయును.—ఏ క్రమమునైన ననుసరింపక, ఇష్టము వచ్చినట్లు అక్కడక్కడ చదువుటవలన లాభము లేదు గనుక మన మేదో యొక క్రమము ననుసరించి చదువవలెను. ఆరాధన పుస్తకములలోను, లూథరన్ పంచాంగములలోను అట్టి క్రమమును చూపునట్టి జాబితాలు అచ్చువేయబడి యున్నవి. సబ్బాతు బడి పాఠముల సంబంధమగు అనుదిన వేదపాఠములను చదువుట మిగుల యుత్తమము.

3. భక్తిగల మనస్సుతో చదువవలయును.—మనము వాక్యమును ఊరకయే చదువక, మన యాత్మలకు ఆదరమును, బలమును కలుగులాగున భక్తిగల మనస్సుతో చదువవలయును. బైబిలు గ్రంథమును మర్యాదతో తీసికొని, చదువకముందు ప్రార్థన చేసి, విశ్వాసముతో చదివి, దానిలోని బోధలు మనకు ఏలాగు సరిపడునో ధ్యానించుకొనవలెను (4). వాక్యమును చదివిన పిమ్మట మనము చదివిన దాని మఱవక, ధ్యానించుకొని, దాని యందు గల బోధలను లక్షించి వాటి ననుసరింప వలెను (కీర్తన. 119: 9, 15, 16).

4. నియమిత కాలములో చదువవలయును.—అది ఉదయమున నైనను, మధ్యాహ్నమందైనను, సాయంతనమున నైనను మొత్తానికి బైబిలు చదువుటకేదో యొక నియమిత కాల ముండవలెను. ఎంతపని యున్నను ప్రతివాడు దినమంతటిలో కొంతసేపు బైబిలును చదువగలడు లేక చదివించుకొనగలడు. అయితే అలాగు చదువుటకుగాని చదివించుకొనుటకుగాని నియమిత కాలము లేనియెడల క్రమముగా

చనువుటవలను కలుగక ఒకానొకప్పుడు అనేక దినములు సహా ఊగకయే గడచి పోవును. మఱియు నియమిత కాలములో భోజనము చేయనివాని బలమేలాగు క్రమ క్రమేణ తగ్గిపోవునో అలాగు మనము నియమిత కాలములో దేవుని వాక్యమును చదువని వారమైనయెడల మన యాత్మబలము క్రమ క్రమముగా క్షీణించిపోవును. నియమిత కాలములో దేవుని వాక్యమును చదివినయెడల దినమునకు కొద్దిగా చదివినను సంవత్సరము పొడుగున గొప్ప నేర్పును, ఆత్మీయ బలమును పొందగలము.

5. బైబిలు వాక్యములను కంఠపాఠముగా నేర్చుకొనవలయును.— బైబిలు చదువుట మాత్రము చాలదు. మనము దానిలోనను నేక వాక్యములను కంఠపాఠముగా నేర్చుకొని వాటిని మన హృదయములో దాచిపెట్టవలయును (5). మనలను సరియైన మార్గములో నడిపించుటకును, మనల ఆదరించుటకును ఏ వాక్యములు అన్నిటిలో నుపయోగకరములై యున్నవో అట్టి వాక్యములను ముఖ్యముగా కంఠపాఠము చేసికొనవలెను. యోహాను 3: 16; రోమా 5: 1 మొదలగు వాక్యములను, 23, 46, 90 మొదలగు కీర్తనలను, క్రీస్తుచెప్పిన ఆశీర్వచనములను (మత్త. 5: 3-12), 1 కొరి 13 లో ప్రేమనుగూర్చి పౌలు వ్రాసినవర్ణనలను కంఠపాఠముగా నేర్చుకొనవలెను. దేవుని వాక్యములలోనుండి మనము దినమునకు కొద్దిగా కంఠపాఠము చేసినయెడల సత్యమునకు పక్షముగా విరోధులతో వాదించుటకును, ఆత్మీయాభివృద్ధిని పొందుటకును, జీవమందును మరణమందును మనకు ఆదరములు కలుగుటకును, అనేక వాక్యములను మనము నేర్చుకొనగలము గనుక అట్టివానిని చక్కగా నేర్చుకొని మనస్సులో నుంచుకొనవలెను.

6. కుటుంబ సమేతముగా బైబిలు చదువవలయును.—ప్రతి కుటుంబములోను నియమిత కాలమందు కుటుంబప్రార్థన యుండవలెను. ఆ సమయమందు బైబిలు పాఠములలో నొకదాని చదువవలెను (6). మఱియు పిన్నలు పెద్దలును కలిసి ఆ పాఠములో నున్న శ్రేష్ఠమైన వాక్యమును కంఠపాఠము చేసినయెడల అది యెంతో ధర్మకార్యమగును.

7. గుడిలోను, సబ్బాతుబడిలోను దేవుని వాక్యమును నేర్చుకొనవలెను.—దేవుని వాక్యము ప్రతి యాదివారమున గుడిలో చదువబడి ప్రసంగింపబడును. ఆ యాదివారమునకు ఏర్పాటుపబడిన పత్రిక పాఠమును, సువార్త పాఠమును మన మనస్సులకు బాగుగా పట్టవలెను. బోధకుడు చేయు ప్రసంగమును మనము శ్రద్ధతో వినవలయును. గుడినుండి యింటికి వచ్చిన పిమ్మట మన బైబిలు తెఱచి ప్రసంగవాక్యమును, దానికి సంబంధించిన వాక్యములను సరిపోల్చి చూచుకొని (కార్య. 17: 11) వాటిని ధ్యానింపవలెను.

సబ్బాతుబడిలో మనము బైబిలును క్రమముగా చదువవలెనను నొక యేర్పాటు కలదు. మనకు ఆత్మీయమయిన మేలులు కలుగులాగున మనలో ప్రతివారును పాఠమును శ్రద్ధతో చదువవలెను. సబ్బాతుబడిలోని యుపాధ్యాయులు తగిన నేర్పుగలవారై యుండవలెను. ఇతరులకు దేవుని వాక్యమును మన శక్తికొలది నమ్మకముగా బోధించుట వలన గాక మనము దేవుని వాక్యమును చక్కగా నేర్చుకొనుటకు మఱి మంచి యేర్పాటు లేనే లేదు.

## 8. బైబిలు క్రమముగా చదువుకొనుటకు కొన్ని ముఖ్యమార్గములు.

బైబిలు చదువుటకు వేర్వేఱు క్రమములున్నవి. వాటిలో నొకవిధమయిన క్రమమును చదివిన పిమ్మట మఱియొక దానిని ననుసరించుట మేలు.

మన సబ్బాతుబడి పాఠముల ననుసరించి యీ విధముగా బైబిలు చదువుట మన మొదటి విధియై యున్నది. సబ్బాతుబడి పాఠముల నేర్పరిచినవారు ఒక క్రమము ననుసరించి వాటిని యేర్పఱిచి యున్నారు. వారి యేర్పాటు ననుసరించి ఆ పాఠములను శ్రద్ధతో చదివినయెడల మనము రాను రాను బైబిలు బోధలలో ప్రవీణులము కాగలము.

మన బైబిలులోని గ్రంథముల వరుస ననుసరించి వాని చదువుటయును మంచి యేర్పాటయి యున్నది. ఆ గ్రంథముల జాబితాను మనము మొదట బాగుగా నేర్చుకొని, ఆ గ్రంథముల గ్రంథకర్తలను గూర్చియు, అవి వ్రాయబడిన కాలమును గూర్చియు తెలిసికొనవలెను. ఈ విధముగా బైబిలు చదువునప్పుడు ఒక్కొక్క పుస్తకమును అధ్యాయముల ప్రకారముగా మాత్రము చదువక ఆ పుస్తకములను మొత్తముగా చదివి వాటి ముఖ్యోద్దేశమును గుర్తింపవలెను. ఒక గ్రంథము నట్లు మొత్తముగా చదివిన పిమ్మట దానిలోని ముఖ్యవిషయములను, ముఖ్య బోధలను చదివి ధ్యానించిన యెడల మేలు.

అంశముల ననుసరించి బైబిలు చదువుటకూడ నొక మంచి యేర్పాటయి యున్నది. ఈవిధముగా ఒక్కొక్క విషయమునుగూర్చి బైబిలు యేమి బోధించునో నేర్చుకొనగలము. బైబిలులో విషయసూచికలు కలిగియున్న గ్రంథ మొకటి యుండినయెడల ఈ విధముగ చదువుటకూడ చాల యుపయోగముగ నుండును. అయితే అది లేకపోయినను, మనము స్వయముగా బైబిలును పరీక్షించి ఆయా విషయములను గూర్చిన బోధల నొక్కటిగా జేర్చి వాటిని నేర్చుకొనుట యెంతో మేలుకరముగా నుండును. ఈలాగు చేసినయెడల బోధలను నిర్ధారణ చేయగలము, లేక యిదివఱకు నేర్చుకొనిన తప్పుబోధలను దిద్దుకొనగలము.

9. బైబిలు గ్రంథములను తేటపఱుచు గ్రంథములను సంపాదించుకొని చదువవలయును.—మనము సభ్యాతుబడి పాఠపుస్తకములను కాపాడి యుంచుకొనవలయును. బైబిలును తేటపఱుచునట్టి పుస్తకములు ఇప్పటికి తెనుగు భాషలో నెక్కువగా ప్రచురింపబడలేదు గాని, ఉన్న పుస్తకములనైనను మన ముపయోగించుకొనిన యెడల మేలుగా నుండును. మన తెనుగు లూధరన్ పబ్లికేషన్ సమాజపు వారు ప్రచురించు పుస్తకములను సంపాదించుకొని చదువుట మిగుల నుపయుక్తము.

మనము చదువవలసిన ముఖ్యగ్రంథము బైబిలే. మనలో చదువగల ప్రతివానికి మంచి యచ్చుతో నచ్చువేయబడిన స్వంత బైబిలు ఒకటి యుండవలెను. బైబిలు స్థలములను కనబఱుచు పటములు (Maps) గల బైబిలును సంపాదించుకొనిన యెడల బాగుగ నుండును. మనము మనస్వంత బైబిలు నుపయోగించి దానిని చదువవలెను. అలాగుచేసినయెడల బైబిలులో ఆయా వాక్యములుండు చోటులను మనము గుర్తించి తెలిసికొనగలము. మనము విశేష బోధలు నేర్పి ఆదరణలను కలిగించు వాక్యములను జ్ఞప్తి యుంచుకొనుటయు వాని పంక్తుల క్రిందుగా గీటులు గీయుటకూడ మంచి యేర్పాటయి యున్నది.

---

## 45. సత్యమాడుటనుగూర్చిన బోధ.

నీతియు యదార్థమైన భక్తియు గలవారై, దేవుని పోలికగా సృష్టింపబడిన నవీన స్వభావమును ధరించుకొనవలెను. ఎఫెసీ 4: 24.

### భాగములు.

I. సత్యమాడుటయొక్క ప్రాముఖ్యత.

II. ఒక సంగతిని గూర్చిన సత్యము పలుకుటకై ముందుగా సత్యము తెలిసికొని, సత్యము గాక మఱి దేనిని పలుకకూడదను నుద్దేశము కలిగి యుండవలెను.

III. మనము ఆయా విషయములనుగూర్చి సత్యముపలుకవలెను.

IV. ఆయా మనుష్యులనుగూర్చి సత్యము పలుకవలెను.

## అనుదిన వేదపాఠములు.

మొదటి యబద్ధము. ఆది 3: 1-5; యోహా. 8: 44, 45.
అబద్ధికులకు కల్గిన శిక్ష కార్య. 5: 1-11.
సత్యమాడవలెను. ఎఫె. 4: 25-32; కొల. 3: 9-11.
మాటలాడు శక్తిని దుర్వినియోగపఱచుట. యాకోబు. 3.
ఇతరులకు తీర్పు చేయకూడదు. మత్త. 7: 1-5; లూకా 6: 37-41.
ఇతరులపై లేనిపోని నేరములనుకల్పించ రాదు. నిర్గ. 23: 1-3; ద్వితీ.19:15-21.
మన మాటలనుబట్టి మనము తీర్పు పొందుదుము. మత్త. 12: 22-37.

## వేదవాక్యములు.

I. 1. మోసము చేయువాడు నాయింట నివసింపరాదు. అబద్ధము లాడు వాడు నా కన్నులయెదుట నిలువడు (కీర్తన 101: 7).

2. ఆయన పాప మేమియు చేయలేదు. ఆయననోటను యే కపటమును కనబడలేదు (పేతురు 2: 22).

II. 3. ప్రభువు దయాళుడని మీరు రుచి చూచి యున్నారు గనుక సమస్తమైన దుష్టత్వమును సమస్తమైన కపటమును వేషధారణను అసూయను సమస్త దూషణ మాటలను మాని, రక్షణ పొందుటకై క్రొత్తగా జన్మించిన శిశువులను పోలినవారై, నిర్మల వాక్యమను పాలనవలన ఎదుగు నిమిత్తము ఆ పాలు అపేక్షించుడి (1. పేతురు 2: 1-3).

4. నీ మాటలనుబట్టి నీతిమంతుడవని తీర్పు నొందుదువు, నీ మాటలను బట్టియే అపరాధివని తీర్పు నొందుదువు (మత్త. 12: 37).

III. 5. ప్రేమ గలిగి సత్యముచు చెప్పుచు క్రీస్తువలె నుండుటకు, మన మన్ని విషయములలో ఎదుగుదము (ఎఫెసీ 4: 15).

IV. 6. లేనివార్త పుట్టింపకూడదు; అన్యాయపు సాక్ష్యము పలుకుటకై దుష్టునితో నీవు కలియ కూడదు (నిర్గ. 23: 1).

7. నీ ప్రజలలో కొండెములాడుచు ఇంటింటికి తిరుగకూడదు (లేవీ. 19:16).

## వివరము.

సత్యము దేవుని మూలమైనది (కీర్తన. 19: 151). అబద్ధమునకు సాతాను మూలకర్తయై యున్నాడు (యోహా. 8: 44). దేవుడు అబద్ధమాడడు. ఆయన యబద్ధము పలుక నేరడు (సంఖ్యా. 23: 19, హెబ్రీ 6: 18). మనము దేవుని పోలి

యుండవలసిన వారమై యున్నాము. మాటలయందును, క్రియలయందును సత్యవంతులమై, ఏ విధమైన యబద్ధముల చేతనైనను ఇతరులను మోసము చేయక నుండవలెను (కొల. 3: 9).

మనుష్యులకు నుండు పరస్పర సంబంధమునుబట్టియే మనము అత్యవసరముగా సత్యము పలుకవలెను. లేనియెడల మనుష్యుల వ్యవహారములలో తొందరలు కలుగును. మనుష్యులు సత్యము పలుకువారు కాకపోయినయెడల, వారొకరియందొకరు నమ్మిక నుంచుకొనలేకపోదురు కావున, వారు చేయు ప్రతిపనిలో సంశయము లుండుట తటస్థమగును. ఈ విధముగ సత్యము లేనిది మనుష్యులు ఒకరితో నొకరు చేయవలసిన వ్యవహారములలో నొకటియైనను జరుగనేరదు.

ఇతరులను మోసపుచ్చుటకు మన మే కార్యమునైనను చేసినయెడల గాని, యే మాటనైనను పలికినయెడలగాని అది యబద్ధమగును. మన మాటల వలన మాత్రము గాక, మన కపట క్రియలవలనకూడ మన మబద్ధమాడగలము (సామె. 6: 13). అబద్ధము లాడువాడు దేవునికిని, సజ్జనులకును అసహ్యుడు (1). అబద్ధికులందఱు అగ్ని గంధకములతో మండు గుండములో పాలు పొందెదరు (ప్రక. 21: 8). మన మెప్పుడును అబద్ధమాడ కూడదు. సత్యము నొప్పుకొనినయెడల నేదో యొక నష్టము మనకు కలిగినను సత్యమే పలుకవలెను గాని అబద్ధమాడి యా నష్టమును తప్పించుకొనుట ధర్మము కాదు. ఇట్టి విషయములో అబద్ధము లాడుట యవసరములని మన మెన్నిసారులు చెప్పినను, అబద్ధమాడుట యెప్పటికి పాపమే. అది దేవునికి అసహ్యముగను, సాతాను క్రియల కనుకూలముగ నున్నది. అది సత్యమునకు చేటుగనుండి, మన స్వంత గుణములను చెరిపి ఇతరులకు హాని కలిగించును. ఒక యబద్ధమును కప్పివేయుటకు వెయ్యి అబద్ధములు కావలసియుండును.

క్రీస్తు మనకు చూపిన మాదిరిని విచారింపగా ఆయన తన క్రియలయందును, మాటలయందును, గుణములయందును సత్యస్వరూపియై యుండెను. ఆయన యెన్నడు నేవిధము చేతనైనను ఒక విషయమునుగూర్చి గాని, ఒక మనుష్యునిగూర్చి గాని సత్యమును తప్పియుండలేదు. ఆయనయందు ఏ కపటమైనను ఎన్నడును కనబడ లేదు (2). ఆయన తలంపులకును మాటలకును కొద్ది వ్యత్యాసమైనను కనబడ లేదు. మనుష్యులనుగూర్చి గాని, ఆయా విషయములనుగూర్చిగాని ఆయన మాటలాడినప్పుడు ఉన్న సంగతిని కాక మఱియొక దానిని పలుకలేదు. ఆయన సత్యమునే పలికెను. అదియు గాక ఆయన సత్యమై యున్నాడు (యోహా. 14: 6).

II. ఒక సంగతినిగూర్చి సత్యము పలుకుటకై ముందుగా సత్యమును తెలిసికొని సత్యము గాక మఱి దేనిని పలుక కూడదను నుద్దేశమును కలిగి యుండవలెను.—ఆయా మనుష్యులను గూర్చిగాని, ఆయా విషయములనుగూర్చి గాని, మనకు నుండు అభిప్రాయములు తప్పభిప్రాయము లైన యెడల మన మే మాత్రము సత్యము పలుకలేము గదా? ఆయా విషయములయందు మనము అభిమానము నుంచినయెడల వాటిలో గల లోపములను గుర్తెరుగ జాలము. మఱియు మనము ద్వేషించిన విషయములలో నుండు మంచిని చూడజాలము. ఉన్న పాటున ఒక సంగతిని చూచుటకు మొదట మనకు తేటయైన ఆలోచనయు, దృష్టియు అవసరమైయున్నది. అనగా మన మిట్టి యభిమానమును ద్వేషబుద్ధిని విడిచి ఆయా మనుష్యులను, లేక విషయములను నిదానముగా లక్షించి, వానిగూర్చి న్యాయమైన సంగతుల నే తలంచుకొనవలెను.

మఱియు ఉన్న వాస్తవమును తెలిసికొనిన పిమ్మట దానిని నిష్కపటముగా చెప్పవలెను.—మనలో నొక యభిప్రాయము నుంచుకొని మాటలతో మఱియొక యభిప్రాయమును చెప్పరాదు. మనకు లేని అనుభవములు, తలంపులు, అభిప్రాయములు మనకు నున్నట్లుగా మాటలాడకూడదు. మనము వేషధారులమును, మోసము చేయువారమును గాక యదార్థవంతులమై యుండవలెను (3). మన మాటలును, క్రియలును నిష్కపట్యములై యుండవలెను (రోమా 12: 9).

దేవుడు మనుష్యులకు ఉచ్చారణ శక్తి నిచ్చెనుగాని మృగములకైనను, మఱి దేనికైనను అట్టి శక్తిలేదు. అది యెంతో దివ్యమైన వరమైయున్నది. కావున మనము దానిని దుర్వినియోగ పఱచకొనక యుండునట్లు మిక్కిలి జాగ్రతపడవలెను. ఆ శక్తిని మన ముపయోగించు విధమును బట్టియే అది దీవెనగాని, శాపముగాని అగునది యగును. మనము వచించు మాటలవలన నితరులకు సంతోషము లేక దుఃఖము, ఆదరణ లేక మనోబాధ, సహాయము లేక నిరాశయు గలుగును. మనము మన మాటలచే నితరులను బలపఱచగలము, లేదా అధైర్య పఱచగలము; వారి విశ్వాసమును వృద్ధి నొందించగలము లేదా వారిని శోధించి పాపము లోనికి నడిపించగలము. మన మాటలవలన నిట్టి గొప్ప కార్యములు జరుగును గనుక, మనము, తొందరపడక (ప్రస. 5: 2), నిదానముతో. మాటలాడవలెను. మఱియు మనము మితిమీఱి మాటలాడ కూడదు (సామె 10: 19). ఇతరులయెడల నిర్దయతోను, అసత్యముగాను మాటలాడరాదు. మనము ఇతరులనుగురించి వచించు మాటలు వెంటనే మఱువబడక వారి మనస్సులలో పడి వారికి మేలుగనో లేక కీడుగానో

యుండును. మన మాటలవలన మేలు పొందినవారు ఇంక నితరులకు మేలుచేయుదురు. కీడు నొందినవారు ఇంక నితరులకు కీడుచేయువా రగుదురు. ఈ విధముగా మనము వచించిన మాటలైనను, ముద్రింపబడి ప్రచురమైన మాటలైనను నిత్యముగా మేలు కీడులకు కారణము లగును. మన మాటలను బట్టియే న్యాయపు తీర్పు దినమున మనము తీర్పు నొందుదుము (4) హృదయమందు నిండియుండు దానిబట్టి నోరు మాటలాడును గదా (మత్త. 12: 34) కాబట్టి మన మాటలు మన గుణములకు దృష్టాంతములై యున్నవి.

III. ఆయావిషయములను గూర్చి మనము సత్యము పలుకవలెను. —ఆయావిషయములను గూర్చి మనము ఇతరులతో మాటలాడునపుడు ఉన్న సంగతిని మాత్రమే పలుకవలెను (5) ఒక విషయమునుగూర్చి మనకు సందేహము లున్నయెడల, వానిని రూఢిగా తెలిసికొనియున్నట్లు మాటలాడకూడదు. సంగతియావత్తు చెప్పుచున్నామనుచు, దానిలో సగము సత్యమును మఱుగుచేయకూడదు. ఒక సంగతినిగూర్చి మన స్వంతయభిప్రాయములను, ఊహలను చేసినపుడు మా యభిప్రాయమిది, లేక యిది మా యూహయని చెప్పవలెనుగాని మన యభిప్రాయములే శాస్త్రములై యున్నట్లు ఖండితముగా చెప్పరాదు.

మనము ప్రేమగలిగి సత్యము పలుకవలెను (ఎఫెసీ 4: 15). ఇతరులపై కోపపడి, వారిని అవమానపఱచుటకై వారికి బుద్ధి చెప్పినయెడల దానివలన మనము వారికి కీడునేకాని యెంతమాత్రమును మేలు చేయనేరము. ఒకా నొకపుడు ఇతరుల మేలుకొరకు వారిని గద్దింపవలసిన సమయములు తటస్థించును (గల. 5: 16; సామె. 27: 6). అట్టిసమయములో మనము గర్వపడి వారిని సిగ్గుపఱచవలెనని కోరక, వారి మేలున్నే-కోరి ఈలాగున గద్దించుచున్నామని వారు తెలిసికొనునట్లు తగిన రీతిగా వారిని గద్దింపవలెను.

ఏది సత్యమనియు న్యాయమనియు మనము తెలిసికొని యున్నామో అది సత్యమైనదనియు న్యాయమనియు చెప్పుటకు భయపడక దానిని యొప్పుకొనవలెను. ముఖ్యముగా దేవుని వాక్యములోని సత్యముల విషయము అట్టి ధైర్యము నగపఱచవలెను. లూథరు దీనికి మంచి మాదిరిని చూపెను. వర్మ్సు పట్టణములో కూడిన మహా సభలో చక్రవర్తియు రాజులును రోమన్ సంఘాధికారు లందరును—నీవు చేసిన బోధలు తప్పులై యున్నట్లు ఒప్పుకొని వానిని రద్దుపఱచుకొనుము లేనియెడల నీకు మరణశిక్ష విధింతుమని బెదిరించినను అతడు పట్టు వదలక సత్యమును ధైర్యముతో ఒప్పుకొనెను. ఎన్ని యాపదలు కలిగినను మన మీ విధముగ దేవుని సత్యమును పట్టుకొని దానిని ఒప్పుకొనవలెను.

మఱియు మనము మాట నిచ్చిన పిమ్మట దాని తప్పకూడదు. ఇచ్చిన మాటను తప్పువారు అబద్ధికులే. అట్టి వారి మాట నికను ఇతరులు నమ్మలేరు. మన మొకరికి మాట నిచ్చిన తరువాత యే విధముగనైనను దాని నెఱవేర్చవలెను. ఒక కార్యమును నెఱవేర్పలేనని తెలిసియుండియు దాని నెఱవేర్తునని మాట నిచ్చుటయు, ఒక కార్యమును చేయుటకు మనస్సు లేక పోయినను దాని చేతునని చెప్పుటయు బొత్తిగా అధర్మమై యున్నది.

మాట తప్పువారును, ఇంక నితర యక్రమములు చేయువారును తాము చేయు అక్రమములను కప్పివేయుటకై యనేక నెపములు చెప్పుదురు. అట్టి నెపములలో దాదాపుగా అన్నియును లేనిపోని యబద్ధములై యున్నవి. తప్పు చేసినందుకై యెన్నడును సాకులు చెప్పరాదు. చేసినపాపమునకు గల కారణమును సాకులతో చెప్పక దాని విషయమై పశ్చాత్తాపపడి క్షమాపణ నడుగవలెను. మనము వాగ్దానముచేసిన మాటను నెఱవేర్చుట యసాధ్యమయినయెడల దానిని తప్పవచ్చునుగాని మఱి యే హేతువుచేతనైనను దానిని తప్పకూడదు.

ఇతరులయెడల నేదైనతప్పుచేసియున్నట్లు తెలిసికొనినయెడల మనము అతప్పును ఒప్పుకొని వారి క్షమాపణ నడుగవలెను. అలాగున చేయకపోవుట మనము చేసినది తప్పు కాదనునట్లుగ నున్నది. మఱియు అది యబద్ధమాడినట్లుగ నుండును. మనము ఇతరులయెడల చేసిన తప్పిదముల నొప్పుకొని, ఆ తప్పిదములను శక్యమైనంతవఱకు దిద్దుకొని, వారి క్షమాపణ నడుగకపోయినయెడల, మనము దేవుని కిష్టులము కానేరము (మత్త. 5: 23, 24).

మనము మనకు తెలిసియున్న యితరుల రహస్యములనుకూడ బయలుపఱచ కూడదు. 'కొండెగాడైతిరుగువాడు పరుల గుట్టుబెట్టబెట్టును'. నమ్మకమైన స్వభావము గలవాడు సంగతి దాచును (సామె. 11: 13). మనము ఇతరుల పాపములలో పాలివారమై యుండినపుడు వాటిని దాచి పెట్టకూడదు. అయితే యితరులు తెలిసికొనలేని రహస్యము లందఱికిని కలవు. ప్రాణస్నేహితులు మనకు అట్టి రహస్యములను తెలిపినయెడల మనము వాటిని యితరులతో నేమాత్రమును చెప్పకూడదు. చెప్పినయెడల మన మట్టి స్నేహమునకు పాత్రులము కాము.

IV. ఆయా మనుష్యుల విషయము మనము సత్యము పలుకవలెను. —ఆయా విషయములనుగూర్చి సత్యము పలుకుట యెంత ముఖ్యమైనదైనను ఆయా మనుష్యులనుగూర్చి సత్యము పలుకుట మఱీ ముఖ్యమును, అవసరమునై యున్నది. మనము మన పొరుగువారి మీద అబద్ధ సాక్ష్యమును పలుకకూడదని యొనిమిదవ యాజ్ఞలో మనకు స్పష్టముగా నియమింపబడి యున్నది. (నిర్గ. 20: 6). ఒకని

గూర్చి కొండెము లాడి అతని పేరును చెరుపువాడు అతని సొమ్మును దొంగిలించువాని కంటె అతనికి నెక్కువ కీడు చేయును (సామె. 22: 1). దొంగకంటె చాడీకోరు నీచుడు.

ఇతరులనుగూర్చి మనము నిర్దయగాను అన్యాయముగాను యోచింపబడకుండునట్లు చూచుకొనవలెను. మన మితరులనుగూర్చి తీర్పుతీర్చగూడదని క్రీస్తు మనకు బోధించెను (మత్త. 7: 1-5) ఇతరులు చేసినదాని చూచి వారు దురుద్దేశముతో చేసిరనియు, చెప్పినదానిని విని వారు దురుద్దేశముతో పలికిరనియు మన మనుకొనగూడదు. ఇతరుల కార్యములను మనము సాధ్యమైనంతవరకు దయగల భావముతో చూడవలెను. వారు తప్పుచేసినయెడల అది తప్పుకాదని మన మెన్నడును అనుకొనరాదు. అయితే తప్పుచేసినవాని విషయములో నైనను మనము నిర్దయను చూపక, వానికి అన్యాయముచేయక ఆ తప్పు మార్గములోనుండి వాని రక్షించుటకు ప్రయత్నము చేయవలెను.

మన మితరులనుగూర్చి లేనిపోని నేరములను కల్పించి, వారిపై చాడీలను చెప్పకూడదు. (6: 7) చాడీకోరులు యెన్నో తొందరలకును మనోవేదనలకును కారకులగుదురు. (సామె 11: 9) మన పరువును దక్కించుకొనుటకు మనకు నెంతటి యాశయున్నదో, ఇతరుల మంచిపేరును కాపాడుటకును మనకు నంతటి యాశ యుండవలయును. మన మెఱిగినవారినిగూర్చి యితరు లన్యాయముగా మాటలాడుటను మనము వినినయెడల అది యన్యాయమని చూపి వారిపక్షముగా మనము మాటలాడవలయును. ఇతరులనుగూర్చి యెల్లప్పుడును కొండెములు చెప్పువారు కొందఱు గలరు. అట్టివారితో మనము పొందుచేయకూడదు. ఏమనగా వారితో పొందుచేసినయెడల వారు మనలనుగూర్చి కూడ చాడీలు చెప్పుదురనుటకే సంశయమును లేదు.

ఇతరులను పొగడుటయందు కూడ మనము సత్యమును మీఱకూడదు (యోబు 32: 21, కీర్త 12: 2, 3). మెప్పునకగిన కార్యము నొకడు చేసినయెడల దానికై యతని మెచ్చుకొనుట ధర్మమే. అట్టి కార్యమున కతని మెచ్చుకపోవుట సత్యము ననుసరించునది కానేరదు. అసూయవలన మనము ఇతరులు చేసిన మంచి కార్యములను తృణీకరింపక (1 కొరి. 12: 14; యాకో. 3: 16 వారు చేసిన యోగ్యమైన కార్యముల నిమిత్తము వారిని తగినట్లు మెచ్చుకొనవలెను. ఇతరులలోగలతప్పులను మాత్రము వివేచించి, మఱి దేనిని చూడనివాడు ఇతరులకు విసుకును పుట్టించును. లేనిపోని ముఖస్తోత్రములు చేయువాడు వారిలో గర్వము పుట్టించును గాని తగినట్లు సమయానుకూలముగా నితరులను మెచ్చుకొనువాడు మఱి మంచి పనులను పూనుకొనుటకు వారిని ప్రోత్సాహపరచును.

## 46. ఆస్తినిగూర్చిన బోధ.

సంతుష్టి సహితమైన దైవభక్తి గొప్ప లాభ సాధనమై యున్నది. 1 తిమో: 6: 6.

### భాగములు.

I. ఆస్తిని సంపాదించుకొను విధము.

II. ఆస్తివిషయమైన హెచ్చు తగ్గులు.

III. ఐశ్వర్యమును గూర్చినబోధ.

IV. దారిద్ర్యమునుగూర్చిన బోధ.

V. మనకు గల వాటితో మనము తృప్తినొంది, ఇతరుల స్థితిని బట్టికాక, వారి యోగ్యతనుబట్టి వారిని ఘనపఱచవలెను.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| అన్నిటిని సమష్టిగా నుంచుకొనుట. | కార్య 4: 32-5: 11. |
| ఐశ్వర్యమువలన శోధనలు. | మత్త. 19: 16-30. |
| దేవునియెడల ఐశ్వర్యవంతులమై యుండవలెను. | లూకా 12: 13-34. |
| ధనము నుపయోగింప గూడని విధము. | లూకా 16. |
| అతి దారిద్ర్యము సోమరితనమువలన, గలిగి శ్రద్ధవలన తొలగి పోవును. | సామె 6: 6-11, 10: 1-5. |
| స్థితివిషయమైన బోధ. | 1 తిమో. 6: 3-19. |
| ఏ స్థితిలో నుండినను తృప్తిగలిగి యుండవలెను | ఫిలి. 4: 10-14. |

### వేదవాక్యములు.

I. 1. దేవుడు వారి నాశీర్వదించెను; ఎట్లనగా—మీరు ఫలించి అభివృద్ధి పొంది విస్తరించి భూమిని నిండించి దాని లోపఱచుకొనుడి: సముద్రపు చేపలను ఆకాశ పక్షులను భూమిమీద ప్రాకు ప్రతి జీవిని ఏలుడని దేవుడు వారితో చెప్పెను (ఆది 1: 28).

II. 2. దేవుని ప్రేమించువారికి, అనగా ఆయన సంకల్పము చొప్పున పిలువ బడినవారికి, మేలు కలుగుటకై సమస్తమును సమకూడి జరుగుచున్నవని యెరుగుదుము (రోమా 8: 28)

III. 3. ఒకడు సర్వలోకము సంపాదించి తన ప్రాణము పోగొట్టుకొన్న యెడల వానికేమి ప్రయోజనము? మనుష్యుడు తన ప్రాణమునకు ప్రతిగా నేమి యియ్యగలడు? (మార్కు 8:36, 37)

4. ధనాపేక్ష సమస్తమైన కీడులకు మూలము. కొందరు దాని నాశించి విశ్వాసమునుండి తొలగిపోయి నానా బాధలతో తమ్మును తామే పొడుచుకొనిరి (1 తిమో 6: 10).

IV. 5. నేను చిన్నవాడనై యుంటిని. ఇప్పుడు ముసలివాడనై యున్నాను. అయినను నీతిమంతులు విడువబడుటగాని, వారి సంతానము భిక్షమెత్తుటగాని నేను చూచియుండలేదు. కీర్త. 37: 27).

6. వ్యర్థమైనవాటిని అబద్ధములను నాకు దూరముగా నుంచుము. పేదరికమునైనను, ఐశ్వర్యమునైనను నాకు దయచేయకుము. తగినంత ఆహారము నాకు అనుగ్రహించుము. ఎక్కువైన యెడల నేను కడుపు నిండినవాడనై నిన్ను విసర్జించి యెహోవా యెవడని యందునేమో. లేక బీదనై దొంగిలి నా దేవుని నామమును దూషింతునేమో (సామె 30: 8, 9).

## వివరము.

I. ఆస్తిని సంపాదించుకొను విధము.—సమస్తము దేవుని వశమును ఆయన సొత్తునై యున్నది. (1కొరి. 10: 26). అయితే దేవుడు సమస్తమును సృజించిన పిమ్మట తన యధికారము క్రిందనే దీనినంతటిని మనుష్యుల వశము చేసెను (1). ఈ యేర్పాటునుబట్టి భూములనుగాని యిండ్లనుగాని సంపాదించుకొనువారిని అవి ఆస్తియును, సొంతములునై యున్నవి.

ఆస్తి కొందఱికి పిత్రార్జితమువలనను, మఱికొందఱికి కష్టార్జితమువలనను లభించును. అయితే యెక్కువమంది తమ సొంత కష్టమువలననే ఆస్తిని సంపాదించుకొనుచున్నారు. ఇట్లు కష్టపడి మనుష్యులు తమకు కావలసినవాటిని సంపాదించుకొనవలె ననునది దేవుని యేర్పాటయి యున్నది. మనుష్యులు కష్టపడి భూమిని లోపఱచుకొనవలెనని ఆయన వారికి ఆజ్ఞాపించెను. (1) మఱియు సోమరితనము ఆయనకు అసహ్యమై యున్నది (2. థెస్స 3: 10). కష్టపడి పనిచేసి, సంపాదించుకొనిన దానిని మితముగా ప్రయోగించుటయే ఆస్తిని సంపాదించుటకైన న్యాయమగు పద్ధతియై యున్నది.

II. ఆస్తి విషయమైన హెచ్చు తగ్గులు.—ఇట్టి హెచ్చు తగ్గులు అనేకములు గలవు. కొందఱికి చాల యాస్తి కలదుగాని, ఎక్కువ మందికి బహు కొద్ది యాస్తికలదు. ఇట్టి హెచ్చు తగ్గులు ఒకానొకపుడు మనుష్యుల యన్యాయము వలన కలిగినను, ఆస్తి విషయములో నందఱికి సమత్వముండక, హెచ్చుతగ్గులుండవలె ననునది మాత్రము దేవుని యేర్పాటయి యున్నది. యెహోవా దారిద్ర్యమును ఐశ్వర్యమును కలుగజేయువాడును గ్రుంగజేయువాడును లేవనెత్తువాడును అయ్యనే (1 సమూ. 2: 7). ఏకరీతిగా కష్టపడువారైనను, సమమైన ఆస్తిగలవారు కానేరరు. వారిలో బీద లెల్లపుడు నుందురు (మత్త. 26: 11). అయినను ఆస్తివిషయములోని హెచ్చు తగ్గులు చాలమట్టునకు మనుష్యుల స్వంత పనులవలననే కలుగునని తెలిసికొనవలెను. సోమరులును, డబ్బును అమితముగా ఖర్చు చేయువారును దరిద్రు లగుదురు. ఆస్తిని సంపాదించుకొనవలెనంటె కష్టపడి పనిచేసి, ముందు జాగ్రతగలిగియుండి, అనవసరముగా డబ్బును వ్రయపఱచక నుండవలెను (సామెత. 10: 4). కొందఱు ఇతరుల స్థితిని చూచి అసూయపడుదురు. అయితే వారి పేదరికమునకు కారణము వారి స్వంత యజాగ్రతయే కాని మఱియొకటి కాదు. స్థితివంతులగు నితరులవలె మనమును కష్టపడి లోక భోగములలో మన సొమ్మును వ్రయపఱచక, దానిని దాచిపెట్టుకొనిన యెడల మనమును వారివలె స్థితిమంతులము కాగలము.

అందఱియొక్క ఆస్తియు సమష్టిగా నుండవలెనని కొంద అభిప్రాయపడి, ఆది క్రైస్తవులు తమ యాస్తులను సమష్టిగా నుంచుకొనిరి గనుక, మనమును అలాగున చేయవలయునని వాదింతురు. అయితే ఆది క్రైస్తవులు ధర్మార్థము అలాగున చేసిరే కాని అలాగున చేయవలెనని యే నియమమును లేదు. ఆస్తి నుంచుకొనుట తప్పు అనుకొని వారా ప్రకారము దాని పంచిపెట్టలేదుగాని, ఇతరుల యక్కఱలనుచూచి, ప్రేమచే రేపబడినవారై యిష్ట పూర్వకముగా అలాగున పంచిపెట్టిరి (కార్య. 5: 4). తమ యాస్తిలో కొంత తమ నిమిత్తమై యుంచుకొనుట యనునది అననీయ సప్పీర యనువారి పాపము కాదుగాని తమ పొలము నమ్మిన ద్రవ్యము కొంత దాచి పెట్టుకొని, ఇంతకే మా పొలము నమ్మితిమి, ఈ సొమ్ము నంతయు తెచ్చి దేవునికి సమర్పించుచున్నాము అని చెప్పి అబద్ధమాడుటయే వారి పాపమై యున్నది. ఈ లాగున అబద్ధమాడినందున వారికి మరణ శిక్ష విధింపబడెను (కార్య. 5: 1-10). అందరును మంచివారైనయెడల ఆస్తులను సమష్టిగా నుంచుకొనుట యనునది యెంతో మేలయిన కార్యముగ నుండును. అయితే యీ లోకములో ననేకులు సోదరులును మోసగాండ్రునై యున్నారు కావున, అలాగు చేసినయెడల శ్రద్ధతో పనిచేయువారు

తమ యాస్తితో నిష్కారణముగా సోమరులను పోషింపవలసివచ్చును. అదియుగాక మితవ్యయము చేయువారు అమితముగా ఖర్చుచేయువారికి ఖర్చులను భరింపవలసి వచ్చును. ఇట్టి యిబ్బందులు కలుగుటవలన ఆదిక్రైస్తవులుసహా సమస్తమును సమష్టిగా నుంచుకొనుట యను వాడుకను కొద్దికాలములోనే మానుకొనిరి.

దేవుడు మనుష్యుల మేలు కోరి వారి యాస్తులలో నిట్టి హెచ్చు తగ్గు లుండునట్లు వాటిని అమర్చెను. స్థితివంతులమైన యెడల మన యాస్తితోను, బీదవారమైన యెడల మన పేదరికముతోను మన మాయన యుద్దేశములను నెరవేర్చవలెనని ఆయన కోరుచున్నాడు (2). స్థితిగలవారు బీదల యక్కరలను చూచి వారియెడల ఔదార్యమును చూపవలెనని ఆయన యుద్దేశించుచున్నాడు. రెండు అంగీలుగల వాడు ఏమియు లేనివానికి నియ్యవలెను (లూకా 3: 11). అన్నము లేక చనిపోవు వారుండినయెడల వారాలాగు చనిపోవలయు ననునది దేవుని యేర్పాటు కాదు. ఎవరికి స్థితియున్నదో వారు దేవు డుద్దేశించినట్లుగా తమ యాస్తిని ఉపయోగించుకొనకపోవుట యను పాపమువలననే అట్టి దుర్గతులు కలుగుచున్నవి గాని మఱి యొకటి కాదు.

III. ఐశ్వర్యము గూర్చిన బోధ.— కొందరికి ఆస్తిని సంపాదింపవలయునను నుద్దేశము తప్ప మఱియొక గుఱి లేదు. ఆస్తి యుండినయెడల సౌఖ్యముండునని అట్టివారనుకొందురు. అయితే ఆస్తి యుండిన చాలును ఇక నేది లేకపోయినను సౌఖ్యము కలుగు ననుకొనుట గొప్ప పొరబాటైయున్నది. ఆరోగ్యము, విద్య, మంచి పేరు, మంచి స్నేహితులను కలిగియుండుట యనునివి ధనముకంటె మిగుల శ్రేయస్కరములై యున్నవి. ఆస్థికంటె ఆత్మసంరక్షణ యెంతో విలువగలది (3). ఒకనికి కలిమి విస్తరించుటవలన ఆ కలిమి వాని జీవనమునకు మూలము కాదు. (లూకా 12: 15). వాడు దేవునియెడల ధనవంతు డగుటయే ముఖ్యమైనది (12: 21). మనము పరలోకములో మన యాస్తిని కూర్చుకొనవలెను. ఎందునకనగా మన ధన మెక్కడ నుండునో అక్కడ మన యాశలు కూడ నుండును (మత్త. 6: 19-21). ధనము నాశించువారికి ఆత్మీయముగా గొప్ప యాపదలు కలుగును (4). ధనమును తగినట్లుగా నుపయోగించుటవలన గొప్ప మేలు కలుగును. అయితే మన యాశలను ధనముమీదనే నిలిపినయెడల అది మన హృదయములోనుండు దేవుని ప్రేమను మనము పోగొట్టుకొనునట్లు చేసి, అన్యాయ, లాభము, మోసము, దొంగతనము, హత్య అను నిట్టి పాపములకు మూలమై, చెప్ప శక్యముకానంత కీడును మనకు కలిగించును.

కొందఱు అన్యాయమైన వర్తకముచేతను, మోసములవలనను, బీదలను బాధించుటవలనను స్థితిగల వారగుదురనుట వాస్తవమే యైనను, స్థితిగల వారంద ఱును అన్యాయవర్తకముచేతనే ధనమును సంపాదించుకొనిరని యనుకొన గూడదు. బైబిలులో విచారింపగా అబ్రహాము (ఆది. 13: 2), ఈసాకు, యాకోబు, దావీదు మొదలగువారు స్థితిగలవారైనను గొప్పభక్తులై యుండిరి అని తెలియును. స్థితిగల వారిలో మంచి క్రైస్తవ భక్తులు చాలమంది కలరు. అయితే మనము మన యాశలను మన ఆస్తిమీద నిలిపివేయ కుండునట్లు జాగ్రత్తగా చూచుకొనవలెను (కీర్తన. 62:10).

ఆస్తిని నమ్మరాదు. 'అది రెక్కలు ధరించి యెగిరి పోవును' (సామె 23: 5). స్థితివంతు లనేకులు దైవ వశముగా దరిద్రులైరి. స్థితిగలవారు తమ యాస్తిని దక్కించుకొనుటకు నెంతో జాగ్రతపడవలెను. అయితే యెంతగా జాగ్రతపడినను ఆస్తిని దక్కించుకొన లేకపోవుటకూడ తటస్థించును. స్థితిమంతుల యాస్తిని ఆశించి మోసములచే దాని నపహరించుటకు యుక్తులు చేయువారనేకులు గలరు కదా ? మఱియు కష్టనష్టములు కలుగుటవలనను అనేక మాఱులు ఆస్తి హఠాత్తుగా మాయమై పోవుట తటస్థించుచున్నది.

ఆస్తివలన శోధనలు కలుగును.—ఆస్తిగలవారు రక్షింపబడరని యను కొనగూడదు. వారు రక్షింపబడవచ్చుననుటకు అబ్రాహాము చక్కని దృష్టాంతమై యున్నాడు (లూకా 16: 24). అయినను ధనవంతులు రక్షణ బొందుట మఱి కష్ట తరముగా నున్నది. ఇందునుబట్టి ధనవంతుడు పరలోక రాజ్యములో ప్రవేశించుట కంటె సూదిబెజ్జములో ఒంటె దూరుట సులభమని (మత్త. 19: 24). క్రీస్తు చెప్పెను. ఆస్తివలన కలుగు శోధనలు చాల గొప్పవి యగుటచేత ఆయన యీలాగు చెప్పెను. జీవముగల దేవునిగాక, తమ ఆస్తిని నమ్ముకొనవలెనను శోధన ధనవంతులకు విశేష ముగా కలుగును (1. తిమొ. 6: 17). మఱియు గర్వపడుటకును దేవుని సేవయం దును ఇతరులకు మేలు చేయుటయందును గాక తమ స్వంత భోగముల నిమిత్తము తమ సొమ్మును వ్రయపఱచుటకును వారికి శోధన కలుగును. ధన మోసము యెన్నోవిధము లుగా దేవుని వాక్యమును అణిచివేయును. (మత్త. 13: 22). మఱియు కుప్ప తిప్పలుగా రూపాయలు కలిగియుండువారికే యిట్టి శోధనలు కలుగు ననుకొనరాదు. చాలమందికి కొద్దియాస్తి మాత్రముండినను, వారు తమ యాశలన్నిటిని దాని మీదనే నిలిపియుంచుటవలన తమ స్వరక్షణను పోగొట్టుకొందురు.

ఆస్తిగలవారిమీద నొక గొప్ప భారము కలదు.—ఆస్తి తమ స్వంతదికాదు. అది దేవునిదై యున్నది. వారు దానిని దేవునికి అనుకూలమైనరీతిగా

వాడుకొనవలసిన దేవుని సేవకులై యున్నారు. దాని నుపయోగించు విధమును గూర్చి వారు దేవునికి లెక్క నప్పగింపవలసినవారై యున్నారు. స్థితిగలవారు మంచి కార్యములను, ధనముగలవారును ఔదార్యముగలవారును ఇతరులకు పాలిచ్చువారునై యుండవలెనని ఆజ్ఞాపింపబడుచున్నారు. ఈలాగు చేసి వారు 'రాబోవు కాలమునకు మంచి పునాదివేసి వాస్తవమైన ధనమును సంపాదించుకొనవలెను' (1. తిమో. 6: 18).

IV. దారిద్ర్యమునుగూర్చిన బోధ.—బీదలకు అనేక కష్టములుండినను, వారు భక్తులైనట్లయిన దేవుడు వారియెడల విశేష దయను చూపును (5). ధనికులకంటె బీదలే యెక్కువ సౌఖ్యముకలవారై యుండవచ్చును. నెమ్మది లేకుండ విస్తారమైన ధన ముండుటకంటె యెహోవా యందలి భయభక్తులతోకూడ కొంచెము కలిగి యుండుట మేలు. పగవాని యింట క్రొవ్విన యెద్దుమాంసము తినుటకంటె ప్రేమగలచోట ఆకు కూరల భోజనము తినుట మేలు (సామి 15: 16, 17).

బీదలకు సువార్త ప్రకటింపబడుననియు (మత్త. 11: 5), మీరు విశ్వాసమందు భాగ్యవంతులుగాను, దేవుని రాజ్యమునకు వారసులుగాను ఉండుటకును దేవుడు వారిని ఏర్పఱచెననియు (యాకో. 2: 5), చెప్పనటువంటి బైబిలు వాక్యములను చూడగా దేవుడు బీదవారియం దెక్కువ లక్ష్యముంచెనని తెలిసికొనవచ్చును. స్థితివంతులకుగల పెక్కుశోధనలు బీదలకు లేవు. బీదలు తమ యక్కఱలను తీర్చుకొనుటకై అనుదినము దేవునిమీద ఆనుకొనవలసియున్నారు కావున, వారు దేవుని మేలు మఱవక ఆయన నాశ్రయించుకొనుటకు వారి పేదఱికము సహా వారికి ప్రేరేపణగా నుండును.

మనము బీదవారమై యున్నాము కావున దేవుడు మన బీద స్థితినిబట్టి మనకు ఆత్మరక్షణ ననుగ్రహించు ననుకొనరాదు. మఱియు స్థితిగలవారని దేవు డెవరినైనను వారి స్థితినిబట్టి నరకములో పడద్రోయడు. లాజరు తన పేదరికమునుబట్టి కాదుగాని, దేవునియందు భయభక్తులు గలిగి యుండినందువలననే రక్షణను పొందెను. ధనవంతుడు తన ధనమునుబట్టి కాదుగాని, తన సుఖభోగములనే కోరి, బీదలకు సహాయము చేయకయు, దేవునికిభయపడకయునున్నందున నరకబాధల పాలయ్యెను (లూకా 16:1-81). ఇందునుబట్టి లాజరుయొక్క పేదఱికము దేవునియం దాశ్రయించుకొనుటకు సహాయముగాను, ధనవంతుని యాస్తి దేవుని మఱచి పోవుటకు శోధనగాను ఉన్నవని తెలిసికొనలెను. దేవుడు చాలమందియొక్క మేలు కోరి వారు తనను మఱువక తనయందు క్తిగలిగి యుండవలెనని దేవుడు ఆనేకులకు పేదఱికమును ఏర్పాటు చేయును. తప్పి

పోయిన సమూరుడు తనకు ధన మున్నంతవఱకు లోక భోగములలో మునిగిపోయెను. బీదవాడై కష్టస్థితిలో పడినపిమ్మట నతడు గుణపడి తన తండ్రియింటికి వెళ్ళెను.

V. మనకు గలవానితో మనము తృప్తినొంది ఇతరుల స్థితినిబట్టి కాక వారి యోగ్యతనుబట్టి వారిని ఘనపఱచవలెను....మనము అతి దరిద్రులమైనను ఐశ్వర్యవంతులమైనను కాక మధ్యస్థితిగలవారమై యుండిన చాలును. ఇదియె కోరదగిన స్థితి. ఇట్టివారికి తక్కువ శోధన లుండును. అతి దారిద్ర్యమువలన దొంగిలించుటకును, ఐశ్వర్యము వలన దేవుని మరచుటకును శోధన కలుగును (6), మనకు గల ఆస్తివలన కాదు గాని భయభక్తులతో గూడిన ఆత్మీయ సంతుష్టివలననే (1. తిమో. 5: 6). ఆత్మనెమ్మది కలుగును. ఏస్థితిలో దేవుడు మనలనుంచెనోతద్దానితో తృప్తిపడి, అందులో దేవుని సేవించి, మనవలె మన పొరుగువారిని ప్రేమించి వారికి మేలుచేసిన యెడల మనకు నిజమైన సౌఖ్యము కలుగును గాని మఱి యే రీతిగాను కలుగదు.

ఇతరుల యోగ్యతనుబట్టి వారిని ఘనపఱచవలెను గాని వారి స్థితినిబట్టి కాదు.—(యాకో. 2: 1-14): ఎంతటి ధనికులైనను వారు మిక్కిలి దుర్మార్గులై యుండినయెడల అట్టివారిని మనము ఘనపఱచ గూడదు. మఱియు నెంతటి బీదలైనను వారు ఇతరులు చేయదగని నీచకార్యములు చేసినట్లయిన బీదవారు కనుక పరవాలేను అని యనుకొనగూడదు. వారిస్థితి యెట్టిదైనను మనము అందరిని నిష్పక్షపాత బుద్ధితో చూడవలెను. మనము ఎవరినైనను తృణీకరింపరాదు. ఎవరి విషయములోనైనను ముఖస్తోత్రములు పలుకరాదు. అందఱును సహోదరులనియు, అందఱును ఏకరీతిగా క్రీస్తునందలి దేవుని కృప లేనిది నశించిపోవలసిన దౌర్భాగ్య పాపులనియు తెలిసికొనవలెను. ఐశ్వర్యవంతులును దరిద్రులును కలిసియుందురు. వారినందరిని కలుగజేసినవాడు యెహోవాయే (సామె 22: 2). మన మీ లోకములోని కేమియు తేలేదు. దీనిలోనుండి యేమియు తీసుకొనిపోలేము (1. తిమో. 6: 7). మరణముతోనే స్థితివలన హెచ్చు తగ్గు లన్నియు మాయమై పోవును. దేవుడు మనుష్యులను చూచురీతిని విచారింపగా అవి యిప్పుడు సహా లేనట్లుగానున్నవి దేవుడు ఆయా వారి ఆస్తిని కాదుగాని ఆయా వారి గుణములను లక్షించును. మనము స్థితివంతులమా బీదలమా అను దాని విషయము చింతింప కూడదుగాని మనము విశ్వాసులమా అవిశ్వాసులమా అనుదాని విషయమైన గొప్పచింత మన కుండవలెను.

## 47. మోసము చేయకూడదను బోధ.

మనుష్యులు మీకేమి చేయవలెనని కోరుదురో ఆలాగుననే మీరును వారికి చేయుడి. ఇది ధర్మశాస్త్రమును ప్రవక్తల ఉపదేశమునై యున్నది. మత్త 7: 12.

### భాగములు.

I. ఏవిధ మోసమైనను మనకు నిషేధమై యుండవలెను.

II. మోసము చేయుటకు గల కారణము.

III. మోసము చేయుటవలన శాపము.

IV. మోసముచేయని వారమగుటకు మనము చేయవలసిన వేవి?

1. మన మిదివఱకు చేసిన మోసములను సదురుబాటు చేయవలెను.
2. కించిత్తైనను మోసములేక మనపనులన్నిటి యదార్థముగా చేయవలెను.
3. ఇతరులు తమ యాస్తిని కాపాడుకొనునట్లు మనము వారికి సహాయము చేయవలెను.

### అనుదిన వేదపాఠములు.

ధనాపేక్ష, దానివలన కలుగు శిక్ష. ఆమో. 8.

న్యాయమైన కొలతలు, త్రాసులు: లేవీ. 19: 35-37 ద్వితీ. 25: 13-16.

లంచము పుచ్చుకొనకూడదు. నిర్గ. 23: 6-9; ద్వితీ. 16: 18-20.

చేసిన మోసమునకై తగిన సదురుబాటు చేయవలెను లేవీ 6: 1-7.

గుణపడిన జక్కయ్య చూపిన మాదిరి. లూకా 19: 1-10.

కొద్దివాటిలో అన్యాయముగా నుండువారు గొప్పవాటిలోను అన్యాయముగా నుందురు. లూకా 16: 1-13.

అక్కరగలిగినవారికి సహాయము చేయవలెను. లేవీ. 25: 35-38; ద్వితీ. 15: 7-11.

### వేదవాక్యములు.

I. 1. ప్రభువు దృష్టియందు మాత్రమేకాక మనుష్యుల దృష్టియందును యోగ్యమైన వాటిని గూర్చి శ్రద్ధతో నాలోచించుకొను చున్నాము (2. కొరి. 8: 21).

2. దొంగ త్రాసు యెహోవాకు హేయము సరియైన గుండు ఆయనకు ఇష్టము (సామె. 11: 1).

II. 3. ధనాపేక్షలేని మనస్సుగలవారై మీకు కలిగిన వాటితో తృప్తిపొంది యుండుడి (హెబ్రీ 13: 5).

III. 4. నీతిని తప్పి తన నగరును స్థాపించువానికి శ్రమ; న్యాయమును తప్పి తన మేడగదులను కట్టించుకొనుచు జీతమియ్యక తన పొరుగువానిచేత నూరకయే కొలువు చేయించుకొనువానికి శ్రమ. (యిర్మీయా 22: 13).

IV. 6. దొంగిలువాడు ఇకమీదట దొంగిలక అక్కరగలవానికి పంచిపెట్టుటకు వీలు కలుగు నిమిత్తము తన చేతులతోనుంచి పని చేయుచు కష్టపడవలెను. (ఎఫెసి 4: 28).

## వివరము.

I. ఏ విధ మోసమైనను మనకు నిషేధమై యుండవలెను.—ఈ లోక వ్యవహారములలో ఆస్తి, ద్రవ్యము అనునవి యెంత యవసరములైనవైనను మనము మోస మేమియు లేకుండ వాటిని సంపాదించుకొనవలెను. (1) మూర్ఖత్వముతో చేయు మోసములు మాత్రముగాక ఎట్టి అన్యాయ కార్యములైనను సరే అవి చిన్నవియైనను, ఎన్నదగినవైనను అట్టివాటిని మనము చేయ కూడదని బైబిలు బోధించుచున్నది. దొంగిల కూడదను ఏడవయాజ్ఞ (నిర్గ. 20: 15) మోసము చేయుటను నిషేధించుచున్నది. మనుష్యులందరి దృష్టికి యోగ్యమైనవాటినిగూర్చి ఆలోచన కలిగియుండుడి. అనగా అందరును మెచ్చుకొనగలుగువాటిని మనము చేయవలెనని పౌలు వ్రాసెను (రోమా 12: 17). ప్రతివానికి వాని స్వంత కష్టార్జితము నిరభ్యంతరముగా అనుభవము కావలెనని దేవుడుద్దేశించి యీ యాజ్ఞ నిచ్చెను. దొంగలను, మోసములు చేయువారిని శిక్షించుటలో సర్కారువారి యుద్దేశమును నిదియే. దేశ చట్టములలో నిట్టివి లేనియెడల సోమరులును, అన్యాయస్థులును, బొత్తిగానే కష్టమును చేయక, పని చేసి దివాహారమును ధనమును సంపాదించుకొనువారి కష్టార్జితమును తామే యనుభవించుటకు తగిన యేర్పాటు లుండవలెను, లేనియెడల ఈ లోక వ్యవహారములు క్రమముగా జరుగ నేరవు.

అనేక విధములైన మోసములు కలవు. మూర్ఖత్వముతో మోసము చేయుట యొక విధమై యున్నది. కన్నమువేసి దొంగిలించువారు బందిపోటు దొంగలు, దగా వ్రాతల మూలముగా ఇతరులను మోసపుచ్చువారు, అయాపనులను చేయించుటకై

తమ చేతికి నప్పగింపబడిన సొమ్మును తమ స్వంత ఖర్చులకై యుపయోగించువారును ఇట్టి మూర్ఖులైన మోసగాండ్రై యున్నారు. తమ పరువును దక్కించుకొనవలెనని కొరువా రెవరైనను ఇట్టి మోసములు చేయరాదు. ఇట్టి మోసములు చేసినయెడల జైదులో వేసెదరను భయముచేత మనుష్యులు సాధారణముగా వీటిని చేయరు.

మఱి ఇతర విధమైన మోసములు కలవు. అవి దేవుని దృష్టియందును, యోగ్యులగు మనుష్యుల దృష్టిలోను మోసములైనను. అవి సర్వ సాధారణముగా జరుగుట వలన, వాటిని చేయువారు మోసగాండ్రనుగా నెంచబడుటలేదు. దొంగిలింపబడిన సొమ్మును దాచిపెట్టుటలో నితరులకు సహాయము చేసినయెడలను, దొంగ సొత్తునుకొనినయెడలను మనము దొంగలతో పాలివారమగుదుము (లేవీ. 6: 2). ఇతరులు పోగొట్టుకొనినది మనకు దొరికినపుడు మనము దానిని దాచిపెట్టి యుంచుకొనుట నిషేధమై యున్నది (లేవీ. 6: 3). సర్కారువారికి చెల్లించవలసిన పన్నును చెల్లింపక పోవుటయు(రోమా 13: 5, 7). తీర్పలేని బాకీలు చేయుటయు (కీర్తన. 37: 21) మోసమై యున్నది. అనవసరమైన ఖర్చులు చేసి అప్పులపాలగుట, పనిచేయుటకు తగిన బలముండియు సోమరులై భిక్షమెత్తుట, పందెము పెట్టి జూదమాడుట, ఇతరులకు ఖర్చు తగులునట్లు వారి మీద కోర్టులలో అన్యాయముగా కేసులు పెట్టుట, ఇతరులు మన చేతికి నప్పగించిన సొమ్ము విషయములో నజాగ్రత్తగానుండుట (లేవీ. 6: 2,) తన కప్పగింపబడిన పనిని నమ్మకముగా చేయక దొంగపని చేయుట మొదలగునవి యన్నియు అయా విధములుగా ఇతరుల సొమ్మును దొంగిలించుటయని తెలిసికొనవలెను.

మోసము చేయుట సర్వసాధారణమై యున్నది.— సర్కారు వారు శిక్షింపలేని చిల్లర మోసములైనను దేవుని యెదుట పాపములేయని తెలిసికొనవలెను. అన్యాయమైన సరకుల నమ్మువాడు దొంగయై యున్నాడు (ఆమో. 8:4-7). కొలత తూనికెలలో మోసము చేయువారును దొంగలే (ద్వితీ. 25: 13-16). వ్యాపారములో అనుభవము లేనివారిని చూచి యెక్కువ ధరలు చెప్పుటయు, అన్యాయమైన వడ్డీ పుచ్చుకొనుటయు, కష్టకాలము ధాన్యపు ధర లెక్కువచేయుటయు, కూలివారి కూలిలో డబ్బులు పుచ్చుకొనుటయు, కూలివారికి తగిన కూలినియ్యకపోవుటయు (యాకో. 5: 4, ద్వితి. 24: 14, 15) మోసములై యున్నవి. పనివారు తమ విధి చొప్పున పనిచేయక మోసములు చేయుటయును సర్వసాధారణమైనమోసమైయున్నది (కొల. 3: 22) లంచము పుచ్చుకొనువాడు. న్యాయమును త్రిప్పివేయువాడుమాత్రము గాక దొంగయునై యున్నాడు ఇట్టివారందరు కన్నపు దొంగలను మూర్ఖులనుగ నెంచి వారిని తృణీకరించుచున్నను, మేమువారివంటి మూర్ఖులము కామని చెప్పుకొనినను

వారికి సమానులై యున్నారు. మనము సమస్తమును న్యాయముగా చేయవలెనని దేవుడు కోరుచున్నాడు కావున ఇట్టి మోసముల నాయన సహింపక ఈ మోసములు చేయువారిని తప్పక శిక్షించును.

II. మోసములుచేయుటకు గల కారణము.—ఇందుకు ధనాపేక్ష కారణమై యున్నది (మీకా 2: 2). అనేకులు ధనము నాశించి దానినిసంపాదించుకొనుటకై అన్ని విధములైన మోసములను చేతురు. ఎట్టిమోసమునకైనను డబ్బాసయే మూలము. ధనము నాశించువాడు లోపలిదొంగ యనవచ్చును. ఆయాశను త్యజింపక పోయినయెడల వాడుతిన క్రియలవలనకూడ దొంగయగును. ఇట్టియాశను త్యజించుట చాల ముఖ్యమైనదని తెలియజేయుటకై దేవుడు దాని విషయమును రెండు ఆజ్ఞల నిచ్చెను. పది యాజ్ఞలలో తొమ్మిదవ యాజ్ఞయు, పదియవ యాజ్ఞయు (నిర్గ. 20: 17). మనము మన పొరుగు వానికి గల దేనినైనను చూచి ఆశింపకూడదని విధించుచున్నవి. మనము మోసముచేయని వారమగునట్లు మొదట ధనాపేక్షను బొత్తుగా త్యజింపవలెను.

ఇదియుగాక మోసము చేయుటకై మనల నేవి శోధించునో అట్టివాటి నన్నిటిని విడిచి పెట్టవలెను. సోమరితనము, అప్పుల పాలగుట, పందెము పెట్టి జూదమాడుట, త్రాగుడు మొదలగునవి యన్నియు మోసములను చేయుటకై మనలను విశేషముగా శోధించును గనుక వాటిజోలికి మనమే మాత్రమును పోగూడదు.

III. మోసము చేయుట వలన శాపము.—ఎట్టి మోసములైనను అవి యన్నియు దేవుని శాపమునకు పాత్రములై యున్నవి. బందిపోటు దొంగలను కన్నపు దొంగలను మాత్రముగాక ఏవిధముగనైనను ఇతరులకు మోసము కలిగించు వారినందరిని బైబిలు శపించును. తనది కానిదాని నాక్రమించి యభివృద్ధినొందిన వారికి శ్రమ (హబ. 2: 6).యనియు న్యాయము తప్పి తన మేడగదులను కట్టించుకొనువానికి శ్రమ (4) యనియు, దొంగలైనను లోభులైనను దోచుకొనువారైనను దేవుని రాజ్యమునకు వారసులు కానేరరు (1. కొరి 6: 18). అనియు బైబిలు బోధించుచున్నది.

IV. మోసము చేయని వారమగుటకు మనముచేయవలసినవేవి?

I. మన మిదివరకు చేసిన మోసములను కుదురుబాటు చేయవలెను.—ఎవరియొద్దనైన అన్యాయముగా దేనినైనను తీసికొనినయెడల మన మా యన్యాయము నొప్పుకొని అపహరించిన దానిని అది యెవరికి చెందవలయునో వారికి నియ్యవలెను. మరియు మనము చేయు పనులు అన్యాయమైనవని గుర్తింపగానే

వాటిని మానుకొనవలెను. సుంకరియైన జక్కయ్య యిల్లు చేసెను (లూకా 19: 8) ఇదియే మోసగాండ్రందరును చేయవలసిన పనియై యున్నది (5).

3. కించిత్తైన మోసము లేక మన పనులన్నిటిని యదార్థముగా చేయవలెను.—మనది కానట్టి దమ్మిడైనను అన్యాయముగా పుచ్చుకొనకూడదు. మనము కొద్దిమోసముచేయ నారంభించిన యెడల గొప్ప గొప్ప మోసములను కూడ చేయువార మగుదుము. మిక్కిలికొంచెములో అన్యాయముగా నుండువాడు సహాయము తటస్థించినపుడు ఎక్కువలో కూడ అన్యాయముగా నుండును (లూకా 16: 10).

ఈ దేశములోను ఈ లోకములోను పూర్ణ న్యాయస్థు లుండిన యెడల నెంత మేలు? మోసముల వలన ఇతరులకు నెంతగా అచ్చియుండినను, అలాగుచేయుట తప్పు అని తెలిసికొని దానిజోలికి వెళ్ళని వారుండిన యెడలనెంత మేలు. పెద్దలలోను పిన్నలలోను ఇట్టివారుండుట మిక్కిలి యవసరముగా నున్నది. అటువంటి వారమైన యెడల మనకు ఒకవేళ కొన్ని నష్టములు కలుగవచ్చును. గాని, అన్నిటిలో గొప్ప ధనముగా నెంచదగిన మంచి మనస్సాక్ష్యము మనకు కలుగును గనుక దీనియెదుట మననష్టము లెన్నదగినవి కావు.

3. ఇతరులు తమ యాస్తిని కాపాడుకొనునట్లు మనము వారికి సహాయము చేయవలెను.—మనము మన పొరుగువారియెడల చూపవలసిన ప్రేమనుబట్టి వారికి ఈమేలును చేయుటకు బద్ధులమై యున్నాము. (నిర్గ. 23: 4, 5). మనవలె మనపొరుగువారిని ప్రేమించి వారు మనకు ఏమిచేయవలెనని కోరుదుమో దానినే వారికి చేయవలెను (మత్త. 7: 12). మనము వారిని అన్యాయము చేసి వారియాస్తిని అపహరింపక, వారు తమయాస్తిని కాపాడుకొని అభివృద్ధిపఱుచుకొనుటకై వారికి సహాయము చేయుట మనవిధియై యున్నది. మనము స్వలాభమును చూచుకొనక, ఇతరుల యక్కఱలను చూచి (లేవీ. 25, 35: 36). ధనాపేక్షవలనగాక ప్రేమవలన రేపబడినవారమై వారియెడల ప్రవర్తించుచు వారికి నిట్టి సహాయము చేయవలెను.

## 48. మన సొమ్ముసొత్తులను, శక్తి యధికారములను ఉపయోగింపవలసిన విధమునుగూర్చిన బోధ.

సణుగుకొనకయు బలవంతముగా గాకయు ప్రతివాడును తన హృదయములో నిశ్చయించుకొనిన ప్రకారము నియ్యవలయును; దేవుడు సంతోషముగా నిచ్చువానిని ప్రేమించును. (2కొరి 9:7)

### భాగములు.

I. సొమ్ముసొత్తుల నుపయోగించవలసిన విధము.

1. మన శరీరాత్మల యక్కఱలను తీర్చికొనుటకు వాటిని ఉపయోగింపదగును.

2. ఇతరుల యక్కఱలను తీర్చుటకు వాటి నుపయోగింపదగును.

(*a*) బీదల కష్టములను నివారణ చేయుటవలన దీని చేయవలెను.

(*b*) ఇతరులకు సువార్తను ప్రకటించుటకై చందా నిచ్చుటవలన దీని చేయవలెను.

II. బలవంతముగా గాక ఔదార్యబుద్ధితో చందా నియ్యవలెను.

III. శక్తి యధికారముల నుపయోగించవలసిన విధము.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| మినాలనుగూర్చిన యుపమానము. | లూకా 19: 11-27. |
| తలాంతులను గూర్చిన యుపమానము | మత్త. 25: 14-30. |
| చందా నిచ్చుటనుగూర్చి పౌలు చేసిన బోధ. | 2. కొరి 8. |
| చందానిచ్చుటనుగూర్చి పౌలు చేసిన బోధ. | 2. కొరి 9. |
| బోధకులను పోషింపవలెను. | 1. కొరి 9: 1-14. |
| ఇచ్చుటకు మను బాధ్యులము. | రోమా 16: 14-29. |
| ఔదార్యముగలవారు పుష్టి నొందుదురు. | సామె 11: 24-31. |

### వేదవాక్యములు.

I. 1. ఎవడైనను స్వకీయులను, విశేషముగా తన తండ్రి యింటివారిని సంరక్షింపకపోతే వాడు విశ్వాస త్యాగము చేసినవాడై అవిశ్వాసికంటే దుష్టుడుగా నుండును (1 తిమొ 5: 8)

2. మీరు ఆయన రాజ్యమును నీతిని మొదట వెదకుడి, అప్పు డవన్నియు మీ కనుగ్రహింపబడును (మత్త 6: 33)

4. తండ్రియైన మన దేవుని యెదుట పవిత్రమును నిష్కళంకమునైన భక్తి యేదనగా దిక్కులేని పిల్లలను విధవరాండ్రను వారి యిబ్బందులలో పరామర్శించుటయు, ఇహలోక మాలిన్యము తన కంటకుండ తన్ను తాను కాపాడుకొనుటయు నే. (యాకో 1: 27)

II. 4. వెదజల్లి అభివృద్ధి పొందువారు కలరు, తగినదానికన్న తక్కువ నిచ్చి లేమికి వచ్చువారు కలరు. ఔదార్యముగలవారు పుష్టినొందుదురు. నీళ్లు పోయు వారికి నీళ్లు పోయబడును (సామె 11: 24, 25)

## వివరము.

ఈ ప్రపంచములోని సర్వమును దేవునిదై యున్నది. మనకుగల ప్రతిది ఆయనదే. మన సొమ్ముసొత్తులను, శక్తియధికారములను ఆయనవే. వాటిని తగినట్లుగా నుపయోగించుటకు ఆయన మనకు వాటిని అప్పగించియున్నాడు. వాటి విషయము మనము దేవునికి లెక్క నప్పగింపవలసినవారమై యున్నాము (లూకా 19: 12-27; మత్త 25: 14-30) మన మాయన గృహ నిర్వాహకులమై యున్నాము. కావున, మన గృహ నిర్వాహకత్వము విషయమై ఆయనకు లెక్క నప్పగింపవలెను (లూకా 16: 1-8)

దేవుడు మనకు నిచ్చిన సొమ్ముసొత్తుల విషయము విచారింపగా మనము వాటితో చాల మేలుచేయగలము లేదా గొప్పకీడు చేయగలము. వాటిని తగినట్లుగా నుపయోగించువారమైన యెడల నవి మేలు చేయుటకు నొక సాధన మగును. అలాగున ఉపయోగింపక వాటినే యాశించి వాటిని పోగుచేయుట యనునది యొకటియే మన యుద్దేశమైనయెడల నవి గొప్ప కీడునకు మూలమగును. మన సొమ్ముసొత్తుల నుపయోగించు విధమునుబట్టియే అవి మనకు దీవెనగాను శాపముగా నుండును. అవి దేవునివై యున్నవి గనుక ఆయన కోరు విధముగా వాటిని ఉపయోగించుట మన విధియై యున్నది.

### 1. సొమ్ము సొత్తుల నుపయోగింపవలసిన విధము.

1. మనశరీరాత్మల యక్కఱలను తీర్చుకొనుటకు వాటినిఉపయోగింపవలెను.—మనయొక్కయు, మనవారియొక్కయు, శరీరములకు కావలసిన అన్నవస్త్రముల నిమిత్తము మన సొత్తుల నుపయోగింపవలెను. ఈలాగున తన

స్వకీయులను పోషింపనివాడు అవిశ్వాసికంటె దుష్టుడు (1). అన్నవస్త్రములు మాత్రముగాక, ఇండ్లు వాకిండ్లు, విద్యాబుద్ధులుకూడ మనకు అవసరములై యున్నవి. కావున మనము వాటిని సంపాదించుకొనుటకుగూడ మన సొమ్ము నుపయోగింపదగును. మన యిండ్ల నలంకరించుకొనుటకు తగిన పటములను, ఇంక నితర యలంకారములను సంపాదించుటయును తగును. అయితే ఒకడు—ఇది నా సొమ్ము నాస్వంత సొత్తు; ఇతరులు ఆహారము లేక కష్టపడుచుంటే నా కేమి? నా స్వంత సౌఖ్యముకొఱకై యిట్టి యవసరములైన ఖర్చుల నిమిత్తము నా సొమ్ము నుపయోగింతును, అనుకొనక తనకుగల సొమ్ము దేవుడిచ్చినదై యున్నది కావున అది యాయనదని తెలిసికొని యితరుల యక్కఱలు తీరు విధముగా దాని నుపయోగింపవలెను. స్థితిగలవారు నగరములను కట్టించుటవలనను తోటలను నాటించుటవలనను, నౌకరుల నుంచుకొనుటవలనను బీదలకు పని చూపి వారిని పోషింపగలరు కావున తాము దేవుని కృపానిశ్వాసకులమై యున్నామని తెలిసికొని, గర్వముతోను, సుఖభోగముల ననుభవించుటకును గాక ఈ విధముగా బీదలకు పని చూపు నిమిత్తము తమ యిండ్ల నెంతగా నలంకరించుకొనినను అది తప్పుకాక మేలుగా నుండును.

అయితే శరీరపు అక్కఱలు మాత్రముగాక మనకు ఆత్మీయావసరములును గలవు (లూకా 12: 15). వాటిని తీర్చుటకై దేవుడు క్రైస్తవ సంఘమును నియమించెను. క్రీస్తు రక్షణను మనుష్యులలో సఫలపఱచుటకు ఆసంఘము దేవుడేర్పఱచుకొనిన సాధనమై యున్నది. ఆత్మీయమైన యీ యక్కఱలే మన ముఖ్యమైన యక్కఱలై యున్నవి. కావున మనము మొదట వీటిని తీర్చుకొనవై శ్రద్ధ పుచ్చుకొనవలెను (2). ఇట్లుండగా మనము క్రైస్తవ సంఘమును పోషింపవలసి యున్నాము. సువార్తను వినువారు దానిని ప్రకటించువారికి తగిన పోషణ నియ్యవలెను (1. కొరి. 9:14). సువార్తను బోధించు బోధకులు మనకు ఆత్మీయ వరముల నిచ్చుచున్నారు కావున వారి పోషణకై మనము వారికి ద్రవ్యసహాయము చేయుట ధర్మము (గల 6:6; 1. కొరి. 9:11). పాస్టరు (గురువు)నుగాని, సువార్తికునిగాని పోషించుటకు గావలయు ఖర్చులుగాక, సంఘ సంబంధమగు నితర ఖర్చులును గలవు. ప్రార్థన యిండ్లను దేవాలయములను కట్టించుటకును, వాటిని మరమ్మతుచేయించుటకును, గుడి సేవకునికి జీత మిచ్చుటకును, ఆరాధనకాలములో దీపములకు నూనె మొదలగువాటిని కొనుటకును, సొమ్ము కావలెను. క్రైస్తవ సంఘముద్వారా మనయొక్కయు, మన వారియొక్కయు ఆత్మీయమైన యక్కఱలు తీర్చబడునట్లుగా దాని ఖర్చులకై మన శక్తి కొలది ద్రవ్యసహాయము నిచ్చుట మన విధియై యున్నది. అలాగున నియ్యకుండుట పాపమై యున్నది.

2. ఇతరుల యక్కఱలనుతీర్చుటకై మనము మన సొమ్ముసొత్తుల నుపయోగింపవలెను.—మనము మనవలెనే మన పొరుగువారిని ప్రేమింపవలెను (మత్త. 22: 39). కావున, మన యక్కఱలను మాత్రముగాక, వారి యక్కఱలను తీర్చుటకుగూడ మన సొమ్ము సొత్తుల నుపయోగింపవలెను. వారి యక్కఱలు శరీర సంబంధమైనవి, ఆత్మ సంబంధమైనవి యని రెండు విధములుగా నున్నవి.

(*a*). బీదల కష్టములను నివారణచేయుటవలన ఇతరుల యక్కఱలను తీర్చవలెను.—బీద లెల్లప్పుడు మనతో నున్నారు. మనము వారికి మేలు చేయవలెను (మార్కు 14: 7). దిక్కులేని పెద్దలు, పిన్నలు, విధవలు, రోగులును మనతో నున్నారు. ఇట్టి వారి యక్కఱలను తమశక్తి కొలది తీర్చనివారు నిజమైన భక్తులు కారు (3) (యోహా. 3: 17). దేవు డెవరికి ఎక్కువగనిచ్చెనో వారియొద్ద ఈ పని నిమిత్తము ఎక్కువగా నడుగును (లూకా 12: 48). అయితే మనము స్థితిగల వారము కాకపోయినను మనశక్తికొలది యీ విధముగా దిక్కులేనివారికి సహాయము చేయవలసినవారమై యున్నాము. పనిచేయ నొల్లని సోమరులకు మనము సహాయము చేయక (2. థెస్స. 3: 10). బీదలకు పని చూపించుట ద్వారా వారికి సహాయము చేయుట మంచిది. పనిచేయలేని నిరాధారులైన సభికులను పోషించుటకు ప్రతి సభయును తగిన యేర్పాటులను చేయవలెను. మొదట సభలోని బీదలను పోషింపవలెను. ఇంక నితరులనుకూడ పోషింపశక్తి యుండినయెడల వారినికూడ పోషింపవలెను (గల. 6: 10). రోగులను పరామర్శించు ఔషధశాలలను, దిక్కులేని పిల్లలను పోషించు ధర్మశాలలకును మన శక్తికొలది ద్రవ్య సహాయమును చేయవలెను. బీదలను కనికరించువాడు యెహోవాకు అప్పిచ్చువాడు (సామె. 19: 17) అని తెలిసికొని యీ పని చేయవలయును. ఈలాగు చేసినయెడల మన మితరుల కిచ్చిన దానికంటె నెక్కువగా పొందుదుము. యితరులకు మనము చేయు మేలు క్రీస్తునకు చేయుచున్నట్లుగా నున్నది (మత్త. 25: 40-45). దాని ప్రతిఫలమును తీర్పుదినమున పొందుదుము.

(*b*). ఇతరుల యాత్మీయమైన అక్కఱలను తీర్చుటకు వారికి సువార్తను ప్రకటించుటకై చందా నిచ్చుటద్వారా మనసొమ్ముసొత్తుల నుపయోగింపవలెను.—మనము ఇతరుల శరీరావసరములను తీర్చుటకు మాత్రము గాక, ఆయావారికిగల ఆత్మీయమైన యక్కఱలను తీర్చుటకుమరి ముఖ్యముగాపనిచేయవలెను. మనుష్యు లందఱును రక్షింపబడవలెనని దేవుడు ఇచ్ఛయించుచున్నాడు.

(1. తిమో. 2: 4). మనుష్యులందరికి సువార్తను ప్రకటింపవలసినదని ఆయన యాజ్ఞనిచ్చెను (మార్కు 16: 15). మన స్వరక్షణ విషయమున మన కెంతటి చింత కలదో యితరుల రక్షణ విషయమున నంతటి చింతగలవారమై అందరికిని సువార్తను ప్రకటించుటకు మన శక్తికొలది ద్రవ్యసహాయమును చేయవలెను.

ఇతరులకు సువార్తను ప్రకటించుటకై క్రైస్తవులు చేయు పని మిషను పని యనబడును. అది స్వదేశీయులకు, విదేశీయులకు సువార్తను ప్రకటించుట యను రెండు విధములుగా నున్నది. ఈ ఇండియా దేశములో సువార్తను ఎన్నడైన వినని వారు చాల మంది యున్నందునను, వినినవారిలో ననేకులు దాని నమ్మకపోవుట వలనను ముఖ్యముగా స్వదేశములో సువార్తను ప్రకటించుట గొప్ప యవసరముగా నున్నది. ఈ పనిని ప్రతి క్రైస్తవుడు తన శక్తికొలది చేయవలెను. పుచ్చుకొనుట కంటె యిచ్చుట ధన్యతే (కార్య 20: 35) యని ప్రభువు చెప్పెను. మనుష్యులందరును దేవుని మహిమార్థమై క్రీస్తు ప్రభువని యొప్పుకొనుచు ఆయన నామమున మ్రొక్కు కాలము త్వరగా వచ్చునట్లు మనము శక్తికొలది పనిచేయుట ప్రయాసమని యెంచక, దానిలోని పాలుపుచ్చుకొనుట గొప్ప భాగ్యమునుగ నెంచి, సంతోషముతో దాని చేయవలెను.

II. బలవంతముగా గాక ఔదార్యబుద్ధితో చందా నియ్యవలెను.—బలవంతము చేయకపోయినయెడల చాల మంది యేమియు నియ్యరు. అలాగు చందా నిచ్చుట దేవునికి అనుకూలము కాదు. మనము ప్రేమవలన రేపబడి, మన మిచ్చుదానికి ప్రతిగా నేమియు కోరక, మన మర్పించునది దేవునికి అనుకూలముగ నుండవలెనను ఒక్కటే కోరికె గలవారమై యియ్యవలెను (లూకా 14:12-14; 6:35).

మనము ఔదార్యము గలిగి యుండవలెను. సంతోషముతో నియ్యవలెను. సంతోషముతో నిచ్చువానిని దేవుడు ప్రేమించును (2 కొరి. 9: 7). ఈ ప్రేమకు పాత్రుల మగునట్లు మన మిచ్చునది సంతోషముతో నియ్యవలెను. ఇయ్యకపోయిన యెడల మాట వచ్చునేమో యను తలంపుతోను, బలవంతముచేతను గాక ధారాళముగా నియ్యవలెను (2. కొరి 9: 6) ఈ విధముగా నిచ్చువారికి దేవుని దీవెన కలుగును కావున, వారికి నష్టమేమియు కలుగక వర్ధిల్లెదరు (4).

అందరును తమ శక్తికొలది నియ్యవలెను (1 కొరి 16: 2). మనము మనశక్తి కొలది నిచ్చినయెడల మన మిచ్చినది యెంత కొద్దిదైనను దేవుడు దాని నంగీకరించును (2. కొరి. 8: 2) రెండుకాసుల నిచ్చిన విధవ చాల ద్రవ్యము నిచ్చిన స్థితివంతుల కంటె నెక్కువగా నిచ్చెనని క్రీస్తు చెప్పెను (మార్కు 12: 41-44). స్థితిగలవారు

కూడ తమ శక్తికొలది నియ్యవలెనని తెలిసికొనవలెను. ఈ బీద విధవ యిచ్చినంత కొద్దిగా వారుకూడ యిచ్చినయెడల అది దేవునికి అనుకూలము కాదు. విధవరాలే బుద్ధితో నిచ్చెనో అట్టి బుద్ధితో ధనవంతులును ఇచ్చువారైనయెడల వారు తమకు కలిగినదంతయు నియ్యవలసి వచ్చును. మనము ధారాళముగా నియ్యవలెను. మనుష్యులచే పొగడబడుటకు కాదుగాని, దేవునిని మనతోడి మనుష్యులను ప్రేమించుటచే కలుగు ఔదార్యబుద్ధితో నియ్యవలయును. మన మింతటి ఔదార్య బుద్ధిగలవారమని యితరులకు ప్రకటింపక, అది యెవరికిని తెలియ కుండునట్లియ్యవలెను. రహస్యముల నెఱుగు దేవుడు ఆలాగున నిచ్చువారికి ప్రతిఫల మిచ్చును (మత్త 6: 1-4).

III. మనము మన సొమ్ముసొత్తులను మాత్రము గాక మన శక్తి యధికారములను కూడ తగినట్లుగా నుపయోగింప వలెను.—దేవుని సేవించుటకును, మన తోడి మనుష్యులకు మేలు చేయుటకును మన శక్తి యధికారముల నుపయోగించుటయే వాటిని తగినట్లుగా నుపయోగించుటయై యున్నది. మనకుగల శక్తి యధికారములుకూడ దేవుడిచ్చిన వరములై యున్నవి. వాటి విషయమును మనము దేవునికి లెక్క యప్పగింపవలసినవారమై యున్నాము. మనము దేవుని మఱీ బాగుగా సేవించులాగున మనకుగల మనోశక్తులను, దేహబలమును పెంచుకొనవలెను. మఱియు పాపము చేయుటయందు వాటిని దుర్వినియోగపఱుపక, దేవుని సేవయందే ఉపయోగింపవలెను (లూకా 19: 22, 23, మత్త 2: 27) దేహబలము వలననైనను, బుద్ధిబలమువలననైనను మనము సంఘములోగాని, సర్కారులోగాని ఏ యుద్యోగమునైనను, లేక యితర పనినైనను పొందిన యెడల దానిలో మన స్వంత మేలును ముఖ్యముగా వెదకక, దేవుని ఘనపఱుప యత్నము చేయవలెను. దేవుడు మనకు నిచ్చిన తలాంతు (అనగా పై జెప్పిన వరము)ను మనము సోమరి తనముచే దాచిపెట్టక, మేలు చేయుటకై దాని నుపయోగింపవలెను. మనమే పనిలో నుండినను మనము విశ్వాసులమును నీతిపరులమునై, ఈ లోకములో విశ్వాసమును, నీతియు ప్రబలమగునట్లు పనిచేయువలెను. ఈ లోకము విషయములో దేవునికి ఒక గొప్ప యుద్దేశము కలదు. అదేదియనిన అందఱును క్రీస్తును విశ్వసించి, ఆ విశ్వాసమందు బలపడ్డాలెనని ఆయన యుద్దేశించుచున్నాడు. అదే మన యుద్దేశమునై యుండవలెను. మఱియు నది కొనసాగునట్లు మనము సమయములను కనిపెట్టి మన శక్తి కొలది అన్ని విధములుగా పనిచేయువలయును.

## 49. మానవప్రాణమునుగూర్చిన బోధ.

మీ దేహము దేవునివలన మీ కనుగ్రహింపబడి మీలో నున్న పరిశుద్ధాత్మకు ఆలయమై యున్నదని మీ రెఱుగరా? మీరు మీసొత్తులు కారు, విలువతో కొనబడినవారు గనుక మీ దేహముతో దేవుని మహిమపఱుచుడి 1. కొరి. 6: 19, 20.

### భాగములు.

I. మన ప్రాణము మనది కాదుగాని, దేవుని వశమైనదై యున్నది.

II. మానవప్రాణమును తీయ కూడదు.

III, ప్రాణము తీయుట యెప్పుడు న్యాయమగును?

(1). మరణ శిక్షకు పాత్రులగు నేరస్థులను శిక్షించుటయందు.

(2). ప్రాణము దక్కించుకొనుటలో.

(3). న్యాయమైన యుద్ధములు చేయుటలో.

IV. మనము ఇతరుల ప్రాణమునకైనను, మన ప్రాణమునకైనను హాని కలిగింప కుండునట్లు చూచుకొనవలెను.

V. ఇతరులను రక్షించుటకు మన ప్రాణము పెట్టుట ధర్మకార్యమై యున్నది.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| ప్రాణహాని చేయుటకుగల కారణములు. | ఆది. 4: 1-8. |
| ప్రాణహాని చేయుటకుగల కారణములు. | ఆది. 37. |
| ప్రాణహాని చేయుటకుగల కారణములు. | 2. సమూ. 11 2 |
| ప్రాణహాని చేయుటకుగల కారణములు. | మత్త: 14:1-11 |
| దేవుడు హంతకులకు విధించిన శిక్ష. | ఆది. 9: 1-7. |
| క్రీస్తు నరహత్యనుగూర్చి వివరించుట. | మత్త. 5: 21-26. |
| తన సహోదరుని ద్వేషించువాడు నరహంతకుడు | 1. యోహా. 3: 13-243. |

## వేద వాక్యములు.

I. 1. దేవుడు తన స్వరూపమందు నరుని సృజించెను. దేవుని స్వరూపమందు వానిని సృజించెను. స్త్రీనిగాను పురుషునిగాను వారిని సృజించెను (ఆది. 1: 27).

II. 2. తన సహోదరుని ద్వేషించువాడు నరహంతకుడు; ఏ నరహంతకుని యందు నిత్య జీవముండదని మీరెరుగుదురు (1. యోహా. 3: 15).

III. 3. నరుని రక్తము చిందించువాని రక్తము నరునివలననే చిందింపబడును, ఏలననగా దేవుడు తన స్వరూపమందు నరుని చేసెను. (ఆది. 9: 6).

IV. 5. నాయందు విశ్వాసముంచు ఈ చిన్నవారిలో నొకని నభ్యంతరపరచువా డెవడో వాడు మెడకు తిరుగటిరాయి కట్టబడినవాడై మిక్కిలి లోతైన సముద్రములో ముంచివేయబడుట వానికి మేలు; అభ్యంతరములవలన లోకమునకు శ్రమ; అభ్యంతరములు రాక తప్పదుకాని యెవనివలన అభ్యంతరములు వచ్చునో ఆ మనుష్యునికి శ్రమ (మత్త. 18: 6, 7).

V. 5. ఆయన మన కోసరము తన ప్రాణము పెట్టెను గనుక దీనివలన ప్రేమ యెట్టిదని తెలిసికొనుచున్నాము. మనముకూడ సహోదరులకోసము మన ప్రాణములను పెట్ట బద్ధులమైయున్నాము (1. యోహా. 3: 16).

6. తన ప్రాణమును ప్రేమించువాడు దానిని నశింపజేసికొనును, ఈ లోకములో తన ప్రాణమును ద్వేషించువాడు నిత్య జీవార్థమైన దానిని కాపాడుకొనునని మీతో యథార్థము చెప్పుచున్నాను (యోహా. 12: 25).

## వివరము.

1. మన ప్రాణము మనది కాదుగాని దేవుని వశమైనదై యున్నది.—మనము మన ప్రాణమును కాపాడుకొనునట్లు నరహత్య చేయకూడదను ఒక ప్రత్యేకమైన యాజ్ఞను దేవుడు మనకు నిచ్చియున్నాడు (నిర్గ 20: 13). మన ప్రాణమును నాశము చేసికొనుటయైనను, ఇతరుల ప్రాణమును నాశము చేయుటయైనను గొప్ప పాపమై యున్నది. దేవుని వాక్యమును, సర్కారువారి చట్టములను చూడగా హత్యచేయువారికి మరణ శిక్ష విధింపబడినట్లు తెలిసికొనగలము (ఆది. 9: 6)

దేవుడు మానవునికి అనుగ్రహించిన దానములలో అతని ప్రాణము ముఖ్యమైనదై యున్నది. ఈ ప్రాణము లేనియెడల వాడు దేవుని దానములలో మరియే దానినైనను అనుభవించుకొనజాలడు. హంతకులు మనుష్యుని యాయువును కొద్దిపఱు

చుటచే అతడు చేయవలసిన పనిని మాన్పి అతని విషయమున దేవునికిగల యుద్దేశము భంగపఱిచెదరు. మనుష్యులకు ప్రాణము నిచ్చినవాడు దేవుడే (ఆది. 2: 7) మఱియు దానిని తీయుటకు ఆయనకే కాని మఱి యెవరికిని అధికారము లేదు. దేవుడు మనుష్యుని తన స్వరూపమందు సృజించెను. కావున యెవడైన మఱియొకని చంపిన యెడలవాడు దేవుని ఘనతను తృణీకరించి పాపము చేసినవాడగును (1) (ఆది. 9: 6).

II. మానవ ప్రాణమును తీయకూడదు.— ఆయా హేతువులచే దుష్టులు నరహత్య చేతురు. పగవలన కాయీను హేబెలును చంపెను (ఆది. 4: 1-8); అసూయచే సోదరులు యోసేపును చంప నాలోచించిరి (ఆది. 37); కసిదీర్చుకొనుటకు, హేరోదియ స్నానికుడగు యోహానును చంపించెను (మత్త. 14: 3-11). లాభము నాసించి యూదా క్రీస్తును ఆయన విరోధులకు నప్పగించి ఆలాగు ఆయన మరణమునకు కారకుడయ్యెను (మత్త. 26: 14-16, 49) చేసినపాపమును కప్పివేయుటకు దావీదు యుక్తులు పన్ని హిత్తీయుడైన ఊరియాను చంపించెను (2 సమూ. 11). మత్తు చేతను, కలహమువలనను, బందిపోటు దొంగతనమువలనను, కన్నపుదొంగతనము వలనను హత్య జరుగుట తటస్థించును. పై చెప్పబడిన వన్నియు హత్యచేయుటకు కారణములై యున్నవి. కావున, మనము వాటిలో దేనిజోలికైనను వెళ్ళకూడదు.

“తన సహోదరుని ద్వేషించువాడు నరహంతకుడు” (1. యోహా. 3: 15). అట్టి వానికి హంతకుల బుద్ధి కలదు గనుక, అతడు శిక్షకు భయపడి ఖూనీపని చేయకపోయినను దేవుని దృష్టిలో నతడు హంతకుడుగా నెంచబడును. పగ నరహత్యకు విత్తనముగా నెంచవలెను. పగవలననే యెంతో మంది హతులైరి.

ఖూనీపని చేయుటవలన మాత్రముగాక, ఇతర పనులవలన కూడ ప్రాణహాని కలుగును. అనేకసార్లు ఒకరి యజాగ్రతవలన నితరులకు ప్రాణహాని కలుగవచ్చును. రైలుబండిని నడిపించువారి యజాగ్రతవలన ప్రయాణికులలో ననేకులకు ప్రాణహాని కలుగుచున్నది. ఇండ్లు మొదలగునవి కట్టించువారు దొంగపనిచేయించుటవలన అవి కూలిపడి యెంతో మందికి ప్రాణహాని కలుగుచున్నది. అయితే యెవరి యజాగ్రతవలన నిట్టి ప్రాణహాని కలుగుచున్నదో వారే దానికి జవాబుదారులై దోషులగుదురని తెలిసికొనవలయును.

మఱియు ప్రాణహాని కాకపోయినను, ఇతరుల శరీరమునకు ఇంకనే యితరమైన హాని కల్గించుటయైన నిషేధమై యున్నది.— త్రాగుడు పోకిరితనము మొదలగు ప్రాణహానికరమగు దురభ్యాసములలోనికి ఇతరులను నడిపించువారు

వారి ప్రాణముల విషయమై జబాబుదారులై యున్నారు. పనివారు తమకు అక్కర అగా నున్నంత భోజనమును సంపాదించుకొనుటకు తగినంత జీతము లియ్యక, వారి శక్తికి మించిన కష్టముగ వారిచే జేయించుటవలన వారు జబ్బుపడినయెడల దానికి వారి యజమానులు ఉత్తరవాదులై యున్నారు. ఇతరులునిరాశచే జబ్బుపడునంతగా మనము వారిని తొందరపఱచి విశ్వసించినయెడల దానికి మనము కారకుల మని తీర్పు నొందెదము. అవిధేయులైన బిడ్డలు తమ తలిదండ్రులును దుఃఖము పాలుజేసి వారి ఆయువును తగ్గింతురు. మిక్కిలి కష్టమైన పనిని చేయుటవలన శరీరమునకు గలుగు హానికంటె, అట్టి చింతలవలన నెక్కువహాని కలుగును (ఆది. 37: 31-35)

## III. ప్రాణము తీయుట యెపుడు న్యాయ మౌను?

1. మరణ శిక్షకు పాత్రులైన నేరస్థులను శిక్షించుటలో ప్రాణము తీయుటకు న్యాయమై యున్నది.—న్యాయాధిపతులు ముందుగా ఆ నేరములను బాగుగా విచారింపవలయును. విచారణలో ఒక నేరస్థుడు మరణశిక్షకు తగిన నేరము చేసినట్లు నేరస్థాపన చేయబడిన యెడల న్యాయాధిపతి దేశచట్టములననుసరించి వానిని చంపిన యెడల దోషము లేదు (3) దేశ మంతటి సంరక్షణకై అలాగున జేయుట యవసరము (రోమా 13: 3, 4).

2. మనము మన ప్రాణము దక్కించుకొనుటకు దొంగలను హంతకులను చంపినయెడల అది దోషముగా నెంచ బడదు,—దొంగ మన మీద హఠాత్తుగా పడి మనలను చంపబోవు చుండగా వానిచేతినుండి తప్పించుకొనుటకు ఏ యుపాయమును తోచనియెడల మన ప్రాణము రక్షించుకొనుటకై వాని చంపుట దోషము కాదు. అయితే అట్టి సమయములో హత్య జరుగకుండ తప్పించుకొనుటకు వీలుకలిగియుండినయెడల ఆ సమయములోనైనను మన మా దొంగను చంపరాదు.

3. న్యాయమైన యుద్ధములను జేయుటలో మనము ప్రాణహత్య చేయుట దోషము కానేరదు.—దేశాధికారులు ముందుగా న్యాయము విచారింపక యుద్ధములు చేయరాదు. మరియు సమాధానము నిమిత్తము చేయగలుగు ప్రయత్నము లన్నిటిని చేయక ముందును యుద్ధము చేయకూడదు. అయితే ఒకానొకప్పుడు స్వదేశమును సంరక్షించుకొనుటకును, న్యాయమును స్థాపించుటకును యుద్ధములు చేయ వచ్చును. అట్టి యుద్ధములు చేయుట తప్పుకాదు. ఇశ్రాయేలీయులు అట్టి యుద్ధములనుచేసినపుడు దేవుడు వారికి సహాయముచేసెను. ఇట్టి న్యాయమైన

యుద్ధములు కొన్నియుండినను అయా దేశములు తమకు కీర్తి కలుగజేసికొనుటకును, దోపుడు నిమిత్తమును అనేక యుద్ధములు చేయుదురు. ఈ కారణముల నిమిత్తము యుద్ధము చేయువారు గొప్ప హంతకులే కాని వేతొకటి కాదు. అందఱును క్రీస్తు బోధ నంగీకరించి వాటికి అనుకూలముగ ప్రవర్తించిన యెడల యుద్ధములన్నియు త్వరలో మానిపోవును

IV. మనము ఇతరుల ప్రాణమునకైనను మన ప్రాణమునకైనను హాని కలిగింప కుండునట్లు చూచుకొనవలెను.

1. ఇతరుల ఆత్మకు హాని కలిగింపకుండునట్లు చూచుకొనవలెను. దేహమునకంటె ఆత్మముఖ్యమైనది కావున దానికి హానిచేయుట దేహమునకు హానిచేయుటవలన గలుగు పాపమునకంటె మఱి గొప్పపాపమైయున్నది. ప్రేమ పొరుగువారికి ఆత్మీయ హానినైనను శారీర యాపదనైనను కలుగ చేయదు (రోమా 13: 10). ఇతరులకు తప్పు బోధలు బోధించుటవలన నైనను, మన మాటలచేతను క్రియలచేతను వారు పాపము చేయునట్లువారికి బోధించుటవలన నైనను వారికి హానిచేయ కుండునట్లు బహు జాగరూకత గలవారమై యుండవలెను.

2. ఇతరుల శరీరమునకు హాని చేయ కుండునట్లు చూచుకొనవలెను.—మనము స్వయముగా వారికి హాని చేయకూడదు. అదియుగాక ఏది యితరులకు ప్రాణహాని కరమైనవో అవివారికి సంభవింపకుండులాగున తగు ప్రయత్నములను చెయవలెను. రోగములచే బాధపడు మన పొరుగువారికి మనము శక్తికొలది సాయము చేయవలెను. తగిన పరామర్శ లేనందున కొందఱు రోగులు మరణమొందెదరు. ఈలాటి రోగులకు మనము తగిన పరామర్శచేయనందున వారు చనిపోయిన యెడల వారి ప్రాణముల విషయమై మనము ఉత్తరవాదులమై యున్నాము. కొందఱు అన్నములేక క్షీణించి చనిపోదురు అట్టివారికి సహాయము చేసి, వారిని రక్షించుట మనవిధియై యున్నది. ఇవియు గాక యింక నితరమైన యపాయములు సంభవించినపుడు కూడ మన పొరుగువారికి సహాయము చేయుట మన విధియై యున్నది.

ఇతరుల ప్రాణమునకు మాత్రము గాక, మనస్వంత ప్రాణమునకును ఏ హానియు కలిగించు కొనకుండ జాగ్రత పడవలయును. మన ప్రాణము దేవుని వశములో నున్నది. ఏ హేతువులచే నితరులకు హానిచేయకూడదని పైన చెప్పబడెనో ఆకారణములను బట్టి మన ప్రాణములకును మనము హాని కల్గించుకొన కూడదు. ఇబ్బందులు కలిగినపుడును, స్వబంధు మిత్రులపై యలిగినపుడును కొందఱు బావులలో పడియును,

విషము పుచ్చుకొనుటవలనను స్వహత్య గావించుకొందురు. ఇది యెంతో వెఱ్ఱిపాపమై యున్నది. ఇతర పాపములు చేసినవారు పశ్చాత్తాపమువలన క్షమింపబడుటకు వారికింకను సమయము కలదు గాని యీలాగు స్వహత్య చేసికొనువారికి అట్టి సమయముండదు. అట్టివారు తమ్మును తాము చంపుకొనిన వెంటనే దేవుని న్యాయపీఠము నెదుట నిలువవలసి యున్నారని తెలిసికొనగలము. వారిగతి యెంత భయంకరము!

వెంటనే స్వహత్య చేసికొనకపోయినను చాలమంది ఆయా విధములుగా తమ యాయువును తగ్గించుకొనుటవలన స్వహత్య చేసికొనుచున్నారన దగును. కొందఱు కామమునకు సంబంధించిన పాపములచేతను, కొందఱు తాగుబోతుతనము చేతను, కొందఱు అజాగ్రత చేతను, కొందరు ఆరోగ్యశాస్త్రమును నిర్లక్ష్య పెట్టుటచేతను, కొందరు పిచ్చికోపము చేతను కొందరు అనవసరముగా చింతించుటచేతను, మఱికొందరు మితి మీఱి సంభ్రమ పడుటచేతను తమ యాయువును తగ్గించుకొను చున్నారు. ఇవి యన్నియు పాపములే. మన ప్రాణము దేవుడు మనకు నిచ్చిన విలువగల దానమని తెలిసికొని దేవుడు మనయెడల నుద్దేశించినదానిని నెఱవేర్చులాగున మనము మన ప్రాణమును భద్రముగా కాపాడుకొనవలెను.

V. ఇతరులను రక్షించుటకు మనము మన ప్రాణమును పెట్టుట ధర్మ కార్యమైయున్నది.—మనలను రక్షించుటకు క్రీస్తు తన ప్రాణమును పెట్టెను. ఆలాగు మనమును ఇతరులను రక్షించుటకై మన ప్రాణమును పెట్టుటకు మనస్సుగలవారమై యుండవలెను. (5). దేశ సంరక్షణకొఱకును, నీటి యాపదలోను నిప్పు బాధలో నుండు వారిని రక్షించుటకును, అంటురోగములచే పీడితులైనవారిని సంరక్షించుటకొఱకును నెవరు తమ ప్రాణముపెట్టుదురో వారు స్వహత్య చేసికొనువారుకాక, దేవునికి అనుకూల మగునట్టిదియు, మనుష్యుల వలన మెప్పుబొంద దగినట్టిదియునైన ధర్మకార్యమును చేసిన వారగుదురు. ఇతరులను రక్షించుటకును మన ప్రాణమును పెట్టుటకంటె మఱి గొప్ప మేలుకార్యమును మనము వారియెడల నగపఱచలేము (యోహా. 15: 13).

క్రైస్తవు లగుటచే కొందఱికి ప్రాణహాని కలుగును. ఈ విధముగా చంపబడు వారు హతసాక్షు లను బిరుదును పొందెదరు. అట్టివారు స్వహత్యను చేసికొనువారు కాక దేవుని యందధిక భక్తిగలవారై, మఱిగొప్ప ధర్మకార్యమును జరిగించిన వారని తెలిసికొనవలెను 6 (మత్త. 10: 39).

## 50. శరీరాత్మల శుద్ధినిగూర్చిన బోధ.

హృదయ శుద్ధిగలవారు ధన్యులు, వారు దేవుని చూచెదరు.
మత్తై. 5: 8.

### భాగములు.

I. హృదయమందును, మాటలయందును, క్రియలయందును ,ద్ధులమై యుండవలెను.

II. అపవిత్రతవలన గలుగు దోషము, దానికి విరుగుడుగా చేయ వని.

III. వివాహమునుగూర్చిన బోధ.

1. దాని యేర్పాటు.
2. దాని యుద్దేశము.
3. దాని గంభీరత్వము.
4. దానిలో చేరదగువారు.
5. దానికి జరుపవలసిన క్రమము.
6. భార్యాభర్తలకుగల సంబంధము.
7. పరిత్యాగపత్రిక నిచ్చుటనుగూర్చి.

### అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| ్యభిచారము చేసినవారికి గలుగు శిక్ష. | 1 కొరి. 5. |
| ున దేహములు దేవుని వశమై యున్నవి. | 1 కొరి. 6. |
| ినము పవిత్రులమై యుండవలెను. | ఎఫె. 5: 1-4. |
| ునము పవిత్రులమై యుండవలెను. | 1 థెస్స. 4: 1-8. |
| ివాహముయొక్క యేర్పాటు. | ఆది. 2: 18-25. |
| క్రీస్తు వివాహమునుగూర్చి చేసిన బోధ. | మత్తై. 19: 3-12. |
| భార్యాభర్తల ధర్మవిధులు. | ఎఫె. 5: 22-23. |

### వేదవాక్యములు.

[. 1. నీ హృదయములోనుండి జీవధారలు బైలుదేరును, కాబట్టి అన్నిటి ంఖ్యముగా నీ హృదయమును కాపాడుకొనుము (సామె. 4: 23).

3. మీలో వేశ్యాగమనమే గాని యేవిధమైన అపవిత్రతయే గాని లోభమే గాని వీటి పేరు ఎత్తనైనను కూడదు. ఇదే పరిశుద్ధులకు తగినది. మరియు కృతజ్ఞతా వచనమే మీరుచ్చరింపవచ్చునుగాని పోకిరి మాటలైనను బూతులైనను సరసోక్తులైనను ఉచ్చరింపకూడదు; ఇవి మీకు తగవు (ఎఫె. 5: 3, 4).

సహోదరులారా పరిశుద్ధమును దేవుని కనుకూలమునైన సజీవ యాగముగా మీ శరీరములను ఆయనకు సమర్పించుకొనుడని దేవుని వాత్సల్యతను బట్టి మిమ్మును బతిమాలుకొనుచున్నాను. ఇట్టి సేవ మీకు యుక్తమైనది (రోమా 12: 1).

II. 4. మీరు శోధనలోకి రాకుండ మెళకువగానుండి ప్రార్థన చేయుడి. ఆత్మ సిద్ధమేగాని శరీరము బలహీనమని పేతురుతో చెప్పెను (మత్త. 26: 41).

III. 5. కాబట్టి వారికను ఇద్దరు కాక యేక శరీరముగా నున్నారు. గనుక దేవుడు జతపరిచినవానిని మనుష్యుడు వేరుపరచ గూడదని చెప్పెను (మత్త. 19: 6)

6. స్త్రీలారా, ప్రభువునకువలె మీ స్వపురుషులకు లోబడియుండుడి (ఎఫె 5: 22).

7. వ్యభిచారము నిమిత్తమే తప్ప తన భార్యను విడనాడి మరియొక తెను పెండ్లిచేసికొనువాడు వ్యభిచారము చేయుచున్నాడనియు విడనాడబడిన దానిని పెండ్లిచేసికొనిన వాడు వ్యభిచారము చేయుచున్నాడనియు మీతో చెప్పుచున్నానని వారితో ననెను. మత్త 19 : 9

## వివరము.

శుద్ధ హృదయులు ధన్యులు, వారు దేవుని చూతురని (ప్ర॥ వా॥) మన ప్రభువు చెప్పెను. ఇది శుద్ధిగలవారు తప్ప అపవిత్రత యందాశపడువా రందరు దేవుని చూడలేరని యున్నట్లుగా నున్నది. దేవుడు పరిశుద్ధుడైయున్నాడు కావున, మనము కూడ పరిశుద్ధులమై యుండవలెనని (లేవీ. 19: 2). ఆయన మందలించి యున్నాడు. ఈ పాఠములో ముఖ్యముగా వ్యభిచార సంబంధమైన యపవిత్రతనుగూర్చి ప్రశంసింపబడును. వ్యభిచరింపకూడదు అను నాజ్ఞను దేవుడిచ్చెను. (నిర్గ. 20: 14). హృదయమందును, నడతయందును అపవిత్రులైనవారికి శిక్ష కలుగునని బైబిలులో నానేక చోట్ల చెప్పబడి యున్నది.

I. మనము హృదయమందును, మాటయందును, క్రియయందును పవిత్రులమై యుండవలెను.

హృదయమందు పవిత్రులమై యుండవలెను.—చెడ్డవి యన్నియు హృదయమునుండియే పుట్టును (మత్త. 15: 19). మనము మన హృదయములో చెడ్డ తలంపులును చెడ్డ కోరికలును పుట్టకుండునట్లు చూచుకొనవలెను. (1). మనము మనస్సులో తలంచుకొను తలంపులలో కొన్ని మంచివారికి తెలిసినయెడల మనము సిగ్గుపడవలసివచ్చును. కావున అట్టితలంపులను మనము మెన్నడును మన మనస్సులో నుంచుకొనరాదు. చెడు తలంపులు మన యాత్మలకు విషకరములై యున్నవి. చెడు తలంపులు తలంచుకొనువారు శోధనల నెదిరింపలేక బలహీనులగుదురు. తమ మనస్సు ఈలాగు చెడ్డవాటిలో మగ్నమై యున్నందున వారు చదువునందుగాని మఱి యితరములగు మంచివాటియందుగాని శ్రద్ధగలిగి యుండనేరక యుందురు. మఱియు మంచి పనులను చక్కపెట్టజాలకయు వాటియందు అభివృద్ధి జెందకపోయు నుందురు. ఇట్టి చెడయాశలను మనస్సులో నుంచుకొనుటయును ఆలాగు యాజ్ఞను మీరుట పాపమై యున్నది. (మత్త. 5:28) ఈ యాశలను త్యజింపక పోయినయెడల నవితప్పక అపవిత్రమైన మాటలను పలుకుటకును, లజ్జాకరమైన క్రియలను చేయుటకును కారణములగును.

2 మాటలయందు పవిత్రులమై యుండవలెను. — మనము కామమునకు సంబంధమైన యే మాటనైనను పలుకకుండునట్లు చూచుకొనవలెను. మఱియు అశుభ్రమైన సరససల్లాపములు, పురాణకథలు, పోకిరిమాటలు (ఎఫె. 5: 3, 4), అట్టి పాటలును త్రాచుపాము కాటుకంటె అపాయకరములని తెలిసికొనివాటిని యే మాత్రమును వాడకయు, వాటిని వాడుకొనువారితో నేమాత్రమునుపొందుచేయకయే యుండవలెను. అపవిత్రత సర్వవిషముకంటె మఱి భయంకరము. మంచివారు మన యెదుట నుండినయెడల సిగ్గుపడవలసివచ్చునట్టి మాటలు పలుకుటయైనను వినుటయైనను మనకు తగదు.

3. క్రియలయందు పవిత్రులమై యుండవలెను.—మన క్రియలు యెంత రహస్యములైనవిగ నుంచబడినను, వాటి నన్నిటిని దేవుడు తేటగా చూచుచున్నాడని తెలిసికొనవలెను (కీర్తన. 139: 1-12). మనము ఏకార్యములను బహిరంగముగా చేయుటకు సిగ్గుపడి రహస్యముగా చేతుమో అట్టికార్యములను నన్నిటిని చేయకుండునట్లు జాగ్రత్తపడవలెను. మన యాత్మలు మాత్రము గాక మన దేహములును దేవుని వశములై యున్నవి. కావున అవి పవిత్రములైన వగునట్లు మనము వాటిని కూడ కాపాడుకొనవలెను (1. కొరి. 6: 19, 20). మంచి సేవ ద్వారా మనము మన దేహములను దేవునికి సమర్పింపవలెను (2) గాని, మనము మన యవయవములను దుర్నీతికి సాధనములనుగా పాపమునకు అప్పగింపకూడదు (రో. 6: 13). ఏ విధమైన

అపవిత్రత పేరును ఎత్తనైనను కూడదు (8). శరీర కార్యములు స్పష్టమై యున్నవి. అవేవనగా—వేశ్యాగమనము, అపవిత్రత, కామాతురత... మొదలైనవి. వీటిని గూర్చి నేను మునుపును చెప్పిన ప్రకారము ఇట్టివాటిని చేయువారు దేవుని రాజ్యము నందు స్వాతంత్ర్యము చేకొనరని మీతో స్పష్టముగా చెప్పుచున్నాను (గల. 5: 19. 21) అని పౌలు వ్రాసినట్టు మన వేదశాస్త్రములో నున్నది.

## II. అపవిత్రతవలన గలుగు దోషము, దానికి విరుగుడుగా చేయవలసిన పని.

1. అపవిత్రత గొప్ప పాపమై యున్నది.—కావున, దాని ననుసరించువారు దేవుని శాపమునకు లోనగుదురు. దేవుడు వ్యభిచారులను తప్పక శిక్షించును. ఈ జీవితకాలములో సహా అట్టివారి శరీరములును మనస్సులును బలహీనమైనవి యగుననుటకు లెక్కలేని దృష్టాంతములు కలవు. మఱియు ఈ పాపము వలన అనేకులు రోగములపాలై క్షీణించి తమ ఆయుస్సును తక్కువ చేసికొందురు. ఈ జీవితకాలమునకు పిమ్మటను అట్టివారు తమ స్వంత దురేచ్ఛలచే బాధపడి, నిత్య దండనకు పాత్రులగుదురు. మన దేహము దేవుని ఆలయమై యున్నది. ఎవడైనను దేవుని యాలయమును (అనగా తన దేహమును) పాడు చేసినయెడల దేవుడు వాని పాడుచేయును. దేవుని యాలయము పరిశుద్ధమై యున్నది. మీరును పరిశుద్ధులైయున్నారు (1. కొరి 3: 17).

2. అపవిత్రతకు లొంగకుండునట్లు మనము చేయవలసిన వేవి?—మనము దురాశయొక్క మొదటి చలనమును కనిపెట్టి వెంటనే దానిని అణచివేయవలెను. కామమునకు సంబంధించిన వాటికి మన మనస్సులో చోటియ్యక మంచి విషయములను గూర్చి ధ్యానించుకొనవలెను. శోధనలోనికి రాకుండ మెలకువ పడి ప్రార్థన చేయవలెను (4) దురాశలను రేపునట్టి సహవాసులు, గ్రంథములు, ఆట పాటలు, బొమ్మలు, సోమరితనము, త్రాగుడు మొదలగు వాటి నన్నిటిని విసర్జించి ఏమాత్రమును వాటి జోలికి పోగూడదు.

## III. వివాహమును గూర్చిన బోధ.

1. వివాహముయొక్క యేర్పాటు.—వివాహమువలన స్త్రీ పురుషులు ప్రేమచే అతుకబడినవారై తమ జీవితాంతమువఱకు ఇతరుల నొల్లక, ఒకరి యెడల నొకరు నమ్మకము గలవారై యుండవలసియున్నారు. నరుడు ఒంటరిగా నుండుట మంచిది కాదు. వానికి సాటియైన సహాయమును వానికొఱకు చేయుదు:

ననుకొని (ఆది 2: 18, 22) దేవుడు హవ్వను సృజించి ఆమెను ఆదామున కిచ్చుట ద్వారా ఏదేను వనములో వివాహముయొక్క యేర్పాటును చేసెను. ఈ విధముగా ఆయన వివాహమును జరిపి మొదటి కుటుంబమును స్థాపించెను.

ఇది దేవుని యేర్పాటు మాత్రముకాదు. ఆయన కుమారుడును మన ప్రభువు నగు యేసు తన పరిచర్యారంభమునందు గలిలైయలోని కానాయూరిలో జరిగిన పెండ్లికి అతిథిగా పిలువబడి వారి యవసరమును దీర్చునై తన మొదటి యద్భుతమును చేసి ఈ యేర్పాటును పరిశుద్ధపరచెను. మనుష్యులందరును తప్పక గృహస్థ స్థితిలో చేరవలెనని నియమము లేదు. అయితే సంసార స్థితికంటే సన్యాసత్వమే పరిశుద్ధమైనదని బోధించువారు దేవుని వాక్యానుసరణముగా బోధింపక, దాని భిన్నముగా నుండు బోధను బోధించువారగుదురు (1 తిమో. 4: 1-3).

2. వివాహముయొక్క యుద్దేశము.—మనుష్యులకు ఇహపరముల యందును సౌఖ్యముండవలెనని దేవుడుద్దేశించి దాని నేర్పరచెను. భార్యాభర్త సంబంధము క్రీస్తునకును సంఘమునకు గల సంబంధమువలె నుండవలెను. భార్యాభర్తలు నిష్కపటమైన ప్రేమచేత అతుకబడవలెను. ఒకరి నొకరు పూర్ణముగా నమ్మి, ఏక మనస్సుగలవారై తమ వ్యవహారములను జరుపుకొనవలెను. వారిద్దరు నైక్యపడి దేవుడు తమకు నిచ్చు బిడ్డలను వారు భయభక్తులలో పెంచవలెను. ఒకరి సంతోషములయందొకరు పాలివారై, ఒకరి భారముల నొకరు భరించుకొనవలెను. దేవుని నారాధించుటయందు కూడ వారైక్యపడి, ఒకరి విశ్వాసమున కొకరు సహాయులై యుండవలెను.

3. వివాహముయొక్క గంభీరత్వము.—వివాహము దేవునియెదుట స్త్రీ పురుషులిద్దరును ఒకరితో నొకరు స్వయముగ చేసికొను నిబంధనయై యున్నది. దానిలో స్వయముగా చేరుటకు మాత్రమే అందరికిని స్వతంత్రము కలదు గాని చేరిన పిమ్మట ఆ నిబంధనను తెంపివేయుటకు నే స్వతంత్రతయును లేదు. (5). మరణము తప్ప మరేదియు నీ నిబంధనను రద్దుపరుప జాలదు. ఈ యేర్పాటు ఇంత గంభీరమైనదై యున్నది కావున ఆలోచన లేకుండ నెవడును అందులో చేరక, బాగుగా నాలోచించి దేవునికి భయపడి అందులో చేరవలెను. మనుష్యులకు సౌఖ్యము గాని దుఃఖము గాని చాల మట్టుకు తమ వివాహమును బట్టియే కలుగును గనుక దీనిని గంభీరమైన దానిగా నెంచి దీనిలో చేరదలంచువారు తాము తగిన వారిని వివాహమాడునట్లుగా తమ్మును నడిపించునట్లు దేవుని వేడుకొనవలెను.

3. వివాహస్థితిలో చేరదగినవా రెవరు?—దగ్గఱ బంధువులలో వివాహములు జరుగకూడదు (లేవీ. 18) ఈ యిండియా దేశములో మేనరికపు వివాహములు చేసికొనుటవలన మిక్కిలి సమీపబంధువులతో వియ్యమందు వాడుక కలదు. ఇట్టి దగ్గఱ బంధుత్వములో వివాహము చేసుకొనువారికి పుట్టు బిడ్డలకు మనోబలమును దేహబలమును తక్కువగా నుండునని యీ సంగతిని పరీక్షించిన వారందఱు ఏకగ్రీవముగా చెప్పుదురు కావున, ఇట్టి దుర్వాడుకను మాన్పివేయుటకు అందఱును కలసి పనిచేయవలెను. బాల్య వివాహములుకూడ ఈ దేశములో గొప్ప కీడుగా నున్నవి. బాలిక రజస్వల యగుతోడనే దానికి పెండ్లి చేయవలెననెడు అభిప్రాయము సరికాదు. తలిదండ్రులే యింకను పిల్లలై యుండుండగా వారికి గలుగు సంతాన మేలాగున బలహీనమైనది కాక యుండగలదు? అదియుగాక బిడ్డను కను తల్లి తానే పిల్లయై యుండుటవలన అపాయ మెంతో కీడు సంభవించును. అట్టి పసి తల్లులు చాల మంది తమ మొదటి ప్రసూతికాలమందే ప్రాణ నష్టము చెందెదరు. ఒకవేళ బ్రతికినను, ఎన్నడును పిల్లలను కనలేని జబ్బు వారికి కలుగును. ఇట్టి పసికూనలకు వివాహము చేయుట బొత్తుగా తగదు. వివాహము చేసికొనువారు సుఖముగా నుండగోరిన యెడల వారిద్దఱు అన్ని విషయములలో నైక్యపడినవారై యుండవలెను, ముఖ్యముగా మత విషయములలో నైక్యపడనివారిందు చేరుట తగదు. క్రైస్తవుడు క్రైస్తవురాలగుటకు నిష్టపడని అన్యకన్యకను పెండ్లి చేసికొనగూడదు. అదే విధముగా క్రైస్తవుడగుటకు మనస్సులేని యొక అన్యునికి క్రైస్తవ పిల్లను పెండ్లికియ్యగూడదు. ఇట్లు మన క్రైస్తవులు రోమన్ కథోలిక్ వారితో వియ్యమందుట ఐక్యము చెడుటకు కారణ మగును గనుక అది తగదు. ప్రొటెస్టెంటువారిలో వివాహము చేసికొనువారు ఏక సంఘములో చేరిన వారైన యెడల మేలు. ఎందుకనగా అట్టివారికి మత విషయమైన ఐక్యముండును భార్యాభర్తలకు విద్యా విషయములలో కూడా సాధ్యమైనంతవఱకు ఐక్య ముండవలెను. మోటువాడు చదువుకొనిన పిల్లను వివాహము చేసికొనినయెడల అట్టి కుటుంబములో నే మాత్రమును సౌఖ్యముండనేరదు. ఆస్తివిషయమైన హేతువులచే ఒకడు తన్నొల్లని పిల్లను యెన్నడును వివాహము చేసికొనినతగదు, ఒకరియందొకరు గుర్తించు యోగ్యతలను బట్టి ఒకరి నొకరు ప్రేమించువారే యింద్దు చేయుటకు అర్హులైయున్నారు (ఎఫె. 5: 25)

5. వివాహము జరుపవలసిన క్రమము.—ఈ దేశములో వివాహమునకు పిల్లలను మాట్లాడు పని తలిదండ్రులదియై యున్నది. ఈ వాడుకను క్రైస్త

వులు మార్చవలసిన యవసరమేమియు లేదుగాని తమ యేర్పాటునకు తమ పిల్లలు స్వయముగా సమ్మతించునట్లు తలిదండ్రులు చూచుకొనవలెను. ప్రతివారును తమ యిష్టపూర్వకముగా వివాహమును చేసికొనవలసి యున్నారు కావున పిల్లవాడు కోరని పిల్లనుగాని పిల్ల కోరని పిల్లవానిగాని మాట్లాడి బలవంతముగా వివాహము చేయుట ధర్మము కాదు.

వివాహ క్రమములలో దేశ సంబంధమైన చట్టములను లక్షించి వాటిని మీఱకుండ వివాహములు జరుపుకొనవలెను. తగిన లైసన్సు (అధికార పత్రిక)ను పొందిన వారు తప్ప మరియెవరును వివాహము చేయకూడదని తెలిసికొని, అట్టివారి చేత క్రమముగా వివాహము చేయించుకొనవలెను. మఱియు వివాహము సంఘముయొక్క యేర్పాటు ననుసరించి జరుపుకొనవలెను. వివాహము దేవుని యేర్పాటయి యున్నది. కావున ప్రార్థనతో దాని నారంభించి దేవుని యాశీర్వాదమును పొందుటకు సంఘముయొక్క ఆరాధనక్రమము ననుసరించి జరుపవలెను

శక్తికి మించిన ఖర్చులుచేసి, అప్పులపాలై వివాహము చేసికొనుట యెంతో బుద్ధిహీనతయై యున్నది. కొద్ది దినముల వేడుక నిమిత్తము కొందరు తమ జీవితకాలమంతటితో సహా తీర్చలేని యప్పులలో పడుదురు. అట్టివారు తమ మెడలకు తిరుగటర్రాళ్ళను కట్టుకొని తమ జీవితకాలమంతయు వాటిని మోయుచు తమ వ్యవహారములను జరుపుకొనవలసినట్లుగా నున్నది. కుటుంబ సౌఖ్యమును కోరువారిట్టి వెఱ్ఱిడంబమును మానుకొనవలెను.

6. భార్యాభర్తలకు గల సంబంధము.—పురుషుడు తన కుటుంబమునకు అధికారియై యున్నాడు (6). గాని వాడు కుటుంబములో నున్నవారిని కఠినత్వముతో నేల కూడదు (కొల. 3: 19). భార్య తనకు సహాయురాలై నిత్యజీవమను వరములో పురుషునితో పాటు నొందునదియై యున్నదనియు (1 పేతురు 3: 7). యెఱిగి భర్త తన భార్యకు తగిన ఘనతను చూపవలెను. తన భార్యను ప్రేమించువాడిట్లు చేయక తప్పదు. స్త్రీ పురుషునికి దాసి కాదు. భార్య తన భర్తకు అందఱికంటె నెక్కువ ప్రాణ స్నేహితురాలైయున్నది. మనము మన స్వంత తలిదండ్రులను సహా విడిచి మన భార్యలను హత్తుకొని యుండవలసివచ్చును (మత్త. 19: 5), వివాహమునకు పిమ్మట భార్యాభర్తలికను ఇద్దఱు కాక ఏక శరీరముగా నున్నారు (19: 6). వారు ఏక ప్రేమయు, ఏక జీవమును ఏక కుటుంబమును ఏక ఆస్తియు గలవారై యుందురు. వారి పనులను నిరీక్షణలును ఒకటే విధముగ నుండెను. మఱియు వారు ఒక్కడే రక్షకుని కలిగినవారై యుందురు. వారు ఒకరి లోపముల

నొకరు సహించుకొని వాటిని క్రమపఱచుకొనుటకు ఒకరి నొకరు సహాయులై యుండవలెను. ఒకరి శ్రద్ధ నొకరును, ఒకరియోగ్యతనొకరును చూచుకొని వాటి యందానందింపవలెను. ఒకరి నొకరు సంతోషపఱచుటకు యత్నింపవలెను. ఈలాగు ప్రయత్నించువారికి సౌఖ్యము కలుగును. మరణము తమ్మ ఎడబాపువఱకు భార్యాభర్తలిరువురును అన్యోన్య ప్రేమానుబంధముచే కట్టుబడి, ఒకరియం దొకరు నమ్మకముగల వారై కలసి యుండవలెను.

7. పరిత్యాగ పత్రిక నిచ్చుటనుగూర్చి.—వివాహముచేసికొనిన స్త్రీ పురుషులు ఏక శరీరముగా నుందురు. దేవుడు జతపఱచినవానిని మనుష్యుడు వేరుపఱచగూడదు (5). వ్యభిచారమునుబట్టి మరి యే హేతువుచేతనైనను నియ్యబడిన పరిత్యాగపత్రిక దేవుని యెదుట చెల్లదు (7). అధికారులవలన పరిత్యాగ పత్రికను పొందినను అట్టి భార్యాభర్త లిరువురిలో నెవరు దోషులై యుండిరో వారు పునర్వివాహము చేసికొనుటకు హక్కుదారులు కాజాలరు. భార్యాభర్త లిద్దఱిలో నిర్దోషిగ నుండువా రెవరో వారే మరల వివాహము చేసికొనుటకు అర్హులై యున్నారు. ఈలాగు న్యాయముగా పరిత్యాగము నొందినవారు గాక, మరి వేరు విధముగా వివాహపు యేర్పాటునుండి ఎడబాపునొందిన యెవరికైనను సంఘముయొక్క క్రమమునను పరించి పునర్వివాహము చేసినయెడల ఆ వివాహము దేవుని వాక్యమునకు భిన్నముగా నున్నది గనుక దానిని జరిగింపరాదు. దేవుని వాక్యముచే నిషేధింపబడిన యిట్టి వివాహమును దేవుని పేరట జరిపి, ఆయన దీవెన దానిమీద నుండవలెనని వేడికొనుట బొత్తుగా అనర్థమై యున్నది.

---

## 51 అధికారులయెడల జరిగింపవలసిన వాటినిగూర్చిన బోధ.

కైసరువి కైసరునకును దేవునివి దేవునికిని చెల్లించుడి.
మత్త. 22: 21.

### భాగములు.

1. దేశప్రభుత్వమునుగూర్చిన బోధ.
   1. అది దేవుని యేర్పాటై యున్నది.
   2. అది ప్రజలకు మేలు కలుగజేయునట్లు యేర్పాటు చేయబడెను.

3. దేవునియాజ్ఞలకు భిన్నముగ నుండువాటిలో తప్ప తక్కిన్నివిషయము లన్నిటిలో దానికి లోబడవలయును.

4. మనము అధికారులయెడల జరిగింపవలసిన యితర ధర్మ విధులు.

II. దేశ ప్రభుత్వమునకును సంఘ ప్రభుత్వమునకు గల సంబంధము.

III. అధికారుల ధర్మ విధులు.

IV. ప్రజలు తమ యధికారులను మన్నన చేయవలెను.

## అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| దేశాధికారమును గూర్చి క్రీస్తు చేసిన బోధ. | మత. 22: 15-22. |
| దేశ ప్రభుత్వము దేవుని యేర్పాటై యున్నది. | రోమా. 13. |
| రాజును సన్మానింపుడి. | 1 పేతురు 2: 13-25. |
| అధికారులకంటె నెక్కువగా దేవునికి లోబడవలెను. | కార్య. 5 :17-32. |
| అధికారులకొరకు ప్రార్థన చేయవలెను. | 1. తిమో. 2: 1-7. |
| అధికారుల ధర్మములు. | ద్వితీ. 17: 14-20. |
| పౌలు అధికారుల యెడల చూపిన మర్యాద. | కార్య. 23: 1-4; 26: 1-3. |

## వేదవాక్యములు.

రోమా 13: 1-7.

1. ప్రతివాడు పై యధికారులకు లోబడి యుండవలెను; ఎందుకనగా దేవునిచేత కలిగినది తప్ప మరి యే అధికారమును లేదు; ఉన్న అధికారములు దేవుని చేతనే నియమింపబడి యున్నవి.

2. కాబట్టి అధికారము నెదురించువాడు దేవుని నిర్ణయము నెదిరించుచున్నాడు; ఎదిరించువారు తమ మీదికి తామే శిక్షను తెచ్చుకొందురు.

3. ప్రభుత్వము చేయువారు చెడ్డ కార్యములకే గాని మంచి కార్యములకు భయంకరులు కారు; నీకు మేలు కలుగుటకు అధికారులు దేవుని పరిచారకులు; వారికి భయపడకుండుటకు కోరితివా మేలు చేయుము; అప్పుడు వారిచేత మెప్పుపొందుదువు.

4. నీవు చెడ్డది చేసినయెడల భయపడుము; వారూరక యే ఖడ్గముధరింపరు; కీడు చేయువాని మీద ఆగ్రహము చూపుటకై వారు ప్రతీకారము చేయు దేవుని పరిచారకులు.

5. కాబట్టి భయమునుబట్టి మాత్రముకాక, మనస్సాక్షిని బట్టియు లోబడి యుండుట యావశ్యకము.

6. ఎందుకనగా వారు దేవుని సేవకులై యుండి యెల్లప్పుడు ఈ సేవ యందే పని కలిగి యుందురు.

7. ఇందునకేగదా మీరు పన్నుకూడ చెల్లించుచున్నారు? కాబట్టి యెవనికి పన్నో వానికి పన్నును, ఎవనికి సుంకమో వానికి సుంకమును చెల్లించుడి. ఎవనియెడల భయముండవలెనో వాని యెడల భయమును, ఎవనియెడల సన్మాన ముండవలెనో వానియెడల సన్మానమును కలిగియుండి అందరికిని వారి వారి ఋణములను తీర్చుడి.

## వివరము.

1. దేశ ప్రభుత్వమునుగూర్చిన బోధ.—క్రైస్తవులమగు మనము సంఘము నెడలను, కుటుంబము నెడలను, మనుష్యు లందరి యెడలను చేయవలసిన విధు లున్నట్లుగా, సర్కారువారియెడల చేయవలసిన ధర్మ విధులుకూడ కలవు. మనము కైసరుని కైసరువు (అనఁగా రాజుకు చెల్లించవలసినవి రాజుకును) దేవునివి దేవునికిని చెల్లింపవలెనని క్రీస్తు మనకు నాజ్ఞాపించెను.

1. దేశ ప్రభుత్వము దేవుని యేర్పాటై యున్నది.—మనుష్యుల లౌకిక విషయములను క్రమపరిచి, నేరస్థులను శిక్షించి, సన్మార్గులను సంరక్షించుటకై అధికారులు దేవునివలన నియమింపబడిన ఆయన పరిచారకులై యున్నారు. క్రమమైన యేర్పాటు లుండవలయునను నియమమును దేవుడే నియమించెను (1). పరలోకమందు అంతయు క్రమముగా జరుగుచున్నది. అలాగు భూలోకమందును జరుగవలయునని దేవుని యుద్దేశమై యున్నది. దేవునిచేత కలిగినది తప్ప మరి యే యధికారమును లేదు. ఉన్న యధికారము లన్నియు దేవుని చేతనే నియమింపబడి యున్నవి కావున అధికారుల నెదిరించువారు వారిని గాక దేవునినే యెదిరించువారగుదురు. మరియు అట్టివారు శిక్షకు లోనగుదురు (1, 2). అవిధేయతయు, అధికారమును తిరస్కరించుటయు సాతాను పనులై యున్నవి. ఈలాగు చేయుటకు సాతాను ఆదినుండి మనుష్యులను ప్రేరేపించుచున్నాడు.

2. ప్రజలకు మేలు కలుగజేయునట్లు ప్రభుత్వము ఏర్పాటు చేయబడెను.—దేశములో క్రమము, సమాధానము, న్యాయము, ప్రబల మగునట్లును, ప్రతివాడు తన స్వతంత్ర హక్కులను నిరభ్యంతరముగా అనుభవించుకొనునట్లును, ప్రజలకు మేలు కలుగుటకై వారి హక్కులను ఏయే విషయములలో తగ్గింపవలెనో ఆయా విషయములలో వాటిని తగ్గించి మొత్తముమీద ప్రజలందరికి క్షేమము కలుగ జేయునట్లును ప్రభుత్వము యేర్పాటు చేయవలెను. ఎవరును తీసి

వేయగూడని స్వతంత్రతములను దేవుడు అందరికి ననుగ్రహించెను. తన ప్రాణమును కాపాడుకొనుటయును, దాసుడు కాక స్వతంత్రుడుగ నుండుటయును, పవిత్రమైన సుఖముల ననుభవించుకొనుటయును, అస్తిని సంపాదించుకొని దానిని భద్రపఱుచుకొనుటయును, దేవుడు మనకు నిచ్చిన జ్ఞానమునుబట్టి ఆయనను సేవించుటయును దేవుడు అందరికి హక్కుల నిచ్చియున్నాడు. సర్కారువారు యీ మన హక్కులను తీసివేయక మనము స్వాయముగాను, మన కుటుంబములలోను, మన సంఘముల లోను వాటిని అనుభవించుకొనునట్లు మనలను కాపాడి, మన యొద్దనుండి వాటిని తీసివేయ ప్రయత్నించు వారిని శిక్షింతురు. ఈ హక్కులను మనకు నిచ్చినవాడు దేవుడే గాని సర్కారువారు కారు. అయితే ఆ హక్కులను ఇతరులు మన యొద్దనుండి తీసివేయకుండునట్లు సర్కారువారు జనులను కాపాడెదరు. ఈ పనిని నిష్పక్షపాత బుద్ధితో చేయులాగున సర్కారువారు జాగ్రతపడవలెను. ఇట్టి విషయములలో బీదలకు కొద్ది హక్కులను, ధనికులకు ఎక్కువ హక్కులను నియ్య రాదు (ద్వితీ 1: 16, 17.) లోబడువారికి మేలు చేయుటకై సర్కారువారు నియమింపబడి యున్నారు. అయితే వారు కీడు చేయువారి మీద ఆగ్రహము చూపుదురు (4). సర్కారువారు చెడ్డ కార్యములకే గాని మంచి కార్యములకు భయంకరులు కారు (3).

5: దేవుని యాజ్ఞలకు భిన్నముగా నుండు వాటిలో తప్ప తక్కిన మాత్ర విషయములన్నిటిలో మనము దేశ ప్రభుత్వమునకు లోబడవలెను.—మనము శిక్షకు భయపడుటచే లోబడువారము గాక, లోబడుట మన విధి యనియు (5) ప్రభువు దాని కోరుచున్నాడనియు (1. పేతు. 2: 13) తెలిసికొని అధికారులకు లోబడవలయును. అట్టి విధేయత మనకు నుండవలెను లేని యెడల ఈ లోకవ్యవహారములు జరుగనేరవు. అధికారులకు విరోధముగా తిరుగు బాటు చేయుట గొప్ప పాపమై యున్నది (2) దేశప్రభుత్వములో లోపములుండిన యెడల వాటిని దిద్దుటకు న్యాయమైన యత్నములను చేయవలెను గాని, ప్రభుత్వమును తిరస్కరించి, దానిని కొట్టివేయుటకు ఏ మాత్రమును ప్రయత్నము చేయ రాదు. అధికారుల న్యాయచట్టములను తెలిసికొని వాటిని లక్షించి, ఎన్నడును వాటిని మీఱక, అందఱును వాటిని లక్షించునట్లు తగిన ప్రయత్నములను చేయవలెను. సర్కారువారిని బెదిరించుటయును, ఏదో యొక విషయమునుగూర్చి తమ యిష్ట ప్రకారముగా చేయుటకు సర్కారువారిని బలవంతపెట్టుటయును అప్పుడప్పుడు అల్లరిమూకలు కూడుట తటస్థమగును. అయితే మన మెంత మాత్రమును అట్టి వాటి జోలికి పోగూడదు.

ఈలాగు అన్ని విషయములలో మనము సర్కారువారికి లోబడవలసినదే గాని వారు దేవుని యాజ్ఞలను లక్ష్యింపక, వాటికి భిన్నముగా నుండు చట్టములు చేసినయెడల అట్టి చట్టములకు మనము లోబడ కూడదు. అట్టి విషయములలో మనము మనుష్యులకు కాదు దేవునికే లోబడవలెను (కార్య. 5: 29) ఈ విధముగా షద్రకు, మేషెకు, అబెద్నెగో యనువారు అగ్నికొలిమిలో వేయబడుటకైన యొప్పుకొని దేవుని యాజ్ఞకే లోబడిరిగాని నెబుకద్నెజరు నిలిపిన బంగారు ప్రతిమకు మ్రొక్కకపోయిరి (దానియేలు. 3). మరియు యెహోవాకు ప్రార్థన చేయకుండవలెనను రాజాజ్ఞకు లోబడక, దానియేలు యెహోవాను ప్రార్థించినందున సింహముల బోనులో వేయబడెను. లూథరును విచారించుటకై వర్మ్సు పట్టణములో కూడిన సభలో లూథరు తాను వ్రాసినవాటిని రద్దుపరచుకొనవలెనని చక్రవర్తి ఆజ్ఞనిచ్చినను, దేవునియొక్కయు, తన స్వంత మనస్సాక్షియొక్కయు అధికారము చక్రవర్తి యధికారముకంటె గొప్పదని తెలిసికొని లూథరు చక్రవర్తికి లోబడక దేవునికి విధేయుడయ్యెను.

4. మనము అధికారులయెడల జేయవలసిన యితర ధర్మములు.—సర్కారువారు మనకు విధించు పన్నును మనము చెల్లించుటకు బాధ్యులమై యున్నాము. సర్కారువారికి మనము అచ్చియున్న ఋణమును మనకు విధియైన పన్నును చెల్లించుటద్వారా తీర్చవలసి యున్నాము (7) మన దేశ క్షేమముకొరకు మనము సుఖ కాలమందును ఆపత్కాలములలోను ప్రయాసపడవలెను. మన దేశమునకు క్షేమము కలుగుటకును, మన దేశాధికారులు క్షేమము గలవారై తమకు నియమింపబడిన భారమైన పనులను న్యాయముగా జరుపునట్లును మనము ప్రార్థన చేయవలెను. మన యారాధన క్రమములో అట్టి ప్రార్థనలు ప్రచురింపబడియున్నవి.

మనము మన దేశాభివృద్ధి నిమిత్తమై పాటుపడవలెను. ఇది బాహ్యాభివృద్ధి మాత్రము కాదుగాని, ముఖ్యముగా ప్రజల గుణములకు సంబంధించినదై యుండవలెను. ప్రజలు నీతి న్యాయములు గలవారై దైవభయభక్తులయందు వృద్ధినొందునట్లు మనము పని చేయవలెను. 'నీతి జనములకు ఘనతకలుగుటకు కారణము, పాపము ప్రజలకు అవమానము తెచ్చును' (సామె. 14: 34). ప్రజలలో జ్ఞానమును సుగుణములు నుండునట్లు మనము పని చేయవలెను. సేనా బలములు దేశమునకు బలముకాదుగాని, ప్రజల సుగుణములే దేశమునకు బలమై యున్నవి.

II. దేశ ప్రభుత్వమునకును, సంఘ ప్రభుత్వమునకును గల సంబంధము.—వెనుకటి కాలములో రోమన్ కథోలిక్ వారు దేశ ప్రభుత్వము

సంఘ ప్రభుత్వమునకు లోబడవలెనని బోధించి, తమ యధికారము చెల్లినంతవరకు ఆ లాగుననే జరిపి యుండిరి గాని, ప్రస్తుతము వారికి నట్టి యధికారము లేదు. యూరోపు దేశములలో కొన్నిటియందు సంఘ ప్రభుత్వము దేశప్రభుత్వమునకు లోనై యుండవలెనని చాల కాలమునుండి ఏర్పాటై యున్నది. అయితే నవీన కాలములో సంఘ ప్రభుత్వము వేఱు, దేశ ప్రభుత్వము వేఱు అను క్రీస్తు బోధ అంతటను నంగీకరింపబడుచున్నది. ఇండియా దేశములో చాలమట్టుకు ఈలాగుననే జరుగుచున్నది. ప్రతిసంఘము తన ప్రభుత్వ వ్యవహారములను జరుపుటకు నే యాటంకములు లేకుండునట్లు సర్కారువారు చూచుకొందురుగాని ఆయా సంఘ ప్రభుత్వ మెట్లుండవలెనో యను దానిగూర్చి వారికే జోలియు పట్టదు. సంఘమునకు నిట్టి స్వాతంత్రము నిచ్చి దాని కాపాడుటయే సర్కారువారి పనియైయున్నదిగాని, సిద్ధాంతములను, ఆరాధన క్రమములను నియమించుట వారి పని కాదు. అయినను సర్కారువారుగూడ దేవుని యాజ్ఞలను లక్షించి వాటి ననుసరించి, దేవుని యాజ్ఞ చొప్పున నీతిన్యాయములతో తమ యధికారమును వహించుకొనుటకు బాధ్యులై యున్నారు.

III. అధికారుల ధర్మ విధులు.—అధికారులు ప్రజలమేలు నిమిత్తము తమ యధికారము వహించుకొనవలెను (2. సమూ. 23: 3) క్రైస్తవులు అధికారమును పొందిన యెడల వారు ఇతర మతస్థులను క్రైస్తవులనుగా చేయుటకు తమ యధికారము నుపయోగింప కూడదు. అయినను తమ న్యాయముచేతను సత్ప్రవర్తనవలనను తనుమతమునకు సుకీర్తి కలుగునట్లు తమ యధికారము నన్ని విధములుగా మంచి క్రియలలోనే కనపరచవలెను. దేవునికి భయపడి ప్రతి పనిని చేయవలెను. తమ యుద్యోగ ధర్మములను యథార్థముగాను, నమ్మకముగాను, నిష్పక్షపాతముతోను క్రైస్తవ కనికరముతోను గూడిన న్యాయముతోను చేయవలెను. (లేవీ. 19: 15; ద్వితి 16: 18.)

IV. ప్రజలు తమ యధికారులను మన్ననచేయవలెను.—మనము మన యధికారులను ఘనపఱచవలెను. ఒకవేళ వారు ప్రభుత్వ విషయములలో మన యభిప్రాయమువంటి యభిప్రాయములు గల వారు కాకపోవచ్చును. అయినను వారి యుద్యోగమును బట్టి వారిని మన్ననచేయుట మన విధియై యున్నది. తమ యధికారులను దూషించుట చాలమందికి వాడుకయై యున్నట్లు తెలిసికొనగలము. అట్టివారు సభలలో అధికారులను విరోధించుటకై జనులను రేపుచు, పత్రికలలో అధికారులకు విరోధముగ దూషణ వాక్యములు ప్రచురించి ప్రజలను ప్రేరేపించు చున్నారు.

ఈలాగు చేయుట గొప్ప పాపమై యున్నది. ప్రభుత్వముతో అక్రమములుండినయెడల సమయముకొఱకు కనిపెట్టి తగినవారికి వాటిని తెలియజేసి, దేశచట్టములను లక్షించి అట్టివాటికి క్రమపరచుటకు పాటుపడుట యెంతమాత్రమును అధర్మముకాక ప్రతివాని విధియై యున్నది.

ఒక పర్యాయము పౌలు అతడు ప్రధానయాజకుడని తెలియక ప్రధాన యాజకుని గూర్చి అమర్యాదగా మాటలాడెను గాని; అతడు ప్రధానయాజకుడని తెలిసికొనిన తోడనే తన తప్పు నొప్పుకొని క్షమాపణ నడిగెను. ఆ ప్రధానయాజకుడచట తన యుద్యోగ ధర్మమున కన్యాయముగ ప్రవర్తించియున్నను, 'నీ ప్రజల యధికారిని నిందింపవద్దు, (నిర్గ. 22:28) అను శాస్త్రమును జ్ఞప్తి చేసికొని పౌలు ప్రధాన యాజకుని గొప్పయుద్యోగమునుబట్టి అతనిగూర్చి అమర్యాదగా మాటలాడ కూడదని తెలిసికొని తన తప్పు దిద్దుకొనెను (కార్య. 23. 1-4),

అధికారులను నిర్లక్ష్యము చేయువారు ప్రభుత్వమును నిర్లక్ష్యపెట్టువారై, దేశక్రమమును చెరుపువారును దేశ క్షేమమును పాడుచేయువారు నగుదురు. మనము అట్టి వారమై యుండక ఎవనికి పన్నో వానికి పన్నును, ఎవనికి సుంకమో వానికి సుంకమును చెల్లించి ఎవరికి భయపడవలయునో వానికి భయపడి, ఎవనికి సన్మానము చూపవలెనో వానికి సన్మానముచూపి అందరికిని వారివారి ఋణములను తీర్చవలెను. (7).

---

## 52. క్రైస్తవుడు అనుదినమును మారుమనస్సు నొంద వలయునను బోధ.

సహోదరులారా నేనిదివరకే పట్టుకొని యున్నానని తలంచుకొనను. అయితే ఒకటి చేయుచున్నాను. వెనుక నున్నవి లక్ష్యపెట్టక ముందట నున్నవాటికొరకై వేగిరపడుచు క్రీస్తు యేసునందు పర సంబంధమైన పిలుపునకు కలుగు బహుమానము పొందవలెనని, గురి యొద్దకే పరుగెత్తుచున్నాను. ఫిలి. 3: 13, 14.

## భాగములు.

I. మనము విశ్వాసమునుండి జారకుండునట్లు మనకు నుండవలసిన జాగ్రత.

II. మన మనుదినమును మన పాపముల నొప్పుకొని పశ్చాత్తాప పడవలెను.

III. క్రైస్తవులకు నుండవలసిన సుగుణములలో వృద్ధి నొందునట్లు మన మనుదినమును ప్రయాస పడవలెను.

## అనుదిన వేదపాఠములు.

| | |
|---|---|
| పాపము లేనివారెవరును లేరు. | 1. యోహా. 1. |
| మనము అయోగ్యులమైన సేవకులము. | లూకా. 17: 5-10. |
| మన దౌర్భాగ్యస్థితి- | రోమా. 7: 18-25. |
| స్వనీతి మన కుండరాదు. | లూకా. 18: 9-14. |
| పాపమునకు దాసులము కాకూడదు. | రోమా. 6. |
| సద్గుణములలో వృద్ధినొందవలెను. | 2 పేతు. 1: 1-11. |
| జయించు వానికి జీవకిరీటము దొరుకును. | ప్రక. 2: 8-11. |

## వేద వాక్యములు.

I. 1. మనము పాపము లేని వారమని చెప్పుకొనిన యెడల, మనలను మనమే మోసపుచ్చుకొందుము; మరియు మనలో సత్యముండదు (1. యోహా. 1:8).

II. 2. తన పొరబాటులు కనుగొనగలవాడెవడు? నేను రహస్యముగా చేసిన తప్పులు క్షమించి నన్ను నిర్దోషినిగా తీర్చుము (కీర్తన. 19:12).

III. 3. ఈ విషయములో మీరు ఇచ్ఛయించుటకును కార్యసిద్ధి కలుగజేసికొనుటకు తన దయా సంకల్పము నెఱవేరుటకై మీలో కార్యసిద్ధి కలుగజేయువాడు దేవుడే (ఫిలి. 2: 13).

4. పరలోకమందున్న మీ తండ్రి తన్ను అడుగు వారికి నెంతో నిశ్చయముగా పరిశుద్ధాత్మ ననుగ్రహించును (లూకా. 11: 13).

5. మనము మేలు చేయుటయందు విసుకక యుందము. మనము అలయక మేలు చేసితిమేని తగిన కాలమందు పంట కోతుము (గల. 6: 9).

## వివరము.

I. మనము విశ్వాసమునుండి జారకుండునట్లు మనకుండవలసిన జాగ్రత.—క్రైస్తవులమైన మనము చేయవలసిన వాటిని చేయుటకుతగా ప్రయత్నపడినను, చేయవలసిన వాటిని చేయక, చేయరాని యనేక వాటిని చేయుచున్నామని యింకను ఒప్పుకొనవలసిన వారమై యున్నాము (లూకా 18-25). ఈ జీవిత కాలములో మనము కొంచెము పాపమునైనను చేయక సంతతి సంపూర్ణవృద్ధిని మనము పొందజాలము (1). మనము అనుదినము గా పాపము జేయువారమై యున్నాము. కావున దేవుని క్షమాపణ అనుదినము అక్కఱగా నున్నది. దేవుడిట్టి క్షమాపణను మనకు అనుదినము చేయుటకై మన మాయనను ప్రార్థింపవలెనని క్రీస్తు మనకు బోధించెను (లూకా 3, 4). మనకు స్వంత పుణ్యములేదు. మనము మన యోగ్యతను గాక దయవలననే ఆయన బిడ్డలమై యిలాగు కాపాడబడుదుము. ఇట్లుండగా దీనమును మారుమనస్సు నొందుట అత్యావసరమై యున్నది.

మనము విశ్వాసమునుండి జారకుండునట్లు ముఖ్యముగా రెండు గూర్చి జాగరూకలమై యుండవలెను. వాటిలో మొదటిది స్వనీతి. మంచి వారమనియు, దేవుడు మన యెడల అడుగ దగుదాని సంతటిని వారమనియు ననుకొనుటయే స్వనీతియై యున్నది (లూకా. 18: 9-14). మనము పాపులమై యున్నాము. ఏలాగునైనను పాపములో పడక తప్పని మును జయించుటకే యత్నముచేయక నిశ్చింతగా పాపము జేయుట. లోనే శోధన మనకుండినను అవి మన యాత్మకు గొప్పకీడును గల్గించి, మన మును నిరర్థకము చేయును. మనము మన శక్తికొలది యనుదినమును త్యజించి, దేవుడు కోరువాటిని చేయ ప్రయత్నింపవలసి యున్నాము. యీలాగు చేసిన పిమ్మట నిక మనము మంచివారమనుకొనక మనము చే యింక నేనేకము లున్నవనియు, చేయరాని యనేకములైన వాటిని చేసియున్న ఒప్పుకొని, మన అయోగ్యతను గుఱెరిగి దేవుని దయవలన గాక మరి మనకు రక్షణ సిద్ధించదను వినయ మనస్సుతో ఒప్పుకొనవలసినవారమై యున్న

ఇందుకై మనలను మనము శ్రద్ధతో పరీక్షించుకొనుట అత్యవసరమై దేవు డేర్పరచిన ధర్మ విధులను తెలిసికొనుటకై మనము దేవుని వాక్యమును, ముగా క్రీస్తు మాదిరిని శ్రద్ధతో ధ్యానించుకొనవలెను. మరియు ఆ విధుల

కొనిన పిమ్మట మన మనోవాక్కాయ కర్మలతో వాటిని సరిపోల్చి చూచి, రెంటికినిగల తారతమ్యములను కనిపెట్టి, మన లోపముల విషయమై సాకులేమియు చెప్పక అవి పాపములని గుర్తెరుగవలెను.

II. మన మనుదినమును మన పాపముల నొప్పుకొని వాటి విషయము పశ్చాత్తాప పడవలెను.—మనము మన సంగతులను యదార్థముగా పరీక్షించుకొనిన యెడల తలంపునందును, మాటయందును, క్రియయందును అనుదినము దేవునికి విరోధముగా పాపముచేయువారమని యొప్పుకొనక తప్పదు. మనలో నుండు స్వభావికమైన దుష్టబుద్ధి (దీనికి బైబిలులో పురాతన పురుషుడు అను పేరు కలదు) మనము అన్నివిధములైన పాపములను చేయునట్లు మనలను త్రేపు చుండును. మన మెన్నియో మారులు ఈ బుద్ధిని అనుసరించు వారమగుదుము. ఇందుచేతనే మనము ఇతరుల మేలు విచారింపక, స్వంతమేలు విచారించుకొనువారమై దేవునియం దుంచవలసిన విశ్వాస ప్రేమల నాయనయందు నుంచకయు, ఆయన యెడల చూపవలసిన కృతజ్ఞతను చూపకయు నుండి, ప్రార్థనవిషయమై అశ్రద్ధ కలవారమగుదుము. మరియు, మనము సాతానుయొక్కయు; లోకము యొక్కయు, శోధనలకు లోబడి, మన స్వంత యాశలకు లోనై, గర్వపడి, ఓర్పు చూపక దేవునిమీద సణుగుకొను వారమగుదుము. ఇదియుగాక మనము స్వలాభము నిమిత్తము ఇతరులను మోసపుచ్చి, వారియక్కఱలలో వారికి సహాయము చేయక, వారి యుద్దేశ్యములు మంచివి కావని పలుకుచు వారిని గూర్చి నిర్దయగా భావించి వారిమీద చాడీలు చెప్పి, మన మాటలవలనను క్రియలవలనను వారికి నొప్పి కలుగచేతుము. మరియు ఈ దుష్ట బుద్ధికి లోబడి మనము ధనాపేక్ష, అమితానుభవము, సోమరితనము,. అన్యాయము, కపటము; అసత్యము, అసూయ, కామక్రోధాది పాపములను చేయువారమగుదుము. కుటుంబ ధర్మములను, సంఘ ధర్మములను, దేశ చట్టములను అనేక మారులు నిర్లక్ష్య పెట్టి, సబ్బాతు దినమును పరిశుద్ధ పఱచవలసినట్లుగా పరిశుద్ధ పఱచక, దేవుని వాక్యమును శ్రద్ధతో చదువకయు, మనయొక్కయు, ఇతరులయొక్కయు ఆత్మీయ క్షేమమునుగూర్చి తగిన చింతగలవారమును గాక వీటిని నిర్లక్ష్యము చేయువార మగుదుము. మనము పాపములన్నిటిని తెలిసికొనలేము. మనకు తెలియని పాపములను కూడ ఎన్నో విధములుగా చేయుచున్నాము.

ఇట్లుండగా మన మీ పాపములనుబట్టి అనుదినమును వాస్తవముగా పశ్చాత్తాపపడి, దేవుని క్షమాపణను వేడి, ఆయన సహాయమువలన అంతకంతకు ఈ పాపములలో పడుటమాని, శుద్ధప్రవర్తనగల వారము కావలయును. ఈవిధముగా

అనుదినమును పశ్చాత్తాపపడిన యెడల క్రీస్తు నిమిత్తము దేవుడు మన పాపము లన్ని
టిని క్షమించు మనని మనము రూఢిగా నమ్మవలయును.

III. క్రైస్తవుల కుండవలసిన సుగుణములలో వృద్ధినొందు
నట్లు మన మనుదినమును ప్రయాసపడవలెను.—మనము మన పాపముల
విషయమై ఏ మాత్రమును నిశ్చింతగా నుండరాదు. మఱియు వాటినిబట్టి యే
మాత్రమును ఆశ్చర్యపడరాదు గాని, నిన్నటికన్న నేడు దేవుని సహాయము వలన
చక్కగా ప్రవర్తింతుమని అనుదినమును నూతనముగా నిశ్చయించుకొనవలయును.

మనము దేవుని దయవలన సంపాదించుకొనిన సుగుణముల విషయమై ఏమాత్ర
మును తృప్తిపడక, మఱిమంచివాటిని సంపాదించుకొనుటకై నిత్యమును ప్రయాస
పడవలెను (2. పేతు. 3: 17, 18). పౌలువలెనే—"ఇదివఱకే నేను గెలిచితినని
యైనను, ఇదివఱకే సంపూర్ణసిద్ధి పొందితినని యైనను నే ననుకొనుట లేదు గాని
నేను దేని నిమిత్తము క్రీస్తు యేసుచేత పట్టబడితినో దానిని పట్టుకొనవలెనని పరుగెత్తు
చున్నాను" (ఫిలి. 3: 12) అని పలుకవలెను. క్రీస్తుని సమరూపమును గల వారము
కావలెనను గుఱిపెట్టుకొని దాని చేరుటకు ప్రయాసపడవలెను. (రోమా 8: 29).
నిత్యమైన ప్రయాసము లేనిది ఆ గుఱి యందదు. అట్టి ప్రయాసము లేనిది మనము
క్రీస్తుకు నమ్మకమైన సేవకులము కానేరము. చివరకు పౌలువలెనే—"మంచి
పోరాటము పోరాడితిని, నా పరుగు కడముట్టించితిని, విశ్వాసము కాపాడితిని,
(2. తిమొ 4: 7). అని చెప్పగలిగి, అట్టి జయమును పొందగోరినయెడల ఈ జీవిత
కాలమందే అత్యవసరముగా నిట్లు ప్రయాసపడవలెను.

ఈలాగు ప్రయాసపడిన యెడల మనము తప్పక వృద్ధి నొందు
దుము.—అట్టివృద్ధిని నిరర్థక పఱుచునట్టి అనేక యాటంకములు కొందఱికి తమ
స్వంత మనస్సులోనుండియు, తమ చుట్టు ప్రక్కలనుండియు కలుగును. అయినను
అట్టి వారుకూడ దేవుని సహాయమును వేడుకొని యథార్థముగా ప్రయాసపడిన
యెడల తప్పక వృద్ధి నొందగలరు. కొందఱిలో నెక్కువగాను, కొందఱిలో
తక్కువగాను కలుగును. కొందఱు తమజీవితమను పడవను వడిగల ప్రవాహ
మునకు ఎదురుగాను, మరి కొందరు దానిని నిమ్మళముగ ప్రవహించు ప్రవాహమున
కెదురుగాను లాగవలసినట్లుగా నున్నది. అనగా కొందరి పనులలో నెక్కువగాను,
కొందరి పనులలో తక్కువగాను శోధనలు కలుగును. సన్మార్గము నవలంబింపగోరు
కొందరికి భక్తిపరులగు తలిదండ్రులు సహాయము లగుదురు. దేవుని సేవింపగోరు
కొందరికి తలిదండ్రులు సహాయులై యుండక విరోధులగుదురు. కొందరు పుట్టుక

నుండి మంచి యభ్యాసములలో పెంచబడుదురు. మరికొందరు దురభ్యాసములలో పడిన పిమ్మట మారుమనస్సు నొందెదరు. పైనుదాహరింపబడిన తరగతి మనుష్యులలో రెండవ తరగతివారు సద్గుణములను సంపాదించుకొనుట మఱీ కష్టముగ నుండును గదా? కావున పైతరగతులలో మొదటి తరగతికంటె రెండవ తరగతిలో చేరినవారి వృద్ధి తక్కువగ నుండినయెడల ఆశ్చర్యపడవలసిన పనిలేదు. అయితే ముఖ్య విషయము—మనలో నెంత వృద్ధి కలదు అనునది కాదుగాని, మనలోని వృద్ధినిబట్టి మనము క్రమక్రమముగా నెట్టివారమగుదుము. మంచివారమగుదుమా దుర్మార్గుల మగుదుమా యనునదియై యున్నది. కావున మనము అంతకంతకు మంచివారమగునట్లు చూచుకొనవలెను. మనలోని వృద్ధి యెంతకొద్దిదైనను, అది నిత్యమైన దగుసెడల, ఏ మాత్రమును వెనుకబడక మనము సద్గుణములను పెంచుకొనగలము. అయితే మనము ఊరకయే యుండినను అట్టి వృద్ధి నొందగలమని యనుకొనరాదు. కష్టముకొలది ఫలము అను లోకోక్తి విశ్వాస విషయములలోను చెల్లును. ఊరకయే యుండుటవలన మనము చెడిపోగలముగాని, ఏ మాత్రము మంచివారము కాజాలము. మనము మంచివారము కావలెనని కోరినయెడల మనలో నుండు దుష్ట బుద్ధితోను మన చుట్టు నుండు చెడ్డవాటితోను మనము నిత్యముగా పోరాడవలసియున్నాము. జీవకిరీటము నొందగోరువారు మరణ పర్యంతము నమ్మకముగా నుండవలెను (ప్రక. 2: 10).

మనకుండవలసిన సద్గుణములలో వృద్ధి కలదా లేదా యని పరీక్షించుకొనవలెను.—క్రీస్తునందు కనబడు గుణలక్షణములు నానాట మనలో కనబడుచున్నావా లేవా యని ధ్యానించుకొని యీ విధముగ మనలను మనమే పరీక్షించుకొనగలము. మరియు మనలోని పగ అసూయ యను గుణములకు ప్రతిగా మనలో ప్రేమ కనికరములు కనబడునా? గర్వమునకు ప్రతిగా వినయమున్నదా? అబద్ధము లాడుట మాని సత్యమే పలుకుచున్నామా? లోభిత్వమునకు ప్రతిగా ఔదార్య బుద్ధి గలిగి యున్నామా? కామమునకు సంబంధించిన పాపములకు బదులుగా పరిశుద్ధ ప్రవర్తన నవలంబించితిమా? ఇహలోక సంబంధములగు వాటిని ఆశింపక పరలోక సంబంధమైనవాటిని ఆశించుచున్నామా? ముంగోపులమై విచ్చలవిడిగా వదరుచున్నామా? క్రమక్రమముగా యీ పాపములను అణచివేయుచున్నామా? నానాటికి స్వలాభము నాశింపక, ఇతరుల మేలు నాశించుచున్నామా? దేవుని సేవయందు అనుదినమును ఆనందించుచున్నామా? ఆయనను ప్రేమించి, ఆయనను ఆశ్రయించుకొని, ఆయనను సంతోషపెట్టుటకు అనుదినమును ప్రయాసపడుచున్నామా? అనునవి మొదలగు ప్రశ్నలను మనకు మనము వేసికొని, మనలను పరీక్షించుకొని క్రైస్తవ జీవమునందు వృద్ధినొందుచున్నామో లేదోయని తెలిసికొనగలము.

ఈ క్రైస్తవసద్గుణములలో వృద్ధి నొందునట్లు మనము దేవుని సహాయమును వేడవలెను.—దేవునికి అనుకూలమైన వాటిని మనము కోరునట్లును, చేయునట్లును మనలో కార్యసిద్ధి కలుగజేయువాడు దేవుడే (8). ఆయన సహాయము లేనియెడల మనలోనుండు దుష్టబుద్ధిని మన చుట్టు నుండు శోధనలను మనము జయింప జాలము. మనము మన పాపములను అనుదినమును ఒప్పుకొని ఆయన క్షమాపణను వేడుకొనుచు, ఇక మీదట వాటిని జయించుటకై శక్తి సహాయముల నిమ్మని ప్రార్థింపవలసి యున్నాము. నిండు మనస్సుతో నడుగువారికి దేవుడు తప్పక వాటి ననుగ్రహించును (2. కొరి. 22:9). మనలను నడిపించి, ప్రోత్సాహపరచి బలపరచుటకు మనకు పరిశుద్ధాత్మ అవసరమై యున్నాడు. తన నడుగువారికి దేవుడు పరిశుద్ధాత్మ యను వరమును దయచేయును (4).

మనము విసుకక పట్టుదలతో ఈపని చేయవలెను.—మనము మేలు చేయుటయందు విసుకక యుండవలయును (5). దేవుడు తన గొప్ప దయవలన మన పాపము లన్నిటిని క్షమించునని మనము గట్టిగా నమ్మకొనవలెను. అయితే అదియట్లుండగా మనము మన పాపములను విడిచి నీతిగా జీవించినను జీవించకపోయినను అంతయు నొకటేయని యెంతమాత్రము ననుకొనక నీతిగా ప్రవర్తించుటకు మన శక్తికొలది ప్రయాస పడవలెను. పాపమునకు లోనైనవారమై జీవించకూడదు. దానికి లోంగితిమేని మనము దేవుని బిడ్డలము కాక ఆయన యుగ్రతకు పాత్రుల మగుదుము. మనము నిజముగా పశ్చాత్తాపపడినయెడల ఆయన దయవలన ఆయన బిడ్డల మగుదుము. మరియు అనుదిన పశ్చాత్తాపమువలన గాక మరి దేనివలనను ఆ స్థితిలో నిలువజాలము.